


# శంకర గ్రంథ రత్నావళి

## ఉపదేశ గ్రంథములు - నలుబది

## ప్రథమ సంపుటము



సాధన గ్రంథ మండలి. ౫౫.

# శంకర గ్రంథ రత్నావళి

## ఉపదేశ గ్రంథములు - నలుబది

## ప్రథమ సంపుటము

అనువాదకుడు

శ్రీ నిర్వికల్పానంద స్వామి



" ఏకం వేదాన్త విజ్ఞానం స్వానుభూత్యా విరాజతే "

ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.

వెల రు. ౩-౦-౦. * పోస్టు ఖర్చులు రు. ౦-౧౨-౦




శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదం శఙ్కరం లోక శఙ్కరమ్.

# వినతి

మహాశయులారా!

శ్రీ ఆచార్యస్వామివారి రచనలన్నియు, అందరికి అందుబాటులో నుండునట్లు, మూలానువాదములతో, పాఠకుల కందివ్వవలయునను, ఈ మహా సేతు నిర్మాణమునకు మేము పూనుకొంటిమి. ఇట్టి మహత్కార్యమునకు, అద్వైతరస పిపాసువుల సంపూర్ణసహకార ముండవలయును. మేము దానినే కాంక్షించు చుంటిమి.

శ్రీశంకరుల ఉపదేశప్రకరణగ్రంథములు, చక్కని, తేట తెనుగున అనువదించి, అనుగ్రహించిన, పూజ్యపాదులు శ్రీ నిర్వికల్పానందస్వామివారికి, మాకృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

మామండలికి, ఈ శంకరగ్రంథరత్నావళి, ప్రథమ సంపుటములో, ఎనిమిదవ వత్సర ప్రారంభము. మామండలి యెడ, ఆదరాభిమానములు చూపుచున్న, పోషకవర్గమునకూ, పాఠకలోకమునకు మా కృతజ్ఞతలు తెలుపుచున్నాము. మున్ముందుకూడ, ఇతోధికముగ ఉత్సాహ, ప్రోత్సాహ, సాహాయ్యముల చూపిన, ఉత్తమగ్రంథముల వెలువరించి, మీ కరకమలములందు, ఉంచగలమని సవినయముగ మనవి చేసికొనుచున్నాము.

తెనాలి,<br>విజయ మాఘము } బులుసు సూర్యప్రకాశ శాస్త్రి<br>సంపాదకుడు: సాధన గ్రంథ మండలి.

ఓమ్

# నివేదన

౧

“అద్వైతజ్ఞానమును కొంగున మూటగట్టుకొని నీ ఇష్టము వచ్చినట్లు మెలగుము” అని శ్రీరామకృష్ణ పరమహంసులవారు నుడివియున్నారు. ఆ అద్వైతజ్ఞానరత్నశకలములు వేదాంతములనబడు ఉపనిషత్తులలో ఇతస్తతముగ విరజిమ్మబడి యున్నవి. ఈ భావరాశిని సంగ్రహించి శ్రీశంకరాచార్యులవారు తమ గ్రంథములలో క్రమాన్వయముగ మననిమిత్తము కరుణాపరవశులై, అత్యంతము ప్రసన్నగాంభీర్యవైశద్యములతో నొప్పు భాషలో భద్రపరచి యున్నారు.

మనకు ప్రస్తుతము శ్రీవారి రచనాఖండములు నూట ఏబది యొకటి లభించుచున్నవి. ఇవి రచింపబడి పదిరెండువందల సంవత్సరములు (కొందరి అభిప్రాయము ననుసరించి ఇరువదిరెండువందల ఏండ్లు) దాటుచున్నను, నేటికిని “తదేవ రమ్యం రుచిరం నవం నవమ్” అను రీతిగ క్రొంగ్రొత్తరుచులను గూర్చుకొనుచు ప్రపంచమునందలి ప్రధానభాషలలోనికి అనువదింపబడి, శ్రద్ధాళువులగు దార్శనిక పండితులకును, తత్త్వజిజ్ఞాసువులకును ఉల్లాసమును గూర్చుచునేయున్నవి కాని, వీని సౌరభ్యము ఒకింతయును తొలగలేదు.

వర్తమానకాలమున ఆంగ్లమున ఆయీ రచనలకు వెలువడిన అనువాద వ్యాఖ్యల విషయము వదలినను; ప్రాచీనులచే ఈ గ్రంథములకు గూర్పబడిన టీకావ్యాఖ్యా వార్తిక, ప్రకరణ, గ్రంథముల సంఖ్యను గమనింప, పఠింప పురుషాయుర్దాయము చాలనంత విస్తృతముగ నున్నవి. భగవత్పాదులవారి రచనల ఉపజీవికగ నొనర్చుకొని వెలువడిన సంస్కృత, దేశీయభాషాగ్రంథముల సంఖ్యకూడ అపరిమితముగనే యున్నది. ఈ ప్రకరణ-వాఙ్మయమునకు సాధ్యమైనంత త్వరలో సూచీపత్రమునుగూర్చు భారము, గవేషణాపరులగు పండితులది. ప్రాచీనతాళపత్రములలో మరుగువడి శిథిలములైనవానిని, కాలపురుషుడే లెక్కింపవలెను!

భగవత్పాదులవారి మూలగ్రంథముల నన్నిటిని ఒక క్రమమును పాటించి అనువాదముతో నైనను ఆంధ్రమున ప్రకటించు ప్రయత్నము ఇంతవరకు జరిగినట్లు

తోచదు. ఈ గ్రంథరాశిని ఇరువదియైదు సంపుటములలో మేము అకారాది క్రమమును పాటించుచు ప్రకటింప సంకల్పించుకొనినాము.

ప్రస్తుతము నూరు శ్లోకములకు దాటని ౪౦ ఉపదేశ-ప్రకరణ గ్రంథములు ప్రథమ సంపుటముగను, నూరు శ్లోకములకు మించి మూడువందల శ్లోకములకు దాటని గద్యపద్య రచనలు ౯ ద్వితీయ సంపుటముగను, ౭౨ స్తవ స్తోత్ర గ్రంథములను తృతీయ సంపుటముగను ప్రకటించు చున్నాము. మొదటి రెండు సంపుటములును జ్ఞానయోగమును, మూడవది భక్తియోగమును నిరూపించు చున్నవి.

ఈశ్వర కృపయును, ఆంధ్రమహాజనుల ఆదరాభిమానములును లభించిన, వెనువెంటనే మిగిలిన సంపుటములుకూడ వెలువడగలవని ప్రత్యేకించి చెప్ప నక్కర లేదు.

ఈ అనువాదమును గురించి ఒక్క మాట: ముఖ్యముగ గ్రంథవిస్తృతి భయమున, సాధ్యమైనంత సంగ్రహముగ అనువదించితిని. అయినను, భావార్థము స్పష్టమగునట్లు సులభశైలియే అవలంబింప బడినది. వేదాంత దర్శనముతో సాధారణ పరిచయము కలవారికి ఈ తెలుగు సేత, ఉపకరింప గలదు. అయినను: లక్ష్యములగు ప్రాచీన టీకలతోబాటు, విపులవ్యాఖ్యతో ప్రతి రచనాఖండమును పునర్ముద్రణము నందవలసి యుండుననువిషయమును నేను విస్మరించుట లేదు. సమర్థులగువారు అందులకు పూనుకొందురు గాక! కొంచెము సంస్కృతముతో పరిచయము కలవారు ఒకసారి అనువాదమును చూచి, మూలమును పఠించునో అర్థము సుస్పష్టమగును. సంస్కృత పరిచయము లేనివారి నిమిత్తము, అనువాదమును ఒక వరుసలో ముద్రించితిమి. దానిని చదివిన మూలశ్లోకముల ముఖ్యార్థము తేటతెల్లమగును. సంస్కృతాభిజ్ఞులు అనువాదమును వదలి, మూల గ్రంథమునే చదువుకొను నిమిత్తము, శ్లోకములను పెద్ద అక్షరములలో కూర్చితిమి. శాస్త్రీయశబ్ద వివరణకోశమును గ్రంథాంతమున గూర్పదలచియు, ద్వితీయ సంపుటమున వెలువడుచున్న గ్రంథములలో ఆయా శబ్దములు చక్కగ వివరింపబడి యుండుటవలన వదలివైచితిని.

ఇక పాఠాంతరములను గురించి: శ్రీరంగం, పూనా, బొంబాయి, కాశీ, ఘోరక్‌పూర్, కలకత్తా మున్నగు చోట్లనుండి భగవత్పాదులవారి మూల గ్రంథములు టీకా వ్యాఖ్యాన వార్తికములతో వెలువడి యున్నవి. కాని

ఏ ఒక్క చోటు నుండియు, అన్ని గ్రంథములును, ప్రచురింపబడ లేదు. వీని అన్నిటిలోను శ్రీరంగం వాణీవిలాస ప్రెస్సువారు ఇరువది సంపుటములలో వెలువరించిన కూర్పే, శ్రేష్ఠతమ మనియును, సంపూర్ణగ్రంథావళి అనియును చెప్పనగును. నేను ఆయా ప్రతుల నన్నిటిని సంప్రదించినను, కలకత్తా ప్రతులు అంగీకరించిన పాఠములనే గ్రహించినాను. ఈ పాఠ భేదములలో అక్షర భేదమే కాని, అర్థ భేదము లేదు.

౨

భగవత్పాదులవారి రచనలు, ఉపదేశప్రకరణ గ్రంథములు ౫౭ ను, స్తవస్తోత్ర గ్రంథములు ౭౨ ను, భాష్యగ్రంథములు ౨౪ ను కలిపి మొత్తము ౧౫౩ ఖండములు లభించు చున్నవి. వీటి సంపూర్ణ నామావళి ఇది:

ఉపదేశ గ్రంథములు: మేము ఈ ప్రథమసంపుటి విషయసూచికలో చూపిన ౪౦ గ్రంథములు గాక, మిగిలినవి: ౪౧ అజ్ఞానబోధిని, ౪౨ ఆత్మ జ్ఞానోపదేశవిధి, ౪౩ ఆత్మానాత్మ వివేకము, ౪౪ తత్త్వబోధ, ౪౫ అపరో క్షానుభూతి, ౪౬ పంచీకరణము, ౪౭ ప్రబోధ సుధాకరము, ౪౮ వేదాంత కేసరి (శతశ్లోకి), ౪౯ స్వాత్మనిరూపణ, ౫౦ వివేక చూడామణి, ౫౧ ఉప దేశసహస్రి, ౫౨ సర్వవేదాన్త సిద్ధాంత సంగ్రహము, ౫౩ ప్రపంచ సార తంత్రము, ౫౪ శంకర స్మృతి, ౫౫ సన్న్యాసప పద్ధతి, ౫౬ సర్వసిద్ధాంత సంగ్రహము, ౫౭ అమరుకశతకము.

వీనిలో శంకరస్మృతి ఇంతవరకు నాగరాక్షరములలో ముద్రితమైనట్లు తోచదు. ఇది పదునారు అధ్యాయముల గ్రంథమనియు, పదిరెండు అధ్యాయ ముల మటుకు కేరళలిపిలో అచ్చయినదనియు వినుచున్నాము. సర్వసిద్ధాంత సంగ్రహమును అమరుకమును శంకరకృతమా? యను విషయము వివాదాస్ప దము. అటులనే ప్రపంచసారతంత్రమును; కాని దీనికి ఆనందగిరి, పద్మపాదుల టీకలున్నందువలన అంగీకరింపవలసియుండును. వంగీయశాక్తులలో శంకరులు శాక్తామోదము అను గ్రంథముగూడ రచించినట్లు ప్రసిద్ధి కలదు. కాని యీ గ్రంథము ముద్రితమైనట్లు తోచదు.

౪౧–౪౯ వరకు గల గ్రంథములును ద్వితీయ సంపుటమున అనువాద సహితముగ వేయుచున్నాము. లభ్యమానములగు టీకలనుగురించి ఆయా గ్రంథాను వాదారంభమున సూచించియున్నాము.

వివేకచూడామణి, ఉపదేశసహస్రి, ఆత్మబోధ, అపరోక్షానుభూతి, అద్వైతపంచరత్నములు, ఆత్మపూజ, ఆత్మానాత్మవివేకము, అద్వైతానుభూతి, పంచీకరణము, ప్రశ్నోత్తరరత్నమాల, వేదాంతడిండిమ, చర్పటపంజరికలను వావిళ్ళవారును; తత్త్వబోధను బరూరి త్యాగరాయశాస్త్రిలవారును ప్రకటించి యుండినట్లు వారి గ్రంథముల పట్టికవలన తెలియుచున్నది. వేదాంతడిండిమ, చర్పటపంజరికలను ఇంకను చాలమంది ప్రకటించియున్నారు.

వివేకచూడామణికి కొండపల్లి వీరవెంకయ్య సన్సువారు (రాజమండ్రి) ప్రకటించిన మరియొక వచనానువాదమును, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి (నెల్లూరు) పద్యానువాదముకూడ కలవు అనురుక్తములకు ౨౭ పద్యానువాదములు కలవు. సర్వసిద్ధాంతసంగ్రహమును బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు తెనిగించియుండిరి.

స్తోత్రగ్రంథములు : అచ్యుతాష్టకములు రెండు 3 అన్నపూర్ణాస్తోత్రం, ౪ అంబాష్టకం ౫ అర్ధనారీశ్వరస్తోత్రం ౬ ఆనందలహరి ౭ ఆర్తత్రాణ నారాయణాష్టాదశకం ౮ ఉమామహేశ్వర స్తోత్రం ౯ కనకధారా స్తోత్రం ౧౦ కల్యాణవృష్టి ౧౧ కాలభైరవాష్టకం ౧౨ కాశీస్తోత్రం ౧౩_౧౪ కృష్ణాష్టకద్వయం ౧౫_౧౬ గంగాస్తోత్ర ద్వయం ౧౭ గణేశ భుజంగ ప్రయాతం ౧౮ గణేశ పంచరత్నములు ౧౯ గౌరీదశకం ౨౦ గోవిందాష్టకం ౨౧ జగన్నాథాష్టకం ౨౨ త్రిపురసుందర్యష్టకం ౨౩ మానసపూజ ౨౪ వేదపాదస్తోత్రం ౨౫_౨౬_౨౭ దక్షిణామూర్త్యష్టక, స్తోత్ర, వర్ణమాలాస్తవములు ౨౮ దశశ్లోకీస్తవం ౨౯ దశావతార స్తోత్రం 3౦ దేవీచతుఃషష్ట్యుపచార స్తోత్రం 3౧ దేవీభుజంగప్రయాతం 3౨ దేవీ అపరాధక్షమాప స్తోత్రం 33 ద్వాదశజ్యోతిర్లింగస్తోత్రం 3౪ నవరత్నమాలిక 3౫ నారాయణస్తోత్రం 3౬ పాండురంగాష్టకం 3౭ పుష్కరాష్టకం 3౮ భగవన్మానసపూజ 3౯ భవానీభుజంగప్రయాతం ౪౦ భవాన్యష్టకం ౪౧ భ్రమరాంబాష్టకం ౪౨ మణికర్ణికాష్టకం ౪3 మంత్రమాతృకాపుష్పమాల ౪౪_౪౫ మీనాక్షీ పంచరత్న, స్తోత్రములు ౪౬ మృత్యుంజయ మానసికపూజ ౪౭_౪౮ యమునాష్టకద్వయం ౪౯ రామభుజంగప్రయాతం ౫౦ లక్ష్మీనృసింహపంచరత్నములు ౫౧ లలితాపంచరత్నములు ౫౨ విష్ణుపాదాదికేశాంతస్తోత్రం ౫3 విష్ణుభుజంగప్రయాతం ౫౪ వెంకటేశ్వర మంగళస్తోత్రం ౫౫ వేదసారశివస్తోత్రం ౫౬ శారదాభుజంగప్రయాతం ౫౭ శివపంచాక్షరస్తోత్రం ౫౮ శివభుజంగప్రయాతం ౫౯ శివనామావళి

౧౦ శివపంచాక్షర నక్షత్రమాల ౧౧-౧౨ శివపాదాదికేశాంత కేశాదిపాదాంత స్తోత్రములు ౧౩ శివాపరాధభంజనస్తోత్రం ౧౪ శివానందలహరి ౧౫ షట్పదీ ౧౬ సంకటనాశన లక్ష్మీనృసింహస్తోత్రం ౧౭ సువర్ణమాల ౧౮ సుబ్రహ్మణ్య భుజంగప్రయాతం ౧౯ సౌందర్యలహరి ౨౦ హనూమత్పంచకం ౨౧ హరిమీడే స్తోత్రములు ౨౨ సద్గురు పాదుకాస్తవము ఇవన్నియును అనువాద సహితముగ తృతీయసంపుటమున వెలువడుచున్నవి.

వీనిలో శివానందలహరి, సౌందర్యలహరి, ఆనందలహరి, లక్ష్మీనృసింహ, హరిమీడే, కనకధారా, దక్షిణామూర్తి స్తోత్రములను [illegible] వారు ప్రకటించియున్నారు. శివానందలహరికి బలిజేపల్లి లక్ష్మీకాంతకవి మున్నగువారును, సౌందర్యలహరికి దుగ్గిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి, [illegible] నారాయణశర్మ, మున్నగువారి పద్యానువాదములు బహుళముగను కలవు. అన్నపూర్ణాదిస్తోత్రముల కొన్నిటిని విశ్వనాథ [illegible] మున్నగువారు అక్కడక్కడ అప్పుడప్పుడు పత్రికలలో పద్యరూపమున ప్రకటించి యుండ వచ్చును గాని, వానిని ఎత్తిచూపుట దుర్ఘటము. సద్గురు పాదుకాస్తవమును వ్యాసాశ్రమమువారు ప్రకటించియున్నారు.

భాష్యగ్రంథములు : వీనిని మరల న్యాయ, శ్రుతి స్మృతి ప్రస్థానముల క్రింద విభజింపనగును. ౧ వేదాంతసూత్ర భాష్యము న్యాయప్రస్థానము ౨ ఈశాది ద్వాదశోపనిషద్భాష్యములు పదమూడు. ౩ గీతా, విష్ణుసహస్రనామ, లలితాత్రిశత్, సనత్సుజాతీయ హస్తామలక, ఆపస్తంబీయ, గాయత్రీ, మాండూక్యకారికా, సుభగోదయస్తోత్రవాసనా భాష్యములు తొమ్మిదియును, యోగసూత్ర వ్యాసభాష్య టీకయును కలిసి పది. మొత్తము భాష్యగ్రంథములు ఇరువది నాలుగు. ద్వాదశోపనిషద్భాష్యములలో శ్వేతాశ్వతర, నృసింహ తాపనీ భాష్యములు శంకరకృతమా యను విషయము వివాదాస్పదము.

మొదటి ఎనిమిది ఉపనిషత్తులకును భాష్యభావమునను సరించి, రాయప్రోలు లింగన సోమయాజిగారు రచించిన తెలుగువివరణ ఇటీవలనే వెలువడి యున్నది. పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారొక్కరు మాత్రము ఈశోపనిషత్ - భాష్యమును తదితరటీకలతో బాటు అనువదించి ప్రకటించి యున్నారు.

వీనిలో కేవలము ఒక్క విష్ణుసహస్రనామ - భాష్య - అనువాదమును మటుకు వావిళ్లవారును, శుద్ధచైతన్యస్వాములవారును ప్రకటించియున్నారు.

మూలములేని గీతాభాష్యానువాదములను చదలువాడ సుందరరామ శాస్త్రి, బరూర త్యాగరాయ శాస్త్రి వారును రాజమండ్రి నుండి మరియొకరును ప్రకటించియున్నారు. వల్లూరి జగన్నాధరావు, త్యాగరాయశాస్త్రి, వావిలాల శివావధాని, చదలువాడ సుందరరామశాస్త్రి, పురాణపండ మల్లయ్యశాస్త్రి మున్నగువారు వేదాంతసూత్రములనుగూర్చి పెద్దవియును, చిన్నవియును అగు భాష్యానుగత గ్రంథములను ప్రకటించి యున్నారే కాని, ఏ ఒక్కరును మూలానువాదములతో సమగ్రగంథమును ప్రకటింపలేదు. కేవలము శ్రీ కళ్యాణానంద భారతీస్వాములవారు మాత్రము లోగడ 'కల్యాణసుధ' యను పేరుతో 'చతుస్సూత్రి' ని మటుకు మూలానువాదముతో వెలువరించి యున్నారు. కనుక భగవత్పాదులవారి ప్రధానరచనయగు భాష్యగ్రంథములులేని లోటు తీరవలసి యున్నది. కనుక మూలముతో బాటు ప్రస్థానత్రయభాష్యమును ముందుగ ప్రకటింపవలెనని, మా యభీష్టము. ♦

3

ఈ గ్రంథరాశినంతటిని ఎట్లు దేనినిమిత్తము పఠింపనగును? సారాంశ మేమి? అను ప్రశ్నలు సహజముగనే కలుగును. వానికి సంగ్రహముగ సమాధానము నొసగుచు ఈ నివేదనను ముగింతును.

శంకరుని ప్రస్థానత్రయవిభజనను గమనించినచో, అప్పటికే గాదిగా ప్రోగైన గ్రంథజాలమునుండి వేదాంతసూత్రములను, గీతలను, ఉపనిషత్తులను ముముక్షువులకు ముఖ్యపఠనీయములుగ గ్రహించి నిర్ణయించినట్లు తోచును. ఈ ప్రస్థానత్రయమనను పూర్వాపరముల నుండిన గ్రంథజాలము యొక్క సారాంశమును ఒక్క ముక్కలో చెప్పవలెననిన; "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అనదగును.

బ్రహ్మమనగా వ్యవహారదృష్టికి జగత్సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నట్లు తోచుచు, సచ్చిదానందస్వరూపమగుటవలన, శూన్యత్వ జడత్వ దుఃఖత్వములు లేని పారమార్థికస్వరూపముతో నిర్ధర్మకమై, నిర్విశేషమై, నిర్వికల్పమై అద్వితీయమై, స్వయంప్రకాశమై, దేశకాలనిమిత్తములకు అతీతమై సత్యమై యొప్పునది.

---

♦ "వివేకచూడామణి" మరియొక విపులమైనటీకతో ప్రస్తుతము నెల నెల "యథార్థభారతి" పత్రికలోను; "గీతాభాష్యము" మూలానువాదములతో "గీతావాణి" పత్రికలోను ప్రకటింపబడు చున్నవి. ఇంకను అసంపూర్ణములు.

జగత్తు అనగా వ్యవహారదృష్టికి దృశ్యమై గోచరించుచు, జ్ఞేయమగుచున్న, వంధ్యాపుత్రాదులవలె నిరాకృతముగాక, ఉండినది లేనిదియు అని చెప్పను టకు వీలులేనిది. ఈ రీతిగ సదసత్ - శబ్దనిర్వచనమునకు లొంగనిదిగనే మిథ్య. రజ్జువున భ్రాంతదృష్టికి గోచరించు సర్పముకూడ ఇట్టిదే. ఇది త్రికాలములయందు లేనిదేయైనను, జ్ఞానవిషయము ( జ్ఞేయము ) అగుచు భయమును గొల్పుచున్నది. అధిష్ఠానమగు త్రాటిని గ్రహించిన, సర్పమువలె జగత్తుయును లీనమగుచున్నది. ఇట్లు లేనిదేయైనను ఎరుగబడుచు, అధిష్ఠానజ్ఞానమున అంత [illegible], సదసదనిర్వచనీయమును, మిథ్యయును అగు జగత్తు : మిథ్య యన [illegible] కాక, ఇట్టిదని గ్రహింపనగును.

వృత్తి - జ్ఞానమునకు ఆశ్రయమగు జ్ఞాతయే జీవుడు. ఈ జీవుడు బ్రహ్మమే. అనగా : అంగాంశ శక్తిరూపమునగాక, సాక్షాత్తుగనే బ్రహ్మము. ఎవరేమియో అది సాధారణముగ తెలియజెప్ప నక్కఱలేదు. అయినను అవిద్యా వశమున జీవభ్రమ ఏర్పడినందువలన ఈ జ్ఞాపక వాక్యమును ఉపదేశింపవలసి వచ్చుచున్నది. ఇదియే స్వగ్రహతత్త్వము.

ఈ జ్ఞానము దృఢమై అపరోక్షమనిపించుకొనునంతవరకు, వ్యవహారము ననుసరించి, ఆధికారిక - యోగ్యతనుబట్టి కర్మమును, ఉపాసనలను ఆచరింప వలసియే యున్నది. ఋషి, దేవ, గురు, ఈశ్వర, అనన్యభక్తి యుంచ వలెను. యాగ యజ్ఞములు, జపహోమములు (ఇష్టకర్మములు) లోకోపకార కరములగు ఆరామతటాకాది నిర్వహణము, ( పూర్తకర్మము ) దాన ధర్మములు ( దత్తకర్మము ) పూజా, పాఠ, స్తవ, స్తుతులను (ఉపాసనకర్మము) వదలిపెట్టుటకు వీలు లేదు. కర్మములు చిత్తశుద్ధినొసగి మనస్సును ఉపాసనార్హముగా చేయ గల్గును. ఉపాసన చిత్తైకాగ్రత నొసగి, కుశాగ్రధారానిశిత మొనర్చును. ఈ రెండును మొత్తముమీద భగవత్కృపనందుటకు జీవుని, అర్హునిగా చేయగల్గును. ఇవంతయును మరల గురువుగీసిన గీటుననుసరించి జరుగవలెను. ఈ రీతిగ గురు, దేవభక్తియుతునకే, అద్వైతజ్ఞానఫలము లభింపగలదు. ఈ రీతిగ జ్ఞానోపాసనా కర్మముల క్రమసముచ్చయము అంగీకరింపబడుచు, స్వరూపసముచ్చయము నిరా కృత మగుచున్నది.

ఈ సాధనాఫలముగ క్రమముక్తియును జీవన్ముక్తియును లభింపగలవు. క్రమముక్తియన: బ్రహ్మలోకమును [విష్ణు, శివాదిలోకములు] [illegible] జేరుకొని, అక్కడ భగవత్కృపవలన క్రమముగ బ్రహ్మాత్మైక్యజ్ఞానము లబ్ధిం

చును. జీవన్ముక్తియన, ఈ లోకముననే ఆత్యంతికదుఃఖ నివృత్తిరూపమును, పరమానందప్రాప్తియును అగు బ్రహ్మానందమును బొందుట.

ప్రత్యక్ష, శబ్ద, అనుమాన, ఉపమాన, అర్థాపత్తి, అనుపలబ్ధులను ఆరు ప్రమాణము లంగీకరింపబడినను, శబ్దప్రమాణమగు శ్రుతియే బలవత్తరము. ఇది యును అవిద్యాంతర్గత మగుటవలన, జీవన్ముక్తుని అస్మదాదులవలె, విధినిషేధ నియమితు నొనర్పజాలదు.

సూత్రాకారముగ పైనజెప్పిన విషయములను గ్రహించి, జీర్ణించుకొను టకు శ్రద్ధాళువులగు పాఠకులు స్థిరచిత్తముతో పఠింపదగిన ముఖ్యగ్రంథములను పేర్కొనుచున్నాను. అవి :— ౧. తర్కసంగ్రహము, ౨. సాంఖ్యకారిక, 3. యోగసూత్రములు (భోజవృత్తితో), ౪. అర్థసంగ్రహము, ౫. వేదాంత సారము, ౬. వేదాంతపరిభాష, ౭. పంచదశి, ౮. సిద్ధాంతబిందు, ౯. సిద్ధాంత లేశ సంగ్రహము, ౧౦. అద్వైతసిద్ధి. ఈ పది గ్రంథములను చక్కగ పఠించిన యెడలనే శంకరులవారి ప్రస్థానత్రయ భాష్యమహిమ తేటతెల్లమగును. మొదటి నాలుగు గ్రంథములును పూర్వపక్షములను గ్రహించుటకును, మిగిలినవి సిద్ధాంత మును ఆకళించుటకును తోడ్పడగలవు. వీని అన్నిటికిని ఆంగ్లానువాదము లున్నవి. ఈ భాష తెలిసినవారు స్వామీ వివేకానందునియొక్కయు, సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారియొక్కయు ఉపన్యాసములనుగూడ చూడ గలరు.

ప్రస్థానత్రయభాష్యము చదువుటకుముందు ఇన్ని గ్రంథములను పఠింప ఓర్పులేనివారు, అథమపక్షము "సిద్ధాంత బిందువు" నైన చక్కగ పరిశీలింప వలెను. అనుకూలముగనుండిన రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, భాస్కర, శ్రీకంఠ, విజ్ఞానభిక్షు, బలదేవాదులు వేదాంతసూత్రములను రచించిన భాష్య ములను గూడ అనుశీలింపనగును. ఇన్ని భాష్యములు చూచుటకు వీలుపడని వారు ఒక్క శ్రీభాష్యమునైనను, పైన చెప్పిన సిద్ధాంతబిందువువలె శ్రద్ధతో పఠింపనగును. జేమ్స్, జాన్స్, ఎడింగ్టన్ ఇన్‌స్టయిన్‌ల వైజ్ఞానికసిద్ధాంతము లను, ప్రాక్ థిల్లీ, విల్ డ్యూరెండ్, బర్ట్రాండ్ రసెల్: వీరిలో ఏ ఒకరిదైనను పాశ్చాత్యదర్శన చరిత్రనుగూడ చదువనగును.

ఈ పఠనానుశీలనముకంటెను ముఖ్యమైన వేమన: ఆధికారిక _ గుణ సంపత్తి, శమదమాదిగుణములును, గురువాక్యమున శ్రద్ధా విశ్వాసములును. కొర వడిన అంతయును బూడిదలో పోసిన పన్నీరే! సాధనయును, గ్రంథపఠనమును అనగా: శ్రవణమననములు సాహచర్యము నందినయెడలనే, తీవ్రధ్యానసిద్ధికి

తోడ్పడును. కనుక సాధనసంపత్తి లేనివారు ఈ శాస్త్రమును ముట్టినచో, మిడిమిడిజ్ఞానము మిడిసిపాటునకే యగునను భయముతో, కొందరు సన్న్యాస పూర్వకమగు వేదాంతశాస్త్రశ్రవణమునే విధించుచున్నారు.

అయినను ఎంతటి అనుపయుక్తుడైనను శ్రద్ధాపూర్వకముగ గురువేదాంత వాక్యములయందు విశ్వాసముంచి భక్తితో ఈశాస్త్రము నభ్యసించిన క్రమముగ ఉపయుక్త - అధికారి యగుటయేగాక; అనివార్యమగు జ్ఞానఫలమునుబొందును.

అద్వైతదర్శనము వేదాంతవిజ్ఞాన సునిశ్చితజ్ఞానము లేకుండిన ముక్తి దుర్లభమని ఎంత నిష్కర్షగ నుడువుచున్నదో; మరల అంత నిష్కర్షగ స్త్రీ శూద్రాది సహితముగ సర్వులకును ఈ జ్ఞానమును, జ్ఞానఫలమును లభింపగలదని చెప్పుచున్నది. ఏలయన, జ్ఞానమహిమ అట్టిది ఎవరైనను జ్ఞానమును బొందుదు నని సంకల్పించుకొనినచో, ముల్లోకములును అడ్డుపడజాలవు. అట్టివానికి ఈ జ్ఞానమును, ముక్తియును లభించితీరును.

సద్యోముక్తియే ఈ శాస్త్రఫలము. అష్టావక్రుడు జనకునకు " అధునైవ సుఖీ శాన్తో బన్ధముక్తో భవిష్యసి — ఇప్పుడే నీవు సుఖమును, శాంతిని, బంధముక్తిని బొందగలవు " అని చెప్పినట్లు, కేవలము ఈ శాస్త్రము నుపదేశించు ఆచార్యుడొక్కడే శిష్యునకు ధైర్యసాహసములతో వక్కాణింపగలడు. ఈ శాస్త్రము నభ్యసించిన; భ్రమకల్పితమగు జీవత్వమును, దాని ననుసరించి కలిగెడు దుఃఖమును తొలగిపోవును. శత్రుమిత్రుల యెడ సమభావము కలుగును. సృష్టియంతయును నాయందే ఆశ్రితమై యున్నది. నాకంటె వేరగునదేమియు లేదు. అనంతకోటిబ్రహ్మాండములతో గూడిన ఈ సృష్టి, సూర్యచంద్ర నక్షత్ర నదీ కానన పర్వత సాగరములతోగూడిన ఈ జగత్తు, నారూపమే అను అనుభవము కలుగును.

అద్వైతశాస్త్రపర్యాలోచనమువలన కర్మయోగి శ్రేష్ఠత్వమునందును. భక్తుడు భక్తులలో మిన్నయగును. జ్ఞాని బ్రహ్మవిద్యాగరిష్ఠుడగును. బ్రాహ్మణుడు తపోనిరతుడగును. క్షత్రియుడు స్వదేశధర్మరక్షణకై వెనుదీయడు. వైశ్య శూద్రులు తమ వృత్తులయందు అధికతర పటుత్వమును జూపుదురు. మానవుడు నిర్భయుడై సందేహరహితుడై ఆనందపూర్ణుడై సంచరించును.

అవస్థాత్రయమును, దాని కతీతమగు స్థితియందుండి, పరీక్షించి ఫలితమగు ఏకాత్మదర్శనమును నిరూపించునది, అద్వైతశాస్త్రమొక్కటియే. సత్యమొక్కటియేగాని, - పలువిధములు కాజాలదు కదా! అవస్థాత్రయమను వల

లోనే చిక్కుబడి, దానిని పరీక్షింపబూనుకొని నందుననే పలకన్నులవలెనే పెక్కులగు ద్వైతదర్శనములు ప్రాచ్యపాశ్చాత్యదేశముల ఏర్పడి, ప్రతియొక్కటియును స్వోత్కృష్టతను నిరూపింప వ్యర్థముగ పరిశ్రమించుచున్నవి. ఇట్టిశ్రమ మనకు కలుగకుండ, అద్వైతజ్ఞానము బ్రహ్మాత్మైక్యమును ప్రదర్శించు చున్నది.

ద్వైతశ్రేణికి జెందిన ప్రతియొక్కమతమును స్వోత్కృష్టతను నిరూపించుటకు పరిశ్రమించుటయేగాక; స్వకక్ష్యను చేరని అన్యవిధద్వైత దృష్టి నవలంబించిన వారికిని, అద్వైతులకును పునరుద్ధారణలేని పాతిత్యమునే విధించుచున్నవి. ఇక అద్వైతదర్శనమో;సర్వము ఆత్మయే అగుటవలన, మీతో మాకెట్టి వాదును లేదు. — "తైః యం న విరుధ్యతే" అని పలుకుచు, క్రమముక్తి పథమును నిర్దేశించు చున్నది. అందరును దివ్యులే. ఈ దివ్యత్వము నేడు కాకుండిన మాపు వికసించి, సర్వులను నిరాఘాటముగ బ్రహ్మపదమునే పొందగలరు. అనుచున్నది. ఇట్టి జగన్మంగళకర శాస్త్రమును అధ్యయన మొనర్చి, దేవగురు కటాక్షమున ఎల్లరును తరింతురు గాక !

౪

ఏవిధమైన అంగబలమును అర్థికబలమును లేకపోయినను, నిష్పచ్చరము కార్చిచ్చుపలె ఎదురుకొనుచున్నను; ఆంధ్రమహాజనులకు ఆధ్యాత్మిక వాణిని వినిపింప ఉబలాటపడుచు, గడచిన ఏడేండ్లనుండి పరిశ్రమించుచుండిన సత్పురుషుడు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి. వీరి గ్రంథప్రచురణా ప్రయత్నమునకు తోడ్పడుట లోకోద్ధరణము కాదు, ఆత్మోద్ధరణమే. కలవారును, లోవెలుగును గనదలచువారును సర్వవిధముల ఈయనకు తోడ్పడుదురు గాక !

శ్రీ జానకిరాంప్రెస్ అధిపతులు ఈ గ్రంథముద్రణవిషయమున సర్వాత్మనా సర్వవిధముల సహకరించినారు. వారతోడ్పాటు లేకుండిన, ఈ గ్రంథము ఈ రీతిగ వెలువడుట అసంభవమే అయియుండెడిది. "జానకీరాముడు ఐహికాముష్మికముల వారికి తోడునీడ యగునుగాక !" — అని ఆ పుంసాం మోహనుని, ఆ నీలమేఘశ్యాముని, ఆ వేదాన్తవేద్యుని సంప్రార్థించుచు ఈ నివేదనను ముగించుచున్నాను.

శ్రీ రామకృష్ణమఠ్,
బేలూరు మఠ్, (పోస్టు)
హౌరాజిల్లా, (కలకత్తా)
వెస్ట్ బెంగాల్.

ఇట్లు
శ్రీ నిర్లిప్తకల్యాణానందస్వామి
28 – 10 – 53

ఓమ్

# ప్రణతి

ఓమ్ విశుద్ధ విజ్ఞాన మగాధ సౌఖ్యం
విశ్వస్య బీజం కరుణాపయోధిః,
అనాద్యనన్తం ప్రకృతేః పరస్తాత్
తత్తత్త్వ మేకం భువి రామకృష్ణః. ౧

న నేతి భీత్యా శ్రుతయో వదన్తి
వదన్తి సాక్షాన్న చ యం కదాచిత్,
చిదేకరూపః శివ ఈశ్వరాణాం
మహేశ్వరోఽసౌ భువి రామకృష్ణః. ౨

— శ్రీ ప్రమదదాసమిత్ర.

వితరితుమవతీర్ణం జ్ఞానభక్తి ప్రశాన్తీః
ప్రణయగలితచిత్తం జీవదుఃఖా సహిష్ణుమ్,
ధృతసహజసమాధిం చిన్మయం కోమలాఙ్గం
విమల పరమహంసం రామకృష్ణం భజామః. 3

హరి హర దేవా మూర్తిభేదాస్త్వమైతే
నిరుపమ బహుమూర్తి ర్మాయయా కల్పయన్తమ్,
అమితగుణచరిత్రం దీనబన్ధుం దయాలుం
విమల పరమహంసం రామకృష్ణం భజామః. ౪

శ్రుతి విగదిత మార్గస్థాపనాయావతారం
జనయ బహువాదభ్రాన్తి మున్మూలయన్తమ్,
భువన విజయఖ్యాతిం శఙ్కరం భాష్యకారం
విమల పరమహంసం రామకృష్ణం భజామః. ౫

— శ్రీమత్ అభేదానన్దస్వామి.

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః. ౧

ఓమ్ సర్వోపప్లవ రహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో
బ్రహ్మైవాహ మస్మి. ౨

ఓమ్ నారాయణం పద్మభవం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ,
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవింద యోగీన్ద్ర మథాస్య శిష్యమ్. ౩

శ్రీ శఙ్కరాచార్యమథాస్య పద్మ
పాదం చ హస్తామలకమ్ చ శిష్యమ్,
తం తోటకం వార్తికకారమన్యా
నస్మద్గురూ న్సన్తతమానతోఽస్మి. ౪

శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదం శఙ్కరం లోకశఙ్కరమ్. ౫

శఙ్కరం శఙ్కరాచార్యం కేశవం బాదరాయణమ్,
సూత్రభాష్య కృతౌ వన్దే భగవన్తౌ పునః పునః. ౬

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేద విభాగినే,
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః. ౭

— సంప్రదాయపరమ్పరా శ్లోకాని.

ఓమ్ నమః శ్రీ యతిరాజాయ వివేకానన్ద సూరయే,
సచ్చిత్సుఖ స్వరూపాయ స్వామినే తాపహారిణే. ౮

— శ్రీమద్ రామకృష్ణానన్దస్వామి.

# విషయసూచిక

| విషయము | శ్లోక సంఖ్య | పత్ర సంఖ్య |
|---|---|---|
| ౧ అద్వైతానుభూతిః | ౮౪ | ౧ |
| ౨ ఆత్మానాత్మ ప్రవివిక్తనిర్ణయ ప్రకరణమ్ | ౧౮ | ౧౯ |
| ౩ ఆత్మషట్కమ్ (ఆత్మపఞ్చకమ్, అద్వైతపఞ్చకమ్, అద్వైతపఞ్చరత్నాని) | ౬ | ౨౫ |
| ౪ ఆత్మపూజా (పరాపూజా) | ౧౪ | ౨౮ |
| ౫ ఆత్మబోధః | ౬౮ | ౩౧ |
| ౬ ఏకశ్లోకీ | ౧ | ౪౪ |
| ౭ కాశీపఞ్చకమ్ | ౫ | ౪౫ |
| ౮ కేవలోఽహమ్ | ౮ | ౪౮ |
| ౯ కౌపీనపఞ్చకమ్ | ౫ | ౫౦ |
| ౧౦ గుర్వష్టకమ్ | ౧౦ | ౫౨ |
| ౧౧ చర్పటపఞ్జరికా-౧ (భజగోవిన్దమ్) | ౧౭ | ౫౭ |
| ౧౨ చర్పటపఞ్జరికా-౨ (మోహముద్గరః) | ౧౫ | ౬౧ |
| చర్పటపఞ్జరికా-౩ (అధికశ్లోకాని) | ౮ | ౬౫ |
| ౧౩ జీవన్ముక్తానన్దలహరీ | ౧౮ | ౬౮ |
| ౧౪ తత్త్వోపదేశః | ౮౭ | ౭౪ |
| ౧౫ ధన్యాష్టకమ్ | ౧౦ | ౯౨ |
| ౧౬ నిర్గుణాష్టకమ్ | ౮ | ౯౬ |
| ౧౭ నిర్వాణషట్కమ్ | ౬ | ౯౯ |
| ౧౮ నిర్వాణదశకమ్ (దశశ్లోకీ, సిద్ధాన్తబిన్దు) | ౧౦ | ౧౦౨ |
| ౧౯ నిర్వాణమఞ్జరీ | ౧౨ | ౧౦౬ |
| ౨౦ నిర్గుణమానసపూజా | ౨౫ | ౧౧౦ |
| ౨౧ ప్రాతః స్మరణ | ౪ | ౧౧౬ |
| ౨౨ ప్రశ్నోత్తర-రత్నమాలికా | ౬౭ | ౧౧౮ |

గమనిక: ద్వితీయసంపుటమున ౪౧ అజ్ఞానబోధిని, ౪౨ ఆత్మజ్ఞానోపదేశవిధి, ౪౩ ఆత్మానాత్మవివేకము, ౪౪ తత్త్వబోధ, ౪౫ పఞ్చీకరణమ్ అను వచనగ్రంథములును; ౪౬ పఞ్చీకరణ-వార్తికము, ౪౭ అపరోక్షానుభూతి (సురేశ్వరులు), ౪౮ ప్రబోధసుధాకరమ్, ౪౯ శతశ్లోకి, ౫౦ స్వాత్మనిరూపణ అను శ్లోకగ్రంథములును వెలువడు చున్నవి. తృతీయ సంపుటమున ౭౫ స్తోత్రములుండును.

ఓమ్

# శంకరగ్రంథరత్నావళి

## ౧. అద్వైతానుభూతిః

సర్గస్థితిప్రలయహేతుమచింత్యశక్తిం
విశ్వేశ్వరం విదితవిశ్వమనంతమూర్తిమ్,
నిర్ముక్తబంధనమపారసుఖాంబురాశిం
శ్రీవల్లభం విమలబోధఘనం నమామి. ౧

యస్య ప్రసాదాదహమేవ విష్ణు
ర్మయ్యేవ సర్వం పరికల్పితఞ్చ,
ఇత్థం విజానామి సదాత్మరూపం
తస్యాంఘ్రియుగ్మం ప్రణతోఽస్మి నిత్యమ్. ౨

అహమానందసత్యాదిలక్షణః కేవలః శివః,
అనానందాదిరూపం యత్ తన్నాహమచలోఽద్వయః. ౩

సృష్టి స్థితి ప్రళయములకు కారణమైనవాడును, అచింత్యనీయశక్తియును, విశ్వేశ్వరుడును, విశ్వవిజ్ఞాతయును, అనంతమూర్తియును, మాయాపాశనిర్ముక్తుడును, అపారసుఖస్వరూపుడును, నిర్మలజ్ఞానమూర్తియును నగు లక్ష్మీపతికి నమస్కరించుచున్నాను. ౧

"నేనే విష్ణుడను, విష్ణుస్వరూపుడనగు నాయందే ఈవిశ్వమంతయును పరికల్పితమైనది." అను జ్ఞానము ఎవని యనుగ్రహమువలన లభించుచున్నదో, మరియు నెవ్వడు నిత్యాత్మస్వరూపుడో, అతని చరణయుగళమునకు నిత్యము నమస్కరించుచున్నాను. ౨

నా స్వరూపము సత్యజ్ఞానానందలక్షణము. కేవల శివస్వరూపము. నిరానందస్వరూపమనునది నేనుకాదు. ఏలయన, నేను నిశ్చలుడను. అద్వితీయుడను. ౩

అక్షిదోషాద్ యథైకోఽపి ద్వయవద్భాతి చంద్రమాః,
ఏకోఽప్యాత్మా తథా భాతి ద్వయవన్మాయయా మృషా. ౪

అక్షిదోషవిహీనానామేక ఏవ యథా శశీ,
మాయాదోషవిహీనానామాత్మైవైకస్తథా సదా. ౫

ద్విత్వం భాత్యక్షిదోషేణ చంద్రే స్వే మాయయా జగత్,
ద్విత్వం మృషా యథా చంద్రే మృషా ద్వైతం తథాత్మని.

ఆత్మనః కార్య ఆకాశో వినాత్మానం న సంభవేత్,
కార్యస్య పూర్ణతా సిద్ధా కిం పునః పూర్ణతాత్మనః. ౭

కార్యభూతో యథాకాశ ఏక ఏవ న హి ద్విధా,
హేతుభూతస్తథాత్మాయమేక ఏవ విజానతః. ౮

నేత్రదోషమువలన ఒకే చంద్రుడు రెండైనట్లు తోచురీతిగ, మాయవలన మిథ్యాజ్ఞానము కలుగగా, అద్వయాత్మయందు ద్విత్వభ్రాంతి కలుగుచున్నది. ౪

నేత్రదోషము లేనివారు సదా ఒకే చంద్రుని చూచుచుండునట్లు, మాయా దోషరహితులు సర్వదా ఒకే ఆత్మను దర్శన మొనర్చుచుందురు. ౫

నేత్రదోషమువలననే చంద్రునియందు ద్విత్వభ్రాంతి; అట్లే మాయా దోషమువలన ఆత్మయందు ద్వైతరూపమగు జగద్భ్రాంతి తోచుచున్నది. చంద్రునియందు ద్విత్వము మిథ్యయైనట్లే, ఆత్మయందు ద్వైతముకూడ మిథ్యయే.

ఆకాశము ఆత్మయొక్క కార్యము. ఆత్మ లేనిచో ఆకాశ ముండదు. కార్యముయొక్క పూర్ణత సిద్ధించుచుండ, కారణముయొక్క పూర్ణత సిద్ధింపకుండునా? ౭

కార్యమగు ఆకాశ మొక్కటియేగాని రెండు కాదు; అట్లే జ్ఞానికి హేతుభూతమగు ఆత్మ యొక్కటియే. ౮

ఏకోఽపి ద్వయవద్భాతి యథాకాశ ఉపాధితః,
ఏకోఽపి ద్వయవత్ పూర్ణ స్తథాత్మాయముపాధితః. ౯

కారణోపాధిచైతన్యం కార్యసంస్థచితోఽధికమ్,
న ఘటాభ్రాన్మృదాకాశః కుత్రచిన్నాధికో భవేత్. ౧౦

నిర్గతోపాధిరాకాశః ఏక ఏవ యథా భవేత్,
ఏక ఏవ తథాత్మాయం నిర్గతోపాధికః సదా. ౧౧

ఆకాశాదన్యదాకాశమాకాశస్పృక్ యథా న హి,
ఏకత్వాదాత్మనో నాన్య ఆత్మా సిధ్యతి చాత్మనః. ౧౨

మేఘయోగాద్ యథా నీరం కరకాకారతామియాత్,
మాయాయోగాత్తథైవాత్మా ప్రపంచాకారతామియాత్.

ఒకే ఆకాశము (ఘటాది) ఉపాధిభేదము ననుసరించి [illegible] దోచునట్లు, పూర్ణమగు ఆత్మయును (బుద్ధ్యాది) ఉపాధిభేదము ననుసరించి అనేక విధముల ప్రతీయమాన మగుచున్నది. ౯

కార్యోపాధిసముదాయమంతయును చైతన్యమే. అనగా కారణోపాధి చైతన్యమగు ఈశ్వరుడు జీవునికంటె వేరుకాదు. ఏలయన, మృద్ఘటాకాశము ఘటాకాశముకంటె వేరు కాదు కదా! ౧౦

ఉపాధులనుండి వేరొనర్పబడిన ఆకాశము ఒక్కటేయగునట్లు, బుద్ధ్యుపాధులనుండి వెలువడిన ఆత్మ ఎల్లప్పుడును ఒక్కటిగనే యుండును. ౧౧

ఒక్కటియేయగు ఆకాశము (వేరొకటిగాతోచు) ఇంకొక ఆకాశము నుండి వేరుకానట్లు, ఏకత్వహేతువువలన ఇంకొక ఆత్మ సిద్ధించదు. ౧౨

మేఘసంపర్కమువలన నీరు మంచుగడ్డయగునట్లు, మాయాయోగమువలన ఆత్మ ప్రపంచాకారము నందుచున్నది. ౧౩

వర్షోపల ఇవాభాతి నీరమేవాభ్రయోగతః,
వర్షోపలవినాశేన నీరనాశో యథా న హి. ౧౪

ఆత్మైవాయం తథా భాతి మాయాయోగాత్ ప్రపంచవత్
ప్రపంచస్య వినాశేన స్వాత్మనాశో న హి క్వచిత్. ౧౫

జలాదన్య ఇవాభాతి జలోత్థో బుద్బుదో యథా,
తథాత్మనః పృథగివ ప్రపంచోఽయమనేకథా. ౧౬

యథా బుద్బుదనాశేన జలనాశో న హి క్వచిత్
తథా ప్రపంచనాశేన నాశః స్యాదాత్మనో న హి. ౧౭

అహిర్నిర్ల్వయినీజాతః శుచ్యాదిర్నాహిమాప్నుయాత్
తథాస్థూలాదిసంభూతః శుచ్యాదిర్నాప్నుయాదిమమ్. ౧౮

నీళ్లే మబ్బుతోకూడి వడగళ్లుగా మారునట్లును, వడగళ్లు కరిగిపోయినను నీటికి నష్టము లేనట్లును _ ౧౪

ఈ ఆత్మయే మాయాసంపర్కమువలన ప్రపంచముగ తోచుచున్నది ఆ ప్రపంచము వినష్టమైనను ఆత్మ కెన్నడును నష్టములేదు. ౧౫

నీటినుండి లేచిన బుడగలు నీటికంటె వేరుగా తోచునట్లు, ఆత్మనుండి వేరుగ నానారూపమగు ఈప్రపంచము ఆభాసించుచున్నది. ౧౬

బుడగ పోయిన నీటికి వినాశనము లేనట్లు, ప్రపంచము వినష్టమైనను ఆత్మ కెన్నడును నష్టము లేదు. ౧౭

కుబుసముయొక్క శుద్ధత్వాదిగుణములు పామును స్పృశింపజాలనట్లు, స్థూలవస్తుగుణము లాత్మ నెన్నడును తాకజాలవు. ౧౮

ప్రమేయాదిత్రయం సాక్షిం భానునా ఘటకుడ్యవత్,
యేన భాతి స ఏవాహం ప్రమేయాదివిలక్షణః. ౨౪

భానుస్ఫురణతో యద్వత్ స్ఫురతీవ ఘటాదికమ్,
స్ఫురతీవ ప్రమేయాది స్వాత్మస్ఫురణతస్తథా. ౨౫

పిష్టాదిర్గుడసంయోగాత్ గుడవత్ ప్రీతిమాన్ యథా,
ఆత్మయోగాత్ ప్రమేయాదిరాత్మవత్ ప్రీతిమాన్ భవేత్.

ఘటనీరాన్నపిష్టానాముష్ణత్వం వహ్నియోగతః,
వహ్నిం వినా కథం తేషాముష్ణత్వం స్యాద్ యథాక్వచిత్.

భూతభౌతికదేహానాం స్ఫూర్తిత్వం స్వాత్మయోగతః,
వినాత్మానం కథం తేషాం స్ఫూర్తితా స్యాత్ తథాక్వచిత్.

సూర్యునివలన ఘటకుడ్యాదులు ప్రకాశింపబడునట్లు, ఎవనివలన ఇంద్రియ సహితములగు ప్రమేయ, ప్రమాణ, ప్రమాతృత్రయము ప్రకాశింపబడుచున్నదో, నే నా ప్రమేయాదిభిన్నమగు పరమాత్మను. ౨౪

సూర్యప్రకాశమువలన ఘటాదిపదార్థములు స్ఫురించునట్లు, ఆత్మప్రకాశమువలన ప్రమేయాదికమంతయును స్ఫురించుచున్నది. ౨౫

రొట్టె మున్నగునవి బెల్లముతో గూడిన, బెల్లమువలెనే ప్రీతికరమగునట్లు ప్రమేయాదికము ఆత్మతో గూడి ఆత్మవలెనే ప్రియమగుచున్నవి. ౨౬

కుండయందలి నీరు, అన్నము, పిండి మున్నగునవి ఎట్లు అగ్నిసంయోగమువలననే వేడియగుచు, అగ్ని లేకుండిన వేడిని బొందజాలకున్నవో— ౨౭

ఆట్లే ఆత్మసంయోగముననే భూతభౌతికములగు శరీరములు ప్రకాశము నందుచున్నవి. ఆత్మవస్తువు లేకుండిన ఇవి ఎన్నడును ప్రకాశము నందజాలవు. ౨౮

నానావిధేషు కుంభేషు వసేదేకం నభో యథా,
నానావిధేషు దేహేషు తథైవైకో వసామ్యహమ్. ౨౯

నానావిధత్వం కుంభానాం న యాత్యేవ యథా నభః
నానావిధత్వం దేహానాం తద్వదేవ న యామ్యహమ్. ౩౦

యథా ఘటేషు నష్టేషు ఘటాకాశో న నశ్యతి,
తథా దేహేషు నష్టేషు నైవ నశ్యామి సర్వగః. ౩౧

ఉత్తమాదీని పుష్పాణి వర్తన్తే సూత్రకే యథా,
ఉత్తమాద్యాస్తథా దేహా వర్తన్తే మయి సర్వగే. ౩౨

యథా న సంస్పృశేత్ సూత్రం పుష్పాణాముత్తమాదితా,
తథా నైవం సర్వగం మాం దేహానాముత్తమాదితా. ౩౩

పలువిధములగు కుండలలో ఒకే ఆకాశముండునట్లు, నేనే నానావిధములగు శరీరములలో వసించుచున్నాను. ౨౯

కుంభములు నానావిధములైనను ఆకాశము నానావిధము కానట్లు, శరీరములు పెక్కురకములైనను ఆత్మ నానావిధత్వమును పొందదు. ౩౦

కుండలు పగిలిపోయినను అందలి ఆకాశమునకు వినాశము లేనట్లు, శరీరములు నానావిధములగునవి వినష్టత నందినను, సర్వగతుడనగు నాకు వినాశము లేదు. ౩౧

ఒకే సూత్రమున ఉత్తమాధమమధ్యమములగు త్రివిధపుష్పములు గ్రథితములగునట్లు, సర్వగతుడనగు నాయందే ఉత్తమాధమమధ్యమములగు త్రివిధ శరీరములు వెలయుచున్నవి. ౩౨

పుష్పసంబంధములగు ఉత్తమాదిగుణములు దారమునకు చెందనట్లు, సర్వగతుడను, ఏకస్వరూపుడను నగు నాకు శరీరమునకును చెందిన ఉత్తమాది గుణములు అంటవు. ౩౩

పుష్పేషు తేషు నష్టేషు యద్వత్ సూత్రం న నశ్యతి,
తథా దేహేషు నష్టేషు నైవ నశ్యామి సర్వగః. ౩౪

రజ్జురన్ధ్రస్థదోషాది సూర్యాభం న స్పృశేద్ యథా,
తథా క్షేత్రస్థదోషాది సర్వగం మాం న సంస్పృశేత్. ౩౫

తద్ రజ్జురన్ధ్రనాశేషు నైవ నశ్యతి సూర్యభా,
తథా క్షేత్రవినాశేషు నైవ నశ్యామి సర్వగః. ౩౬

దేహో నాహం సదృశ్యత్వాత్ భౌతికత్వాన్న చేంద్రియమ్,
ప్రాణో నాహ మనేకత్వా న్మనో నాహం చలత్వతః ౩౭

బుద్ధిర్నాహం వికారిత్వాత్ తమో నాహం జడత్వతః,
దేహేంద్రియాదికం నాహం వినాశిత్వాద్ ఘటాదివత్.

ఆధారమున గ్రుచ్చబడిన పుష్పములన్నియును చెడిపోయినను దారము చెడకుండునట్లు, ఈ శరీరము లన్నియును వినష్టత నందినను సర్వగతుడనగు నాకు చెరుపులేదు. ౩౪

రజ్జువు, రంధ్రము, మున్నగువాని సంబంధమగు దోషములు సూర్యకాంతిని స్పృశింపజాలనట్లు, నానావిధశరీరముల సంబంధమగు దోషములు సర్వగతుడనగు నన్ను ముట్టజాలవు. ౩౫

రజ్జువు, రంధ్రము, మున్నగునవి నశించినను సూర్యప్రభ నశించకుండునట్లు, శరీరములన్నియును నశించినను సర్వగతుడనగు నాకు వినాశము లేదు. ౩౬

దృశ్యమానమగుటవలన నేను దేహమును గాను; భౌతికపదార్థము లగుట వలన నేను ఇంద్రియములను గాను; అనేకములగుటవలన నేను ప్రాణమును గాను; చంచలమగుటవలన నేను మనస్సును గాను. ౩౭

వికారయుక్తమగుటవలన నేను బుద్ధిని గాను; జడమగుటవలన నేను తమస్సును గాను. ఘటాదులవలె వినాశము నందునవగుటవలన దేహేంద్రియాదికము నేను కాను. ౩౮

దేహేంద్రియప్రాణమనో బుద్ధ్యజ్ఞానాని భాసయన్,
అహంకారం తథా భామి చైతేషాం స్వాభిమానినమ్. ౩౯

సర్వం జగదిదం నాహం విషయత్వాదితం ధియః,
అహం నాహం సుషుప్త్యాదౌ అహామః సాక్షితః సదా. ౪౦

సుప్తౌ యథా నిర్వికారస్తథావస్థాద్వయేఽపి చ,
ద్వయోర్మాత్రాదియోగేన న వికారీ భవామ్యహమ్. ౪౧

ఉపాధినీలరక్తాద్యైః స్ఫటికో నైవ లిప్యతే,
తథాత్మా కోశజైః సర్వైః కామాద్యైర్నైవ లిప్యతే ౪౨

ఘాతేన భ్రామ్యమాణేన భ్రమతీవ యథా మహీ,
అఙ్గోఽప్యాత్మా విమూఢేన చలతీవ ప్రదృశ్యతే. ౪౩

శరీరము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, అజ్ఞానము, మున్నగువానిని ప్రకాశింప జేయుచు, ఈ శరీరాదులయందు ఆత్మాభిమానమును వహించెడు అహంకారమును గూడ నేనే ప్రకాశింప జేయుచున్నాను. ౩౯

ఈ సమస్త జగత్తుయును, నేను కాదు. బుద్ధియును, విషయ సమూహ మునుగూడ నేను కాదు. సుషుప్తియందు సాక్షిస్వరూపమున నా సత్తయే ప్రకాశించుచున్నది. ౪౦

సుషుప్తిస్థితియం దేరీతిగ నేను నిర్వికారుడనో అట్లే జాగ్రత్స్వప్నములయందుకూడ నిర్వికారుడను. స్వప్నజాగరణ విషయ స్పర్శవలన నేను వికృతిని బొందను. ౪౧

ఉపాధిస్థితములగు నీలరక్తాది వర్ణములు స్ఫటికము నంటనట్లు, శరీరము నుండి కలిగిన కామక్రోధాది దోషముల వలన ఆత్మ లిప్తము కాదు. ౪౨

నాగలి తిరుగునప్పుడు భూమికూడ తిరుగుచుండునట్లు తోచునట్లు, మూఢవ్యక్తులకు నిశ్చలమగు ఆత్మ చలస్వభావముగ తోచుచున్నది. ౪౩

దేహత్రయమిదం నిత్యమాత్మత్వేనాభిమన్యతే,
యావత్తావదయం మూఢో నానాయోనిషు జాయతే. ౪౪

నిద్రాదేహజదుఃఖాది జాగ్రద్దేహం న సంస్పృశేత్,
జాగ్రద్దేహజదుఃఖాదిస్తథాత్మానం న సంస్పృశేత్. ౪౫

జాగ్రద్దేహవదాభాతి నిద్రాదేహస్తు నిద్రయా,
నిద్రాదేహవినాశేన జాగ్రద్దేహో న నశ్యతి. ౪౬

తథాయమాత్మవద్భాతి జాగ్రద్దేహస్తు జాగరే,
జాగ్రద్దేహవినాశేన నాత్మా నశ్యతి కర్హిచిత్. ౪౭

హిత్వాయం స్వాప్నకం దేహం జాగ్రద్దేహమవేక్షతే,
జాగ్రద్దేహం ప్రబుద్ధోఽయం హిత్వాత్మానం యథా తథా.

దేహత్రయమును ఆత్మగా అభిమానించుచు, నిత్యముగా విశ్వసించు నంతవరకు మూఢుడు నానావిధయోనులందు జన్మించుచున్నాడు. ౪౪

స్వప్నమున ప్రతీతమగు శరీరమునకు సంభవించెడు దుఃఖాదులు జాగ్రదవస్థ యందలి శరీరమునకు అంటనట్లు, జాగ్రదవస్థయందలి శరీరమునకు సంభవించెడు దుఃఖాదులు ఆత్మ నంటవు. ౪౫

స్వప్నావస్థయందు తోచెడు శరీరము జాగ్రదవస్థయందలి శరీరమువలెనే సత్య మనిపించును. స్వప్నకల్పితమగు శరీరము వినష్టమైనను, జాగ్రదవస్థయందలి శరీరము నశింపకుండును. ౪౬

అట్లే జాగ్రద్దేహమున ఆత్మప్రతీతి జాగ్రద్దశయం దేర్పడినను, ఈ జాగ్రద్దేహము వినష్టమైనప్పుడు ఆత్మ వినష్టము కాదు. ౪౭

స్వప్న శరీరమును విడచి జాగ్రద్దేహమును వీక్షించునట్లు, జాగ్రద్దేహభ్రాంతినుండి ప్రబోధమునందిన యతడు దానిని విడచి ఆత్మనే వీక్షించుచుండును. ౪౮

స్వప్నభోగే యథైవేచ్ఛా ప్రబుద్ధస్య నవిద్యతే,
అసత్స్వర్గాదికే భోగే నైవేచ్ఛా జ్ఞానినస్తథా. ౪౯

భోక్తా బర్హీ యథా భోగ్యః సర్పో దృషది కల్పితః,
రూపం శిలానయోరాత్మా భోక్తృభోగ్యస్వరూపకః. ౫౦

జ్ఞస్య నాస్త్యేవ సంసారో యద్వదజ్ఞస్య కర్మిణః,
జానతో నైవ భీర్యద్వద్ రజ్జుసర్పమజానతః. ౫౧

సైంధవస్య ఘనో యద్వజ్జలయోగాజ్జలం భవేత్,
ఆత్మయోగాత్తథా బుద్ధిరాత్మవద్ బ్రహ్మవేదినః. ౫౨

తోయాశయేషు సర్వేషు భానురేకోఽప్యనేకవత్,
ఏకోఽప్యాత్మా తథా భాతి సర్వక్షేత్రేష్వనేకవత్. ౫౩

మేల్కొనినవాడు స్వప్న కల్పితములగు సుఖభోగములయందు [illegible] గొననట్లు, జ్ఞానులు అనిత్యములగు స్వర్గాదిభోగములను వాంఛింప[illegible]. ౪౯

రాతియందు మయూరాగము భోక్తగను, సర్పము భోగ్యముగను [illegible] వది. కాని ఈ రెంటియొక్క స్వరూపము శిలయే. అట్లే ఆత్మయందు భో[illegible] భోగ్యభావము కల్పింపబడుచున్నది. ౫౦

ఎరుగనివాడు త్రాటినిజూచి పాముని భయపడునట్లును, [illegible] కాభయము లేకుండునట్లును, భ్రమరహితుడగు జ్ఞానికి సంసారభయము, [illegible] మగు తాపత్రయ భీతియును లేవు. అజ్ఞుడును [illegible] వ్యక్తికే ఈ సంసారచక్ర పరిభ్రమణము. ౫౧

సైంధవలవణఖండము జలసంపర్కమున ద్రవీభావమునందునట్లు, బ్రహ్మజ్ఞాని బుద్ధికూడ ఆత్మసంయోగమున ఆత్మాకారము నందును. ౫౨

వివిధ జలాశయములలో ఒకే సూర్యుడు ప్రతిబింబించుచు నానావిధ ముల దోచునట్లు, ఒకే ఆత్మ సర్వక్షేత్రములలో భాసించుచు అనేకవిధములుగ తోచుచున్నది. ౫౩

భానోరన్య ఇవాభాతి జలభానుర్జలే యథా,
ఆత్మనోఽన్య ఇవాఽభాసో భాతి బుద్ధౌ తథాత్మనః. ౫౪

బింబం వినా యథా నీరే ప్రతిబింబో భవేత్ కథమ్,
బింబాత్మానం తథా బుద్ధౌ చిదాభాసో భవేత్ కథమ్.

ప్రతిబింబచలత్వాద్యా యథా బింబస్య కర్హిచిత్,
న భవేయుస్తథాఽభాసకర్తృత్వాద్యాస్తు నాత్మనః. ౫౬

జలే శైత్యాదికం యద్వత్ జలభానుం న సంస్పృశేత్
బుద్ధేః కామాదికం తద్వచ్చిదాభాసం న సంస్పృశేత్.

బుద్ధేః కర్తృత్వభోక్తృత్వదుఃఖిత్వాద్యైస్తు సంయుతః,
చిదాభాసో వికారీవ శరావస్థాంబుభానువత్. ౫౮

జలప్రతిబింబితుడగు సూర్యుడు బింబభూతుడగు సూర్యునికంటె అన్యుడగు రీతిని దోచునట్లు, బుద్ధిప్రతిబింబితమగు ఆత్మాభాసకూడ ఆత్మకంటె వేరైనట్లు ప్రతీతమగుచున్నది. ౫౪

బింబము లేకుండిన నీటియందు ప్రతిబింబముండనట్లు, ఆత్మయే లేకుండిన బుద్ధియందు చిదాభాస ప్రతిఫలింపదు. ౫౫

ప్రతిబింబసూర్యుని చంచలత్వాదిగుణములు బింబసూర్యునికి చెందనట్లు, చిదాభాసుని కర్తృత్వాదిగుణములు ఆత్మకు సంక్రమింపవు. ౫౬

నీటికి సంబంధించిన చల్లదనము మొదలైన గుణములు జలప్రతిబింబిత సూర్యుని సంస్పృశింపనట్లు, బుద్ధికి సంబంధించిన కామక్రోధాదులు చిదాభాసునికి తగులజాలవు. ౫౭

నీటికుండయందు ప్రతిఫలించినసూర్యుడు వికారయుతునివలె దోచునట్లు, బుద్ధికి సంబంధించిన కర్తృత్వభోక్తృత్వదుఃఖిత్వాదిగుణసంబంధమైన చిదాభాసుడు వికారివలె దోచుచున్నాడు. ౫౮

శరావస్థోదకే నష్టే తత్స్థభానుర్వినష్టవత్,
బుద్ధేర్లయే తథా సుప్తే నష్టవత్ ప్రతిభాత్యయమ్. ౫౯

జలస్థార్కం జలఞ్చోర్మిం భాసయన్ భాతి భాస్కరః,
ఆత్మాభాసం ధియం బుద్ధేః కర్తృత్వాదీనయం తథా, ౬౦

మేఘావభాసకో భానుర్మేఘాచ్ఛన్నోఽపి భాసతే,
మోహావభాసకస్తద్వన్మోహాచ్ఛన్నోఽపి భాత్యయమ్ ౬౧

భాస్యం మేఘాదికం భానుర్భాసయన్ ప్రతిభాసతే,
తథా స్థూలాదికం భాస్యం భాసయన్ ప్రతిభాత్యయమ్.

సర్వప్రకాశకో భానుః ప్రకాశ్యైర్నైవ దూష్యతే,
సర్వప్రకాశకో హ్యాత్మా సర్వైస్తద్వన్న దూష్యతే. ౬౩

కుండయందలి నీరుపోగా అందలి సూర్యుడు వినష్టతనందినట్లు తోచు రీతిగ, బుద్ధి లయమందిన అందలి చిదాభాసుడుకూడ వినాశనమును గొందినట్లు తోచును. ౫౯

ప్రతిబింబసూర్య, జల, తరంగములను ప్రకాశింపజేయుచు, సూర్యుడు తాను వెలుగొందుచున్నట్లు, ఆత్మయును చిదాభాసుని, బుద్ధిని, బుద్ధినిష్ఠము లగు కర్తృత్వాదికమును ప్రకాశింపజేయుచు తాను వెలుగొందుచున్నది. ౬౦

మబ్బువలన కప్పబడినను, సూర్యుడా మబ్బును ప్రకాశింపజేయుచు, తానుగూడ వెలుగొందుచున్నాడు. అట్లే, జీవుడును అజ్ఞానాచ్ఛన్నుడయ్యును, ఆఅజ్ఞానమును ప్రకాశింపజేయుచు, తానుగూడ వెలుగొందుచున్నాడు. ౬౧

స్వయంప్రకాశమానుడగు సూర్యుడు ప్రకాశ్యములగు మేఘాదులను ప్రకాశింపజేయునట్లు, ఆత్మయును స్థూలవస్తుసముదాయము నంతటిని ప్రకాశింపజేయుచు, తానుగూడ వెలుగొందుచున్నది. ౬౨

సర్వప్రకాశకుడగు సూర్యుడు ప్రకాశ్యవస్తువులవలన దోషమునందనట్లు, సర్వప్రకాశకమగు ఆత్మ వస్తుసముదాయమువలన దోషమునందజాలదు. ౬౩

**ముకురస్థం ముఖం యద్వన్ముఖవత్ ప్రథతే మృషా,**
**బుద్ధిస్థాభాసక స్తద్వత్ ఆత్మవత్ ప్రథతే మృషా.** ౬౪

**ముకురస్థస్య నాశేన ముఖనాశో భవేత్కథమ్,**
**బుద్ధిస్థాభాసనాశేన నాశో నైవాత్మనః క్వచిత్.** ౬౫

**తామ్రకల్పితదేవాదిస్తామ్రాదన్య ఇవ స్ఫురేత్,**
**పతిభార్యాదిరూపేణ తథాత్మోత్థమిదం జగత్.** ౬౬

**ఈశజీవాదివద్భాతి యథైకమపి తామ్రకమ్,**
**ఏకోఽప్యాత్మా తథైవాయమీశజీవాదివన్మృషా.** ౬౭

**యథేశత్వాదినాశేన తామ్రనాశో న విద్యతే,**
**తథేశత్వాదినాశేన నాశో నైవాత్మనః సదా.** ౬౮

అద్దమునందలి మోము వాస్తవమగునట్లు తోచినను మిథ్యయేయైనట్లు, బుద్ధిస్థమగు చిదాభాస మిథ్యయయ్యును ఆత్మవలెనే తోచుచున్నది. ౬౪

దర్పణప్రతిబింబితవదనము నష్టమైన, మోమునకు చెడుగు లేదుకదా! అట్లే బుద్ధిస్థితమగు ఆభాస నష్టమైనను ఆత్మకెన్నడును వినాశనము లేదు. ౬౫

రాగితో చేయబడిన దేవవిగ్రహాదులు రాగికంటె వేరైనట్లు తోచునట్లు, ఆత్మనుండి ఉత్పన్నమైన ఈజగత్తు సతి, పతి మున్నగు రూపముల దోచుచున్నది. ౬౬

ఒకేతామ్రలోహఖండము ఈశ్వరుడు, జీవజంతువులు, పాత్రలుమున్నగు రూపముల గోచరించునట్లు ఒకేఆత్మ జీవేశ్వరాది బహువిధ మిథ్యారూపముల విభిన్నమై ప్రతీయమాన మగుచున్నది. ౬౭

ఈశ్వరాదిరూపములు నాశనమైనను తామ్రఖండమునకు వినాశము లేనట్లు, జీవేశ్వరత్వాదులు వినష్టతనందినను ఆత్మకు వినాశము లేదు. ౬౮

అధ్యస్తో రజ్జుసర్పోఽయం సత్యవద్ రజ్జుసత్తయా,
తథా జగదిదం భాతి సత్యవత్ స్వాత్మసత్తయా. ౬౯

అధ్యస్తాహేరభావేన రజ్జురేవావశిష్యతే,
తథా జగదాభావేన సదాత్మైవావశిష్యతే. ౭౦

స్ఫటికే రక్తతా యద్వనుపాధేర్నీలతాంబరే,
యథా జగదిదం భాతి తథా సత్యమివాద్వయే. ౭౧

స్ఫటికే రక్తతా మిథ్యా మృషా ఖే నీలతా యథా,
తథా జగదిదం మిథ్యా త్వేకస్మిన్నద్వయే మయి. ౭౨

జీవేశ్వరాదిభావేన భేదం పశ్యతి మూఢధీః,
నిర్భేదే నిర్విశేషేఽస్మిన్ కథం భేదో భవేద్ ధ్రువమ్. ౭౩

తాటియందు పాము ఆరోపింపబడినప్పుడు, ఆ పాము రజ్జుసత్తవలనే వాస్తవమైనట్లు తోచుచున్నది. అట్లే ఆత్మసత్తవలన ఈ జగత్తు సత్యమువలె అనుభూత మగు చున్నది. ౬౯

భ్రాంతి - సర్పము లేకుండిన మిగులునది రజ్జువే. అట్లే జగత్ - భావము తొలగిపోయిన శేషించునది సద్రూపమగు ఆత్మయే. ౭౦

ఉపాధిగతములగు రక్త నీలవర్ణములు స్ఫటికాకాశముల గోచరించునట్లు, ఈ జగత్తుకూడ సత్యమువలె అద్వయమగు ఆత్మయందు గోచరించుచున్నది. ౭౧

రక్త నీల వర్ణములు స్ఫటికాకాశముల మిథ్యయైనట్లు, ఈ జగత్తుకూడ మిథ్యయే; ఏకస్వరూపుడను, అద్వితీయుడను అగు నాయందు కల్పితము. ౭౨

మూఢబుద్ధియే జీవేశ్వరాది భేదభావమును జూచును. కాని నిర్విశేషమును, భేదరహితమును అగు ఆత్మయందు భేదభావము లెట్లు ధ్రువమగును? ౭౩

లింగస్య ధారణాదేవ యతోఽయం జీవతాం వ్రజేత్,
లింగనాశే శివస్యాస్య జీవతా వేశతా కుతః. ౨౪

శివ ఏవ సదా జీవో జీవ ఏవ సదా శివః,
వేత్త్యైక్యమనయోర్యస్తు స ఆత్మజ్ఞో న చేతరః. ౨౫

క్షీరయోగాద్యథా నీరం క్షీరవద్దృశ్యతే మృషా,
ఆత్మయోగాదనాత్మాయమాత్మవద్దృశ్యతే తథా. ౨౬

నీరాత్ క్షీరం పృథక్కృత్య హంసో భవతి నాన్యథా,
స్థూలాదేః స్వం పృథక్కృత్య ముక్తో భవతి నాన్యథా. ౨౭

క్షీరనీరవివేకజ్ఞో హంస ఏవ న చేతరః,
ఆత్మానాత్మవివేకజ్ఞో యతిరేవ న చేతరః. ౨౮

చిత్స్వరూపమగు ఆత్మ లింగధారణము, అనగా, ఉపాధిధారణమువలన జీవునివలె దోచుచున్నది. కాని లింగనాశనమైన, అనగా ఉపాధులు తొలగిపోయిన శివస్వరూపమగు పరమాత్మయందు జీవేశ్వరత్వాదు లేమియును ఉండవు. ౨౪

ఎల్లకాలముల శివుడే జీవుడు, జీవుడే శివుడు, ఈ ఉభయుల ఐక్యము నెరిగినవాడే ఆత్మజ్ఞుడు. ఇతరులు కారు. ౨౫

నిక్కము కాకుండినను నీరు పాలతో గలసి పాలవలె గోచరించునట్లు, అనాత్మరూపమగు ఈ జగత్తు ఆత్మతో గలసి ఆత్మవలె దోచుచున్నది. ౨౬

నీటనుండి పాలను వేరుచేయగలిగినదియే హంస యగుచున్నది. అట్లే స్థూలములగుశరీరాదులనుండి ఆత్మను వేరుచేయగలిగినవాడే ముక్తుడగుచున్నాడు. ఇంకొక ఉపాయము లేదు. ౨౭

హంస ఒక్కదానికే క్షీరనీరవివేకజ్ఞానము కలదు. ఆత్మానాత్మ వివేకజ్ఞానయుతుడే యతి. ఇతరులు యతులనబడజాలరు. ౨౮

అధ్యస్త చోరజః స్థాణోర్వికారః స్యాన్న హి క్వచిత్,
నాత్మనో నిర్వికారస్య వికారో బింబజస్తథా. ౭౯

జ్ఞాతే స్థాణౌ కృతశ్చౌరశ్చౌరాభావే భయం కుతః,
జ్ఞాతే స్వస్మిన్ కుతో విశ్వం విశ్వాభావే కుతోఽఖిలమ్ ౮౦

గుణమూర్తిత్రయం భాతి పరస్పరవిలక్షణమ్,
సత్త్వాదిలక్షణో యస్మిన్ స ఏవాహం నిరంశకః. ౮౧

దేహత్రయమిదం భాతి యస్మిన్ బ్రహ్మణి సత్యవత్,
తదేవాహం పరబ్రహ్మ దేహత్రయ విలక్షణమ్. ౮౨

జాగ్రదాదిత్రయం యస్మిన్ ప్రత్యగాత్మని సత్యవత్,
స ఏవాహం పరం బ్రహ్మ జాగ్రదాది విలక్షణః. ౮౩

స్థాణువున చోరభ్రాంతి కలిగినను దాని కెట్టి వికారమును ఏర్పడనట్లు నిర్వికారమగు ఆత్మయందు విశ్వవిభ్రాంతి కలిగినను, దాని కెట్టి వికృతియును కలుగదు. ౭౯

స్థాణువును స్థాణువుగా గ్రహించినప్పుడు దొంగ ఎక్కడ? దొంగ లేకుండిన ఇక భయమెక్కడ? ఆత్మజ్ఞానము ఏర్పడిన విశ్వ మెక్కడ నుండి గలదు? సంసారము లేనిచో నానావిధవస్తుజాత మెట్లగపడును? ౮౦

పరస్పరవిరుద్ధములును, గుణమయములును అగు మూడుమూర్తులు ప్రకాశించు చున్నవి. వీనిలో సత్త్వాదిగుణసంపన్నమును, అంశరహితమును, అనగా, పరిపూర్ణమగునది ఏది కలదో, అదియే నేను. ౮౧

ఏ బ్రహ్మమున శరీరత్రయము సత్యమువలె నగపడుచు, ప్రతీయమానమగు చున్నదో, ఏ బ్రహ్మము దేహత్రయాతిరిక్తమో, అదియే నేను. ౮౨

ఏఆత్మయందు జాగ్రత్స్వప్నసుషుప్తులనబడు అవస్థాత్రయము సత్యము వలె తోచుచున్నదో, ఏది ఈఅవస్థల కతీతమైయున్నదో, ఆపరబ్రహ్మమే నేను.

**విశ్వాదికం త్రయం యస్మిన్ పరమాత్మని సంస్థితమ్,**
**స ఏవ పరమాత్మాఽహం విశ్వాదికవిలక్షణః.** ౮౪

**విరాడాదిత్రయం భాతి యస్మిన్ బ్రహ్మణి నశ్వరమ్,**
**స ఏవ సచ్చిదానందలక్షణోఽహం స్వయంప్రభః.** ౮౫

విశ్వతైజసప్రాజ్ఞులనబడు ముగ్గురకును అవస్థానమగుచు, ఈమువ్వురకును అతీతమగు పరమాత్మయే నేను. ౮౪

ఏపరబ్రహ్మమున విరాట్టు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడను మువ్వురు ప్రకాశించుచున్నారో, మరియును ఏది సచ్చిదానందస్వరూపమును, స్వయంప్రభయును అయి వెలుగొందుచున్నదో, ఆపరబ్రహ్మమే నేను. ౮౫

ఇతి శ్రీమద్భగవత్ పూజ్యపాద గోవిందపాదాచార్యశిష్య, పరమహంస
పరివ్రాజకాచార్య, శ్రీశంకరభగవత్పూజ్యపాద
విరచిత అద్వైతానుభూతిః. ౧

ఇది శ్రీనిర్వికల్పానందకృత అద్వైతానుభూతి - ఆంధ్రానువాదము ౧



# ౨. అనాత్మశ్రీ విగర్హణ ప్రకరణమ్

లబ్ధా విద్యా రాజమాన్యా తతః కిం
ప్రాప్తా సంపత్ ప్రాభవాఢ్యా తతః కిమ్;
భుక్తా నారీ సుందరాఙ్గీ తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧

కేయూరాద్యైర్భూషితో వా తతః కిం
కౌశేయాద్యైరావృతో వా తతః కిమ్,
తృప్తో మిష్టాన్నాదినా వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౨

దృష్టా నానా చారుదేశాస్తతః కిం
పుష్టాశ్చేష్టా బంధువర్గాస్తతః కిమ్,
నష్టం దారిద్ర్యాదిదుఃఖం తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౩

రాజమాన్యతను పొందించువిద్య లభించినను, ఫలమేమి? ప్రభావముతో గూడిన సంపదను పొందినను ఫలమేమి? సుందరాంగియగు రమణితో భోగముల ననుభవించినను ఫలమేమి? — ఆత్మసాక్షాత్కారము లభించలేదు. అట్టిచో ఇవి అన్నియును వ్యర్థములే! ౧

ఏ వ్యక్తి ఆత్మసాక్షాత్కారమును పొందలేడో, అతడు [illegible] — అలంకారములవలన భూషితుడైనను, పట్టుపుట్టములను గట్టినను, మిష్టాన్నాదులవలన తృప్తినందినను ఫలమేమి? ౨

మనోహరములగు పెక్కుదేశములను వీక్షించినాడు. ఇష్టులగు బంధువర్గమును పోషించినాడు. దారిద్ర్యమును నశింపజేసికొనినాడు. — కాని, ఆత్మ సాక్షాత్కారము నందలేదు. లాభమేమి? ౩

స్నాతం తీర్థే జహ్నుజాయా తతః కిం
దానం దత్తం ద్వ్యష్టసంఖ్యం తతః కిమ్,
జప్తా మన్త్రాః కోటిశో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౪

గోత్రం సమ్యగ్భూషితం వా తతః కిం
గాత్రం భస్మాచ్ఛాదితం వా తతః కిమ్,
రుద్రాక్షాదిః సుధృతో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౫

అన్నైర్విప్రాస్తర్పితా వా తతః కిం
యజ్ఞైర్దేవాస్తోషితా వా తతః కిమ్,
కీర్త్యా వ్యాప్తాః సర్వలోకాస్తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౬

ఎవనికి ఆత్మస్వరూపదర్శనము లభింపలేదో అతడు, గంగాతీర్థముల స్నాన మొనర్చిన నేమి ఫలము? షోడశదానముల నొసర్చిన ఏమి ఫలము? కోటి మంత్రజప మొనర్చిన ఏమి ఫలము? ౪

గోత్రము (వంశము) అలంకృతమైనది. గాత్రము భస్మాచ్ఛాదిత మైనది. రుద్రాక్షాదులు చక్కగ ధరింపబడినవి. కాని ఆత్మానుభవము కాదు. వీనివలన కలుగు ఫలమేమి? ౫

ఆత్మసాక్షాత్కారముపొందనివాడు విప్రులనుఅన్నభోజనముతో సంతోష పెట్టగ కలుగు ఫల మేమి? యజ్ఞముచే దేవతలను సంతోషపరచిన ఫల మేమి? కీర్తితో సర్వలోకములను వ్యాపింపజేసిన కలుగు ఫల మేమి? ౬

కాయః క్లిష్టశ్చోపవాసైస్తతః కిం
లబ్ధాః పుత్త్రాః స్వీయపత్న్యాస్తతః కిమ్,
ప్రాణాయామః సాధితో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౭

యుద్ధే శత్రుర్నిర్జితో వా తతః కిం
భూయో మిత్త్రైః పూరితో వా తతః కిమ్,
యోగైః ప్రాప్తాః సిద్ధయో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౮

అబ్ధిః పద్భ్యాంలఙ్ఘితో వా తతః కిం
వాయుః కుంభే స్థాపితో వా తతః కిమ్,
మేరుః పాణావుద్ధృతో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౯

ఆత్మసాక్షాత్కారము లభింపలేదు, ఉపవాసము లొనర్చి, కాయక్లేశ మొనర్చిన లాభమేమి? స్వభార్యవలన పుత్త్రులను బడసిన లాభమేమి? ప్రాణాయామును సాధించిన ఫలమేమి? ౭

ఆత్మసాక్షాత్కారము నందనివాడు యుద్ధమున శత్రువులను నిర్జించినను, మిత్రులతో నిండియున్నను, యోగసిద్ధులను పొందినను లాభమేమి? ౮

సముద్రమును అడుగులతో దాటినను, వాయువును కుంభకప్రాణాయామమున నిల్పినను, మేరువును చేతితో నెత్తినను, ఆత్మసాక్షాత్కారము నందకుండిన లాభమేమి? ౯

క్ష్వేళః పీతో దుగ్ధవద్వా తతః కిం
వహ్నిర్జగ్ధో లాజవద్ వా తతః కిమ్,
ప్రాప్తశ్చారః పక్షివత్ ఖే తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౦

బద్ధాః సమ్యక్ పావకాద్యాస్తతః కిం
సాక్షాద్ విద్ధా లోహవర్యాస్తతః కిమ్,
లబ్ధో నిక్షేపోఽఞ్జనాద్యైస్తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౧

భూపేన్ద్రత్వం ప్రాప్తముర్వ్యాం తతః కిం
దేవేన్ద్రత్వం సంభృతం వా తతః కిమ్,
మునీన్ద్రత్వం చోపలబ్ధం తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౨

విషమును పాలవలె త్రాగగలడు, నిప్పును పేలాలవలె తినగలడు, పక్షివలె ఆకాశమున తిరుగగలడు— కాని ఆత్మసాక్షాత్కారము నందలేడు. ఫలమేమి ? ౧౦

అగ్న్యాదులను లోబరచుకొనినను, సుదృఢలోహములను విరచినను, అంజనాదులవలన ధననిక్షేపములను బొందినను, ఆత్మసాక్షాత్కార మొనర్చుకొనని యెడల లాభమేమి ? ౧౧

ఉర్వియందు రాజేంద్రత్వము లభించినది, లాభమేమి ? స్వర్గమున దేవేంద్రత్వము లభించినది, లాభమేమి ? వనమున యతీంద్రత్వము లభించినది, లాభమేమి ?— ఆత్మసాక్షాత్కారము లభింపకుండిన ? ౧౨

మన్త్రైః సర్వః స్తమ్భితో వా తతః కిం
బాణైర్లక్ష్యో భేదితో వా తతః కిమ్,
కాలజ్ఞానం చాపి లబ్ధం తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౩

కామాతఙ్కః ఖణ్డితో వా తతః కిం
కోపావేశః కుణ్ఠితో వా తతః కిమ్,
లాభాశ్లేషో వర్జితో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౪

మోహధ్వాన్తః పేషితో వా తతః కిం
జాతో భూమౌ నిర్మదో వా తతః కిమ్,
మాత్సర్యార్తిర్మీలితా వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౫

మంత్రబలమున సమస్తమును స్తంభింపజేసినను, బాణముతో లక్ష్యమును ఛేదించినను, కాలజ్ఞానమును బడసినను ఆత్మసాక్షాత్కారమొక్కటి లేకుండి చో మిగిలిన వన్నియును వ్యర్థములు. ౧౩

కామావేశము ఖండింపబడినది, కోపావేశము కుంఠితమైనది, లోభ శ్లేషంగము వర్జింపబడినది. అయినను ఆత్మసాక్షాత్కారము లభింపలేదు. లాభ మేమి? ౧౪

మోహాంధకారము నలుగగొట్టబడినది. పృథివియందు గర్వరహితుడే యైనాడు. మాత్సర్యపీడ ప్రశమితమైనది. అయినను ఆత్మదర్శనము లభింప బడిన వీనివలన లాభమేమి? ౧౫

ధాతుర్లోకః సాధితో వా తతః కిం
విష్ణోర్లోకో వీక్షితో వా తతః కిమ్,
శమ్భోర్లోకః శాసితో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్. ౧౬

యస్యేదం హృదయే సమ్యగనాత్మశ్రీవిగర్హణమ్,
సదోదేతి స ఏవాత్మసాక్షాత్కారస్య భాజనమ్. ౧౭

అన్యే తు మాయికజగద్భ్రాన్తివ్యామోహమోహితాః,
న తేషాం జాయతే క్వాపి స్వాత్మసాక్షాత్కృతిర్భువి. ౧౮

బ్రహ్మలోకమును సాధించినను, విష్ణులోకమును వీక్షించినను, శివలోకమును శాసించినను, ఆత్మలోకమును సాక్షాత్తుగ జూడకుండిన, లాభమేమి? ౧౬

ఎవని హృదయమున సంపూర్ణముగ ఈరీతిగ ఎల్లప్పుడును అనాత్మవస్తు సౌందర్య-నింద ఉదయించుచుండునో, అతడే ఆత్మసాక్షాత్కారమునకు అర్హుడు. ౧౭

మిగిలినవారు జగద్-భ్రాంతి వ్యామోహ మోహితులు. వారికి జగత్తున ఎన్నడును ఆత్మసాక్షాత్కారము లభింపదు. ౧౮

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత అనాత్మశ్రీవిగర్హణ ప్రకరణమ్. ౨

ఇది శ్రీనిర్వికల్పానందకృత అనాత్మశ్రీ, విగర్హణ అనువాదము. ౨



# 3. ఆత్మ షట్కమ్

(ఆత్మపఞ్చకమ్, అద్వైతపఞ్చకమ్, నిర్వాణపఞ్చకమ్)

నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గః
నాహఙ్కారః ప్రాణవర్గో న బుద్ధిః,
దారాపత్య క్షేత్ర విత్తాదిదూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్. ౧

రజ్జ్వజ్ఞానాద్ భాతి రజ్జౌ యథాఽహిః
స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః,
ఆప్తోక్త్యాఽహిభ్రాన్తినాశే స రజ్జుః
జీవో నాహం దేశికోక్త్యా శివోఽహమ్. ౨

మత్తో నాన్యత్ కిఞ్చిదత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మాయోపక్లృప్తమ్,
ఆదర్శాన్తర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్. 3

నేను శరీరమును గాను, నేత్రములు మొదలగు ఇంద్రియములును గాను, అంతరంగమును అనగా అహంకారమును గాను. పంచప్రాణములును గాను. బుద్ధియును గాను. పుత్ర, కళత్ర, క్షేత్ర, విత్తములును గాను. సాక్షియును, నిత్యుడును, ప్రత్యక్కుయును, శివస్వరూపమును అగు ఆత్మయే నేను. ౧

త్రాడు అని తెలియకపోవుటవలన త్రాటియందు పాము గోచరించునట్లు స్వాత్మజ్ఞానమువలననే జీవభావము. ఆప్తులగువారు చెప్పగా సర్పభ్రాంతిపోయి త్రాడు త్రాడే యగుచున్నది. ఈరీతిగనే నేను గురూపదేశమువలన జీవుడను గాననియు శివస్వరూపుడ ననియు తెలిసికొంటిని. ౨

నాకంటె వేరగు విశ్వమనున దొకటి లేదు. బాహ్యవస్తువు దర్పణమున ప్రతిబింబిత మగునట్లు, సత్యవస్తువు మాయావృతమై అద్వైతరూపుడనగు నాయందు ప్రకాశము నందుచున్నది. కనుక నేను శివస్వరూపుడను. 3

ఆభాతీదం విశ్వమాత్మన్యసత్యం
సత్యజ్ఞానానన్దరూపే విమోహాత్,
నిద్రామోహాత్ స్వప్నవత్ తన్న సత్యం
శుద్ధః పూర్ణో నిత్య ఏకః శివోఽహమ్. ౪

నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో
దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః,
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహం
కారస్యైవ హ్యాత్మనో మే శివోఽహమ్. ౫

నాహం దేహో జన్మమృత్యుః కుతో మే,
నాహం ప్రాణో క్షుత్పిపాసా కుతో మే
నాహం చిత్తం శోకమోహౌ కుతో మే,
నాహం కర్తా బన్ధమోక్షౌ కుతో మే. ౬

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత ఆత్మషట్కమ్. ౩

నిద్రయందు అజ్ఞానమువలన నిజముకాకపోయినను, స్వప్నవస్తువు నిజమనిపించునట్లు, సత్యజ్ఞానానంద స్వరూపాత్ముడనగు నాయందు అజ్ఞానప్రాబల్యమువలన ఈజగత్తు గోచరించుచున్నది. ఇది మిథ్యయే. నేను నిత్యుడను, శుద్ధుడను, పూర్ణుడను, అద్వితీయుడను, శివస్వరూపుడను. ౪

పుట్టుక, పెరుగుట, చావు — నాకు లేవు. ఇవి ప్రకృతినుండి కలిగిన శరీరధర్మములని శాస్త్రము లనుచున్నవి. చిన్మయాత్ముడనగు నాకు కర్తృత్వభోక్తృత్వములు లేవు. ఇవి అహంకార ధర్మములు. నేను శివస్వరూపుడను. ౫

నేను శరీరమును గాను, జననమరణములు నాకెక్కడ? నేను ప్రాణమును గాను, క్షుత్పిపాసలు నాకెక్కడ? నేను చిత్తమును గాను, శోకమోహములు నాకెక్కడ? నేను కర్తనుగాను, బంధమోక్షములు నాకెక్కడ?

ఇది ఆత్మషట్క ఆంధ్రానువాదము. ౩

—*—

# ౪. ఆత్మపూజా

## (వా, పరాపూజా)

అఖణ్డే సచ్చిదానన్దే నిర్వికల్పైకరూపిణి,
స్థితేఽద్వితీయభావేఽస్మిన్ కథం పూజా విధీయతే. ౧

పూర్ణస్యావాహనం కుత్ర సర్వాధారస్య చాసనమ్,
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యం చ శుద్ధస్యాచమనం కుతః. ౨

నిర్మలస్య కుతః స్నానం వస్త్రం విశ్వోదరస్య చ,
అగోత్రస్య త్వవర్ణస్య కుతస్తస్యోపవీతకమ్. ౩

నిర్లేపస్య కుతో గన్ధః పుష్పం నిర్వాసనస్య చ,
నిర్విశేషస్య కా భూషా కోఽలఙ్కారో నిరాకృతేః ౪

నిరంజనస్య కిం ధూపైర్దీపైర్వా సర్వసాక్షిణః,
నిజానన్దైకతృప్తస్య నైవేద్యం కిం భవేదిహ. ౫

నిర్వికల్పమును, ఏకస్వరూపమును, అద్వితీయమును, అఖండమునునగు చ్చిదానందబ్రహ్మమును పూజించు టెట్లు ? ౧

పూర్ణవస్తువును ఆహ్వానించు టెట్లు ? సర్వాధారమగుదాని కాసన ెక్కడ ? నిర్మలమగుదానికి అర్ఘ్యపాద్యము లెందుకు ? శుద్ధమగుదానికి చమన మెందుకు ? ౨

పవిత్రమగుదానికి స్నాన మెందుకు ? విశ్వోదరునకు వస్త్ర మొసగు ట్లు ? గోత్రవర్ణరహితునకు ఉపవీత మెందుకు ? ౩

నిర్లేపునకు గంధము నలదు టెట్లు ? గంధరహితునకు పుష్పము లేల ? శేషునకు భూషణము ఎందుకు ? నిరాకారునకు అలంకార మెయ్యది ? ౪

నిరంజనునకు ధూప మెందులకు ? సర్వసాక్షికి దీప మెందుకు ? ని— ందతృప్తున కేమి నైవేద్యము సమర్పింప గలము ?

విశ్వానన్దయితు స్తస్య కిం తామ్బూలం ప్రకల్ప్యతే,
స్వయంప్రకాశచిద్రూపో యోఽసావర్కాదిభాసకః. ౬

ప్రదక్షిణా హ్యనన్తస్య హ్యద్వయస్య కుతో నతిః,
వేదవాక్యైకవేద్యస్య కుతః స్తోత్రం విధీయతే. ౭

స్వయంప్రకాశమానస్య కుతో నీరాజనం విభోః,
అన్తర్బహిశ్చ పూర్ణస్య కథముద్వాసనం భవేత్. ౮

ఏవమేవ పరాపూజా సర్వావస్థాసు సర్వదా,
ఏకబుద్ధ్యా తు దేవేశే విధేయా బ్రహ్మవిత్తమైః. ౯

దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సదాశివః,
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్. ౧౦

సమస్త విశ్వమునకును ఆనందము నొసగువానికి తాంబూలమే మొసగి సంతోషమును గూర్పగలము? స్వయంప్రకాశచిద్రూపుడై సూర్యచంద్రాదులను భాసింపజేయువానికి హారతి ఏమిటి? ౬

అనంతునకు ప్రదక్షిణ మొనర్చు టెట్లు? అద్వయునకు ప్రణామ మొనర్చు టెట్లు? వేదవేద్యుని ఏస్తోత్రమున స్తుతింపగలము? ౭

స్వయంప్రకాశమానునకు నీరాజనము నర్పించు టెట్లు? లోపలను, వెలుపలను, అంతటను నిండియుండువాని కుద్వాసన మేమి? ౮

బ్రహ్మవిత్ శ్రేష్ఠులగువారు ఏకాగ్రచిత్తమున సర్వదా సర్వావస్థల యందును ఈరీతిగ పరమేశ్వరుని పరాపూజ నొనర్పనగును. ౯

శరీరమే దేవాలయము. జీవుడే సదాశివుడగు దేవుడు. అజ్ఞాననిర్మాల్యమును త్యజించి సోఽహంభావపూజ నొనర్ప నగును. ౧౦

తుభ్యం మహ్యమనన్తాయ మహ్యం తుభ్యం శివాత్మనే,
నమో దేవాదిదేవాయ పరాయ పరమాత్మనే. ౧౧

యోగీ దేహాభిమానీ స్యాద్ భోగీ కర్మణి తత్పరః,
జ్ఞానీ మోక్షాభిలాషీ చ తత్త్వజ్ఞే నాభిమానితా. ౧౨

కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్,
ఆత్మనా పూరితం సర్వం మహాకల్పాంబునా యథా. ౧౩

ఆత్మా త్వం గిరిజా మతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం
పూజా తే వివిధోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః,
సఞ్చారస్తు పదోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యద్ కర్మ కరోమి తత్తదఖిలం శమ్భో తవారాధనమ్.

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాద విరచితా ఆత్మపూజా. ॥౪॥

నీవును నేనును అనంతస్వరూపులమే. ఉభయులము శివస్వరూపులమే. దేవాది దేవుడును, శ్రేష్ఠుడును నగు పరమాత్మకు నమస్కారము. ఆపరమాత్మ స్వరూపుడనగు నాకుకూడ నమస్కారము. ౧౧

యోగి దేహాభిమాని యగును. భోగి కర్మతత్పరు డగును. జ్ఞాని మోక్షము గోరును. నిరభిమాని తత్త్వజ్ఞు డొక్కడే. ౧౨

మహాప్రళయజలమువలె సర్వమును ఆత్మతో నిండియున్నది! ఏమొనర్తును? ఎక్కడ కేగుదును? దేనిని గ్రహింతును? దేనిని త్యజింతును? ౧౩

నీవే ఆత్మవు. గిరికన్య బుద్ధి. పంచప్రాణములు సహచరులు. శరీరమే గృహము. భోగములే నీపూజ. నిద్రయే సమాధి. తిరుగుటయే ప్రదక్షిణము. పలుకుటయే నుతి. నేనొనర్చెడు సర్వకర్మములును నీ ఆరాధనయే! ౧౪

ఇది ఆత్మపూజ _ ఆంధ్రానువాదము ॥౪॥

# ౫. ఆత్మబోధః

తపోభిః క్షీణపాపానాం శాన్తానాం వీతరాగిణామ్,
ముముక్షూణామపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే. ౧

బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైకసాధనమ్,
పాకస్య వహ్నివజ్జ్ఞానం వినా మోక్షో న సిధ్యతి. ౨

అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్,
విద్యాఽవిద్యాం నిహన్త్యేవ తేజస్తిమిరసఙ్ఘవత్. ౩

పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్ తన్నాశే సతి కేవలః,
స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేఽంశుమానివ. ౪

వివిధములగు తపోకర్మములవలన పాపమును బోగొట్టుకొనిన వారును, శాంతచిత్తులును, నిష్కాములును అగు ముముక్షువుల నుద్దేశించియే ఈ ఆత్మబోధయను గ్రంథము చెప్పబడుచున్నది. (ఆయాగుణములు లేనివారి నిమిత్తము కాదు. వారు అద్వైతజ్ఞానమున కనర్హులు.) ౧

ఇతర సాధనలు మోక్షము నొసగజాలవు; జ్ఞాన మొక్కటియే మోక్ష సాధనము. ఎన్నియుండినను నిప్పులేకుండిన వంట జరుగనట్లు, జ్ఞానము లేకుండిన ముక్తి లేదు. ౨

అవిద్యతో కర్మమునకెట్టి విరోధమును కాకుండుటవలన, అది ఎన్నడును అవిద్యను బోగొట్టజాలదు. కాంతి చీకటిని బోగొట్టునట్లు విద్యయే అవిద్యను తొలగించుచున్నది. ౩

అజ్ఞానమువలన ఆత్మ పరిచ్ఛిన్నమైనట్లుగ తోచుచున్నది; అది నాశనమైన మబ్బు తొలగిపోయిన సూర్యునివలె, శుద్ధమగు ఆత్మ స్వయముగ ప్రకాశించును. ౪

అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్ వినిర్మలమ్,
కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం కతకరేణువత్. ౫

సంసారః స్వప్నతుల్యో హి రాగద్వేషాదిసంకులః,
స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽసత్యవద్భవేద్. ౬

తావత్ సత్యం జగద్భాతి శుక్తికారజతం యథా,
యావన్న జ్ఞాయతే బ్రహ్మ సర్వాధిష్ఠానమద్వయమ్. ౭

ఉపాదానేఽఖిలాధారే జగన్తి పరమేశ్వరే,
సర్గస్థితిలయాన్ యాన్తి బుద్బుదానీవ వారిణి. ౮

సచ్చిదాత్మన్యనుస్యూతే నిత్యే విష్ణౌ ప్రకల్పితాః,
వ్యక్తయో వివిధాః సర్వా హాటకే కటకాదివత్. ౯

ఇండుపగింజపొడ నీటియందలి మాలిన్యమును తొలగించి తానును నశించునట్లు, జ్ఞానము (అనగా బ్రహ్మాకారమగు అంతఃకరణవృత్తి) అజ్ఞానకలుషితుడగు జీవుని అత్యంత నిర్మలునొనర్చి, తాను లీనమైపోవుచున్నది. ౫

రాగద్వేషాదులతో నిండిన ఈసంసారము స్వప్నతుల్యము. జ్ఞానముదయించు వరకు సత్యముగనే యున్నట్లనిపించును. జ్ఞానప్రబోధము కలిగిన మిథ్యయగును. ౬

సర్వమునకును అధిష్ఠానమును, అద్వయమునుఅగు బ్రహ్మము తెలియ కొననంతవరకు, ముత్యపుచిప్పను వెండియనుకొని భ్రమించునట్లు, జగత్తు సత్యముగనే తోచును. ౭

అఖిలాధారుడును, ఉపాదానస్వరూపుడును అగు పరమేశ్వరునియందు, నీటియందు బుడగలవలె, అనంతకోటిబ్రహ్మాండములు సృష్టిస్థితిలయములను బొందుచున్నవి. ౮

సువర్ణమున కటకకుండలాద్యలంకారములు కల్పితమైనట్లు, సర్వానుస్యూతమును, సచ్చిదానందస్వరూపమును, ఆత్మయును, నిత్యమును అగు విష్ణువున (సర్వవ్యాపి) దేవ మనుష్య తిర్యగాది రూపములు కల్పింపబడు చున్నవి. ౯

యథాకాశో హృషీకేశో నానోపాధిగతో విభుః,
తద్భేదాద్ భిన్నవద్భాతి తన్నాశే కేవలో భవేత్. ౧౦

నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః,
ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్. ౧౧

పఞ్చీకృతమహాభూతసంభవం కర్మసఞ్చితమ్,
శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే. ౧౨

పఞ్చప్రాణ మనో బుద్ధి దశేంద్రియ సమన్వితమ్,
అపఞ్చీకృతభూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్. ౧౩

అనాద్యవిద్యాఽనిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే,
ఉపాధిత్రితయా దన్యమాత్మాన మవధారయేత్. ౧౪

ఆకాశము సర్వవ్యాపి. కాని ఘటపటాది ఉపాధులవలన నానావిధముగను, నాశయుక్తముగను తోచుచున్నది. అట్లే హృషీకేశుడు (బ్రహ్మము)కూడ వివిధశరీరోపాధులవలన నానావిధముగను,తన్నాశమున వినాశనము నందునట్లును తోచుచున్నాడు. ౧౦

రుచియును, రంగుయునులేని నీరు ఉపాధివశమున నానావిధరసవర్ణములను బొందుచున్నది. అట్లే ఉపాధివశమున ఆత్మకు జాతియును, నామమును, ఆశ్రమమును ఆరోపింపబడుచున్నవి. ౧౧

సంచిత కర్మఫలమగుచు పంచీకృత, మహాభూత పంచకములవలన కలిగిన ఈ స్థూలశరీరమే సుఖదుఃఖములను అనుభవించుటకు ఏర్పడినది. కనుక భోగాయతనమని చెప్పబడుచున్నది. ౧౨

పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, బుద్ధి వీనితో గూడిన సూక్ష్మశరీరము అపంచీకృత, పంచమహాభూతములవలన కలిగి, భోగసాధన మగుచున్నది. ౧౩

అనాదియును, అనిర్వచనీయమును అగు అవిద్యయే కారణోపాధియని చెప్పబడుచున్నది. ఇదియే ఆత్మకు కారణశరీరోపాధి. ఆత్మను ఈమూటికిని అతీతమైన దానిగ అవధరింప నగును. ౧౪

పఞ్చకోశాదియోగేన తత్తన్మయ ఇవ స్థితః,
శుద్ధాత్మా నీలవస్త్రాదియోగేన స్ఫటికో యథా. ౧౫
వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యావఘాతతః,
ఆత్మానమాన్తరం శుద్ధం వివిఞ్చ్యాత్ తణ్డులం యథా. ౧౬
సదా సర్వగతోఽప్యాత్మా న సర్వత్రావభాసతే,
బుద్ధావేవావభాసతే స్వచ్ఛేషు ప్రతిబిమ్బవత్. ౧౭
దేహేన్ద్రియ మనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్,
తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్ సదా. ౧౮
వ్యాపృతేష్వింద్రియేష్వాత్మా వ్యాపారీవా వివేకినా,
దృశ్యతేఽభ్రేషు ధావత్సు ధావన్నివ యథా శశీ. ౧౯

శుద్ధమగు స్ఫటికము నీలాది వర్ణములుగల వస్తువులతో గలసి ఆయావర్ణములతో దోచునట్లు, శుద్ధమగు ఆత్మ పంచకోశములతో గలసి ఆయారూపములతో నున్నట్లు తోచుచున్నది. ౧౫

దంచుటవలన పొట్టును బోగొట్టి బియ్యపుగింజలను వేరుపరచునట్లు, హృదయాంతర్వర్తియును శుద్ధమును అగు ఆత్మను (పైనజెప్పిన త్రివిధోపాధుల నుండియు) యుక్తి అనగా విచారము నాశ్రయించి వేరుపరచనగును. ౧౬

ఆత్మ సర్వకాలముల సర్వవ్యాపియే; కాని స్వచ్ఛములగు దర్పణాదుల యందే ప్రతిబింబము గోచరించునట్లు, నిర్మలమగు బుద్ధియందే గోచరించును. ౧౭

శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ప్రకృతి— వీనికి అతీతమైనది ఆత్మ; అయ్యు రాజువలె వీని వృత్తులను సాక్షియై నిరీక్షించుచున్నది. అని గ్రహింపనగును. ౧౮

మేఘములు పరుగిడుచుండిన చంద్రుడు పరుగిడుచున్నాడని తలచునట్లు, అవివేకులు ఇంద్రియములు స్వకార్యమును నిర్వర్తించుచుండ ఆత్మయే వ్యవహరించు చున్నదని తలపోయుచున్నారు. ౧౯

ఆత్మచైతన్యమాశ్రిత్య దేహేన్ద్రియమనోధియః
స్వకీయార్థేషు వర్తన్తే సూర్యాలోకం యథా
దేహేన్ద్రియగుణాన్ కర్మాణ్యమలే సచ్చిదా
అధ్యస్యతేఽవివేకేన గగనే నీలతాదివత్.

అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చా
కల్ప్యతేఽమ్బుగతే చన్ద్రే చలనాదిర్యథామ్భస

రాగేచ్ఛాసుఖదుఃఖాని బుద్ధౌ సత్యాం ప్రవ
సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్ బుద్ధేస్తు

ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర
స్వభావః సచ్చిదానన్ద నిత్యనిర్మలతాత్మనః.

లోకులు సూర్యుని వెలుగుండుటచే తమతమ పనులను
నట్లు, ఆత్మచైతన్యము నాశ్రయించియే శరీరేంద్రియ మనో
ముల ప్రవర్తిల్లు చున్నవి.

వివేకము లేకపోవుటవలన జనులు నిర్మలాకాశమున
నారోపించునట్లు, విశుద్ధమును సత్ చిత్స్వరూపమును అగు
ద్రియ సంబంధములగు గుణకర్మములను అధ్యస్త మొనర్చుచు

నీటి కదలికను అందు ప్రతిఫలించిన చంద్రున కారో
వశమున మనస్సునకు సంబంధించిన కర్తృత్వ భోక్తృత్వా
ఆత్మకు ఆరోపించుచున్నారు.

బుద్ధి పనిచేయుచుండిన యెడలనే అనురాగము,
దుఃఖము మున్నగునవి కలుగుచున్నవి. సుషుప్తియందు బు
ఇచ్ఛాదులు గోచరించుచుండుట లేదు. కనుక అవి బుద్ధిధ
ములు కావు.

సూర్యునకు ప్రకాశమును, నీటికి చల్లదనమును,
స్వభావములు.

ఆత్మనః సచ్చిదంశశ్చ బుద్ధేర్వృత్తిరితి ద్వయమ్,
సంయోజ్య చావివేకేన జానామీతి ప్రవర్తతే.

ఆత్మనో విక్రియా నాస్తి బుద్ధేర్బోధో న జాత్వపి,
జీవః సర్వమలం జ్ఞాత్వా జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి.

రజ్జుసర్పవదాత్మానం జీవో జ్ఞాత్వా భయం వహేత్,
నాహం జీవః పరాత్మేతి జ్ఞానశ్చేన్నిర్భయో భవేత్.

ఆత్మావభాసయత్యేకో బుద్ధ్యాదీనిన్ద్రియాణి చ,
దీపో ఘటాదివత్ స్వాత్మా జడైస్తైర్నావభాస్యతే.

స్వబోధే నాన్యబోధేచ్ఛా బోధరూపతయాత్మనః,
న దీపస్యాన్యదీపేచ్ఛా తథా స్వాత్మా ప్రకాశతే.

ఆత్మయొక్క సచ్చిదంశమును, బుద్ధియొక్క [illegible] ‘నేను ఎరుగుదును’ అని అవివేకమున వ్యవహరించుచున్నా[illegible]

ఆత్మకు వికారములేదు. బుద్ధికి జ్ఞానప్[illegible] మిథ్యాజ్ఞానమువలన తన్ను జ్ఞాతగను, ద్రష్టగను భా[illegible] మన్నాడు.

త్రాటిని పాముగా భావించి భయపడునట్లు, [illegible] భయము కలుగుచున్నది. ‘నేను జీవుడను [illegible] కలిగిన నిర్భయుడగును.

దీపము ఘటాదివస్తువులను ప్రకాశింపజేయునట్లు, [illegible] మాదులను ప్రకాశింప జేయుచున్నది. జడములగు వానివలన ఆత్మ [illegible] మగుచుండుటలేదు.

ఆత్మ జ్ఞానస్వరూపమగుటవలన దానిబోధనిమిత్తము [illegible] ప్రయోజనము లేదు. దీపము ప్రకాశించుటకు మరియొక దీపము [illegible] ఆత్మ స్వయంప్రకాశము.

నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః,
విద్యాదైక్యం మహావాక్యై ర్జీవాత్మ పరమాత్మనోః. ౩౦

ఆవిద్యకం శరీరాదిదృశ్యం బుద్బుదవత్ క్షరమ్,
ఏతద్విలక్షణం విద్యాదహం బ్రహ్మేతి నిర్మలమ్. ౩౧

దేహాన్యత్వాన్న మే జన్మజరాకార్శ్యలయాదయః,
శబ్దాదివిషయైః సఙ్గో నిరిన్ద్రియతయా న చ. ౩౨

అమనస్త్వాన్న మే దుఃఖరాగద్వేషభయాదయః,
అప్రాణో హ్యమనాః శుభ్ర ఇత్యాది శ్రుతిశాసనాత్. ౩౩

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిర్వికల్పో నిరఞ్జనః,
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽస్మి నిర్మలః. ౩౪

'శరీరము ఆత్మ కాదు. ఇంద్రియములు ఆత్మ కాదు'— ఇత్యాది శ్రుతి వాక్యములు 'నేతి' వాక్యములు; వానిని అవలంబించి శరీరేంద్రియాదులగు ఉపాధులను నిషిద్ధ మొనర్పనగును. మరియు తత్త్వమస్యాది మహావాక్యముల వలన జీవబ్రహ్మైక్యమును సాధింపనగును. ౩౦

శరీరాది దృశ్యపదార్థములు అవిద్యాకల్పితములు. జలబుద్బుదములవలె నశ్వరములు. నేను ఈ శరీరాదులకు అతీతుడను. నిర్మల బ్రహ్మస్వరూపుడను అని తెలిసికొననగును. ౩౧

నేను శరీరముకంటె వేరు. కనుక శరీర ధర్మములగు జరామరణకృశత్వాదులు నాయందు లేవు. నేను ఇంద్రియములను గాను. కనుక శబ్దస్పర్శాది-విషయ-సంసర్గము నాకులేదు. ౩౨

నేను మనస్సును గాను. కనుక నాయందు మనోధర్మములగు సుఖదుఃఖ రాగద్వేష భయాదులు లేవు. ఏలయన, ఆత్మ ప్రాణమునకును మనస్సునకును భిన్నమైనదని శ్రుతి ఆదేశించుచున్నది. ౩౩

నేను నిర్గుణుడను, నిష్క్రియుడను, నిత్యుడను, నిర్వికల్పుడను, నిరంజనుడను, నిర్వికారుడను, నిరాకారుడను, నిత్యముక్తుడను, నిర్మలుడను. ౩౪

అహమాకాశవత్ సర్వబహిరన్తర్గతోఽచ్యుతః,
సదా సర్వసమః శుద్ధో నిస్సఙ్గో నిర్మలోఽచలః. ౩౫

నిత్యశుద్ధవిముక్తైక మఖణ్డానన్దమద్వయమ్,
సత్యం జ్ఞానమనన్తం యత్ పరం బ్రహ్మాఽహమేవ చ.

ఏవం నిరన్తరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా,
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్. ౩౭

వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేన్ద్రియః,
భావయేదేక మాత్మానం తమనన్తమనన్యథా. ౩౮

ఆత్మన్యేవాఖిలం దృశ్యం ప్రవిలాప్య ధియా సుధీః,
భావయేదేకమాత్మానం నిర్మలాకాశవత్ సదా. ౩౯

నేను ఆకాశమువలె సర్వము వెలుపల లోపల నిండియున్నాడను. అచ్యుతుడను. సర్వసముడను. శుద్ధుడను. నిస్సంగుడను. నిర్మలుడను, నిశ్చలుడను.

నేను నిత్యశుద్ధవిముక్తస్వభావుడను. అఖండానంద స్వరూపుడను. సత్యజ్ఞానానంతస్వరూపమగు పరబ్రహ్మమేది కలదో, అదియే నేను. ౩౬

'నేను బ్రహ్మమును' అని నిరంతరము భావించుచుండుటవలన ఏర్పడు సంస్కారము, రసాయనము రోగములను బోగొట్టునట్లు అవిద్యాకృతములగు విక్షేపములను దొలగించును. ౩౭

ఏకాంతప్రదేశమున గూరుచుండి, వైరాగ్యమును, ఇంద్రియజయమును బొంది, అనన్య చిత్తముతో అద్వితీయమును, అనంతమును అగు ఆత్మను భావింపనగును. ౩౮

స్వబుద్ధిబలమున బుద్ధిమంతుడగువాడు దృశ్యప్రపంచము నంతటిని ఆత్మయందే విలీన మొనర్పనగును. అనంతరము అనన్యచిత్తముతో అద్వితీయమును, నిర్మలాకాశమును బోలునదియు, అనగా అనంతమును అగు ఆత్మను భావింపనగును. ౩౯

రూపవర్ణాదికం సర్వం విహాయ పరమార్థవిత్,
పరిపూర్ణ చిదానన్ద స్వరూపేణావ తిష్ఠతే. ౪౦

జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భేదః పరాత్మని న విద్యతే,
చిదానన్దస్వరూపత్వాద్దీప్యతే స్వయమేవ హి. ౪౧

ఏవమాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే,
ఉదితావగతిజ్వాలా సర్వాజ్ఞానేన్ధనం దహేత్. ౪౨

అరుణేనైవ బోధేన పూర్వం తత్తిమిరే హతే,
తత ఆవిర్భవేదాత్మా స్వయమేవాంశుమానివ. ౪౩

ఆత్మా తు సతతం ప్రాప్తోఽప్యప్రాప్తవదవిద్యయా,
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా. ౪౪

పరమార్థవిదుడు రూపవర్ణాదికముల నన్నిటిని త్యాగ మొనర్చి, పరిపూర్ణ చిదానంద స్వరూపముననే వెలయుచుండును. ౪౦

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము — అను భేదములు పరమాత్మయందు లేవు. అది చిదానందస్వరూప మగుటవలన స్వయంప్రకాశకము. ౪౧

ఈరీతిగ ఆత్మారణియందు సర్వదా ధ్యానమథన మొనర్చినయెడల జ్ఞానాగ్నిశిఖ వెలువడి అజ్ఞానకాష్ఠముల నన్నిటిని దహించివేయును. ౪౨

అరుణోదయమున చీకటులు తొలగిపోగా స్వయంప్రకాశమానుడగు సూర్యు డావిర్భవించునట్లు, జ్ఞానమువలన అవిద్య నశింపగా స్వయంప్రకాశమానమగు ఆత్మ ఆవిర్భవించును. ౪౩

స్వకంఠాభరణమువలె ఆత్మ యెల్లప్పుడును ప్రాప్తమయియే యున్నది. కాని కంఠహారము తన మెడలో నుండగా ఎక్కడనో పోయినదని వెదికికొనుచు, తుదకు దానిని గుర్తించినట్లు, అవిద్యవలన అప్రాప్తముగ తోచు ఆత్మ, అవిద్య తొలగిపోగా లభ్యమైన దనిపించును. ౪౪

స్థాణౌ పురుషవద్భ్రాన్త్యా కృతా బ్రహ్మణి జీవతా,
జీవస్య తాత్త్వికే రూపే తస్మిన్ దృష్టే నివర్తతే. ౪౫

తత్త్వస్వరూపానుభవాద్ ఉత్పన్నజ్ఞానమఞ్జసా,
అహం మమేతి నాత్మానం బాధతే దిగ్భ్రమాదివత్. ౪౬

సమ్యగ్విజ్ఞానవాన్ యోగీ స్వాత్మన్యేవాఖిలం జగత్,
ఏకఞ్చ సర్వమాత్మానమీక్షతే జ్ఞానచక్షుషా. ౪౭

ఆత్మైవేదం జగత్ సర్వమాత్మనోఽన్యన్న విద్యతే,
మృదా యద్వత్ ఘటాదీని స్వాత్మానం సర్వమీక్షతే.

జీవన్ముక్తస్తు తద్విద్వాన్ పూర్వోపాధిగుణాంస్త్యజేత్,
సచ్చిదానన్దరూపత్వం భజేద్ భ్రమరకీటవత్. ౪౯

(దూరమునుండి) స్థాణువు (ఎండుమోడు) ను జూచి మానవుడని భ్రమవలన తలచునట్లు, బ్రహ్మమున జీవబుద్ధి ఏర్పడుచున్నది. జీవుని యథార్థభావమగు బ్రహ్మమును సాక్షాత్కరించుకొనిన జీవభావము తొలగిపోవును. ౪౫

దిక్‌నిర్ణయమైన దిక్‌భ్రమ పోయినట్లు, తత్త్వస్వరూపానుభవమైన జ్ఞానముకలిగి, జీవునకుగల 'నేను నాది' అను భావమును పోగొట్టును. ౪౬

పరిపూర్ణవిజ్ఞానయుతుడగు యోగి జ్ఞాననేత్రమున తనయందే సర్వజగత్తును; సర్వమును ఆత్మస్వరూపముగను, వీక్షించును. ౪౭

ఈజగత్తంతయును ఆత్మస్వరూపమే. ఆత్మభిన్నమగు వస్తువే లేదు. ఘటాదులు మృత్తికకంటె వేరుకానట్లు, సర్వమును ఆత్మమయముగనే జ్ఞాని వీక్షించును. ౪౮

కనుక, జీవన్ముక్తుడగు విద్వాంసుడు పూర్వోపాధికి జెందిన గుణములనుపరిత్యజించి, భ్రమరకీటన్యాయమున, సచ్చిదానందస్వరూపమును భజింపవలెను. (నిరంతర బ్రహ్మధ్యానమున బ్రహ్మమే యగును.) ౪౯

తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాదిరాక్షసాన్,
యోగీ శాన్తిసమాయుక్తో హ్యాత్మారామో విరాజతే. ౫౦

బాహ్యాఽనిత్యసుఖాసక్తిం హిత్వాత్మసుఖనిర్వృతః,
ఘటస్థదీపవత్ స్వస్థం స్వాత్మన్యేవ ప్రకాశతే. ౫౧

ఉపాధిస్థోఽపి తద్ధర్మైర్నిర్లిప్తో వ్యోమవన్మునిః,
సర్వవిన్మూఢవత్ తిష్ఠేదసక్తో వాయువచ్చరేత్. ౫౨

ఉపాధివిలయాద్ విష్ణౌ నిర్విశేషం విశేన్మునిః,
జలే జలం వియద్వ్యోమ్ని తేజస్తేజసి వా యథా. ౫౩

యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్,
యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్.

యోగిపురుషుడు మోహసముద్రమును దాటి, రాగద్వేషాది_రాక్షసులను జంపి, శాంతితోఁగూడి, ఆత్మారాముఁడై విలసిల్లును. ౫౦

బాహ్యములును, అనిత్యములును అగు సుఖములయందలి అనురాగమును త్యజించి, ఆత్మానందమునందు యోగి, ఘటస్థదీపమువలె, తనయందు తానే వెలుగొందు చుండును. ౫౧

ముని శరీరోపాధియందుండినను శరీరధర్మములవలన అంటబడక ఆకాశమువలె నిర్లేపుఁడైయుండును. అంతయును ఎరిగి మూఢునివలె కనిపించును. అనాసక్తుఁడై వాయువువలె తిరుగాడుచుండును. ౫౨

నీరు నీటితోడను, మిన్ను మింటితోడను, వెలుగు వెలుగుతోడను కలిసిపోవునట్లును, శరీరోపాధి తొలగిపోయినప్పుడు తత్త్వజ్ఞుఁడు విష్ణువున అనగా, సర్వవ్యాపకమగు పరబ్రహ్మమున సంపూర్ణముగ ఐక్యమునందును. ౫౩

దేనిని పొందుటకంటె ఉత్తమమగు లాభము లేదో, ఏది సర్వోత్తమమగు సుఖమో, ఎద్దాని జ్ఞానముకంటె శ్రేష్ఠజ్ఞానము వేరుగ లేదో, అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౫౪

యద్దృష్ట్వా నాపరం దృశ్యం యద్భూత్వా న పునర్భవః,
యజ్జ్ఞాత్వా నాపరం జ్ఞేయం తద్బ్రహ్మేత్యవధారయేత్.

తిర్యగూర్ధ్వమధః పూర్ణం సచ్చిదానన్దమద్వయమ్,
అనన్తం నిత్యమేకం యత్ తద్ బ్రహ్మేత్యవధారయేత్.

అతద్వ్యావృత్తిరూపేణ వేదాన్తైర్లక్ష్యతేఽద్వయమ్,
అఖణ్డానందమేకం యత్ తద్ బ్రహ్మేత్యవధారయేత్.

అఖణ్డానన్దరూపస్య తస్యానన్దలవాశ్రితాః,
బ్రహ్మాద్యాస్తారతమ్యేన భవన్త్యానన్దినోఽఖిలాః. ౫౭

తద్యుక్తమఖిలం వస్తు వ్యవహారస్తదన్వితః,
తస్మాత్ సర్వగతం బ్రహ్మ క్షీరే సర్పిరివాఖిలే. ౫౮

బ్రహ్మమును జూచిన మరి దృశ్యపదార్థము అగపడదు. బ్రహ్మమైన యెడల మరి జన్మము లేదు. బ్రహ్మము నెరిగిన, ఇక తెలిసికొనదగినది యుండదు. బ్రహ్మ మిట్టిదని గ్రహింపనగును. ౫౪

కిందుగను, మీదుగను, వంకరగను, నిండి సచ్చిదానంద స్వరూపమై, అద్వితీయమై అనంతమై, నిత్యమై, ఏకమై ఏది వెలయుచున్నదో అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౫౫

ఏ అద్వితీయవస్తువు వేదాంతవాక్యములవలన "నేతి నేతి" అని సూచింపబడుచున్నదో, ఏది అఖండానంద స్వరూపమును, ఏక వస్తువును అగుచున్నదో, దానినే బ్రహ్మమని గ్రహింపుము. ౫౬

బ్రహ్మానందలవలేశమును అవలంబన మొనర్చుకొనియే హిరణ్యగర్భాదులగు సమస్త జీవులును మనుచున్నారు. హెచ్చుతగ్గులుగ అందరును ఆనందమునే అనుభవించుచున్నారు. ౫౭

బ్రహ్మచైతన్య - సమన్వితములైన యెడలనే వస్తువులన్నియును వ్యవహారయోగ్యము లగుచున్నవి. పాలయందు (సారమగు) నేతివలె బ్రహ్మము సర్వగతమై వెలయుచున్నది. ౫౮

అణుమస్థూలమహ్రస్వమదీర్ఘమజమవ్యయమ్,
అరూపగుణవర్ణాఖ్యం తద్బ్రహ్మేత్యవధారయేత్. ౬౦

యద్భాసా భాస్యతేఽర్కాదిర్భాస్యైర్యత్తు న భాస్యతే,
యేన సర్వమిదం భాతి తద్ బ్రహ్మేత్యవధారయేత్. ౬౧

స్వయమన్తర్బహిర్వ్యాప్య భాసయన్నఖిలం జగత్,
బ్రహ్మ ప్రకాశతే వహ్నిప్రతప్తాయసపిణ్డవత్. ౬౨

జగద్విలక్షణం బ్రహ్మ బ్రహ్మణోఽన్యన్న కిఞ్చన,
బ్రహ్మాన్యద్భాసతే మిథ్యా యథా మరుమరీచికా. ౬౩

దృశ్యతే శ్రూయతే యత్తద్ బ్రహ్మణోఽన్యన్న విద్యతే,
తత్త్వజ్ఞానాచ్చ తద్బ్రహ్మ సచ్చిదానన్దమద్వయమ్. ౬౪

బ్రహ్మము అణువు కాదు, స్థూలమును కాదు. పొడుగుకాదు, పొట్టియును కాదు, జన్మము, వినాశము, రూపము, గుణము, వర్ణము లేనిది — ఈ రీతిగ బ్రహ్మము నెరుగవలెను. ౬౦

సూర్యచంద్రాగ్నులెద్దానిని ప్రకాశింప చేయజాలవో, అవి దేనివలన ప్రకాశితము లగుచున్నవో, మరియును దేనివలన ఈ సమస్తమును ప్రకాశితమగుచున్నదో, దానినే బ్రహ్మమని గ్రహింపవలెను. ౬౧

అగ్నితప్తమగు లోహపిండమువలె, బ్రహ్మము బహిరంతరముల వ్యాపించి, సమస్త జగత్తును ప్రకాశింపజేయుచు, తానును ప్రకాశించుచున్నది. ౬౨

బ్రహ్మము జగత్తుకంటె విలక్షణమైనది. బ్రహ్మము గాక వేరొకవస్తువు కాదు. బ్రహ్మముకంటె అన్యమగు వస్తువు ప్రకాశించిన, అది ఎండమావివలె మిథ్య. ౬౩

కనబడునదియును, వినబడు నదియును బ్రహ్మముకంటె వేరుకాదు. తత్త్వజ్ఞానము లభించిన, అది అంతయును ఏకరస స్వరూపమగు సచ్చిదానంద బ్రహ్మమే యగును. ౬౪

సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే,
అజ్ఞానచక్షుర్నేక్షతే భాస్వన్తం భానుమన్ధవత్. ౬౫

శ్రవణాదిభిరుద్దీప్తో జ్ఞానాగ్ని పరితాపితః,
జీవః సర్వమలాన్ముక్తః సువర్ణవత్ ద్యోతతే స్వయమ్.

హృదాకాశోదితో హ్యాత్మా బోధభానుస్తమోఽపహృత్,
సర్వవ్యాపీ సర్వధారీ భాతి సర్వం ప్రకాశతే. ౬౭

దిగ్దేశ కాలాద్యనపేక్ష్య సర్వగం
శీతాదిహృన్నిత్యసుఖం నిరఞ్జనమ్,
యః స్వాత్మతీర్థం భజతే వినిష్క్రియః
స సర్వవిత్ సర్వగతోఽమృతో భవేత్. ౬౮

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత ఆత్మబోధః ॥౫॥

జ్ఞాననేత్రములు కలవారు సర్వవ్యాప్తమైన సచ్చిదానంద స్వరూపముగు ఆత్మను వీక్షించుచున్నారు. అంధుడు, ప్రకాశమానుడగు సూర్యుని జూడజాలనట్లు, అజ్ఞాననేత్రులు బ్రహ్మమును జూడజాలరు. ౬౫

శ్రవణ - మనన - నిదిధ్యాసనముల వలన ప్రదీప్తమై, జ్ఞానాగ్నివలన సముజ్జ్వలితమంది, సర్వపాప వినిర్ముక్తమై బంగారమువలె, జీవుడు స్వయంప్రకాశిత నందును. ౬౬

బోధ - భాను - స్వరూపమున హృదయాకాశమున ఆత్మ ఉదయించి తమస్సును బోగొట్టి సర్వవ్యాపియును, సర్వాధారమును అగుచు, సర్వమును ప్రకాశింపజేయును. ౬౭

ఆత్మతీర్థము దిగ్దేశకాలాదుల నపేక్షింపక సర్వత్ర వెలయుచు, శీతోష్ణాదులగు ద్వంద్వముల పరిహరించుచు, సుఖకరమగుచు, పవిత్రమై, సుఖకరమై వెలయుచున్నది. ఏ నిష్క్రియుడు దీనిని సేవించుచున్నాడో, అతడు సర్వవేత్తయై, సర్వగతుడై అమృతత్వమును బొందును. ౬౮

ఇది ఆత్మబోధ ఆంధ్రానువాదము ॥౫॥

# ౬. ఏకశ్లోకీ

కిం జ్యోతి స్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే,
చక్షు స్తస్య నిమీలనాదిసమయే కిం ధీర్ధియోదర్శనే
కిం తత్రాహమతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మి ప్రభో.

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచితా ఏకశ్లోకీ ||౬||

గురువు శిష్యుని ప్రశ్నించెను : వత్సా ! వస్తుప్రకాశకమగు జ్యోతి ఏదియని నీ యభిప్రాయము ? [శిష్యుడు :] పగలు సూర్యుడును, రాత్రి ప్రదీప చంద్రాదులును, [గురువు :] అగుచో సూర్యప్రదీపాదులను గుర్తించుజ్యోతి ఏది ? [శిష్యుడు :] నేత్రము. [గురువు :] కళ్లుమూసికొని నప్పు డేది జ్యోతి యగుచున్నది. [శిష్యుడు :] బుద్ధి. [గురువు :] ఈ బుద్ధిని జూచున దేమి? [శిష్యుడు :] నేను, అనగా ఆత్మయే. కనుక మీరును నేనునుగూడ, ప్రభూ! పరంజ్యోతి స్వరూపమగు ఆత్మయే. ౧

ఇది ఏకశ్లోకి ఆంధ్రానువాదము ||౬||

# ౭. కాశీపఞ్చకమ్

మనోనివృత్తిః పరమోపశాన్తిః
స తీర్థవర్యా మణికర్ణికాత్రి,
జ్ఞానప్రవాహో విమలాదిగఙ్గా
స కాశికాహం నిజబోధరూపా.

యస్యామిదం కల్పితమిన్ద్రజాలం
చరాచరం భాతి మనోవిలాసమ్,
సచ్చిత్సుఖైకా పరమాత్మరూపా
స కాశికాహం నిజబోధరూపా.

కోశేషు పఞ్చస్వధిరాజమానా
బుద్ధిర్భవానీ ప్రతి దేహగేహమ్,
సాక్షీ శివః సర్వగతోఽన్తరాత్మా
సా కాశికాహం నిజబోధరూపా.

ఎచ్చటనో మనోవృత్తిపూర్వకమగు పరమశాంతి [illegible] అచ్చటనే తీర్థశ్రేష్ఠమగు మణికర్ణిక జ్ఞానప్రవాహముతో [illegible] వెలయుచు కాశీక్షేత్రమును సృష్టించుచున్నది. బోధరయే [illegible]. [illegible] గు నేనే కాశికాస్వరూపుడను.

దేనియందు మనోవిలాసమును, ఇంద్రజాలమును అను [illegible] లసిల్లుచున్నదో, ఏది సచ్చిత్సుఖస్వరూపమును, ఏకమును, పరమా[illegible] మును, ప్రకాశస్వరూపమును అగుచు వెలయుచున్నదో [illegible]కాశికయే నేను.

పంచకోశముల వ్యాపించి ప్రతిదేహమును గేహముగా (గృహముగ [illegible]) నర్చుకొనిన బుద్ధియే భవాని; అంతరాత్మయును, సర్వగతుడును, సాక్షి మును అగువాడే శివుడు. ఈ ఉభయులయొక్క సమ్మిళనక్షేత్రమగునటియే కాశి; ఆ కాశికయే నేను. అది బోధస్వరూపము,

కాశ్యాం హి కాశతే కాశీ కాశీ సర్వప్రకాశికా,
సా కాశీ విదితా యేన తేన ప్రాప్తాహి కాశికా. ౪

కాశీక్షేత్రం శరీరం త్రిభువనజననీ వ్యాపినీ జ్ఞానగఙ్గా
భక్తిః శ్రద్ధా గయేయం నిజగురుచరణధ్యానయోగః ప్రయాగః,
విశ్వేశోఽయం తురీయః సకలజనమనః సాక్షిభూతోఽన్తరాత్మా
దేహే సర్వం మదీయే యది వసతి పునస్తీర్థమన్యత్ కిమస్తి.

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత కాశీపఞ్చకమ్ ॥౭॥

కాశికయందే, అనగా ఆత్మజ్ఞానముననే కాశిక ప్రకాశించును. ఈ జ్ఞానరూపమగు కాశికయే అన్నిటిని ప్రకాశింప జేయుచున్నది. ఈ జ్ఞానరూప కాశికను ఎరిగిన వానికే కాశీప్రాప్తి. ౪

త్రిభువన జననియగు జ్ఞానగంగయే ప్రవాహము. శరీరమే కాశీక్షేత్రము. భక్తి శ్రద్ధలే గయ. నిజ గురు చరణ ధ్యాన యోగమే ప్రయాగ. తురీయుడే విశ్వేశ్వరుడు; ఈయనయే అంతరాత్మయును, సకల జన మనః సాక్షియును. ఈ సర్వమును నా శరీరముననే వెలయుచుండగా, ఇతర తీర్థములతో ప్రయోజనమేమి? ౫

ఇది కాశీపంచక ఆంధ్రానువాదము ॥౭॥

---

# ౮. కేవలోఽహమ్

విశోక ఆనన్దమయో విపశ్చిత్
స్వయం కుతశ్చిన్న బిభేతి కశ్చిత్,
నాన్యోఽస్తి పన్థా భవబన్ధముక్త్యై
వినా స్వతత్త్వావగమం సు సూక్ష్మకమ్. ౧

నిత్యం విభుం సర్వగతం సు సూక్ష్మం
అన్తర్బహిః శూన్యమనన్య మాత్మనః,
విజ్ఞాయ సమ్యక్ నిజతత్త్వమేతత్
పుమాన్ విపాప్మా విరజో విమృత్యుః. ౨

బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవమోక్షస్య కారణమ్,
యేనాద్వితీయమానన్దం బ్రహ్మ సమ్పద్యతే బుధైః ౩

అశోకుడును, ఆనందమయుడును అగు విద్వాంసుడు, తా నెన్నడును [illegible] టినుండియు భయమును బొందడు. అత్యంతసూక్ష్మమగు ఆత్మస్వరూపజ్ఞానము గాక, సంసారబంధమునుండి ముక్తినొసగు ఉపాయము వేరొకటి లేదు. ౧

నిత్యమును, సర్వవ్యాపియును, సర్వగతమును, సుసూక్ష్మమును, [illegible] హితమును అగు ఆత్మస్వరూపమును చక్కగా తెలిసికొనిన పురుషుడు, పాప మును, రజస్సును బోగొట్టుకొని మృత్యురహితు డగును. ౨

బ్రహ్మాత్మైక్యజ్ఞానమే సంసారముక్తికి కారణము. ఈ జ్ఞానముచేతనే బుధులు అద్వితీయానందస్వరూపమగు బ్రహ్మమును బొందుచున్నారు. ౩

బ్రహ్మీభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః,
విజ్ఞాతవ్యమతః సమ్యగ్ బ్రహ్మాభిన్నత్వమాత్మనః. ౪

యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీతమజ్ఞానాత్,
తత్సర్వం బ్రహ్మైకం ప్రత్యస్తాశేషభావనాదోషమ్. ౫

మృత్కార్యభూతోఽపి మృదో న భిన్నః
కుమ్భోఽస్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్,
న కుమ్భరూపం పృథగస్తి కుమ్భః
కుతో మృషా కల్పితనామమాత్రః. ౬

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సన్దర్శయితుం న శక్యతే,
అతో ఘటః కల్పిత ఏవ మోహాత్
మృదేవ సత్యం పరమార్థభూతమ్. ౭

బ్రహ్మము నెరిగి బ్రహ్మమైనవాడు మరి తిరిగి సంసారమునకు రాడు. కనుక ఆత్మ బ్రహ్మముతో అభిన్నమను విషయమును చక్కగ గ్రహింపనగును. ౪

అజ్ఞానమువలన నానారూపమునదోచు ఈ విశ్వమంతయును అద్వితీయ బ్రహ్మముగాక వేరొకటికాదు. భేదభావనాదోషమున బ్రహ్మమే ఇట్లు ప్రత్యక్షమగుచున్నది. ౫

మృత్తికతో చేయబడిన వస్తువులు మృత్తికకంటె వేరు కావు. సర్వావస్థలయందు మన్నుగాక కుండ యను వేరొక వస్తువు లేదు. కనుక ఘటమను పేరు మిథ్య - మృత్తికయందు కల్పితము. ౬

మృత్తికకంటె వేరగు ఘటస్వరూపమును ఎవ్వరును ప్రదర్శింపజాలరు. కనుక అజ్ఞానవశముననే మంటియందు కుండ కల్పితమగుచున్నది - ఘటరూపము మిథ్య. మృత్తికయే సత్యమును, పరమార్థమును అగుచున్నది. ౭

సద్బ్రహ్మ కార్యం సకలం సదేవ
తన్మాత్రమేతన్న తతోఽన్యదస్తి,
అస్తీతి యో వక్తి న తస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ ప్రజల్పః. ౮

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాద విరచిత కేవలోఽహమ్ ॥౭॥

బ్రహ్మము సత్స్వరూపము, కార్యము సత్స్వరూపము. కనుక కార్యము బ్రహ్మస్వరూపమే యగుచున్నది. బ్రహ్మముకంటె వేరగున దేదియును లేదు. బ్రహ్మముకంటె వేరగు సత్యవస్తువు వలదనువాని వాక్యము నిద్రితుని ప్రలాపోక్తిని బోలునది. అతని మోహ మింకను బోలేదు. ౮

ఇది కేవలోఽహమ్ ఆంధ్రానువాదము ॥౮॥

---

# ౯. కౌపీనపఞ్చకమ్

## (యతిపఞ్చకమ్)

వేదాన్తవాక్యేషు సదా రమన్తో
భిక్షాన్నమాత్రేణ చ తుష్టిమన్తః,
అశోకమన్తః కరణే చరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః. ౧

మూలం తరోః కేవలమాశ్రయన్తః,
పాణిద్వయం భోక్తుమమన్త్రయన్తః,
కన్థామివ శ్రీమపి కుత్సయన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః. ౨

స్వానన్దభావే పరితుష్టిమన్తః
సుశాన్తసర్వేన్ద్రియవృత్తిమన్తః,
అహర్నిశం బ్రహ్మసుఖే రమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః. ౩

సర్వదా ఉపనిషద్వాక్యములను చింతించువారును, భిక్షవలన లభించిన అన్నముతో తృప్తినందువారును, ఆనందమయమగు అంతఃకరణమున చరించు వారును అగు ఏ కౌపీనధారులగు పురుషులు గలరో, వారు అదృష్టవంతులు. ౧

చెట్టు నీడయే నివాసభూమి. కరద్వయమే భోజనపాత్ర. ఐశ్వర్యమనిన బొంతవలె అసహ్యము. కౌపీనమే వస్త్రము — ఇట్టి పురుషులే ధన్యులు. ౨

ఆత్మానంద — పరితృప్తులును, జితేంద్రియులును, అహర్నిశము బ్రహ్మా నందమున క్రీడించువారును, కౌపీనధారులును అగు వ్యక్తులే భాగ్యవంతులు. ౩

దేహాదిభావం పరివర్తయన్తః,
స్వాత్మానమాత్మన్యవలోకయన్తః,
నాన్తం న మధ్యం న బహిః స్మరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ౪

బ్రహ్మాక్షరం పావనముచ్చరన్తో
బ్రహ్మాఽహమస్మీతి విభావయన్తః,
*[పఞ్చాక్షరం పావనముచ్చరన్తో
పతిం పశూనాం హృది భావయన్తః]
భిక్షాశినో దిక్షుపరిభ్రమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః. ౫

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత కౌపీన పఞ్చకమ్ ||౫||

దేహాత్మభావమును తొలగించువారును, తమలో తమ్ము వీక్షించుకొను వారును, వెలుపల, లోపల, మధ్యమును గల వస్తువులను సంస్మరింపనివారును అగు ఏ కౌపీనధారులు గలరో, వారే ధన్యులు. ౪

పవిత్రమగు ఓంకారమంత్రమును ఉచ్చరించువారును, 'నేను బ్రహ్మమును' అని బోధించువారును * [లేక పావనమగు పంచాక్షరమంత్రమును ఉచ్చరించువారును, పశుపతియగు శివుని హృదయమున ధ్యానించువారును] భిక్షాన్నమును గ్రహించుచు నలుదిక్కుల తిరుగువారును, కౌపీనధారులును అగు యతులే ధన్యులు. ౫

ఇది కౌపీనపంచక-ఆంధ్రానువాదము. ||౫||

* ఈభాగము పాఠాంతరము.

## ౧౦. గుర్వష్టకమ్

శరీరం సురూపం తథా వా కలత్రం
యశశ్చారు చిత్రం ధనం మేరుతుల్యమ్,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౧

కలత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం
గృహం బాంధవాః సర్వమేతద్ధి జాతమ్,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౨

షడఙ్గాదివేదో ముఖే శాస్త్రవిద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౩

సుందరమగు శరీరము, రూపవతియగు భార్య మనోహరమును విచిత్రమును అగు యశస్సు, మేరుతుల్యమగు ధనము ఇన్నియుండినను మనస్సు గురు పాదపద్మముల సంలగ్నము కాకుండిన ఫలమేమి ? ౧

భార్య కలదు. ధనమున్నది. పుత్ర పౌత్రాది సర్వస్వమును కలదు. గృహము, బంధుగులు మొదలగున వన్నియును లభించినవి. అయినను గురుచరణారవిందభక్తి లేకుండిన ఫలమేమి ? ౨

శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛన్దో జ్యోతిషములను ఆరు అంగములతో గూడిన నాలుగు వేదములును, మిగిలిన శాస్త్రవిద్యలును కంఠస్థములైనవి. కవిత్వమును, గద్యపద్యములను చెప్పగలడు. అయినను గుర్వంఘ్రి కమలమున మనస్సును నిల్పజాలనిచో లాభమేమి ? ౩

విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః
సదాచారవృత్తేషు మత్తో న చాన్యః,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౪

క్షమామణ్డలే భూపభూపాలబృన్దైః
సదా సేవితం యస్య పాదారవిన్దమ్,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౫

యశో మే గతం దిక్షు దానప్రతాపాత్
జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౬

విదేశములయందు సన్మానము లభించినది. స్వదేశమునఁ ఖ్యాతి గడించినాడు. నాకంటె సదాచారపరుడింకొకడు లేడను తలపు. అయినను గురుపాదపద్మభక్తి లేనిచో లాభమేమి? ౪

భూమండలమున గల రాజులును సార్వభౌములును తన పాదములను సకాలముల గొలుచుచున్నారు. అయినను తన మనస్సున గురుపాదుకలను నిలుపుకొన జాలనిచో లాభమేమి? ౫

“దానవీరుడ నని నాకీర్తితో దిక్కులు నిండినవి. జగత్తున గల వస్తువులన్నియును నా చేతికి వచ్చినవి.” అని భావించుచున్నను, ఇది యంతయును ఎవ్వని ప్రసాదమువలన లభించినదో, ఆగురుని యొక్క పాదపద్మముల భక్తి నిలుప జాలనిచో లాభమేమి? ౬

న భోగో న యోగో న వా వాజిరాజౌ
న కాన్తాసుఖే నైవ విత్తేషు చిత్తమ్,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౭

అరణ్యే న వా స్వస్య గేహే న కార్యే
న దేహే మనో వర్తతే మే త్వనర్ఘ్యే,
మనశ్చేన్న లగ్నం గురోరఙ్ఘ్రి పద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౮

అనర్ఘ్యాణి రత్నాని భుక్తాని సమ్యక్
సమాలిఙ్గితా కామినీ యామినీషు,
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్. ౯

యోగ భోగములు లేవు. (రాజ్య రథ గజ) తురగాదుల కోర్కె లేదు. కాంతా కనక స్పృహ లేదు. అయినను, మనస్సు గురుపాదపద్మముల నిలువని యెడల లాభ మేమి? ౭

"గార్హస్థ్య వానప్రస్థముల కోర్కె లేదు. ఏకార్యమునను అభిలాష లేదు. శరీరవిషయమున మనస్సు ప్రవర్తిల్లుట లేదు. అమూల్యమగు దానిని పొందగోరుచున్నాను" — అని చెప్పునాతని మనస్సు గురుపాదపద్మముల తగుల్కొనని యెడల లాభ మేమి? ౮

వెలలేని రత్నములు లభించినవి. యామిను (రాత్రు) లయందు కామినీ సమాలింగనసుఖము లభించినది. అయినను గురుపాదపద్మములయందు మతి లేకుండిన గతిలేదు. [ఈ శ్లోకము అధిక పాఠము.] ౯

## ౧౦ గుర్వష్టకమ్



గురోరష్టకం యః పఠేత్ పుణ్యదేహీ
యతిర్భూపతిర్బ్రహ్మచారీ చ గేహీ,
లభేత్ వాఞ్ఛితార్థం పరం బ్రహ్మసంజ్ఞః
గురోరుక్తవాక్యే మనో యస్య లగ్నమ్. ౧౦

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత గుర్వష్టకమ్ ॥౧౦॥

యతి, భూపతి, బ్రహ్మచారి, గృహి — ఎవ్వరైనను కానిమ్ము! ఈ గురు అష్టకమును పఠించువాడు పుణ్యపురుషుడే. గురువాక్యమున విశ్వాసము కలవాడు బ్రహ్మ మనబడు పరమవాంఛితార్థమును బడయును. ౧౦

ఇది గురు అష్టకాంధ్రానువాదము ॥౧౦॥

—*—

# ౧౧. చర్పట పఞ్జరికా స్తోత్రమ్ ౧

## (భజగోవిందస్తోత్రమ్)

దినమపి రజనీ సాయం ప్రాతః, శిశిరవసన్తౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయుస్తదపి న ముఞ్చత్యాశావాయుః.
* భజ గోవిన్దం భజగోవిన్దం, భజగోవిన్దం మూఢమతే,
ప్రాప్తే సన్నిహితే మరణే, నహి నహి రక్షతి డుకృఞ్ కరణే. ౧

అగ్రేవహ్నిః పృష్ఠే భానూ రాత్రౌ, చి(చు)బుక సమర్పితజానుః
కరతలభిక్షా తరుతలవాస స్తదపి న ముఞ్చత్యాశాపాశః. ౨

రాత్రింబగళ్లు, ఉదయాస్తమయములు, శిశిరవసంత ఋతువులు మరల మరల వచ్చుచు (పోవు) న్నవి. కాలము క్రీడించుచున్నది. ఆయువు క్షీణించుచున్నది. కాని ఆశయను గాలి (పట్టి) విడవకున్నది. * మూఢమానవుడా! గోవిందుని భజింపుము. గోవిందుని భజింపుము. గోవిందుని భజింపుము. మృత్యువు సమీపించినప్పుడు "డుకృఞ్ కరణే కృధాతువు అర్థము చేయుట" అను ధాతుగణ పాఠము నిన్ను రక్షింప జాలదు. అనగా తత్త్వజ్ఞానమును బొందక అనాత్మ బోధకములగు అన్యశాస్త్రములను పఠించి కాలమును గడుపువారికే గతి లేదు. ఇక విషయ సుఖలిప్తులమాట వేరుగ చెప్పవలెనా ? _ అని భావము. ౧

[దిగంబరివై నీవు శీతనివారణార్థము] ఎదుట నిప్పుపెట్టుకొని వెనుక సూర్యుని ఉంచుకొనినావు. రాత్రి మోకాలు మీద బుగ్గలనంటిపెట్టుకొని కాలము గడుపుచున్నావు. కరతల భిక్షు. తరుతల వాసము. అయినను ఆశాపాశము విడువకున్నది. ౨

---

* ఈ రెండు పాదములను ఇక రాబోవు ప్రతి శ్లోకముతోడను గలిపి చదువుకొనవలయును.

యావద్ విత్తోపార్జనశక్తస్తావన్నిజపరివారో రక్తః,
పశ్చాద్ ధావతి జర్జరదేహే వార్తాం పృచ్ఛతి కోఽపి న గేహే.
జటిలో ముణ్డీ లుఞ్ఛితకేశః, కాషాయాంబర బహుకృతవేషః,
పశ్యన్నపి న చ పశ్యతి మూఢః, ఉదరనిమిత్తంబహుకృతవేషః.
భగవద్గీతా కిఞ్చిదధీతా గఙ్గాజలలవకణికా పీతా,
సకృదపియస్య మురారిసమర్చాతస్య యమః కింకురుతేచర్చామ్.
అఙ్గం గలితం పలితం ముణ్డం, దశనవిహీనం జాతం తుణ్డమ్,
వృద్ధో యాతి గృహీత్వా దణ్డం,తదపి న ముఞ్చత్యాశాపిణ్డమ్.
బాలస్తావత్ క్రీడాసక్తస్తరుణస్తావత్ తరుణీరక్తః,
వృద్ధస్తావత్ చిన్తామగ్నః, పరే బ్రహ్మణి కోఽపి న లగ్నః.

ధనోపార్జనాసామర్థ్య మున్నంతవరకు పుత్రకళత్రాది పరివారము అనురాగమును చూపుదురు. దేహము జరాగ్రస్తమై శక్తిహీనమైనప్పుడు, ఇంట నుండిన వారెవ్వరును ఎట్లుంటివి ? యనిగూడ అడుగరు. ౩

జటలను ధరించినను, తలగొరిగించుకొనినను, జుట్టు ఊడబెరుకుకొనినను, కాషాయము కట్టినను, విశేష మేమి ? ఈ వేషము లన్నియును ఉదరపోషణార్థమే. నీవు గమనించియు, గమనింపన ట్లుంటివి ? ౪

కొలదియైనను భగవద్గీతను పఠించి, గంగాజల కణమును పానమొనర్చి, ఒకమారైనను మురారిని అర్చించినవానిని యము డేమి చేయగలడు ? ౫

శరీరావయవములు సత్తు దప్పినవి. తల నెరిసినది. పళ్లూడినవి. ఇట్టి ఆకారముతో వృద్ధుడు చేత కఱ్ఱను బట్టుకొని నడచుచున్నాడు. అయినను ఆశాపిండము వదలుట లేదు. ౬

బాలుడు క్రీడాసక్తుడు, యువకుడు లలనాలోలుడు. వృద్ధుడు చింతామగ్నుడు. పరబ్రహ్మమున మనస్సును నిల్పిన వాడెవ్వడును గోచరింపడు. ౭

పునరపి జననం పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనమ్
ఇహ సంసారే ఖలు దుస్తారే, కృపయాఽపారే పాహి మురారే.

పునరపి రజనీ పునరపి దివసః, పునరపి పక్షః పునరపిమాసః,
పునరప్యయనం పునరపి వర్షం, తదపి న ముఞ్చత్యాశామర్షమ్.

వయసి గతే కః కామవికారః, శుష్కే నీరే కః కాసారః,
నష్టే ద్రవ్యే కః పరివారో, జ్ఞాతే తత్త్వే కః సంసారః. ౧౦

నారీ స్తనభర నాభినివేశం, మిథ్యామాయామోహావేశమ్,
ఏతన్మాంస వసాది వికారం, మనసి విచారయ వారం వారమ్.

కస్త్వం కోఽహం కుత ఆయాతః, కా మే జననీ కో మే తాతః,
ఇతి పరిభావయ సర్వమసారం, విశ్వం త్యక్త్వా స్వప్నవిచారమ్.

మరల పుట్టుక, మరల చావు; మరల మాతృగర్భశయనము. మురారీ! అపారమగు ఈ సంసార సముద్రమునుండి నన్ను దయతో రక్షింపుము. ౮

మరల మరల రాత్రిం బగళ్లును, పక్ష, మాసాయన, సంవత్సరములు వచ్చుచు బోవుచున్నవి. కాని ఆశమాత్రము వదలుట లేదు. ౯

వయస్సు మళ్లిన కామ మెక్కడ? నీ రెండిన చెరు వెక్కడ? ధనము పోయిన పరివార మేది? తత్త్వ మెరిగిన సంసార మేమి? ౧౦

యువతి కుచములయెడ కలుగు అనురాగము మిథ్యయగు మాయా మోహమే! ఆ స్తనములు, మాంసము, వసమున్నగువాటి వికారస్వరూపమే అని మనస్సున మాటిమాటికి విచారించి చూడుము. ౧౧

నీ వెవ్వడవు? నే నెవరు? నీ వెటనుండి వచ్చితివి? నాతల్లి ఎవరు? తండ్రెవరు? విచారమువలన స్వప్నమును బోలిన ఈ విశ్వమును పరిత్యజించి, సర్వమసారమని భావింపుము. ౧౨

గేయం గీతానామసహస్రం, ధ్యేయం శ్రీపతిరూపమజస్రమ్,
నేయం సజ్జనసఙ్గే చిత్తం, దేయం దీనజనాయ చ విత్తమ్. ౧౩
యావజ్జీవో నివసతి దేహే, కుశలం తావత్ పృచ్ఛతి గేహే,
గతవతి వాయౌ దేహాపాయే, భార్యా బిభ్యతి తస్మిన్ కాయే.
సుఖతః క్రియతే రామాభోగః, పశ్చాద్ధన్త శరీరే రోగః,
యద్యపి లోకే మరణం శరణం, తదపి న ముఞ్చతి పాపాచరణమ్.
రథ్యాచర్పట విరచిత కన్థః, పుణ్యాపుణ్య వివర్జిత పన్థః,
నాహం న త్వం నాయం లోక స్తదపి కిమర్థం క్రియతే శోకః.
కురుతే గఙ్గాసాగరగమనం, వ్రతపరిపాలన మథవా దానమ్,
జ్ఞానవిహీనే సర్వమనేన, ముక్తిర్న భవతి జన్మశతేన. ౧౭

ఇతి శ్రీ శఙ్కర భగవత్పూజ్యపాద విరచిత చర్పట పఞ్జరికా ॥౧౧॥
(భజగోవింద) స్తోత్రమ్ ॥౧౧॥

భగవద్గీతలను, విష్ణుసహస్రనామమును పఠింపుము. నిరంతరము నారాయణధ్యాన మొనర్పుము. చిత్తమును సాధుసంగమున నుంచుము. విత్తమును దీనుల కొసగుము. ౧౩

జీవుడు బొందెలో నుండినంతవరకు ఇంటనందరును కుశలమునడుగుదురు. ప్రాణవాయువు శరీరమును విడచినప్పుడు, నిర్జీవమైన దానిని జూచి భార్యకూడ భయపడును. ౧౪

సుఖముగ కామినితో క్రీడించుచున్నాడు, తుదకు శరీరమునకు వ్యాధి. లోకమున మరణమే పర్యవసానమైనను పాపాచరణమును విడుచుటలేదు. ౧౫

కూడలియందు పడియున్న చినుగుపీలికలతో బొంతనుచేసి కట్టుకొనుము. ధర్మాధర్మరహితమగు మార్గము నవలంబింపుము. నీవు, నేను, ఈ భూలోక మనునవియే లేవు. శోక మెందులకు? ౧౬

గంగాసాగరసంగమతీర్థమును సేవించినను, వ్రతముల నాచరించినను, దాన మొనర్చినను, తత్త్వజ్ఞానము లేకుండిన నూరుజన్మలకైనను ముక్తి లేదు.

ఇది భజగోవింద స్తోత్రాంధ్రానువాదము ॥౧౧॥

## ౧౨. చర్పట పఞ్జరికా స్తోత్రమ్. (౨)

### (మోహ ముద్గరః)

మూఢ జహీహి ధనాగమతృష్ణాం
కురు తనుబుద్ధే మనసి వితృష్ణామ్,
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్. ౧

*కా తవ కాన్తా కస్తే పుత్రః, సంసారోఽయమతీవ విచిత్రః,
కస్య త్వం వా కుత ఆయాతస్తత్త్వం చిన్తయ తదిదం భ్రాతః.

మా కురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషాత్ కాలః సర్వమ్,
మాయామయ మిదమఖిలం హిత్వా,
బ్రహ్మపదం ప్రవిశాశు విదిత్వా. ౩

మూఢుడా! ధనతృష్ణను పరిత్యజింపుము. అల్పమతీ! మనస్సున వైరాగ్యమును అవలంబింపుము. స్వప్రయత్నమున సంపాదించినంత దానితో, మనస్సును సంతోషపెట్టుకొనుము. ౧

నీ భార్య ఎవరు? పుత్రు డెవరు? ఈ సంసారము చాల అద్భుతమైనది. నీ వెవరివాడవు? ఎటనుండి వచ్చితివి? సోదరుడా! ఈతత్త్వమును చక్కగ చింతింపుము. ౨

ధన జన యౌవనములనుగూర్చి గర్వింపకుము. ఏలయన, సర్వమును కాలుడు నిముషములో ఎత్తికొని పోగలడు. మాయాకార్యమగు ఈసర్వమును త్యజించి, తత్త్వమును గ్రహించి, బ్రహ్మపదమును బొందుము. ౩

నలినీదలగత జలమతితరలం
    తద్వజ్జీవన మతిశయ చపలమ్,
క్షణమపి సజ్జనసఙ్గతిరేకా
    భవతి భవార్ణవ తరణే నౌకా. ౪

*యావజ్జననం తావన్మరణం
    తావజ్జననీ జఠరే శయనమ్,
ఇతి సంసారే స్ఫుటతర దోషః
    కథమిహ మానవ! తవ సన్తోషః. ౫

దినయామిన్యౌ సాయం ప్రాతః శిశిరవసన్తౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయు స్తదపి న ముఞ్చత్యాశావాయుః.
*అఙ్గం గలితం పలితం ముణ్డం, దన్తవిహీనం జాతం తుణ్డమ్,
కరధృతకమ్పితశోభితదణ్డం, తదపి న ముఞ్చత్యాశాభాణ్డమ్. ౭

తామరాకుమీది నీటిబొట్టువలె, జీవనము అత్యంత చంచలము. [అనగా ప్రాణము ఏముహూర్తమున పోయినను పోవచ్చును.] కాన ఒక్కక్షణకాల మైనను సాధుసంగ మొనర్పుము; అదియే సంసారసాగరమును దాటించు నౌక కాగలదు. ౪

పుట్టిన గిట్టుట తప్పదు. మరల మాతృగర్భమున శయనము. మానవుఁడా! ఇట్టి దోషము సంసారమున స్పష్టముగ తోచుచుండగా, ఇది నీకెట్లు సంతోషము గూర్పగలదు? ౫

రాత్రింబగళ్లు, ఉదయాస్తమయములు, శిశిరవసంతములు మరలమరల వచ్చుచు బోవుచున్నవి. కాలము క్రీడించుచున్నది. ఆయువు పోవుచున్నది. కాని ఆశ (తృష్ణ) మాత్రము పోవుట లేదు. ౬

అంగము గళితమైనది. ముండము పలితమైనది, నోరు బోసిపోయినది. చేత ఊతగా బుచ్చుకొనిన కఱ్ఱకూడ వణుకు చున్నది, అయినను ఆశాభాండమును వదలజాలకున్నాడు. ౭

సుర వర మన్దిర తరుతల వాసః, శయ్యా భూతల మజినం వాసః,
సర్వపరిగ్రహ భోగత్యాగః, కస్య సుఖం న కరోతి విరాగః. ౮

శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ, మా కురు యత్నం విగ్రహసన్ధౌ.
భవ సమచిత్తః సర్వత్ర త్వం, వాఞ్ఛస్యచిరాద్ యది విష్ణుత్వమ్.

అష్టకులాచల సప్తసముద్రాః, బ్రహ్మా పురన్దర దినకర రుద్రాః,
న త్వం నాహం నాయం లోక స్తదపి కిమర్థం క్రియతే శోకః.

త్వయి మయిచాన్యత్రైకో విష్ణుః, వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః,
సర్వస్మిన్నపి పశ్యాత్మానం సర్వత్రోత్సృజ భేదజ్ఞానమ్. ౧౧

దేవాలయ ప్రాంతముననున్న చెట్టునీడయే నివాసస్థానము. భూమి శయ్య. అజిన వల్కల ధారణము. అపరిగ్రహ వ్రతము. భోగత్యాగము. ఇట్టి వైరాగ్య మెవ్వరికి సుఖ మొసగకుండును ?

శీఘ్రముగ నీవు విష్ణుత్వమును బొందగోరుచో, శత్రుమిత్రులయందును, బంధుపుత్రాదులయందును, విగ్రహసంధులయందునను ఉదాసీనుడవు కమ్ము !— సమచిత్తుడవు కమ్ము. ౯

మహేంద్ర, మలయ, సహ్య, శుక్తిమంత, ఋక్ష, వింధ్య, పారియాత్ర, హిమాలయములను, అష్టకుల పర్వతములును, లవణ, ఇక్షు, సురా, ఘృత, దధి, దుగ్ధ, జలములను సప్తసముద్రములును, బ్రహ్మ, ఇంద్ర, సూర్య, రుద్రులును, నీవును, నేనును, ఈలోకములును ఏమియును గావు; అనిత్యములు. ఇక శోకించుట దేని కొరకు ? ౧౦

సర్వమును విష్ణుమయము. నీలోన, నాలోన, ఇతర వస్తువులలోన ఉండినది విష్ణువొక్కడే. ఈవిషయమును గ్రహింపక నీవు అనవసరముగ కలవర పడుచుంటివేమి ? సర్వత్ర ఆత్మనే చూడుము. సర్వదా భేదజ్ఞానమును పరిత్యజింపుము. ౧౧

*బాలస్తావత్ క్రీడాసక్తః తరుణస్తావత్ తరుణీరక్తః,
వృద్ధస్తావచ్చిన్తామగ్నః పరమే బ్రహ్మణి కోఽపి న లగ్నః. ౧౨
అర్థమనర్థం భావయ నిత్యం, నాస్తి తతః సుఖలేశః సత్యమ్,
పుత్రాదపి ధనభాజాం భీతిః, సర్వత్రైషా కథితా నీతిః. ౧౩
*యావద్విత్తోపార్జన శక్తస్తావన్నిజపరివారో రక్తః,
తదను చ జరయా జర్జర దేహే వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే.

కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాత్మానం పశ్యతు కోఽహం,
ఆత్మజ్ఞాన విహీనా మూఢాః
తే పచ్యన్తే నరకనిగూఢాః.
౧౫

బాల్యము క్రీడలతోను, యౌవనము స్త్రీసుఖముతోను, వృద్ధాప్యము చింతలతోను గడిచి పోవుచున్నది. ఏస్థితియందునను బ్రహ్మధ్యాన మొనర్చువాడు కనిపించుట లేదు.
౧౨

'అర్థము అనర్థమునే కలిగించును.' అని నిత్యము భావింపుము. దీని వలన కొంచెము సుఖముకూడ లేదు. తుదకు ధనికునకు కొడుకనినను భయమే. ఈ నీతి సర్వకాలముల చెల్లును.
౧౩

ధనార్జనశక్తి ఉండినంతవరకు పరివారవర్గము అనురాగమును ఒలికించుచుండును. తరువాతనో, శరీరము జరాజర్జరితముకాగా. నీవిషయమును పట్టించుకొనువారే ఇంట నుండరు.
౧౪

కామ, క్రోధ, లోభ, మోహములను వదలి "నే నెవ్వడను ?" అని విచారించి ఆత్మదర్శన మొనర్పుము. ఆత్మజ్ఞానరహితులగు మూఢులు ఘోర నరక యాతనల ననుభవింతురు.
౧౫

**షోడశపజ్ఝటికాభిరశేషః, శిష్యాణాం కథితోఽభ్యుపదేశః,**
**యేషాం నైష కరోతి వివేకం, తేషాం కః కురుతామతిరేకమ్.**

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత మోహముద్గరః ॥౧౧॥

శిష్యుల నిమిత్తము షోడశపజ్ఝటికా శ్లోకముల ఉపదేశసారము చెప్పబడినది. దీనివలన వివేకమును బొందని వారికి ఇంకెవరేమి చెప్పగలరు? ౧౭

ఇది మోహముద్గర ఆంధ్రానువాదము ॥౧౭॥

—*—

9)

# చర్పట పఞ్జరికా స్తోత్రమ్. (3)

## (అధిక శ్లోకాని)

**సత్సఙ్గత్వే నిఃసఙ్గత్వం, నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్,**
**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః. ౧**

**కా తే కాన్తాధనగతచిన్తా, వాతుల కిం తవ నాస్తి నియన్తా,**
**యస్త్వాం హస్తే సుదృఢనిబద్ధం బోధయతి ప్రభవాది విరుద్ధమ్.**

**యోగరతో వా భోగరతో వా సఙ్గరతో వా సఙ్గవిహీనః,**
**యస్య బ్రహ్మణి రమతే చిత్తం, నన్దతి నన్దతి నన్దత్యేవ. ౩**

***రథ్యా కర్పట విరచిత కన్థః పుణ్యాపుణ్య వివర్జిత పన్థః,**
**యోగీ యోగనియోజితచిత్తో, రమతే బాలోన్మత్తవదేవ. ౪**

సాధుసంగ మొనర్చిన నిష్కామి యగును. అనాసక్తుడైన మోహము తొలగిపోవును. మోహము తొలగిన నిశ్చలతత్త్వమగు బ్రహ్మము లభించును. బ్రహ్మలాభమైన జీవన్ముక్తియే ఇహలోకముననే ముక్తుడగును. ౧

పిచ్చివాడా! ఎల్లప్పుడును నీకు కాంతా ధన చింతయేనా? నిన్నడ్డు వారెవ్వరును లేరా? నీచేతితో నిన్ను నీవు బంధించుకొంటివి గదోయి – ఇట్టి నిన్ను ఆయా దోషములనుండి విడిపింపగల నియంత ఎక్కడ? ౨

యోగరతుడే యగుగాక, భోగరతుడే యగుగాక! సంగియే యగుగాక, నిస్సంగియే యగుగాక! ఎవ్వని చిత్తము బ్రహ్మమున క్రీడించుచుండునో, అతడే ఆనందించును. ౩

దారిలో పడియున్న చినుగుపేలికలను ధరించి, పుణ్యాపాపముల కతీతమగు మార్గమున చరించుచు, చిత్తమును యోగముననిల్పి, యోగిపురుషుడు బాలునివలెను ఉన్మత్తునివలెను తిరుగుచుండును. ౪

ప్రాణాయామం ప్రత్యాహారం, నిత్యానిత్యవివేకవిచారమ్,
జాప్యసమేత సమాధివిధానం, కుర్వవధానం మహదవధానమ్.

గురుచరణామ్బుజ నిర్భరభక్తః
సంసారాదచిరాద్ భవ ముక్తః,
సేన్ద్రియ మానస నియమాదేవం,
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్. ౬

కా తే అష్టాదశదేశే చిన్తా, వాతుల తవ నాస్తి నియన్తా,
యస్త్వాం హస్తే సుదృఢనిబద్ధం బోధయతి ప్రభవాది విరుద్ధమ్.
ద్వాదశపఞ్జరికామయ ఏషః శిష్యాణాం కథితో హ్యుపదేశః.
యేషాం చిత్తే నైవ వివేకః తే పచ్యన్తే నరకమనేకమ్. ౮

ఇతి శ్రీ శఙ్కర భగవత్ పూజ్యపాద విరచిత ద్వాదశ పఞ్జరికా స్తోత్రమ్॥౧౨॥

ప్రాణాయామ ప్రత్యాహారములను, నిత్యానిత్య వస్తువివేకమును, జపముతోగూడిన సమాధినిష్ఠను, ఏకాగ్రచిత్తమును సావధానుడవై సంపాదించుకొనుము.

గురుపాదపద్మములయందు భక్తివిశ్వాసములనుంచి, శీఘ్రముగనే ముక్తుడవుకమ్ము. మనస్సును ఇంద్రియములను నిరోధించిన నిజహృదయాంతర్గతుడగు దేవుని కనుగొన గలవు. ౬

ఉన్మత్తుడా! నీమనస్సు పదునెనిమిది దేశములకు పరుగిడుచున్న దేల? నిన్ను నిరోధించి, స్వహస్తమున బద్ధుడవైన నిన్ను విడిపించి, కర్తృత్వభోక్తృత్వభావములు నీకు విరుద్ధములు _ స్వాభావికములు కావు - అని బోధించెడి నాయకుడు లేడా? ౭

ద్వాదశ పంజరికా మయమగు ఈ ఉపదేశము శిష్యుల నిమిత్తము. దీని వలన వివేకము నందనివారు నరకమున బడుదురు. * ౮

ఇది ద్వాదశ పంజరిక_ఆంధ్రానువాదము ॥౧౨॥

---

* చర్పట మంజరిక, ద్వాదశమంజరిక, షోడశ పంజరిక, చతుర్దశ పంజరిక, మోహముద్గరము, భజగోవింద శ్లోకములు___ ఇన్ని పేర్లతో భారతదేశము

# ౧౩. జీవన్ముక్తానన్దలహరీ

**పురే పౌరాన్ పశ్యన్ నవయువతినామాకృతి మయాన్**
**సువేషాన్ స్వర్ణాలఙ్కరణకలితాంశ్చిత్ర సదృశాన్,**
**స్వయం సాక్షీ ద్రష్టేత్యపి చ కలయంస్తైః సహ రమన్**
**మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః.** ౧

గురుదీక్షనుబొంది అజ్ఞానతమమును వీడిన ముని, పట్టణములలో యువతీ యువకులు అను ఆకారములను, చక్కగా నలంకరించి బంగారు నగలతో నొప్పుచు బొమ్మలవలె తోఁచట్టువారిని చూచుచున్నను; తన్ను దాను సాక్షిగా నెరిగికొనుచు, వారితో కలిసిమెలసి తిరిగినను వ్యామోహమును బొందడు. ౧

---

నందలి వివిధరాష్ట్రములలో వివిధ పాఠములతో ఈశ్లోకములు ప్రచారములో నున్నవి. పాఠాంతరములలో అక్షరముల మార్పేగాని, భావమున మార్పులేదు. కాని, క్రమము పైనచూపిన శీర్షికలలో విభేదమున్నది.వీనిని దొరికినంత మటుకు సరిచూచి, నేను కొంతగా స్వతంత్రించి ఈ మూడు భాగములుగ విభజించితిని. అందు ద్వితీయభాగమున * ఈ చిహ్నముగల శ్లోకములు పునరుక్తములేయైనను, ఒక ప్రతి ననుసరించి అట్లే నిల్పితిని. వీనిలో పదునాల్గు శ్లోకములు శంకర రచితములుగాన, పద్మపాద, తోటక, హస్తామలక, సుబోధ, కార్తికకార, నిత్యానంద, ఆనందగిరి, దృఢభక్త, నిత్యనాథ, యోగానంద, సురేంద్రః మేధాతిథి, భారతీవంశ, లవని ఆంధ్రదేశ ప్రతులందు గలదు. వీరు శంకరశిష్యులనియు అందే కలదు. — అను.

వనే వృక్షాన్ పశ్యన్ దలఫలభరాన్ నమ్రసుశిఖాన్
ఘనచ్ఛాయాచ్ఛన్నాన్ బహులకలకూజద్ద్విజగణాన్,
భజన్ ఘస్రో రాత్రాదవనితలతల్పైక శయనో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౨

కదాచిత్ ప్రాసాదే క్వచిదపి చ సౌధేషు ధనినాం
కదా కాలే శైలే క్వచిదపి చ కూలేషు సరితామ్,
కుటీరే దాన్తానాం మునిజనవరాణామపి వసన్
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. 3

క్వచిద్ బాలైః సార్ధం కరతలగతాలైః, సహసితైః
క్వచిత్ తారుణ్యాలఙ్కృతనరవధూభిః సహ రమన్,
క్వచిద్ వృద్ధైశ్చిన్తాకులితహృదయైశ్చాపి విలపన్
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౪

కొమ్మలతోడను పండ్లతోడను వంగి, దట్టమగు నీడ నొసగుచు, తియ్యగ కూయుచున్న పెక్కుపక్షులతో నొప్పుచుండిన వనవృక్షములను జూచుచు, వానినే రాత్రింబగల్లు ఉనికిపట్టుగా జేసికొని, నేలనే పక్కగా యొనర్చుకొని ముని వ్యామోహము నందకుండును. గురుదీక్షామహిమ ఇట్టిది. అది తమమును బోనడచును. ౨

గురుదీక్షను బొంది అజ్ఞానమును బరిహరించిన ముని, ఒకప్పుడు మేడల మీదను, మరొకప్పుడు ధనికుల సౌధములలోను, ఇంకొకప్పుడు పర్వతముల మీదను, అన్యసమయముల నదీకూలములయందునను, ఇతరకాలముల జితేంద్రియులగు యతుల కుటీరముననను నివసించుచు మోహము నందకుండును. 3

గురుదీక్షాబలమున జ్ఞానియైన మౌని, ఒకప్పుడు చేతితో బొమ్మలు పట్టుకొని నవ్వుచుండెడి పిల్లలతోడను, మరొకప్పుడు సోయగముతో నొప్పుచుండు పడుచులతోడను, ఆనందించుచుండినను; మరొకప్పుడు చింతలతో హృదయ వ్యథనందు వృద్ధులతోజేరి రోదన మొనర్చుచుండినను వ్యామోహము నందకుండును. ౪

కదాచిత్ విద్వద్భిర్వివిదిషుభిరత్యన్తనిరతైః
కదాచిత్ కావ్యాలఙ్కృతిరసరసాలైః కవివరైః,
కదాచిత్ సత్తర్కైరనుమితిపరైస్తార్కికవరైః
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః. ౫

కదా ధ్యానాభ్యాసైః క్వచిదపి సపర్యావికసితైః
సుగన్ధైః సత్పుష్పైః క్వచిదపి దలైరేవ విమలైః,
ప్రకుర్వన్ దేవస్య ప్రముదితమనాః సంస్తుతిపరో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః. ౬

శివాయాః శమ్భోర్వా క్వచిదపి చ విష్ణోరపి కదా
గణాధ్యక్షస్యాపి ప్రకటతపనస్యాపి చ కదా,
పఠన్ వై నామాలిం నయనరచితానన్దసలిలో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః. ౭

గురుదీక్షను బొంది అజ్ఞానమును దూరమొనర్చిన మౌని, ఒకప్పుడు ఏకాగ్రనిష్ఠతో జ్ఞానాన్వేషణము నొనర్చు జ్ఞానులతోడను, ఒకప్పుడు కావ్యాలంకారరస రసికులగు కవులతోడను కలిసి మెలసి యుండును; మరొకప్పుడు అనుమానప్రమాణమునే ప్రధానముగనెంచెడి తార్కికులతో శ్రుతి, అవిరోధియగు తర్క మొనర్చుచుండును; అయినను వ్యామోహము నందకుండును. ౫

గురువునుండి దీక్షనుబొంది తమస్సును క్షయమొనర్చిన మౌని, ఒకప్పుడు ధ్యానాభ్యాస మొనర్చును; మరియొకప్పుడు వికసిత సుగంధ పుష్పములతో దేవపూజ యొనర్చును, ఇంకొకప్పుడు కేవలము తులసీ బిల్వాది పత్రములతోడనే పూజ యొనర్చును, వ్యామోహము నందకుండును. ౬

గురుదీక్షను బొంది జ్ఞానియైన మౌని, ఒకప్పుడు పార్వతీదేవియొక్కయు, మరియొకప్పుడు శివునివియును, ఇంకొకప్పుడు గణపతివియును, మరొకప్పుడు విష్ణునివియును, ఇంకొకప్పుడు సూర్యునివియును అగు నామావళిని పఠించుచు, కంట ఆనందాశ్రువులను రాల్చుచు, నిర్మోహుడై యుండును. ౭

కదాచిజ్జాగ్రత్యాం విషయకిరణైః సంవ్యవహరన్
కదాచిత్ స్వప్నస్థోఽపి చ విషయానేవ చ భజన్,
కదాచిత్ సౌషుప్తం సుఖమనుభవన్నేవ సతతం
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౮

కదాప్యాశావాసాః క్వచిదపిచ దివ్యామ్బరధరః
క్వచిత్ పఞ్చాస్యోత్థాం త్వచమపి దధానః కటితటే,
మనస్వీ నిఃశఙ్కః సుజనహృదయానన్ద జనకో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౯

కదాచిత్ సత్త్వస్థః క్వచిదపి రజోవృత్తిసుగత-
స్తమోవృత్తిః క్వాపి త్రితయరహితః క్వాపి చ పునః,
కదాచిత్ సంసారీ శ్రుతిపదవిహారీ క్వచిదహో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౦

గురుదీక్షను బొంది అజ్ఞానమును విడచిన మౌని, వ్యామోహమునందక, ఒకప్పుడు జాగ్రదవస్థయందు నిలచి, విషయేంద్రియములతో వ్యవహరించుచుండును; ఇంకొకప్పుడు స్వప్నస్థానముననుండి అందలి విషయములను భోగించును. ఇంకొకప్పుడు సుషుప్తుడై అందలి సుఖమును నిరంతరముగ అనుభవించుచుండును. ౮

గురుదీక్షవలన జ్ఞానమునంది వ్యామోహమును విడచినమౌని, ఒకప్పుడు దిగంబరియై, మరియొకప్పుడు దివ్యాంబరధారియై, ఇంకొకప్పుడు పులితోలు పుట్టమును మొలకు చుట్టియు, మనస్వియై, శంకారహితుడై, సజ్జనుల హృదయమున కానందము నొసగుచు ఒప్పుచుండును. ౯

గురుదీక్షితుడై జ్ఞానియైన మౌని, ఒకప్పుడు సత్త్వగుణమున నెలకొని యుండును. ఇంకొకప్పుడు రజోగుణ వ్యవహారముల ప్రవేశించును. ఇంకొకప్పుడు తమోవృత్తియుక్తుడై యుండును. ఒకప్పుడు సంసారి; ఇంకొకప్పుడు శ్రుతిమార్గవిహారి. అహో, ఏమి ఆశ్చర్యము! అయినను వ్యామోహము నందకుండును. ౧౦

కదాచిత్ మౌనస్థః క్వచిదపి చ వాగ్వాదనిరతః
కదాచిత్ స్వానన్దే హసతి రభసా త్యక్తవచసా,
కదాచిల్లోకానాం వ్యవహృతిసమా లోకనపరో
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౧

కదాచిచ్ఛక్తీనాం వికచముఖపద్మేషు కమలాన్
క్షిపంస్తాసాం క్వాపి స్వయమపి చ గృహ్ణన్స్వ ముఖతః,
తదద్వైతం రూపం నిజపరవిహీనం ప్రకటయన్
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౨

క్వచిచ్ఛైవైః సార్థం క్వచిదపిచ శాక్తైః సహ రమన్
కదా విష్ణోర్భక్తైః క్వచిదపి చ సౌరైః సహ వసన్,
కదా గాణాపత్యైర్గత సకల భేదోఽద్వయతయా
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౩

గురుదీక్షవలన జ్ఞానమునందిన మౌని,ఒకప్పు డేమియును మాట్లాకుండును. మరొకప్పుడు వాగ్వాద మొనర్చును. ఇంకొకప్పుడు ఆత్మానంధపరవశుడై తొందరగా మాట్లాడును. ఇంకొకప్పుడు లోకుల వ్యవహారములను చూచు చుండును. అయినను ఎట్టిస్థితియందునను అతడు వ్యామోహము నందడు. ౧౧

గురుదీక్షను బొంది జ్ఞానియైన మౌని, ఒకప్పుడు పద్మములను శక్తి రూపిణులగు స్త్రీల ముఖపద్మములయం దుంచుచు (అనగా వారిని పూజించుచు) మరియొకప్పుడు ఆపద్మములనే తన ముఖమున నుంచుకొనుచు (అనగా తన్ను పూజించుకొనుచు) స్వపర భేదరహితమును, స్త్రీ పురుష లింగాతీతమును అగు అద్వైతభావమును ప్రదర్శించుచు వ్యామోహము నందకుండును. ౧౨

గురువునుండి దీక్షను గ్రహించుటవలన తమమును దూర మొనర్చుకొనిన మౌని, ఒకప్పుడు శైవులతోడను, మరొకప్పుడు శాక్తులతోడను, ఇంకొకప్పుడు వైష్ణవులతోడను, అన్యసమయముల గాణపత్యులతోడను వినోదించుచు, అద్వయబ్రహ్మస్వరూపమును గ్రహించినవా డగుటవలన భేదరాహిత్యమునంది వ్యామోహము నందకుండును. ౧౩

నిరాకారం క్వాపి క్వచిదపి చ సాకారమమలం
నిజం శైవం రూపం వివిధగుణభేదేన బహుధా,
కదాశ్చర్యం పశ్యన్ కిమిదమితి హృష్యన్నపి కదా
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౪

కదా ద్వైతం పశ్యన్నిఖిలమపి సత్యం శివమయం
మహావాక్యార్థానా మవగతి సమభ్యాస వశతః,
గతద్వైతాభాసః శివ శివ శివేత్యేవ విలపన్
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః. ౧౫

ఇమాం ముక్తావస్థాం పరమశివసంస్థాం గురుకృపా
సుధాపాఙ్గావాప్యాం సహజసుఖవాప్యా మనుదినమ్,
ముహుర్మజ్జన్ మజ్జన్ భజతి సుకృతీ చేన్నరవర -
స్తదా యోగీ త్యాగీ కవిరితి వదన్తీహ కవయః. ౧౬

గురుదీక్షను బొంది జ్ఞానియైన మౌని, వివిధసమయములలో వివిధరీతులుగ నిరాకారసాకారములను, గుణభేదములతో నొప్పారు నిజస్వరూపమును ఆశ్చర్యముతో పరికించుచు, "ఇదేమి" అని ఆనందించుచు, ఎన్నడును మోహము నందకుండును. ౧౪

గురుదీక్షనుబొంది జ్ఞానియైన మౌని, ఒకప్పుడు ద్వైతవస్తువులను వీక్షించినను, శివస్వరూపమే సత్యమను మహావాక్యార్థమును అభ్యాసమువలన గ్రహించి, ద్వైతాభాసనువీడి "శివా! శివా! శివా!" అని మాత్రమే ఉచ్చరించుచు మోహము నందకుండును. ౧౫

పుణ్యాత్ముడును, నరశ్రేష్ఠుడును అగువాడు గురుకృపాసుధా - కటాక్షమను సరోవరమున-ఇదియే సహజసుఖమగు బ్రహ్మసరోవరము-ప్రతిదినము మాటిమాటికి గ్రుంకులిడుచు, పరమశివస్వరూపమగు ఈముక్తావస్థను సేవించుచో; అతనినే పండితులు యోగియనియు, త్యాగియనియు, కవియనియు నుడువుదురు. ౧౬

మానే మానీ గుణిని గుణవాన్ పణ్డితే పణ్డితశ్చ
దీనే దీనః సుఖిని సుఖవాన్ భోగిని ప్రాప్తభోగః,
మూర్ఖే మూర్ఖో యువతిషు యువా వాగ్మిని ప్రౌఢవాగ్మీ
ధన్యః కోఽపి త్రిభువనజయీ యోఽవధూతేఽవధూతః. ౧౭

ఇతి శ్రీ శఙ్కర భగవత్పూజ్యపాద విరచిత జీవన్ముక్తానన్ద లహరీ ॥౧౩॥

ఎవడు మౌనవ్రతధారులకడ మౌనియై, గుణవంతులలో గుణియై, పండితులలో, పండితుడై, దీనులలో దీనుడై, సుఖాత్ములలో సుఖాత్ముడై, భోగులలో భోగియై, మూర్ఖులలో మూర్ఖుడై, యువతులలో యువకుడై, వక్తలలో ప్రౌఢవక్తయై, సన్న్యాసులలో సన్న్యాసియై మెలగగలుగునో, ఆ ధన్యుడే త్రిభువనములను జయించినవాడగును. ౧౭

ఇతి జీవన్ముక్తానందలహరి ఆంధ్రానువాదము ॥౧౩॥

# ౧౪ తత్త్వోపదేశః

తత్త్వం పదార్థశుద్ధ్యర్థం గురుః శిష్యం వచోఽబ్రవీత్,
వాక్యే తత్త్వమసీత్యత్ర త్వం పదార్థం వివేచయ. ౧

న త్వం దేహోఽసి దృశ్యత్వాదుపజాత్యాదిమత్త్వతః,
భౌతికత్వా దశుద్ధత్వా దనిత్యత్వాత్ తథైవచ. ౨

అదృశ్యో రూపహీనస్త్వం జాతిహీనోఽప్యభౌతికః,
శుద్ధనిత్యోఽపి దృగ్రూపో ఘటో యద్వన్న దృగ్భవేత్.

న భవానింద్రియాణ్యేషాం కరణత్వేన యా శ్రుతిః,
ప్రేరకస్త్వం పృథక్ తేభ్యో న కర్తా కరణం భవేత్. ౪

గురువు శిష్యునితో ఇట్లనెను: 'తత్త్వమసి' [తత్, త్వమ్, అసి_అది నీవు, అగుదువు] అను శ్రుతి [ఉపనిషద్] వాక్యము నందలి 'తత్, త్వం' పదములు ప్రతిపాదించు అర్థమును నిర్ణయించుటకుగాను, మొదట 'త్వం' పద_అర్థమును వివేకింపుము అనగా శరీరాదులనుండి ఆత్మ వేరని గ్రహింపుము. ౧

త్వం _ పదప్రతిపాద్యుడవగు నీవు శరీరమవు కావు. ఏలయన దృశ్యమును, జడమును, బ్రాహ్మణత్వాది అవాంతరజాతియుక్తమును, పంచభూత నిర్మితమును, అశుద్ధమును, అనిత్యమునుగూడ అయియున్నది. ౨

[త్వం _పద ప్రతిపాద్యుడవగు] నీకు రూపము లేదు; జాతి లేదు; నీవు పంచభూత సంభూతుడవు కావు. నీవు శుద్ధుడవు, నిత్యుడవు, జ్ఞానరూపుడవు. ఘటాదులవలె, శరీరముకూడ జ్ఞానస్వరూపము కాదు, ౩

[త్వం _ ప్రతిపాద్యుడవగు] నీవు ఇంద్రియములు కూడ కాదు. శ్రుతి ఇంద్రియములను కరణము [పని చేయునవి]లని చెప్పుచున్నది. కనుక నీవు వాని కంటె వేరు. నీవు ప్రేరకుడవు మాత్రమే. కర్త ఎన్నటికిని కరణము కాదు. ౪

నానైతాన్యేకరూపస్త్వం భిన్నస్తేభ్యః కుతః శృణు,
న చైకేంద్రియరూపస్త్వం సర్వత్రాహం ప్రతీతితః. ౫
న తేషాం సముదాయో౽సి తేషామన్యతమస్య చ,
వినాశే౽ప్యాత్మధీస్తావదస్తి సా నైవమన్యథా. ౬
ప్రత్యేకమపి తాన్యాత్మా నైవ తత్ర వచః శృణు,
నానాస్వామికదేహో౽యం నశ్యేద్భిన్నమతాశ్రయః. ౭
నానాత్మాభిమతం నైవ విరుద్ధవిషయత్వతః,
స్వామ్యైక్యే తు వ్యవస్థా స్యాద్దేశపార్థివదేశవత్, ౮
న మనస్త్వం న వా ప్రాణో జడత్వాదేవ చైతయోః,
గతమన్యత్ర మే చిత్తమిత్యన్యత్వానుభూతితః. ౯

ఇంద్రియములు పెక్కు; నీవు ఏకరూపుడవు. కనుక నీవు వాటికంటె భిన్నుడవు. కారణమేమియో వినుము. సర్వత్ర "నేను" అని స్ఫురణ కలుగుచుండుటవలన, నీవు ఒకే ఇంద్రియమ వెట్లగుదువు? కాజాలవు. ౫

ఇంద్రియ సముదాయముకూడ నీవు కాదు. కాక దానిలో ఏఒక్కటియునుగూడ నీవు కాదు. ఇంద్రియములు నష్టమైనను "నేను" అను ఆత్మజ్ఞానము అవ్యాహతముగనే యుండును. కానిచో, "నేను చూచితిని, ఆ నేనే స్మరించుకొనుచుంటిని" అను అనుభవము కలుగదు. ౬

ఆయా ఇంద్రియములలో ప్రతి ఒకటియును ఆత్మ యనుటకు వీలు లేదు. ఈవిషయమున యుక్తి వినుము: అట్లగుచో పలువురు యజమానులుగల ఈ శరీరము వివిధములగు అభిప్రాయములను అనుసరించిన, నశించును. ౭

ఈదేహమునకు ప్రభువులు పెక్కుమంది యగుచో, వారికి అభిప్రాయ భేదము కలుగును. కనుక నానాత్మను ఏవాదియును అంగీకరింపడు. రాజు ఒక్కడేయైన దేశమున ఏర్పాట్లుచక్కగనుండునట్లు, ఈశరీరవిషయమునగూడ.

నీవు మనస్సువు కాదు, ప్రాణమును కాదు. ఏలయన ఈరెండును జడ పదార్థములు. "నామనస్సు ఎచ్చటికో ఏగినది" అను అనుభవమువలన మనస్సు కంటె ఆత్మ వేరు. ౯

క్షుత్ తృడ్భ్యాం పీడితః ప్రాణో మయాయం చేతి భేదతః,
తయోర్ద్రష్టా పృథక్ తాభ్యాం ఘటద్రష్టా ఘటాద్ యథా.
సుప్తౌ లీనాస్తి యా బోధే సర్వం వ్యాప్నోతి దేహకమ్,
చిచ్ఛాయయా చ సమ్బద్ధా న స బుద్ధిర్భవాన్ ద్విజ. ౧౧
నానారూపవతీ బోధే సుప్తౌ లీనాతిచఞ్చలా,
యతో దృగేకరూపస్త్వం పృథక్ తస్య ప్రకాశకః. ౧౨
సుప్తౌ దేహాద్యభావేఽపి సాక్షీ తేషాం భవాన్ యతః,
స్వానుభూతిస్వరూపత్వాన్నాన్యస్తస్యాస్తి భాసకః. ౧౩
ప్రమాణం బోధయన్తం తం బోధం మానేన యే జనాః,
బుభుత్సన్తే త ఏధోభిర్దగ్ధుం వాఞ్ఛన్తి పావకమ్. ౧౪

కుండ కంటె కుండను జూచువాడు వేరైనట్లు: "నా ప్రాణము ఆకలి దప్పులవలన పీడింపబడినది." అను భేదజ్ఞానము కలుగుచుండుటవలన, ఈ పీడితప్రాణమునకు ద్రష్టయగు ఆత్మ, ప్రాణముకంటె భిన్నము. ౧౦

ద్విజుడా ! సుషుప్తికాలమున లయమంది, జాగ్రదవస్థయందు చైతన్య బింబసమన్వితమై, సమస్త శరీరమును వ్యాపించియుండు బుద్ధికూడ నీవు కాదు.

మేలుకొని యున్నప్పుడు బుద్ధి నానా రూపములను ధరించుచు, అతి చంచల మగుచున్నది. నిద్రించునప్పుడు కారణమున లీనమగుచున్నది. (ఈ పరిస్థితుల వెంటని పరికించుచు) నీవు దృక్కువై, బుద్ధిని ప్రకాశింపజేయుచు, బుద్ధి కంటె వేరుగ నున్నావు. కనుక, బుద్ధి ఆత్మ కాజాలదు. ౧౨

సుషుప్తికాలమున దేహాదులకు అభావము ఘటిల్లినను నీవు వానికి సాక్షివి కనుక నీవు అనుభూతిస్వరూపుడవు. నీవుగాక దేహాదులను ప్రకాశింపజేయువా రెవ్వరును లేరు. ౧౩

బోధయే ప్రమాణమును అవబోధిత మొనర్చుచున్నది. ప్రమాణమువలన బోధ నెరుగగోరువారు, కాష్ఠములతో నగ్నిని దహింప గోరుచున్నారు. ౧౪

విశ్వమాత్మానుభవతి తేనాసౌ నానుభూయతే,
విశ్వం ప్రకాశయత్యాత్మా తేనాసౌ న ప్రకాశ్యతే. ౧౫

ఈదృశం తాదృశం నైతన్న పరోక్షం సదేవ యత్,
తద్బ్రహ్మ త్వం న దేహాదిదృశ్యరూపోఽసి సర్వదృక్. ౧౬

ఇదన్తేనైవ యద్భాతి సర్వం తచ్చ నిషిధ్యతే,
అవాచ్యతత్త్వమనిదం న వేద్యం స్వప్రకాశతః. ౧౭

సత్యం జ్ఞానమనన్తఞ్చ బ్రహ్మలక్షణముచ్యతే,
సత్యత్వాజ్జ్ఞానరూపత్వాదనన్తత్వాత్ త్వమేవ హి. ౧౮

విశ్వమునే ఆత్మ ఎరుగుచున్నది కాని, విశ్వము ఆత్మను అనుభవించుట లేదు. ఆత్మయే విశ్వమును ప్రకాశింప జేయుచున్నది. కాని, విశ్వమువలన ఆత్మ ప్రకాశిత మగుచుండుట లేదు. ౧౫

"ఇట్టిది అట్టిది" అని చెప్పుటకు వీలు కానిదియును, పరోక్షము కానిదియును, సత్స్వరూపమే యగునదియును, ఏదికలదో, అదియే బ్రహ్మము. అదియే నీవుకాని దేహాదిదృశ్యరూపుడవు కావు. నీవు సకలమునకును ద్రష్టవు.

ఏది ఇదంతా (ఇది, ఇది అను) రూపమున ప్రకాశిత మగుచున్నదో అది నిషేధింప బడుచున్నది. అది బ్రహ్మము కాదు. ఇదియని వాక్కుతో చెప్పుటకు వీలుకానిదియును, ఇదియని ప్రతిపాదింప బడనిదియును, బుద్ధితో ఎరుగ బడనిదియును, స్వప్రకాశస్వరూప మగునదియును అగు వస్తువే బ్రహ్మము. [బ్రహ్మము అవాఙ్మానసగోచరము.] ౧౭

బ్రహ్మము సత్యజ్ఞానానంత లక్షణముగా చెప్పబడుచున్నది. సత్యత్వ, జ్ఞానరూపత్వ, అనంతత్వ - కారణముగ నీవే ఆ బ్రహ్మమవు. ౧౮

ఇతి దేహాద్యుపాధేః స్యాజ్జీవ స్తస్య నియామకః,
ఈశ్వరః శక్త్యుపాధిత్వాత్ ద్వయోర్బోధే స్వయంప్రభా. ౧౯
అపేక్షతేఽఖిలైర్మానైః న యన్మాన మపేక్షతే,
వేదవాక్యం ప్రమాణం తద్బ్రహ్మాత్మావగతౌ మతమ్. ౨౦
అతో హి తత్త్వమస్యాది వేదవాక్య ప్రమాణతః,
బ్రహ్మణోఽస్తి యయా యుక్త్యా సాస్మాభిః సంప్రకీర్త్యతే.
శోధితే త్వం పదార్థే హి తత్త్వమస్యాది చిన్తితమ్,
సమ్భవేన్నాన్యథా తస్మాచ్ఛోధనం కృతమాదితః. ౨౨
దేహేన్ద్రియాదిధర్మాన్ యః స్వాత్మన్యారోపయన్ మృషా,
కర్తృత్వాద్యభిమానీ చ వాచ్యార్థస్త్వం పదస్య సః. ౨౩

శరీరాదులగు ఉపాధులుండిన వానితోఁగల సంబంధము ననుసరించి బ్రహ్మమే, ఆ శరీరాదుల నియంతయగు జీవు డనబడును. మాయాశక్తి ఉపాధితోఁగల సంబంధము ననుసరించి బ్రహ్మమే ఈశ్వరుడు నాబడును. ఈ రెండును తొలగిపోయిన మిగులునది స్వయంప్రభయగు బ్రహ్మమే. ౧౯

సమస్త ప్రమాణములును దేనిని అపేక్షించుచున్నవో, ఏది ఏట్టి ప్రమాణమును అపేక్షింపదో, ఆ వేదవాక్యమే బ్రహ్మస్వరూపమగు ఆత్మావగతికి ప్రమాణము. ౨౦

కనుక బ్రహ్మవిషయమున 'తత్త్వమసి' మున్నగు వేదవాక్యములు ప్రమాణిత మొనర్పఁగోరి, ఏ యుక్తులను ప్రదర్శించెనో, వానినే మేమును జెప్పుచున్నాము. ౨౧

త్వం - పదార్థము శోధితమైనయెడలనే తత్త్వమస్యాది వాక్యచింత సంభవ మగును; అన్యథా కాజాలదు. కనుక మొదట ఆ శోధన మొనర్పబడుచున్నది. ౨౨

మిథ్యాభూతములగు శరీరేంద్రియ ధర్మములను ఆత్మయం దారోపించుకొని ఎవడు కర్తృత్వభోక్తృత్వాదులయం దభిమానమును వహించుచున్నాడో అతడే త్వం పదమునకు వాచ్యార్థము. ౨౩

దేహేన్ద్రియాదిసాక్షీ యస్తేభ్యో భాతి విలక్షణః,
స్వయంబోధస్వరూపత్వాల్లక్ష్యార్థస్త్వంపదస్య సః. ౨౪
వేదాన్తవాక్యసంవేద్య విశ్వాతీతాక్షరాద్వయమ్,
విశుద్ధం యత్స్వసంవేద్యం లక్ష్యార్థస్తత్పదస్య సః. ౨౫
సామానాధికరణ్యం హి పదయోస్తత్త్వయోర్ద్వయోః,
సమ్బన్ధస్తేన వేదాన్తైర్బ్రహ్మైక్యం ప్రతిపాద్యతే. ౨౬
భిన్నప్రవృత్తిహేతుత్వే పదయోరేకవస్తుని,
వృత్తిత్వం యత్తదేవైక్యం విభక్త్యన్తకయోస్తయోః. ౨౭
సామానాధికరణ్యం తత్సమ్ప్రదాయిభిరీరితమ్,
తథా పదార్థయోరేవ విశేషణవిశేష్యతా. ౨౮

శరీరేంద్రియాదులకు సాక్షియును, వానికంటె వేరుగ ప్రకాశించు వాడును. స్వయంబోధస్వరూపుడును అగువాడే త్వం పదమునకు లక్ష్యార్థము. ౨౪

వేదాంతవేద్యుడును, విశ్వాతీతుడును, అవినాశియును, అద్వితీయుడును, విశుద్ధుడును అగు స్వయంప్రకాశ స్వరూపుడే (ఈశ్వరుడే) తత్పదమునకు లక్ష్యార్థము. (౪౧-వ శ్లో. చూ) ౨౫

"తత్, త్వమ్-అది, నీవు" అను ఈరెండుపదములకును గల సంబంధము సామానాధికరణ్యము. కనుక వేదాంతవాక్యములవలన జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింప బడుచున్నది. ౨౬

ఏతావున విభిన్నరూపములగు రెండుపదములు ఒకే వస్తువును ప్రతిపాదించుచుండునో, అట్టి సమాన విభక్తియుక్తములును, ఏకార్థప్రతిపాదకములును అగు పదద్వయము సమానాధికరణ మనబడును. వాని సంబంధమే సామానాధికరణ్యము. "తత్, త్వం" అను ఈరెండు పదములకును ఈసంబంధమే కలదు. వేదాంతిసంప్రదాయజ్ఞుల అభిప్రాయమే ఇది. ఇట్టి పదములకు విశేష్య-విశేషణ సంబంధము కూడయుండును. ౨౭-౨౮

అయం సః సోఽయమితివత్ సమ్బన్ధో భవతి ద్వయోః,
ప్రత్యక్త్వం సద్వితీయత్వం పరోక్షత్వఞ్చ పూర్ణతా. ౨౯

పరస్పరవిరుద్ధం స్యాత్ తతో భవతి లక్షణా,
లక్ష్యలక్షణసమ్బన్ధః పదార్థ ప్రత్యగాత్మనోః. ౩౦

మానాన్తరోపరోధాచ్చ ముఖ్యార్థస్యాపరిగ్రహే,
ముఖ్యార్థస్యావినాభూతే ప్రవృత్తిర్లక్షణోచ్యతే. ౩౧

త్రివిధా లక్షణా జ్ఞేయా జహత్యజహతీ తథా,
అన్యోభయాత్మికా జ్ఞేయా తత్రాద్యా నైవ సమ్భవేత్. ౩౨

"అయం సః _ వీడే వాడు; సః అయం _ వాడే వీడు" అను వాక్యములలో ఏరీతిగ ఒకమారు 'అయం' పదము విశేష్యమును, 'సః' పదము విశేషణమును, ఇంకొకమారు 'సః' పదము విశేష్యమును, 'అయం' పదము విశేషణమును అగుచున్నవో, ఆరీతిగనే "తత్, త్వం" పదములకుగూడ విశేష్యవిశేషణసంబంధము. కాని, "తత్, త్వం" పదముల పరోక్షత్వ – ప్రత్యక్త్వములును, పూర్ణతా – పూర్ణతలును విరుద్ధధర్మములు అగుచున్నవి. కనుక, ఈ పదముల అర్థనిర్ణయమునకు గాను, ఐక్యసిద్ధికి గాను, లక్షణార్థమును గ్రహింపవలెను. అనగా, ఇట్టిపదముల వాచ్యార్థము అనగా తత్, త్వం ప్రతిపాదవస్తువునకును ప్రత్యగాత్మకును, లక్ష్యలక్షణసంబంధ మేర్పడును. అందు తత్, త్వం పద_ప్రతిపాద్యము వాచ్యార్థము, లక్షణ. ప్రత్యగాత్మ, లక్ష్యము. ౨౯_౩౦

అన్యప్రమాణమువలన ముఖ్యార్థము బాధితమైనపట్లు, ముఖ్యార్థముతో నుండు అవినాభావసంబంధమునే లక్షణ యందురు. ౩౧

లక్షణ మూడు విధములు: జహత్, అజహత్, జహదజహత్తు లని. వీనిలో మొదటిది ఇట అనువర్తింపదు. ౩౨

వాచ్యార్థమఖిలం త్యక్త్వా వృత్తిః స్యాద్ యయా తదన్వితే,
గఙ్గాయాం ఘోష ఇతివజ్జహతీ లక్షణా హి సా. 33

వాచ్యార్థస్యైకదేశస్య ప్రకృతే త్యాగ ఇష్యతే,
జహతీ సమ్భవేన్నైవ సమ్ప్రదాయవిరోధతః. 3౪

వాచ్యార్థమపరిత్యజ్య వృత్తిరన్యార్థకే తు యా,
కథితేయమజహతీ శోణోఽయం ధావతీతివత్. 3౫

న సమ్భవతి సోఽప్యత్ర వాచ్యార్థోఽతి విరోధతః,
విరోధాంశపరిత్యాగో దృశ్యతే ప్రకృతే యతః. 3౬

వాచ్యార్థము నంతటిని పరిత్యజించు వృత్తి జహల్లక్షణ. దీని అన్వయ విధానమిది. "గంగాయాం ఘోషః – గంగలో గొల్లపల్లె." (గంగలో గొల్లపల్లె ఉండదుకాన, గంగనే పరిత్యజించి, తీరమును గ్రహింపనగును.) 33

వాచ్యార్థముయొక్క ఒకభాగమును పరిత్యజించుటయే జహల్లక్షణ. అది సంప్రదాయమునకు విరోధముగ నుండుటవలన "తత్త్వమసి" యనుపట్ల కుదురదు. (ఈ రెంటి ముఖ్యార్థమును వదలి చైతన్యమాత్రమునే గ్రహింపవలసి యుండును.) 3౪

వాచ్యార్థమును పరిత్యజింపక అన్యార్థకమగు వృత్తిని గ్రహించుట అజహల్లక్షణ. ఉదాహరణ: "శోణో ధావతి – ఎరుపు పరుగిడు చున్నది." (ఎరుపు పరుగిడజాలదుగాన, శోణశబ్దవాచ్యార్థమగు ఎరుపును పరిత్యజింపకుండ, ఎఱ్ఱటిదియగు గుఱ్ఱము అని అర్థము చెప్పుకొనుట.) 3౫

"తత్ త్వమసి" యనుపట్ల విరోధాంశ – పరిత్యాగ – రూపమగు అజహల్లక్షణకూడ అనువర్తింపదు. ఈ రెండు పదముల వాచ్యార్థము అత్యంత విరుద్ధముగ నున్నది. 3౬.

వాచ్యార్థస్యైకదేశఞ్చ పరిత్యజ్యైకదేశకమ్,
యా బోధయతి సా జ్ఞేయా తృతీయా భాగలక్షణా.
సోఽయం విప్ర ఇదం వాక్యం బోధయత్యాదిత స్తథా,
తత్కాలత్వవిశిష్టఞ్చ తథైతత్కాల సంయుతమ్.
అత స్తయోర్విరుద్ధం తత్ తత్ కాలత్వాది ధర్మకమ్,
త్యక్త్వా వాక్యం యథా విప్రపిణ్డం బోధయతీరితమ్.
తథైవ ప్రకృతే తత్త్వమసీత్యత్ర శ్రుతౌ శృణు,
ప్రత్యక్త్వాదీన్ పరిత్యజ్య జీవధర్మాం స్త్వమః పదాత్.
సర్వజ్ఞత్వ పరోక్షాదీన్ పరిత్యజ్య తతః పదాత్,
శుద్ధం కూటస్థమద్వైతం బోధయత్యాదరాత్ పరమ్.

వాక్యార్థమునందలి ఒకభాగమును విడచి, ఇంకొకభాగమును బ సదియే మూడవదయగు భాగలక్షణ. (జహదజహల్లక్షణ)

(ఉదాహరణ:) "సోఽయం విప్రః - ఆ బ్రాహ్మణుడే ఇతడు" పట్ల: మొదట "సః - ఆతడు, ఆ" అను పదము (నేను పూర్వ చూచియుండిన) కాలవైశిష్ట్యమును, "అయం - ఇతడు" అను పదము (నేను చూచుచుండిన) ఈ కాలవైశిష్ట్యమును దెల్పుచున్నవి.

కనుక "ఆతడే ఈ విప్రుడు" అను వాక్యమున ఆయా కా సంబంధించిన విరుద్ధధర్మములను పరిత్యజించి బ్రాహ్మణవ్యక్తినే తెలుపు (లేనిచో ఒకరు ఇంకొకరు కాజాలరు కదా!)

అట్లే ఈ సందర్భమున "తత్త్వమసి" అను శ్రుతివాక్య విష గూడ (భాగలక్షణ యగును.) వినుము. త్వం - పదవాచ్యుడగు జీవుని లగు ప్రత్యక్త్వ మున్నగువానిని విడచి, తత్ - పదప్రతిపాద్యుడగు రుని సర్వజ్ఞత్వము, పరోక్షత్వము మున్నగు ధర్మములను విడచి శ్రుతి పూర్వకముగ శుద్ధమును, కూటస్థమును అగు అద్వైత వస్తువునే మున్నది.

తత్త్వమోః పదయోరైక్యమేవ తత్త్వమసీత్యలమ్,
ఇత్థమైక్యావబోధేన సమ్యగ్జ్ఞానం దృఢం నయైః. ౪౨
అహం బ్రహ్మేతి విజ్ఞానం యస్య శోకం తరత్యసౌ,
ఆత్మా ప్రకాశమానోఽపి మహావాక్యైస్తథైరతా. ౪౩
తత్త్వమోర్బోధ్యతేఽథాపి పౌర్వాపర్యానుసారతః,
తథాపి శక్యతే నైవ శ్రీగురోః కరుణాం వినా. ౪౪
అపరోక్షయితుం లోకా మూఢైః పణ్డితమానిభిః,
అన్తఃకరణసంశుద్ధౌ స్వయం జ్ఞానం ప్రకాశతే. ౪౫
వేదవాక్యైరతః కిం స్యాద్ గురుణాతి న సామ్ప్రతమ్,
ఆచార్యవాన్ పురుషో హి వేదేత్యేవం శ్రుతిర్జగౌ. ౪౬

ఈ రీతిగ 'తత్త్వమసి' వాక్యము "తత్ త్వం" పదముల ఐక్యమును ప్రస్తావించుచున్నది. (దీనిని విని) ఐక్యజ్ఞానమును బడసిన అనంతరము యుక్తి (మననము) వలన దృఢమగును. ౪౨

'నేనే బ్రహ్మమను' అను జ్ఞానమును బొందినవాడు శోకమును అతిక్రమించును. ఆత్మ స్వయంప్రకాశస్వరూపము. అయినను మహావాక్యములు పూర్వాపరముల ననుసరించి, "తత్ త్వం" పదముల ఐక్యమును బోధించుచున్నవి. తమ్ము పండితులుగా ఎన్నుకొని అహంకారమునందు మూఢులకు, ఆత్మ ప్రత్యక్షము కాదు. శ్రీ గురుకరుణ ఆవశ్యకము. అంతఃకరణశుద్ధి యుండవలెను. అప్పుడే ఈ జ్ఞానము స్వయముగ ప్రకాశించును. ౪౩ _ ౪౫

"వేదవాక్యముల వలననే జ్ఞానము లభించును. గురువుతో ఏమి ప్రయోజనము?" అని ఎంచకూడదు. "ఆచార్యవంతుడగు (గురువుగల) పురుషుడే ఎరుగును" అని శ్రుతియే చెప్పుచున్నది. ౪౬

అనాదావిహ సంసారే బోధకో గురురేవ హి,
అతో బ్రహ్మాత్మవస్త్వైక్యం జ్ఞాత్వా దృశ్యమసత్తయా. ౪౮
అద్వైతే బ్రహ్మణి స్థేయం ప్రత్యగ్బ్రహ్మాత్మనా సదా,
తత్ ప్రత్యక్షాత్ పరిజ్ఞాతమద్వైతం బ్రహ్మచిద్ఘనమ్. ౪౯
ప్రతిపాద్యం తదేవాత్ర వేదాన్తైర్న ద్వయం జడమ్,
సుఖరూపం చిదద్వైతం దుఃఖరూపమసజ్జడమ్. ౪౯
వేదాన్తైస్తద్ద్వయం సమ్యక్ నిర్ణీతం వస్తుతో నయాత్,
అద్వైతమేవ సత్యం త్వం విద్ధి ద్వైతమసత్ సదా. ౫౦
శుద్ధే కథమశుద్ధః స్యాద్ దృశ్యం మాయామయం తతః,
శుక్తౌ రూప్యం మృషా యద్వత్ తథా విశ్వం పరాత్మని.

అనాదియును (అపారమును) అగు ఈ సంసారమున బోధకుడు గురువొక్కడే. బ్రహ్మాత్మైక్యమును గురువువలన నెరిగి దృశ్యవస్తువులను మిథ్యారూపముగ భావించి అద్వైతబ్రహ్మమున ప్రత్యక్ బ్రహ్మముగ నెలకొని యుండదగును. ఆత్మసాక్షాత్కారమున చిద్ఘనరూపియగు అద్వైతబ్రహ్మము ఎరుకకు వచ్చును. ౪౮ - ౪౯

సర్వవేదాంత (ఉపనిషత్) ప్రతిపాద్యమాయద్వైతబ్రహ్మమే - ద్వైతమును జడమును బోధించుట లేదు. జ్ఞానస్వరూపముగు అద్వితీయబ్రహ్మము ఆనందస్వరూపము; జడరూపమగు ద్వైతవస్తువులు మిథ్యయును దుఃఖరూపములును. ౪౯

ఉపనిషత్తులు చిజ్జడస్వరూపమును యుక్తియుక్తముగ నిర్ణయించినవి. నీవు సర్వదా అద్వైతబ్రహ్మమును సత్యముగను, ద్వైతవస్తువును మిథ్యగను గ్రహింపుము. ౫౦

శుద్ధవస్తువున అశుద్ధవస్తు వెట్లుండగలదు ? కనుక, దృశ్యజగత్తు మాయామయము అనగా, మిథ్య. శుక్తియందు రజతము మిథ్యయైనట్లు, పరమాత్మయందు జగత్తు మిథ్య. ౫౧

విద్యతే న స్వతః సత్త్వం నాసతః సత్త్వమస్తి వా,
బాధ్యత్వాన్నైవ సద్ద్వైతం నాసత్ ప్రత్యక్షభానతః. ౫౨

సదసన్న విరుద్ధత్వాదతోఽనిర్వాచ్యమేవ తత్,
యః పూర్వమేక ఏవాసీత్ సృష్ట్వా పశ్చాదిదం జగత్. ౫౩
ప్రవిష్టో జీవరూపేణ స ఏవాత్మా భవాన్ పరః,
సచ్చిదానన్ద ఏవ త్వం విస్మృత్యాత్మతయా పరమ్. ౫౪
జీవభావమనుప్రాప్తః స ఏవాత్మాపి బోధతః,
అద్వయానన్దచిన్మాత్రః శుద్ధః సామ్రాజ్యమాగతః. ౫౫
కర్తృత్వాదీని యాన్యాసంస్త్వయి బ్రహ్మాద్వయే పరే,
తానీదానీం విచార్య త్వం కిం స్వరూపాణి వస్తుతః. ౫౬

స్వాభావికముగనే జగత్తునకు నైజమగు సత్త్వము లేదు. అసద్వస్తువునకు సత్త్వ మెట్లుండును? బాధితమగుచుండుటవలన, ద్వైతము సత్యముకాదు. కాక, (శశశృంగాదులవలె) అసత్తు అనగా అలీకమును గాదు. ఏలయన, ద్వైతమునకు ప్రత్యక్షభావము కలదు. ౫౨

జగత్తు సదసత్స్వరూపమును కాదు. ఏలయన, అవి విరుద్ధములు. కనుక అనిర్వాచ్యము. పూర్వ మెవడేకమాత్రుడై యుండెనో, అతడే తరువాత ఈజగత్తును సృష్టించి, జీవరూపమును దాల్చి ప్రవేశించెను. నీవే అట్లు ప్రవేశించిన పరమాత్మవు. నీవు సచ్చిదానంద స్వరూపుడవు. నీవు నీ పరమాత్మ భావమును విస్మరించి, జీవత్వమును బొందినాడవు. జ్ఞానము లభించిన, నీ వా అద్వితీయానంద చిత్స్వరూపశుద్ధ సామ్రాజ్యమును బొందిన పరమాత్మ స్వరూపుడవే యగుదువు. ౫౩_౫౫

అద్వితీయబ్రహ్మస్వరూపుడవగు నీయందే కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు (జీవుడనని భావించినప్పుడు) ఉండెనో, వానిని ఇప్పుడు విచారించి చూడుము:_ వాస్తవమునకు వీని స్వరూప మేమి? ౫౬

అత్రైన శృణు వృత్తాన్తమపూర్వం శ్రుతిభాషితమ్,
కశ్చిద్ గాన్ధారదేశీయో మహారత్నవిభూషితః. ౫౭
స్వగృహే స్వాఙ్గణే సుప్తః ప్రమత్తః సన్ కదాచన,
రాత్రౌ చౌరః సమాగత్య భూషణానాం ప్రలోభతః. ౫౮
బద్ధ్వా దేశాన్తరం చౌరైర్నీతః సన్ గహనే వనే,
భూషణాన్యపహృత్యాపి బద్ధాక్షకరపాదకః. ౫౯
నిక్షిప్తో విపినేఽతీవకుశకణ్టకవృశ్చికైః,
వ్యాలవ్యాఘ్రాదిభిశ్చైవ సఙ్కులే తరుసఙ్కులే. ౬౦
వ్యాలాదిదుష్టసత్త్వేభ్యో మహారణ్యే భయాతురః,
శిలాకణ్టక దర్భాద్యైర్దేహస్య ప్రతికూలకైః. ౬౧
క్రియమాణే విలుఠనే విశీర్ణాఙ్గోఽసమర్థకః,
క్షుత్తృషాతప వాయ్వగ్న్యాదిభిస్తప్తోఽతితాపకైః. ౬౨

ఈ సందర్భమున శ్రుతి నుడివిన అపూర్వ వృత్తాంతమును వినుము. గాంధారదేశీయుడగు ఒకానొక వ్యక్తి ఒకప్పుడు అమూల్యరత్నములతో నలంకరించుకొని నిజగృహప్రాంగణమున ఏమరి నిద్రించుచుండెను. రాత్రివేళ దొంగలు వచ్చి, అలంకారములయందలి ఆశచే అతనిని కట్టి దేశాంతరమునకు గొనిపోయిరి. భూషణములను అపహరించి, అతని కళ్లను కాలుసేతులను గట్టివైచి, అత్యంతము కుశకంటకములతోను, వృశ్చిక సర్ప వ్యాఘ్రములతోడను నిండిన, నిబిడారణ్యమున పారవైచి వెడలిపోయిరి. ౫౭-౬౦

నిబిడారణ్యమున సర్పాది దుష్టజంతుభయమున ఆతురుడై, శరీరప్రతికూలములగు శిలాకంటకావృతస్థానమున శయనించుటవలన శరీరాంగములు విశీర్ణములును, శక్తిరహితములును నయ్యెను. అత్యంత దుఃఖప్రదములగు ఆకలిదప్పులును, ఎండయును, గాలియును, నిప్పును మున్నగునవి తాపము నొసగుచుండెను. ౬౧-౬౨

బద్ధముక్తో తథా దేశప్రాప్త్యావేన సుదుఃఖధీః,
దదృశే కఞ్చిదాక్రోశన్నైకం తత్రైవ తస్థివాన్. ౬౩
తథా రాగాదిభిర్వైరైః శత్రుభిర్దుఃఖదాయిభిః,
చోరైర్దేహాభిమానాద్యైః స్వానన్దధనహారిభిః. ౬౪
బ్రహ్మానన్దే ప్రమత్తః స్వాజ్ఞాననిద్రావశీకృతః,
బద్ధస్త్వం బన్ధనైర్భోగతృష్ణాజ్వరాదిభిర్దృఢమ్. ౬౫
అద్వయానన్దరూపాత్ త్వాం ప్రచ్యావ్యాతీవ ధూర్తకైః,
దూరానీతోఽసి దేహేషు సంసారారణ్యభూమిషు. ౬౬
సర్వదుఃఖనిదానేషు శరీరాదిత్రయేషు చ,
నానాయోనిషు కర్మాన్ధవాసనానిర్మితాసు చ. ౬౭

అక్కడనుండి ఆవ్యక్తి బంధముక్తుడై స్వదేశమునకు వెళ్లుటకుగాను, అత్యంతదుఃఖితచిత్తమున ఉచ్చైఃస్వరమున రోదించపొడగెను. కాని ఎవ్వరును కనిపించలేదు. ౬౩

అట్లే నీవును బ్రహ్మానందము నవధరించక, అజ్ఞాన నిద్రావశీభూతుడవైతివి. దుఃఖప్రదులగు రాగద్వేషాది శత్రువులు, స్వాత్మానందధనము నపహరించిరి. శరీరాభిమానమను చోరుడే, భోగతృష్ణాదిరూపమగు బంధమున నిన్ను బంధించినాడు. ౬౪-౬౫

ధూర్తులగు చోరులు గాంధారదేశస్థుని అతిదూరవనమునకు గొనిపోయినట్లు, రాగాదులు నిన్ను అద్వితీయానందస్వరూపమునుండి భ్రష్టుని జేసి, శరీరమను దూరదేశమునకు, సంసారారణ్యమునకు తీసికొనివచ్చినవి. ౬౬

సర్వదుఃఖములకును కారణము స్థూలసూక్ష్మకారణ శరీరములు. ఈ మూడిటియందును, (లేక, శరీరేంద్రియాంతఃకరణములయందునను) కర్మను

ప్రవేశితోఽసి స్రష్టోఽసి బద్ధః స్వానన్దదృప్తితః,
అనాదికాలమారభ్య దుఃఖంచానుభవన్ సదా. ౬౮

జన్మ మృత్యు జరాదోష నరకాది పరమ్పరామ్,
నిరన్తరం విషణ్ణోఽనుభవన్నత్యన్త శోకవాన్. ౬౯

అవిద్యాభూతబన్ధస్య నివృత్తౌ దుఃఖదస్య చ,
స్వరూపానన్దసంప్రాప్తౌ సతోఽప్యుపాయం న లబ్ధవాన్. ౭౦

యథా గాంధారదేశీయశ్చిరం దైవాద్దయాలుభిః,
కైశ్చిత్ పాన్థైః పరిప్రాప్తైర్నేత్రదృష్ట్యాదిబన్ధనః. ౭౧

నకును, అజ్ఞానమునకును సంబంధించిన సంస్కారమువలన నిర్మింపబడిన నానా విధయోనులందు నీవు ప్రవేశించితివి. ఇట్లు (నీవు నిన్ను) సృష్టించుకొని, ఆనందలోభమున బద్ధుడవైతివి. అనాదికాలమునుండి సర్వదా దుఃఖము ననుభవించుచుంటివి. జన్మమృత్యుజరా నరకముల బొందుచు విషణ్ణుడవగుచున్నావు. దుఃఖప్రదమగు అవిద్యయొక్క నివృత్తియును, స్వరూపానంద ప్రాప్తియును లభించెడు మార్గమును కనుగొన జాలకుంటివి. ౬౭ - ౭౦

ఏరీతిగా ఆగాంధారనివాసి చాలకాల మట పడియుండి, అదృష్ట వశమున ఆ మార్గమున బోవువారును, దయాళులును అగు వ్యక్తులవలన నేత్రాది బంధనమునుండి ముక్తినంది స్వస్థచిత్తులగు పాంధులవలన ఉపదిష్టుడై పండితుడును, మేధావియును, నిశ్చితమతియును, పథకుశలుడును అగుచు గ్రామము నుండి గ్రామాంతరమును జేరుకొనుచు నిజగృహమును బ్రవేశించి బంధుగులవలన కౌగిలింపబడి పూర్వమువలెనే సుఖముగ నుండునో ఆ రీతిగనే నీవును దుఃఖ ప్రదములగు బహుజన్మముల పరిభ్రమించి అనంతరము అదృష్టవశమున శుభప్రద మగు ఉపాయమున శ్రద్ధనుబూని, ఉత్తమకర్మముల ననుష్ఠించుచు వర్ణాశ్రమ ధర్మపరాయణుడవై దానివలన లభించిన పుణ్యబలమున మహోన్నతినంది, ఈశ్వరానుగ్రహమున బ్రహ్మవేత్తయగు గురువునుబొంది, యథాశాస్త్రము సన్న్యసించినవాడును, వివేకాది గుణసంపన్నుడును అగు ఆ గురువునుండి నేడు

స స్వస్థైరుపదిష్టశ్చ పణ్డితో నిశ్చితాత్మకః,
గ్రామాద్ గ్రామాన్తరం గచ్ఛన్మేధావి మార్గతత్పరః. ౭౨
గత్వా గాన్ధారదేశం స స్వగృహం ప్రాప్య పూర్వవత్,
బాన్ధవైః సమ్పరిష్వక్తః సుఖి భూత్వా స్థితోఽభవత్. ౭౩
త్వమప్యేవమనేకేషు దుఃఖదాయిషు జన్మసు,
భ్రాన్తో దైవాచ్ఛుభే మార్గే జాతశ్రద్ధః సుకర్మకృత్. ౭౪
వర్ణాశ్రమాచారపరోఽవాప్తపుణ్యమహోదయః,
ఈశ్వరానుగ్రహాల్లబ్ధో బ్రహ్మవిద్ గురుసత్తమః. ౭౫
విధివత్ కృతసన్న్యాసో వివేకాదియుతః సుధీః,
ప్రాప్తో బ్రహ్మోపదేశోఽద్య వైరాగ్యాభ్యాసతః పరమ్.
పణ్డితస్తత్ర మేధావీ యుక్త్యా వస్తువిచారయన్,
నిదిధ్యాసన సమ్పన్నః ప్రాప్తో హి త్వం పరం పదమ్. ౭౬
అతో బ్రహ్మాత్మవిజ్ఞాన ముపదిష్టం యథావిధి,
మయాచార్యేణ తే ధీర సమ్యక్ తత్ర ప్రయత్నవాన్. ౭౭
భూత్వా విముక్తబన్ధస్త్వం భిన్నద్వైతాత్మసంశయః,
నిర్ద్వంద్వో నిస్పృహో భూత్వా విచరస్వ యథాసుఖమ్.

బ్రహ్మోపదేశమును బొందితివి. కేవలము వైరాగ్యము నభ్యసించుటవలననే పండితుడవును, మేధావియును అగు నీవు యుక్తివలన వస్తువిచార మొనర్చి, ధ్యానపరాయణుడవై పరమపదమును (ముక్తిని) బొందినావు. ౭౧ - ౭౬

ధీరుడా! ఆచార్యుడనగు నేను నీకు యథావిధిగ బ్రహ్మాత్మవిజ్ఞానమును ఉపదేశించినాను. నీవు ఇక నీ ప్రయత్నప్రాబల్యమున బంధముక్తుడవు కమ్ము. ద్వైతసందేహమును బోగొట్టుకొనుము. నిర్ద్వంద్వుడవు, నిష్కాముడవునయి యథాసుఖము విహరింపుము. ౭౭ - ౭౮

వస్తుతో నిష్ప్రపఞ్చోసి నిత్యాముక్తః స్వభావతః,
న తే బన్ధవిమోక్షౌ స్తః కల్పితౌ తే యతస్త్వయి. ౮

న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేష పరమార్థతా. ౮

శ్రుతిసిద్ధాన్తసారోఽయం తథైవ త్వం స్వయా ధియా,
సంవిచార్య నిదిధ్యాస్య నిజానన్దాత్మకం పరమ్ ౮

సాక్షాత్కృత్వాఽపరిచ్ఛిన్నాద్వైతబ్రహ్మాక్షరం స్వయమ్,
జీవన్నేవ వినిర్ముక్తో విశ్రాన్తః శాన్తిమాశ్రయ. ౮

విచారణీయా వేదాన్తా వన్దనీయో గురుః సదా,
గురూణాం వచనం పథ్యం దర్శనం సేవనం నృణామ్. ౮

యథార్థమునకు నీవు ప్రపంచాతీతుడవు. నీవు స్వాభావికముగనే ని
ముక్తస్వరూపుడవు. నీయందు బంధమోక్షములు లేవు. ఏలయన, (బ్ర
స్వరూపుడవగు) నీయందు అవి కల్పితములు.

నిరోధము లేదు, ఉత్పత్తి లేదు. బద్ధుడు లేడు, సాధకుడును లే
ముముక్షువు లేడు, ముక్తుడును లేడు_ ఇదియే పరమార్థదృష్టి. (అనగా ఉ
దొకటియే; అదియే బ్రహ్మము.)

ఇది ఉపనిషత్_సిద్ధాంత_సారము. నీవు స్వబుద్ధివలన నిజానందస్వరూ
మగు పరబ్రహ్మమును చక్కగ విచారించి, ధ్యానించి, స్వయముగ అపరిచ్ఛి
మును, అక్షరమును, అద్వైతమును అగు పరబ్రహ్మమును సాక్షాత్
మొనర్చుకొని, జీవన్ముక్తుడవు కమ్ము. విశ్రాంతిని బొందుము. శాంతిని
యింపుము. రా౨_

వేదాంత (ఉపనిషద్_) వాక్యములు విచారణీయములు. గురువు
వందనీయుడు. నరులకు గురువాక్యశ్రవణమును, దర్శనమును, సేవయును
కరములు.

* గురుర్బ్రహ్మ స్వయం సాక్షాత్ సేవ్యో వన్ద్యో ముముక్షుభిః
నోద్వేజనీయ ఏవాయం కృతజ్ఞేన వివేకినా. ౮౫

* యావదాయుస్త్వయా వన్ద్యో వేదాన్తో గురురీశ్వరః,
మనసా కర్మణా వాచా శ్రుతిరేవైష నిశ్చయః. ౮౬

* భావాద్వైతం సదా కుర్యాత్ క్రియాద్వైతం న కర్హిచిత్,
అద్వైతం త్రిషు లోకేషు నాద్వైతం గురుణా సహ. ౮౭

ఇత్యేవం బోధితో బ్రహ్మామృతబోధాత్మనా ద్విజః,
గురుణా భాష్యకారేణ మణ్డనాఖ్యకవిర్మహాన్ ౮౮

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత తత్త్వోపదేశః ॥౧౪॥

గురువే ప్రత్యక్షబ్రహ్మము. ముముక్షువులకు గురువు సేవనీయుడు, వందనీయుడు. కృతజ్ఞుడును వివేకియును అగువాడు గురువున కెట్టి ఆయాసమును కలిగింపకూడదు. ౮౫

ఆయువు ఉండినంతవరకు త్రికరణశుద్ధిపూర్వకముగ - మనోవాక్కాయములతో - వేదాంతములను, గురువును, ఈశ్వరుని నమస్కరింపుము. ఇది శ్రుతి వాక్యము. ఇది నిశ్చితమగు సిద్ధాంతము. ౮౬

భావాద్వైతము నవలంబింపుము - అనగా, అద్వైతభావమును హృదయమునసే నిల్పికొనుము. కర్మవేళల అద్వైతభావమును ప్రదర్శింపకుము. (అగుచో, కర్మమే నిర్వహింపబడదు.) ముల్లోకముల అద్వైతము చెల్లును. కాని గురువు పట్ల కూడదు. (ఏలయన ఐక్యము ఘటిల్లిన గురుపూజయును, ఫలమగు గురుకృపయును లభింపవు.) ౮౭

భాష్యకారుడును, గురుడును అగు శంకరుడు, బ్రాహ్మణుడును, మహాత్ముడును, పండితుడును అగు మండనమిశ్రునకు ఈరీతిగ బ్రహ్మామృతమగు జ్ఞానస్వరూపమును బోధించెను. ౮౮

ఇది తత్త్వోపదేశ ఆంధ్రానువాదము ॥౧౪॥

---

* ఈ మూడుశ్లోకములును సారతత్త్వోపదేశమను వేరు శీర్షికతో గూడ భారతదేశమునం దంతటను ప్రచారములో నుండి, వేరొక గ్రంథముగకూడ పరిగణింపబడుచున్నవి.

## ౧౫. ధన్యాష్టకమ్

తజ్జ్ఞానం ప్రశమకరం యదిన్ద్రియాణాం
తజ్జ్ఞేయం యదుపనిషత్ సునిశ్చితార్థమ్,
తే ధన్యా భువి పరమార్థనిశ్చితేహాః
శేషాస్తు భ్రమనిలయే పరిభ్రమన్తి. ౧

ఆదౌ విజిత్య విషయాన్ మదమోహరాగ
ద్వేషాదిశత్రుగణ మాహృతయోగరాజ్యాః,
జ్ఞాత్వా మతం సమనుభూయ పరాత్మవిద్యా
కాన్తాసుఖం వనగృహే విచరన్తి ధన్యాః. ౨

త్యక్త్వా గృహే రతిమధోగతిహేతుభూతా
మాత్మేచ్ఛయోపనిషదర్థరసం పిబన్తః,
వీతస్పృహా విషయభోగపదే విరక్తా
ధన్యాశ్చరన్తి విజనేషు విరక్తసఙ్గాః. ౩

ఇంద్రియములను విషయములనుండి మరల్చునదియే జ్ఞానము. ఎరుగదగినది ఉపనిషత్తుల నిశ్చితార్థమే. పరమార్థతత్త్వమును నిర్ణయింప పాటుపడువారే ఈ లోకమున ధన్యులు. మిగిలినవారు భ్రమపడి తిరుగాడుచున్నారు. ౧

మొదట మదమోహరాగద్వేషాదులగు శత్రువులను నిర్జించి, యోగరాజ్యమును కైవసమొనర్చుకొని, అభిమతవస్తువు నెరిగి, పరాత్మవిద్యయను కాంతతో సుఖము ననుభవించి, ధన్యులగువారు వనగృహమున విహరించుచున్నారు. ౨

అధోగతి కారణమగు విషయప్రీతిని పరిత్యజించి, యథేచ్ఛగా ఉపనిషద్ - సార - రసమును గ్రోలుచు, నిస్సంగులగుచు, విషయభోగముల విరక్తినంది, లోకాలయమును త్యజించి ధన్యులగువారు ఏకాంత ప్రదేశముల విహరించుచున్నారు. ౩

త్యక్త్వా మమాహమితి బన్ధకరే పదే ద్వే
మానాపమానసదృశాః సమదర్శినశ్చ,
కర్తారమన్యమవగమ్య తదర్పితాని
కుర్వన్తి కర్మపరిపాకఫలాని ధన్యాః. ౪

త్యక్త్వైషణాత్రయమవేక్షితమోక్షమార్గా
భైక్ష్యామృతేన పరికల్పితదేహయాత్రాః,
జ్యోతిః పరాత్ పరతరం పరమాత్మసంజ్ఞం
ధన్యా ద్విజా రహసి హృద్యవలోకయన్తి. ౫

నాసన్ న సన్ న సదసన్ న మహాన్ న చాణు
న స్త్రీ పుమాన్ న చ నపుంసకమేవబీజమ్,
యైర్బ్రహ్మ తత్సమనుపాసితమేకచిత్తైః
ధన్యా విరేజురితరే భవపాశబద్ధాః. ౬

ధన్యవ్యక్తులు " మమ, అహం - నాది, నేను " అను పదములను రెంటిని, బంధదాయకము లగుటవలన, వదలి, దూషణభూషణములను సమముగ వీక్షించుచు, సర్వత్ర సమస్వరూపమగు ఆత్మనే వీక్షించుచు, ఈశ్వరునే కర్తగ గ్రహించి, ఈశ్వరార్పణబుద్ధితో పూర్వకర్మపరిణామ ఫలములగు కార్యములను నిర్వహించుచున్నారు. (లేక : ఆత్మాతిరిక్తమగు బుద్ధినే కర్తగ గ్రహించి, ఆ కర్త యొసగిన వస్తువులను కర్మఫలముగ గ్రహించుచున్నారు.) ౪

ధన్యులగు ద్విజులు మోక్షోపాయము నెరిగి, పుత్రవిత్తలోకైషణలను త్యజించి, భిక్షాన్నమను అమృతమువలన దేహయాత్రను నిర్వహించుకొనుచు, నిర్జనప్రదేశనిషణ్ణులై హృదయమున పరంజ్యోతి స్వరూపమగు పరమాత్మను వీక్షించుచున్నారు. ౫

సత్తయును అసత్తయును కానిదియును, సదసత్తులు కానిదియును, అణుమహత్తులు కానిదియును, స్త్రీనపుంసకపురుషమూర్తి కానిదియును, సర్వకారణమును అగు బ్రహ్మమును ఎవ రేకాగ్రచిత్తమున ఉపాసించుచున్నారో, వారే ధన్యులు. మిగిలినవారు సంసారపాశబద్ధులు. ౬

అజ్ఞానపఙ్కపరిమగ్నమపేతసారం
దుఃఖాలయం మరణజన్మజరావసక్తమ్,
సంసారబన్ధనమనిత్యమవేక్ష్యధన్యా
జ్ఞానాసినా తదవశీర్య వినిశ్చయన్తి. ౭

శాన్తైరనన్యమతిభిర్మధురస్వభావైః
ఏకత్వనిశ్చితమనోభిరపేతమోహైః,
సాకం వనేషు విజితాత్మపదస్వరూపం
శాస్త్రేషు సమ్యగనిశం విమృశన్తి ధన్యాః. ౮

అహిమివజనయోగం సర్వదావర్జయేద్ యః
కుణపమివ సునారీం త్యక్తుకామో విరాగీ,
విషమివ విషయాన్ యో మన్యమానో దురన్తాన్
జయతి పరమహంసో ముక్తిభావం సమేతి. ౯

"సంసారము, అనిత్యము, బంధనస్వరూపము. ఇది అజ్ఞానమను బురదలో దిగబడియున్నది.ఇది నిస్సారము. దుఃఖమునకు పుట్టిల్లు. జన్మజరామరణములతో చిక్కుబడియున్నది." అని గ్రహించి ధన్యులగువారు జ్ఞానఖడ్గముతో దానిని ఛేదించి, యథార్థతత్త్వమును చక్కగ గ్రహించుచున్నారు. ౭

శాంతులును, ఏకాగ్రచిత్తులును, మధురస్వభావులును, జీవబ్రహ్మైక్య విషయమున సందేహము లేనివారును, మోహరహితులును నగు వ్యక్తులతోగూడి, వనమధ్యమున ధన్యపురుషులు, శాస్త్రములలో ఆత్మస్వరూపమని నిర్ణయింపబడినదానిని గ్రహించి, చక్కగ విమర్శించుచున్నారు. ౮

జనసంగమును సర్పమువలె భావించి సర్వదా పరిత్యజించువాడును, చక్కటి అందగత్తెను చూచి పీనుగవలె విడుచునంతటి వైరాగ్యముగలవాడును, దురంతములగు భోగవిషయములను విషమువలె భావించువాడును అగు పరమహంసకు జయమగును. అతడే ముక్తిని బొందును. ౯

సమ్పూర్ణం జగదేవ నన్దనవనం సర్వేఽపి కల్పద్రుమాః
గాఙ్గం వారి సమస్తవారినివహాః పుణ్యాః సమస్తాః క్రియాః,
వాచః ప్రాకృతసంస్కృతాః శ్రుతిగిరో వారాణసీ మేదినీ
సర్వావస్థితిరస్య వస్తువిషయాదృష్టే పరబ్రహ్మణి. ౧౦

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత ధన్యాష్టకమ్ ॥౧౫॥

బ్రహ్మసాక్షాత్కారమైనయెడల, జగత్తే నందనవన మగును. తరువులన్నియును కల్పద్రుమములే. జలమంతయును గంగయే. సమస్తకార్యములును పుణ్యక్రియలే. ప్రాకృత సంస్కృతవాక్కులు వేదవాక్యము లగును. భూమండల మంతయును కాశీక్షేత్రమే. ఇట్టి జ్ఞాని ఏరీతిగ నుండినను బ్రహ్మముననే వెలయుచుండును. ౧౦

ఇది ధన్యాష్టక ఆంధ్రానువాదము ॥౧౫॥

## ౧౬. నిరఞ్జనాష్టకమ్

స్థానం నమానం నచనాద-బిన్దు-రూపంన రేఖానచధాతువర్ణమ్,
ద్రష్టానదృశ్యంశ్రవణంన శ్రావ్యంతస్మైనమోబ్రహ్మనిరఞ్జనాయ.
వేదోనశాస్త్రం నచశౌచసన్ధ్యా,మన్త్రోనజాప్యంనచధాన-ధేయమ్,
హోమోనయజ్ఞోనచ దేవపూజా,తస్మైనమోబ్రహ్మనిరఞ్జనాయ.
వృక్షోనమూలంనచబీజమూలం,శాఖానపత్రంనచవల్లిపల్లవమ్,
పుష్పం నగన్ధో న ఫలంనఛాయా,తస్మైనమోబ్రహ్మనిరఞ్జనాయ.
అధోనచోర్ధ్వంనశివోనశక్తిః, పుమాన్న నారీనచలిఙ్గమూర్తిః,
బ్రహ్మానవిష్ణుర్న చ దేవరుద్రస్తస్మై, నమో బ్రహ్మ నిరఞ్జనాయ.

స్థానమానములు♦ లేక, నాదబిందువులుగాక, రూపురేఖలు లేక, ధాతు వర్ణరహితమై, దృక్-దృశ్యములుగాక, శ్రవణశబ్దములుగాక ఒప్పుచుండెడు నిరంజనబ్రహ్మమునకు నమస్కారము. ౧

వేదశాస్త్రములుగాక, శౌచసంధ్యలుగాక, మంత్రజపములుగాక, ఆధార ఆధేయములుగాక, హోమయజ్ఞములుగాక, దేవపూజయునుగాక ఒప్పుచుండెడు నిరంజనబ్రహ్మమునకు నమస్కారము. ౨

చెట్టును విత్తుయునుగాక, బోదెయునుగాక, కొమ్మలును ఆకులును గాక, తీగెలును చిగుళ్లునుగాక, పూవులును తావియునుగాక, కాయయును పండునుగాక, నీడయునుగాక, ఒప్పుచుండెడు నిరంజన బ్రహ్మమునకు నమస్కారము. ౩

ఊర్ధ్వాధోదేశములుగాక, శివశక్తులుగాక, స్త్రీపురుషమూర్తిగాక, లింగమూర్తిగాక, బ్రహ్మవిష్ణురుద్రులలో నెవ్వరునుగాక ఒప్పుచుండెడు నిరంజనబ్రహ్మమునకు నమస్కారము. ౪

---

ఈ శ్లోకములకు శ్రీ శంకరులవారు రచించిన భాష్యము కలదు.

♦ మానము = పరిమాణము, హద్దు.

అఖణ్డఖణ్డం న చ దణ్డదణ్డ్యం
　　కాలోఽపి జీవో న గురుర్న శిష్యః,
గ్రహో న తారా న చ మేఘమాలా
　　తస్మై నమో బ్రహ్మనిరఞ్జనాయ. ౫

శ్వేతం న పీతం న చ రక్తరేతో
　　హైమం న రౌప్యం న చ వర్ణవర్ణమ్,
చన్ద్రార్కవహ్న్యుదయో న చాస్తం
　　తస్మై నమో బ్రహ్మనిరఞ్జనాయ. ౬

స్వర్గే న మర్త్యే నగరే న సత్రే
　　జాతేరతీతం న చ భేదభిన్నమ్,
నాహం న తత్త్వం న పృథక్ పృథక్త్వాత్
　　తస్మై నమో బ్రహ్మనిరఞ్జనాయ. ౭

ఖండాఖండములుగాక, దండదండనీయులుగాక, కాలముగాక, జీవుడు గాక, గురుశిష్యులుగాక, గ్రహనక్షత్రములుగాక, మేఘమాలగాక ఒప్పుచుండెడు నిరంజనబ్రహ్మమునకు నమస్కారము. ౫

తెలుపుయును పసుపుయునుగాక, రక్తవీర్యములుగాక, వెండిబంగారములుగాక, చాతుర్వర్ణ్యముగాక, కీర్తిగాక, సూర్యచంద్రాగ్నులుగాక, వీరి ఉదయాస్తమయములునుగాక ఒప్పుచుండెడు నిరంజన బ్రహ్మమునకు నమస్కారము. ౬

స్వర్గమర్త్యములుగాక, నగరసత్రములుగాక, జన్మముగాక, భేదభిన్నత్వములుగాక, అహంతత్త్వములుగాక, పృథక్తత్త్వములుగాక ఒప్పుచుండెడు నిరంజనబ్రహ్మమునకు నమస్కారము. ౭

గమ్భీరధీరం న ఘనం న శూన్యం
సంసారసారం న చ పాపపుణ్యమ్,
వ్యక్తం న చావ్యక్తమభేదభిన్నం
తస్మై నమో బ్రహ్మనిరఞ్జనాయ. ౮

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత నిరఞ్జనాష్టకమ్ ॥౧౬॥

ధీరగాంభీర్యములుగాక, శూన్యఘనములుగాక, సంసారమును దాని సారమునుగాక, పాపపుణ్యములుగాక, వ్యక్తావ్యక్తములుగాక, అభేదభిన్నత్వములుగాక ఒప్పుచుండెడు నిర్విశేషనిరంజన బ్రహ్మమునకు నమస్కారము. ౮

ఇది నిరంజనాష్టక ఆంధ్రానువాదము. ॥౧౬॥

# ౧౭. నిర్వాణషట్కమ్

## (ఆత్మషట్కమ్)

మనోబుద్ధ్యహఙ్కారచిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణనేత్రమ్,
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయు
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్. ౧

అహం ప్రాణసంజ్ఞో న వై పఞ్చవాయు
ర్న వా సప్తధాతుర్న వా పఞ్చకోశః,
న వాక్పాణిపాదౌ న చోపస్థపాయూ
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్. ౨

మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము: ఇవి నేను కాను. కర్ణము, జిహ్వ, ఘ్రాణము: ఇవియును నేను కాదు. ఆకాశము, భూమి, తేజస్సు, వాయువు: (జలము) ఇవియును నేను కాదు. నేను (కర్మేంద్రియములకును, జ్ఞానేంద్రియములకును, పంచభూతములకును, అతీతుడనగు) చిదానందరూప శివుడను. నేను శివుడనే. ౧

నేను ప్రాణమను కాను. కాక ప్రాణాపానవ్యానసమానోదానము లనబడు పంచవాయువులును కాదు. రక్తమాంసమేదోస్థిమజ్జారసశుక్రములను సప్త ధాతువులుకూడ నేను కాదు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయానందమయము లనబడు పంచకోశములు కూడ నేను కాదు. వాక్కుయును, హస్తపాదములుకూడ నేను కాదు. పాయూపస్థలుకూడ నేను కాదు. నేను చిదానన్దరూపుడను. శివుడనే నేను. నేనే శివుడను. ౨

న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః,
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్. ౩

న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్యభావః,
న ధర్మో నచార్థో న కామో న మోక్ష
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్. ౪

న మృత్యుర్న శఙ్కా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ,
న బన్ధుర్న మిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానన్దరూపః శివోహం శివోహమ్. ౫

నాకు పుణ్యపాపములు లేవు. సుఖదుఃఖములు లేవు. మంత్రజపము లేదు. తీర్థసేవ లేదు. వేదయజ్ఞములు లేవు. భోజనపదార్థము, భోజనము, భోక్త (భుజించువాడు) ఇవి నేను కాదు. నేను చిదానందస్వరూపుడనగు శివుడను. నేను శివస్వరూపుడను. ౩

నాకు రాగద్వేషములు లేవు. లోభమోహములు లేవు. మదమాత్సర్యములు లేవు. ధర్మార్థకామమోక్షములు లేవు. నేను చిదానందస్వరూపుడను. నేనే శివుడను. శివస్వరూపమే నేను. ౪

మృత్యువు, భయము, జాతిభేదము; ఇవి నాకు లేవు. నాకు జన్మమును (దాని నొసగు) తల్లిదండ్రులును లేరు. నాకు బంధుమిత్రు లెవ్వరును లేరు. నాకు గురువెవ్వడును లేడు, శిష్యుడును లేడు. నేను చిదానందస్వరూపిని. శివుడే నేను. శివుడే నేను. ౫

అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్,
న వా బన్ధనం నైవ ముక్తిర్న బన్ధః
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్. ౬

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత నిర్వాణషట్కమ్ ॥౧౭॥

నేను నిర్వికల్పుడను, వికల్పరహితుడను. సర్వవ్యాపినగుటవలన నిరాకారరూపుడను. సర్వేంద్రియములతోడను నాకెప్పుడును సంబంధము లేదు. నాకు బంధమోక్షములు లేవు. నేను సచ్చిదానంద స్వరూపుడను. శివస్వరూపుడను. నేనే శివుడను. శివోఽహమ్. ౬

ఇది నిర్వాణషట్క ఆంధ్రానువాదము ॥౧౭॥

# ౧౮. నిర్వాణదశకమ్ *

## ( దశశ్లోకీ - సిద్ధాన్త బిన్దుః )

న భూమిర్న తోయం న తేజో న వాయు
ర్న ఖం నేన్ద్రియం వా న తేషాం సమూహః,
అనైకాన్తికత్వాత్ సుషుప్త్యేకసిద్ధ
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౧

న వర్ణా న వర్ణాశ్రమాచారధర్మా
న మే ధారణాధ్యానయోగాదయోఽపి,
అనాత్మాశ్రయాఽహం మమాధ్యాసహానాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౨

నేను పృధివీభూతమను కాను, తేజస్సుయును కాదు, వాయువును కాదు, ఆకాశమును కాదు. నేను ఏఒక ఇంద్రియమను గాను; లేక వాని సమష్టియును గాను. ఏలయన, ఇవి అనైకాంతికములు, వ్యభిచారదోషయుక్తములు, వినాశశీలములు. కాని నేను సుషుప్తికి ఏకమాత్రసాక్షిగ సిద్ధుడ నగుచున్నాను. నేను అద్వితీయుడను, అవశిష్టస్వరూపుడను - అనగా సమస్తద్వైత వస్తువులును బాధితములుకాగా అబాధితమగుచు మిగిలెడు నదేదియో అదియే నేను. అది శివస్వరూపమును, పరమానందజ్ఞానస్వరూపమును, ధర్మరహితమును అయియున్నది. నేను కేవల శివస్వరూపుడను. ౧

నాకు బ్రాహ్మణత్వాది - వర్ణములు లేవు. వర్ణమునకును ఆశ్రమమునకును సంబంధించిన ఆచారధర్మములు లేవు. నాకు ధ్యాన, ధారణా, యోగములు లేవు. ఆత్మవిరోధియగు అవిద్యకు (అనాత్మ) ఆశ్రయమగు నా అధ్యాస తత్త్వజ్ఞానమువలన తొలగిపోవుటవలన, నేను ఆ అద్వితీయమును, అవశిష్టమును, శుద్ధమును అగు శివస్వరూపమే యగుచున్నాను - నేను కేవలము శివుడనే. ౨

---

* ఈ పది శ్లోకములకును విశ్వేశ్వరసరస్వతి శిష్యుడగు మధుసూదన సరస్వతివిరచితమగు "సిద్ధాంబిందు" వను విపులటీకయును, దానికి పరమానంద సరస్వతి శిష్యుడగు (గౌడ) బ్రహ్మానందసరస్వతి విరచితమును, తతోధిక విపులమును అగు "న్యాయరత్నావళి" యను టీకయును కలవు.

న మాతా పితా వా న దేవా న లోకా
న వేదా న యజ్ఞా న తీర్థం బ్రువన్తి,
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౩

న సాంఖ్యం న శైవం న తత్ పాఞ్చరాత్రం
న జైనం న మీమాంసకాదేర్మతం వా,
విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౪

న చోర్ధ్వం న చాధో న చాన్తర్న బాహ్యం
న మధ్యం న తిర్యఙ్ న పూర్వాపరా దిక్,
వియద్వ్యాపకత్వాదఖణ్డైకరూప
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౫

సుషుప్తికాలమున నాకు తల్లిదండ్రులును, దేవతలును, లోకములును, వేదములును, యజ్ఞములును, తీర్థములును ఉండవు - అని శ్రుతివాక్యము లన్నియును నుడువుచున్నవి. సుషుప్తికాలమున నా అతిశూన్యాత్మకత్వము నిరాకృతమగుటవలన నేను ఆ అద్వితీయ - పరిశిష్ట - కేవల - శివస్వరూపిని. 3

సాంఖ్య, శైవ, పాంచరాత్ర, జైన, మీమాంస, తార్కికాదిమతములు ("తత్త్వమసి" అను మహావాక్యమునందలి) తత్ - పద - అర్థమగు పరబ్రహ్మమును ప్రతిపాదింపకుండుటవలన యుక్తియుక్తములు కావు. విశుద్ధాత్మస్వరూపత్వహేతు - విశిష్టమగుటవలన, అనగా సవికల్పానుభూతికంటె భిన్నమును, తత్త్వమస్యాదివాక్య - జన్యమును అగు ఏ అఖండనిర్వికల్పానుభూతి కలదో, దానివలన నేను అద్వితీయ-పరిశిష్ట-శుద్ధ-శివస్వరూపుడ నగుచున్నాను.

కిందా, మీదా, లోపల, వెలుపల, సూటి, వంకరా, తూర్పు, పడమర, అను దేశభేదములు నాయందు లేవు. నేనే ఆకాశమునంతటిని వ్యాపించియున్నాను. కనుక నేనే అఖండాకృతిని. అద్వితీయమును, పరిశిష్టమును, కేవలమును శివస్వరూపమును అగునదియే నేను. ౫

న శుక్లం న కృష్ణం న రక్తం న పీతం
న కుబ్జం న పీనం న హ్రస్వం న దీర్ఘమ్,
అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్
తదేకో౽వశిష్టః శివః కేవలో౽హమ్. ౬

న శాస్తా న శాస్త్రం న శిష్యో న శిక్షా
న చ త్వం న చాహం న చాయం ప్రపఞ్చః,
స్వరూపావబోధో వికల్పాసహిష్ణుః
తదేకో౽వశిష్టః శివః కేవలో౽హమ్. ౭

నా జాగ్రన్న మే స్వప్నకో వా సుషుప్తిః
న విశ్వో న వా తైజసః ప్రాజ్ఞకో వా,
అవిద్యాత్మకత్వాత్ త్రయాణాం తురీయః
తదేకో౽వశిష్టః శివః కేవలో౽హమ్. ౮

తత్ పదార్థమగు బ్రహ్మమునకు శుక్ల, కృష్ణ, లోహిత, పీతాది వర్ణము లేవియును లేవు. అణు, మహత్, దీర్ఘ, హ్రస్వములను పరిమాణములును దానికి లేవు. అది అరూపము - అప్రమేయము. అది సూర్యచంద్రాది జ్యోతులకుగూడ అవభాసకము. కనుక దాని నెవరు ప్రకాశింప జేయగలరు? ఇట్టి యీ బ్రహ్మవస్తువు తానొక్కటియగుచు మిగులువడు చున్నదో, ఆ శుభస్వరూపమగు కేవలుడనే నేను. ౬

గురువు లేదు, శాస్త్రము లేదు, శిష్యుడు లేడు, శిక్షయును లేదు - ఉపదేశకర్తృకరణ కర్మక్రియలు లేవు. నీవు లేవు, నేను లేను - శ్రోతయును, వక్తయునుగూడ లేరు. బ్రహ్మస్వరూపజ్ఞానము ఈ వికల్పములను సహింప లేదు. కనుక నేను ఆ అద్వితీయావశిష్ట - కేవల - శివస్వరూపుడ నగుచున్నాను. ౭

నాకు జాగ్రత్స్వప్నసుషుప్తులు లేవు. విశ్వ, తైజస, ప్రాజ్ఞులలో నే నెవ్వడను గాను. ఈ త్రయము అవిద్యాకల్పితము. కనుక నేను ఈ అవస్థాత్రయమునకు అతీతుడనగు తురీయుడను, అద్వితీయుడను, పరిశిష్టుడను, శివస్వరూపుడను, కేవలుడను. ౮

అపి వ్యాపకత్వాద్ హితత్వప్రయోగాత్
స్వతః సిద్ధభావాదనన్యాశ్రయత్వాత్,
జగత్ తుచ్ఛమేతత్ సమస్తం తదన్యత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. ౯

న చైకం తదన్యద్ ద్వితీయం కుతః స్యాత్
న వా కేవలత్వం న చాఽకేవలత్వమ్,
న శూన్యం న చాఽశూన్యమద్వైతకత్వాత్
కథం సర్వవేదాన్తసిద్ధం బ్రవీమి. ౧౦

ఇతి శ్రీ శఙ్కరభగవత్ పూజ్యపాదవిరచిత నిర్వాణదశకమ్ ॥౧౮॥

వ్యాపకు డగుటవలనను, బాధావధి యగుటవలనను, భ్రమాధిష్ఠాన మగుట వలనను, అజ్ఞాతమగుటవలనను, ప్రపంచబోధకు గ్రాహకాంతరము లేకుండుట వలనను, ప్రియత్వోపదేశము వలనను, స్వయంసిద్ధ మగుచుండుటవలనను, అనన్యాశ్రయ మగుటవలనను, సాక్షి గాక మిగిలిన జగత్తంతయును తుచ్ఛము _ మిథ్య. నేను ఆ అద్వితీయు _ పరిశిష్ట _ కేవల _ శివస్వరూపుడను. ౯

ఆత్మ అద్వైతస్వరూపమగుట వలనను, ఏకత్వ _ సంఖ్యావిశిష్టము కాదు. కనుక తద్భిన్నమగు ద్వితీయవస్తు వెటునుండి వచ్చును? దానికి ఏకత్వముగాని, అనేకత్వముగాని లేవు. అది శూన్యమును గాదు, అశూన్యమును గాదు. కనుక సమస్త వేదాంతసిద్ధమగు ( ఉపనిషత్ - సిద్ధమగు ) వస్తువును గురించి (వాక్కులతో) ఎట్లు చెప్పగలను? ౧౦

ఇది నిర్వాణదశక ఆంధ్రానువాదము ॥౧౮॥

# ౧౫. నిర్వాణమఞ్జరీ

అహం నామరో నైవ మర్త్యో న దైత్యో
న గన్ధర్వయక్షః పిశాచప్రభేదః,
పుమాన్ నైవ న స్త్రీ తథా నైవ షణ్డః
ప్రకృష్టఃప్రకాశస్వరూపః శివోఽహమ్. ౧

అహం నైవ బాలో యువా నైవ వృద్ధో
న వర్ణీ న చ బ్రహ్మచారీ గృహస్థః,
వనస్థోఽపి నాహం న సన్న్యస్తధర్మా
జగజ్జన్మనాశైకహేతుః శివోఽహమ్. ౨

అహం నైవ మేయస్తిరోభూతమాయా
తథైవేక్షితుం మాం పృథఙ్నాస్త్యుపాయః,
సమాశ్లిష్టకాయత్రయోఽప్యద్వితీయః
సదాతీన్ద్రియః సర్వరూపః శివోఽహమ్. ౩

నేను దేవతను గాను, మానవుడను గాను, దైత్య - గంధర్వ - యక్ష - పిశాచములలో నెవ్వడను గాను. స్త్రీ - పురుష - నపుంసక - మూర్తిని గాదు. శ్రేష్ఠప్రకాశస్వరూపుడగు శివుడనే నేను. ౧

నేను బాలుడను గాను, యువకుడను గాను, వృద్ధుడను గాను. (శరీర సంబంధములగు అవస్థాభేదములకు నేను అతీతుడను) బ్రాహ్మణాది వర్ణధర్మములు నాకు లేవు. నేను బ్రహ్మచారిని గాను, గృహస్థుడను గాను, వానప్రస్థుడను గాను, సన్న్యాసినిగూడ కాదు. నాకాశ్రమధర్మములు లేవు. జగత్ - సృష్టిస్థితిలయములకు ఏకమాత్రకారణమగు శివుడనే నేను. ౨

నేను ఏ ప్రమాణమునకును విషయముగ గాను, అప్రమేయుడను మాయ నానుండి అంతర్ధానమైనది. అయినను (దృక్ దృశ్యాదిదర్శనములు లేకుండుటవలన) నన్ను వీక్షించుటకు వేరుగా ఎట్టి ఉపాయమును లేదు నేను (స్థూల - సూక్ష్మ - కారణము లనబడు) శరీరత్రయము నావరించుకొని యున్నను, అద్వితీయుడనే, సర్వదా అతీంద్రియస్వరూపుడను. సర్వరూపుడగు శివస్వరూపుడను. ౩

అహం నైవ మన్తా న గన్తా న వక్తా
న కర్తా న భోక్తా న ముక్తాశ్రమస్థః,
యథాహం మనోవృత్తిభేదస్వరూపః
తథా సర్వవృత్తిప్రదీపః శివోఽహమ్. ౪

న మే లోకయాత్రాప్రవాహప్రవృత్తిః
న మే బన్ధబుద్ధ్యా దురీహానివృత్తిః,
ప్రవృత్తేర్నివృత్తస్య చిత్తస్య వృత్తిః
యతస్త్వన్వహం తత్స్వరూపః శివోఽహమ్. ౫

నిదానం యదజ్ఞానకార్యస్య కార్యం
వినా యస్య సత్త్వం స్వతో నైవ భాతి,
యదాద్యన్తమధ్యాన్తరాలాన్తరాల
ప్రకాశాత్మకం స్యాత్ తదేవాఽహమస్మి. ౬

నేను మంతను (చింతించువాడను) గాను, గంతను (నడచువాడను) గాను, వక్తను గాను, కర్తను గాను, భోక్తయును గాను. నేను ముక్తపురుషు లుండు ఆశ్రమమునకును జెందను. నేను అంతఃకరణ - వృత్తి - స్వరూపమై నట్లు, ఆయావృత్తులను ప్రకాశింపజేయువాడను గూడ. శివుడనే నేను. ౪

నాకు సంసారయాత్రా ప్రవాహమనిన ప్రవృత్తి (వాంఛ) లేదు. నన్ను బద్ధునిగా భావించికొని, ఈ దుర్బుద్ధిని తొలగించుకొనెడు ప్రయత్నమును లేదు. నా చిత్తవృత్తులు నివృత్తి (నిరోధము) నందినవి. నేను చిత్తవృత్తులను ప్రకాశింపజేయు పరశివుడను. ౫

కార్యములేకుండ ఏ అజ్ఞానసత్త స్వతఃప్రకాశితము కాకుండునో, ఆ అజ్ఞానకార్యమగు సంసారమును ప్రకాశింపజేయునదియును, ఆద్యంత మధ్యాంత రాళముల హృదయము నేది ప్రకాశింపజేయుచున్నదియో, అదియే నేను. ౬

యతోఽహం న బుద్ధిర్న మే కార్యసిద్ధిః
యతో నాహమఙ్గం న మే లిఙ్గభఙ్గమ్,
హృదాకాశవర్తీ గతాఙ్గత్రయార్తిః
సదా సచ్చిదానన్దమూర్తిః శివోఽహమ్. ౭

యదాసీద్విలాసాద్ వికారం జగత్ యద్
వికారాశ్రయం నాద్వితీయత్వతః స్యాత్,
మనోబుద్ధిచిత్తాహమాకారవృత్తిః
ప్రవృత్తిర్యతః స్యాత్ తదేవాహమస్మి. ౮

యదన్తర్బహిర్వ్యాపకం నిత్యశుద్ధం
యదేకం సదా సచ్చిదానన్దకన్దమ్,
యతః స్థూలసూక్ష్మప్రపఞ్చస్య భానం
యతస్తత్ ప్రసూతిస్తదేవాహమస్మి. ౯

నేను బుద్ధినికాను, కనుక "కార్యము సిద్ధించునా" యనెడు చింతయును లేదు. నేను శరీరమునుకాను, కనుక ఏ అవయవమైన పోవునా అను పంతలేదు. (లేక: ఏలయన నేను అంగమును కాను. నా చిత్తమునకు హానిలేదు.) నేను హృదయాకాశవర్తిని. శరీరత్రయసంబంధమగు ఆర్తి నాకు లేదు. నేను సర్వదా సచ్చిదానందస్వరూపమగు పరమశివుడనే. ౭

అవిద్యావిలాసవికారమగు ఈ జగత్తు ఉండినప్పుడు, అద్వితీయతా-హేతువువలన వికారాశ్రయమగు వస్తువేదియును లేకుండెను. (జగత్తు బ్రహ్మమున ఆరోపితమైనదేకాని, బ్రహ్మముయొక్క పరిణామము-వికారము-కాదు.) మనో, బుద్ధి, చిత్త, అహంకారము లెద్దానినుండి ప్రవృత్తము లగుచున్నవో, అదియే నేను. ౮

లోపలను, వెలుపలను నిండియుండినదియును, నిత్యశుద్ధమును, ఉనికి, తెలివిడి, ఉబ్బు ఈ మూటికిని మూలమైనదియును, స్థూల సూక్ష్మ ప్రపంచముల ప్రకాశమునకును, ఉత్పత్తికిని కారణమైనదియును అగున దేదియో అదియే నేను. ౯

యదర్కేన్దువిద్యుత్ప్రభాజాలమాలా
విలాసాస్పదం యత్ స్వభేదాదిశూన్యమ్,
సమస్తం జగద్ యస్య పాదాత్మకం స్యాద్
యతః శక్తిభానం తదేవాహమస్మి. ౧౦

యతః కాలమృత్యుర్బిభేతి ప్రకామం
యతశ్చిత్తబుద్ధీన్ద్రియాణాం విలాసః,
హరి బ్రహ్మ రుద్రేన్ద్ర చన్ద్రాదినామ్నః
ప్రకాశో యతః స్యాత్ తదేవాహమస్మి. ౧౧

యదాకాశవత్ సర్వగం శాన్తరూపం
పరంజ్యోతిరాకారశూన్యం వరేణ్యమ్,
యదాద్యన్తశూన్యం పరం శఙ్కరాఖ్యం
యదన్తర్విభావ్యం తదేవాహమస్మి. ౧౨

ఇతి శ్రీ శఙ్కరభగవత్పూజ్యపాద విరచిత - నిర్వాణమఞ్జరీ. ॥౧౯॥

సూర్య, చంద్ర, విద్యుత్ప్రభాసమూహ విలాసమున కేది ఆశ్రయమో; స్వజాతీయ,విజాతీయస్వగత భేదములు లేనిదేదియో, జగత్తు దేనియొక్క చతుర్థాంశమో, దేనినుండి సమస్తశక్తియును ప్రకాశించుచున్నదో అదియే నేను ౧౦

ఏదియనిన కాలరూపయగు మృత్యువుకూడ అత్యంతము భీతి నందునో, దేనినుండి చిత్తమును బుద్ధియును, ఇంద్రియములును వికాసము నందుచున్నవో, హరి, హర, బ్రహ్మేంద్ర చంద్రాది నామములు దేనివలన ప్రకాశము నందుచున్నవో అదియే నేను. ౧౧

ఆకాశమువలె సర్వవ్యాపియును, శాంతరూపమును, పరంజ్యోతియును, నిరాకారమును, వరణీయమును, ఆద్యంతరహితమును, హృదయాంతరమునను, (వెలపలను) ధ్యానింపబడినదియును, శ్రేష్ఠమును అగు ఏ శంకరస్వరూపము కలదో, అదియే నేను. ౧౨

ఇది నిర్వాణమంజరి - ఆంధ్రానువాదము. ॥౧౯॥

## ౨౦. నిర్గుణమానసపూజా *

ఆరాధయామి మణిసన్నిభమాత్మలిఙ్గమ్
మాయాపురీ హృదయపఙ్కజ సన్నివిష్టమ్,
శ్రద్ధానదీ విమలచిత్త జలాభిషేకైః
నిత్యం సమాధికుసుమైరపునర్భవాయ. ౧

అయమేకోఽవశిష్టోఽస్మీత్యేవ మావాహయేచ్ఛివమ్,
ఆసనం కల్పయేత్ పశ్చాత్ స్వప్రతిష్ఠాత్మచిన్తనమ్. ౨

పుణ్యపాపరజఃసఙ్గో మమ నాస్తీతి వేదనమ్,
పాద్యం సమర్పయేద్ విద్వాన్ సర్వకల్మషనాశనమ్. ౩

(గురువు:) మాయాపురియనదగు హృదయపద్మమున ధవళమణికాంతుల నీనుచు వెలయు ఆత్మలింగమును, నేను శ్రద్ధానదీ - నిర్మలజలము - మనదగు చిత్తముతో నభిషేకించుచు, సమాధి పుష్పములతో సర్వదా అర్చించుచున్నాను. నాకు పునర్జనము కలుగకుండునుగాక. ౧

నేనొక్కడనే పరిశిష్టుడను: అను చింతయే ఆవాహనము. స్వస్వరూప ప్రతిష్ఠా భావనయే ఆసనము. ఇట్లు శివున కావాహనాసనముల నర్పింపుము. ౨

నాకు పుణ్యపాపసంబంధమగు మాలిన్యము లేదు - అను జ్ఞానమునే సర్వకల్మషనాశనమగు పాద్యముగ భావించి అర్పింపనగును. ౩

---

* పరాపూజ లేక ఆత్మపూజ యనునది శిష్యవాక్కుగాను, ఈ నిర్గుణ మానసపూజ గురువువాక్కుగాను కొన్నిప్రతులలో కలదు. ఆ ప్రతులలో పరాపూజయందు ఈ అధికశ్లోకము లున్నవి.

"గీయతే శ్రుతిభిస్తస్య నీరాజనవిధిః కుతః,
ప్రదక్షిణమనన్తస్య ప్రణామోఽద్వయవస్తునః."
"వేదవాచామవేద్యస్య కిం వా స్తోత్రం విధీయతే,
అన్తర్బహిః సంస్థితస్యోద్వాసనావిధిః కుతః." ౨

అనాదికల్పవిధృత మూలాజ్ఞానజలాఞ్జలిమ్,
విసృజేదాత్మలిఙ్గస్య తదేవార్ఘ్య సమర్పణమ్. ౪

బ్రహ్మానన్దాబ్ధికల్లోలకణకోట్యంశ లేశకమ్,
పిబన్తీన్ద్రాదయ ఇతి ధ్యానమాచమనం మతమ్. ౫

బ్రహ్మానన్దజలేనైవ లోకాః సర్వే పరిప్లుతాః,
అచ్ఛేద్యోఽయమితి ధ్యానమభిషేచనమాత్మనః. ౬

నిరావరణచైతన్యం ప్రకాశోఽస్మీతి చిన్తనమ్,
ఆత్మలిఙ్గస్య సద్వస్త్రమిత్యేవం చిన్తయేన్మునిః. ౭

త్రిగుణాత్మాశేషలోకమాలికాసూత్రమస్మ్యహమ్,
ఇతి నిశ్చయమేవాత్ర హ్యుపవీతం పరం మతమ్. ౮

ఈఆత్మలింగమున కర్ఘ్యమేమన : అనాదికాలమునుండి సంచితమైన మూలాజ్ఞానమును జలాంజలిగ సమర్పించుటయే. ౪

బ్రహ్మానందతరంగకణముయొక్క కోట్యంశబిందువు నేఇంద్రాదులు పాన మొనర్చుచున్నారను ధ్యానమే ఆచమనము. ౫

బ్రహ్మానందజలము లోకము లన్నియును నిండియున్నవి. ఇది అచ్ఛేద్యము: అను భావనయే ఆత్మాభిషేకము. ౬

'నేను ఆవరణరహితమైన చైతన్యస్వరూపుడను, ప్రకాశస్వరూపుడను' అను చింతయే ఈఆత్మలింగమున కర్పింపదగిన చక్కనివస్త్రము. ఈరీతిగ మునియగువాడు ధ్యాన మొనర్పదగును. ౭

ఇక ఉపవీత మెట్టిదనిన : సత్త్వరజస్తమోగుణయుతములగు భువనము లను మాలల్లోని సూత్రమును నేనే, అను నిశ్చయము. ౮

అనేకవాసనామిశ్రప్రపఞ్చో౽యం ధృతో మయా,
నాన్యేనేత్యనుసన్ధానమాత్మనశ్చన్దనం భవేత్. ౯

రజః సత్త్వతమోవృత్తిత్యాగరూపైస్తిలాక్షతైః,
ఆత్మలింగం యజేన్నిత్యం జీవన్ముక్తిప్రసిద్ధయే. ౧౦

ఈశ్వరో గురురాత్మేతి భేదత్రయవివర్జితైః,
బిల్వపత్రైరద్వితీయైరాత్మలిఙ్గం యజేచ్ఛివమ్. ౧౧

సమస్తవాసనాత్యాగం ధూపం తస్య విచిన్తయేత్,
జ్యోతిర్మయాత్మవిజ్ఞానం దీపం సన్దర్శయేద్ బుధః. ౧౨

నైవేద్యమాత్మలిఙ్గస్య బ్రహ్మాణ్డాఖ్యం మహోదనమ్,
పిబానన్దరసం స్వాదు మృత్యురస్యోపసేచనమ్. ౧౩

పెక్కు వాసనలతో (సంస్కారములతో) నిండిన ఈ ప్రపంచమును నేనే ధరించియున్నాను. ఇతరులు కాదు, అను అనుసంధానమే చందనము. ౯

త్రిగుణవృత్తిత్యాగమును తిలలతోడను, అక్షతలతోడను, జీవన్ముక్తిని పొందునిమిత్తము, నిత్యము అర్పింపనగును. ౧౦

ఈశ్వరుడు, గురువు, ఆత్మ : ఈ మూటికిని భేదము లేదను భావనయే అద్వితీయమగు బిల్వపత్రముకాగా, దానితో శివస్వరూపమగు ఆత్మలింగమును పూజింప నగును. ౧౧

ప్రాజ్ఞవ్యక్తి సమస్తవాసనాత్యాగమునే ధూపముగ భావింపనగును. జ్యోతిర్మయమగు ఆత్మవిజ్ఞానమను దీపమును చూపింపనగును. ౧౨

బ్రహ్మాండమను అన్నమే ఈ ఆత్మలింగమునకు మహానైవేద్యము. మృత్యువే ఆధరువు – ఇట్టి చక్కటి బ్రహ్మానందరసమును త్రాగుము. ౧౩

అజ్ఞానోచ్ఛిష్టహస్తస్య క్షాలనం జ్ఞానవారిణా,
విశుద్ధస్యాత్మలిఙ్గస్య హస్తప్రక్షాలనం భవేత్. ౧౪

రాగాదిగుణశూన్యస్య శివస్య పరమాత్మనః,
సరాగవిషయాభ్యాసత్యాగస్తామ్బూలచర్వణమ్. ౧౫

అజ్ఞానధ్వాన్తవిధ్వంసప్రచణ్డమతిభాస్కరమ్,
ఆత్మనో బ్రహ్మతా జ్ఞానం నీరాజనమిహాత్మనః. ౧౬

వివిధబ్రహ్మసందృష్టిర్మాలికాభిరలఙ్కృతమ్,
పూర్ణానన్దాత్మతాదృష్టిం పుష్పాఞ్జలిమనుస్మరేత్. ౧౭

పరిభ్రమన్తి బ్రహ్మాణ్డసహస్రాణి మయీశ్వరే,
కూటస్థాచలరూపోఽహమితి ధ్యానం ప్రదక్షిణమ్. ౧౮

అజ్ఞానమే ఎంగిలి. ఇట్టి ఎంగిలితో కూడిన చేతిని, జ్ఞానమను నీటితో కడుగుము. విశుద్ధమగు ఆత్మలింగమునకు ఇదియే హస్తప్రక్షాలనము. ౧౪

విషయాభ్యాసమునందలి అనురాగమును త్యజించుటయే రాగాదిరహితుడును, శివస్వరూపుడును అగు పరమాత్మకు తాంబూలము నర్పించుట. ౧౫

అజ్ఞానాంధకారమును వినాశమొనర్చు సూర్యుడనదగు ఏ ప్రవరబుద్ధి కలదో, ఏది ఆత్మను, బ్రహ్మముగ గ్రహించుచున్నదో అదియే నీరాజనము. ౧౬

ఈ ఆత్మలింగమును, వివిధవస్తువులలో బ్రహ్మమును దర్శించు ప్రక్రియనే మాలగా నొనర్చి, అలంకరింపుము. పూర్ణానందస్వరూపమగు ఆత్మదర్శనమే పుష్పాంజలి. ౧౭

ఈశ్వరుడనగు నాయందు అనంతకోటి బ్రహ్మాండములు పరిభ్రమించుచున్నవి. నేను కూటస్థుడను, అచలుడను అను ధ్యానమే ప్రదక్షిణము. ౧౮

విశ్వవన్ద్యోఽహమేవాస్మి నాస్తి వన్ద్యో మదన్యతః,
ఇత్యాలోచనమేవాత్ర స్వాత్మలిఙ్గస్య వన్దనమ్. ౧౯

ఆత్మనః సత్క్రియా ప్రోక్తా కర్తవ్యాభావభావనా,
నామరూపవ్యతీతాత్మచిన్తనం నామకీర్తనమ్. ౨౦

శ్రవణం తస్య దేవస్య శ్రోతవ్యాభావచిన్తనమ్,
మననన్త్వాత్మలిఙ్గస్య మన్తవ్యాభావచిన్తనమ్. ౨౧

ధ్యాతవ్యాభావవిజ్ఞానం నిదిధ్యాసనమాత్మనః,
సమస్తభ్రాన్తివిక్షేపరాహిత్యేనాత్మనిష్ఠతా. ౨౨

సమాధిరాత్మనో నామ నాన్యచ్చిత్తస్య విభ్రమః,
తత్రైవ బ్రహ్మణి సదా చిత్తవిశ్రాన్తిరిష్యతే. ౨౩

నేను జగత్పూజ్యుడను, నాకంటె వందనీయు లెవ్వరును లేదు – అను చింతయే ఆత్మలింగవందనము. ౧౯

ఆత్మ కెట్టికర్తవ్యమును లేదు, అను చింతయే సత్కారము. నామరూప రహితమగు ఆత్మచింతనమే, నామకీర్తనము. ౨౦

ఆత్మభిన్నమగు శ్రోతవ్యవస్తువు లేదనుధ్యానమే, ఈపూజాంగమగు శ్రవణము; అన్యమగు మననవస్తువు లేదను-చింతనమే, ఆత్మలింగమననము. ౨౧

జగద్-భ్రాంతియను మనశ్చాంచల్యము లేకుండ ఆత్మనిష్ఠయందుండి, ధ్యానయోగ్యమగు వస్తువు మరియొక్కటి లేదను జ్ఞానమే, నిదిధ్యాసనము. ౨౨

బ్రహ్మమున చిత్తము సదా, విభ్రమమునందకుండ, నెలకొనియుండు అవయే సమాధియని చెప్పబడుచున్నది. ౨౩

ఏవం వేదాన్తకల్పోక్తస్వాత్మలిఙ్గప్రపూజనమ్,
కుర్వన్నామరణం వాపి క్షణం వా సుసమాహితః. ౨౪
సర్వదుర్వాసనాజాలం పదపాంసుమివ త్యజేత్,
విధూయాజ్ఞానదుఃఖౌఘం మోక్షానన్దం సమశ్నుతే. ౨౫

ఇది శ్రీశఙ్కరభగవత్పూజ్యపాద విరచిత నిర్గుణమానసపూజా ॥౨౦॥

ఈరీతిగ వేదాంతకల్పమున ఆత్మలింగపూజ విధింపబడినది. ఆమరణాంతముగాని, లేక ఒక్క క్షణముగాని, ఈ పూజనొనర్చినయెడల దుర్వాసనలన్నియును పాదధూళివలె పరిత్యక్తము లగును. అజ్ఞాన సంభూతమగు దుఃఖసమూహము విధూత మగును. మోక్షానందము లభించును. ౨౪_౨౫

ఇది నిర్గుణమానసపూజ ఆంధ్రానువాదము ॥౨౦॥

## ౨౧. ప్రాతఃస్మరణమ్

ప్రాతః స్మరామి హృదిసంస్ఫురదాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్,
యత్ స్వప్నజాగర సుషుప్తిమవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూతసఙ్ఘః ౧

ప్రాతర్భజామి మనసాం వచసామగమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ,
యన్నేతి నేతి వచనైర్నిగమా అవోచం
స్తం దేవదేవ మజమచ్యుత మాహురగ్ర్యమ్. ౨

సచ్చిదానంద స్వరూపమును, పరమహంసలకు గూడ ఆశ్రయమగునదియును, తురీయమును, హృదయమున ప్రకాశించునదియును, అగు ఆత్మతత్త్వమును ప్రాతఃకాలమున స్మరించుచున్నాను. జాగ్రత్స్వప్నసుషుప్తుల నెరుగునదియును, నిత్యమును, నిష్కళమును అగు బ్రహ్మమే నేను. పంచభూత నిర్మితమగు శరీరమును నేను గాను. ౧

మనోవాక్కులకగోచరమగుచు, మనోవాక్కులను ప్రకాశింపజేయుచు, వేదములచే "నేతి, నేతి" అని వర్ణింపబడుచు, పరదేవతయై, "అజ, అచ్యుత, ఆదిపురుష" శబ్దములచే వర్ణింపబడు పరబ్రహ్మమును ప్రాతఃకాలమున భజించుచున్నాను. ౨

ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్,
యస్మిన్నిదం జగదశేషమశేషమూర్తౌ
రజ్జ్వాం భుజఙ్గమ ఇవ ప్రతిభాసితం వై. 3

శ్లోకత్రయమిదం పుణ్యం లోకత్రయవిభూషణమ్,
ప్రాతఃకాలే పఠేద్యస్తు స గచ్ఛేత్ పరమం పదమ్. ४

ఇతి శ్రీ శఙ్కరభగవత్పూజ్యపాద విరచిత ప్రాతః స్మరణమ్ ॥౨౧॥

అజ్ఞానాతీతమును, సూర్యప్రభాసదృశమును, పూర్ణమును, సనాతనమును అగు పురుషోత్తమాఖ్య-పరబ్రహ్మమును ప్రాతఃకాలముననమస్కరించుచున్నాను. సర్వమూర్తి స్వరూపుడగు ఈఅశేషమూర్తియందే, జగత్తంతయును, రజ్జువున సర్పమువలె, ప్రకాశించుచున్నది. 3

లోకత్రయాలంకారమగు ఈశ్లోకత్రయమును ప్రాతఃకాలమున పఠించు వాడు ముక్తినందును. ४

ఇది ప్రాతఃస్మరణ ఆంధ్రానువాదము ॥౨౧॥

## ౨౨. ప్రశ్నోత్తర రత్నమాలికా

కః ఖలు నాలంక్రియతే దృష్టాదృష్టార్థసాధనపటీయాన్,
అనయా కంఠస్థితయా ప్రశ్నోత్తరరత్నమాలికయా. ౧

భగవన్ కిముపాదేయం గురువచనం హేయమపిచ కిమకార్యమ్,
కో గురురధిగత తత్త్వః శిష్యహితాయోద్యతః సతతమ్. ౨

త్వరితం కిం కర్తవ్యం సుధియా సంసారసన్తతిచ్ఛేదః,
కిం మోక్షతరోర్బీజం సమ్యగ్జ్ఞానం క్రియాసిద్ధమ్. ౩

కః పథ్యతరో ధర్మః కః శుచిరిహ యస్య మానసం శుద్ధమ్,
కః పణ్డితో వివేకీ కిం విషమవధీరణా గురుషు. ౪

ఈ ప్రశ్నోత్తరరత్నమాలికను కంఠహారముగ ధరించిన, ఐహికాముష్మిక ముల రెంటిని సాధించు సామర్థ్యమును బొంది, ఏపురుషుడు శోభింపకుండును? (అనగా దీనివలన లౌకికదివ్యజ్ఞానములు రెండును లభింపగలవు.) ౧

(శిష్యుడు): భగవంతుడా! గ్రహింపదగిన దేది?

(గురువు): గురువాక్యము. * త్యజింపదగిన దేది? అసత్కార్యము. గురు వెవరు? తత్త్వజ్ఞుడును, నిరంతర శిష్యవత్సలుడును.

బుద్ధిమంతుడగువాడు తొందరగా నిర్వహింపదగిన దేది? సంసారము భేదించుట. మోక్షవృక్ష బీజమేమి? – వర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానమున (చిత్తశుద్ధిద్వారమున) లభించెడు తత్త్వజ్ఞానము. ౩

అత్యంతము హితకరమగు వస్తువేది? ధర్మము. పవిత్రు డెవ్వడు? శుద్ధ చిత్తుడే. పండితు డెవ్వడు? ఆత్మానాత్మవివేకజ్ఞుడు. ఏది విషము? గుర్వవజ్ఞ.

---

* ఈమీదట ప్రశ్నలన్నియును శిష్యవాక్యములుగను, సమాధానము లన్నియును గురువచనములుగను గ్రహింప నగును.

కిం సంసారే సారం బహుశోఽపి విచిన్త్యమానమిదమేవ,
కిం మనుజేష్విష్టతమం స్వపరహితాయోద్యతం జన్మ. ౫

మదిరేవ మోహజనకః కః స్నేహః కే చ దస్యవో విషయాః,
కా భవవల్లీ తృష్ణా కో వైరీ యస్త్వనుద్యోగః. ౬

కస్మాద్ భయమిహ మరణాద్ అన్ధాదపి కో విశిష్యతే రాగీ,
కః శూరో యో లలనాలోచనబాణైర్న చ వ్యథితః. ౭

పాతుం కర్ణాఞ్జలిభిః కిమమృతమివ యుజ్యతే సదుపదేశః,
కిం గురుతాయా మూలం యదేతదప్రార్థనం నామ. ౮

కిం గహనం స్త్రీచరితం కశ్చతురో యో న ఖణ్డితస్తేన,
కిం దుఃఖమసన్తోషం కిం లాఘవమధమతో యాచ్ఞా. ౯

సంసారమున సార మెయ్యది? అనేకులు చింతించి నిర్ణయించినది. మానవులు అమితముగా కోరున దేది? తనకును ఇతరులకును ఉపకారమును జేయు వాని జన్మము. ౫

కలువలె మత్తెక్కించున దేది? స్నేహము. చోరు లెవ్వరు? విషయములే. సంసారపాశ మేది? తృష్ణ. శత్రు వెవరు? సోమరియే. ౬

ఇట భయప్రదమగున దేది? మృత్యువు. పుట్టుగ్రుడ్డి కంటెను గ్రుడ్డి ఎవరు? విషయాసక్తుడు. శూరు డెవడు? — లలనా — లోచన — బాణముల వలన వ్యధ నందనివాడు? ౭

ఎద్దానిని అమృతమువలె కర్ణాంజలితో పాన మొనర్ప దగును? సదుపదేశము. గౌరవమునకు మూల మేమి? యాచింపకుండుట. ౮

గహనమగున దేది? స్త్రీ చరిత్ర. చతురు డెవ్వడు? — స్త్రీలవలన జయింపబడనివాడు. దుఃఖకరమగున దేది? — అతృప్తి. లాఘవమగున దేది? — అధముని యాచించుటయే. ౯

కిం జీవితమనవద్యం కిం జాడ్యం పాఠతోఽప్యన
కో జాగర్తి వివేకీ కా నిద్రా మూఢతా జన్తోః.

నలినీదలగతజలవత్ తరలం కిం యౌవనం ధనం
కథయ పునః కే శశినః కిరణసమాః సజ్జనా ఏవ.

కో నరకః పరవశతా కిం సౌఖ్యం సర్వసఙ్గవిరతిర
కిం సాధ్యం భూతహితం ప్రియం చ కిం ప్రాణినా

కోఽనర్థఫలో మానః కా సుఖదా సాధుజనమైత్రీ
సర్వవ్యసనవినాశే కో దక్షః సర్వథా త్యాగీ.

కిం మరణం మూర్ఖత్వం కిం చానర్ఘం యదవసరే
ఆమరణం కిం శల్యం ప్రచ్ఛన్నం యత్కృతం పాః

జీవన మేది? దోషరహితమగున దే జీవనము. జాడ్య మేది
పట్టుబడకుండుట. జాగరూకు డెవ్వడు? వివేకి. నిద్ర ఏది? మూ

పద్మపత్రస్థజలమువలె చంచలమేది? — యౌవనము, ధనమ
చంద్రకిరణములవలె నిర్మలమగు చరిత్ర కలవారెవరు? — సజ్జనులు.

నరక మేది? పరాధీనత. సుఖ మేది? సర్వసంగ నివృత్తి.
దేది? ప్రాణిహితము. జీవులకు ప్రియమగున దేది? ప్రాణము.

అనర్థదాయకమగున దేది? మానము. సుఖదాయక మగున
జనమైత్రి. సర్వవ్యసనములను బోగొట్టుకొనగలవా డెవరు? త్యా

మరణ మేది? మూర్ఖత్వమే. అమూల్యమగున దేది?
దొడ్డపడిన దానము. ఆమరణము మనశ్శల్యమగున దేది? ప్రచ్ఛ
రించిన పాపము.

కుత్ర విధేయో యత్నో విద్యాభ్యాసే సదౌషధే దానే,
అవధీరణా క్వ కార్యా ఖల - పరయోషిత్ - పరధనేషు. ౧౫

కాఽహర్నిశమనుచిన్త్యా సంసారసారతా న ప్రమదా,
కా ప్రేయసీ విధేయా కరుణా దీనేషు సజ్జనమైత్రీ. ౧౬

కంఠగతైరప్యసుభిః కస్య హ్యాత్మా న శక్యతే జేతుమ్,
మూర్ఖస్య శఙ్కితస్య చ విషాదినో వా కృతఘ్నస్య. ౧౭

కః సాధుః సద్వృత్తః కమధమమాచక్షతే త్వసద్వృత్తమ్,
కేన జితం జగదేతత్ సత్యతితిక్షావతా పుంసా. ౧౮

కస్మై నమాంసి దేవాః కుర్వన్తి దయాప్రధానాయ,
కస్మాద్ ఉద్వేగః స్యాత్ సంసారారణ్యతః సుధియః. ౧౯

యత్నింపదగున వేవి? విద్యాభ్యాసము, మంచిఔషధము, దానము సైరింపదగని వేవి? ఖలుడు, పరస్త్రీ, పరధనము. ౧౫

అహర్నిశము చింతింపదగిన దేది? సంసారాసారతయే కాని, స్త్రీ చింతనము కాదు. అత్యంతము ప్రియకరములుగ భావింపదగిన వేవి? దీనులయెడ కరుణ, సజ్జనులతో మైత్రియును. ౧౬

ప్రాణము పోయినను ఎవరి చిత్తము కరుగకుండును? మూర్ఖుడును సందేహయుతుడును, విషాదగ్రస్తుడును, కృతఘ్నుడును; వీరి చిత్తమును జయిం చుట అసాధ్యము. ౧౭

సాధు వెవరు? సచ్చరిత్రుడు. అధము డెవడు? అసచ్చరిత్రుడు. ఎవ డీజగత్తును జయింప గలడు? సత్యనిష్ఠుడును, సహిష్ణువును అగువాడు. ౧౮

దేవతలెవరికి నమస్కరింతురు? దయాహృదయునకు. సంసారారణ్యమనిన ఉద్వేగము నందువా డెవడు? బుద్ధిమంతుడు. ౧౯

కస్య వశే ప్రాణిగణః సత్యప్రియభాషిణో వినీతస్య,
క్వ స్థాతవ్యం న్యాయ్యే పథి దృష్టార్థలాభాయ. ౨౦

కోఽన్ధో యోఽకార్యరతః కో బధిరో యో హితాని న శృణోతి,
కో మూకో యః కాలే ప్రియాణి వక్తుం న జానాతి. ౨౧

కిం దానమనాకాంక్షం కిం మిత్రం యో నివారయతి పాపాత్,
కోఽలఙ్కారః శీలం కిం వాచాం మణ్డనం సత్యమ్. ౨౨

విద్యుద్విలసితచపలం కిం దుర్జనసంగతిర్యువతయశ్చ,
కులశీలనిష్ప్రకమ్పాః కే కలికాలేఽపి సజ్జనా ఏవ. ౨౩

చిన్తామణిరివ దుర్లభమిహ కిం కథయామి తచ్చతుర్భద్రమ్,
కిం తద్వదన్తి భూయో విధూతతమసో విశేషేణ. ౨౪

జను లెవ్వరికి వశమగుదురు? సత్యమును, ప్రియమును బల్కుచు వినయము నగుబరచువానికి. దృష్టార్థమగు లాభమును బొందగోరువాడు అవలంబింప దగిన మార్గ మేది? న్యాయ్యమార్గము. ౨౦

అంధు డెవ్వడు? – అసత్కార్యనిరతుడు. బధిరు డెవ్వడు? హితోక్తుల నాదరింపనివాడు. మూగ ఎవరు? యథాకాలమున ప్రియవచనముల బల్క నేరనివాడు. ౨౧

దాన మేది? – నిష్కామమగునదే. మిత్రు డెవ్వడు? – పాపమునుండి మరల్చువాడు. అలంకార మేది? – శీలమే. వాక్కును భూషించునదేది? – సత్యము. ౨౨

మెరుపుతీగవలె చంచల మేది? – దుర్జనస్నేహము. యువతులును. కులశీలయుతు లెవ్వరు? – కలిలోగూడ సజ్జనులే. ౨౩

ఇహలోకమున చింతామణివలె దుర్లభమగున దేది? – అది చతుర్భద్రము. జ్ఞానులు దాని నెట్లు వివరింతురు? – ౨౪

దానంప్రియవాక్యసహితంజ్ఞానమగర్వం క్షమాన్వితం శౌర్యమ్,
విత్తం త్యాగసమేతం దుర్లభమేతచ్చతుర్భద్రమ్. ౨౫

కిం శోచ్యం కార్పణ్యం సతి విభవే కిం ప్రశస్తమౌదార్యమ్,
కః పూజ్యో విద్వద్భిః స్వభావతః సర్వదా వినీతో యః. ౨౬

కః కులకమలదినేశః సతి గుణవిభవేపి యో నమ్రః,
కస్య వశే జగదేతత్ ప్రియహితవచనస్య ధర్మనిరతస్య. ౨౭

విద్వన్మనోహరా కా సత్కవితా బోధనిరతా చ,
కం న స్పృశతి విపత్తిః ప్రబుద్ధవచనానువర్తినం దాన్తమ్. ౨౮

కస్మై స్పృహయతి కమలా త్వనలసచిత్తాయ నీతివృత్తాయ,
త్యజతి చ కిం సహసా ద్విజ గురు సుర నిన్దాకరం చ సాలస్యమ్.

అదుర్లభ చతుర్భద్ర మేమన : ప్రియవాక్యములతో గూడిన దానము· గర్వరహితమగు జ్ఞానము, క్షమాగుణముతో గూడిన శౌర్యము. దానముతో గూడిన ఐశ్వర్యము. ౨౫

శోచనీయ మేది ? వైభవముండగా పీనాసియగుట. ప్రశంసింపదగిన దేది ? ఔదార్యము. విద్వత్ - పూజ్యు డెవడు ? - వినయస్వభావుడు. ౨౬

కుల - పద్మభాస్కరు డెవ్వడు ? పెక్కుగుణములుండియును, నమ్రు డగువాడు. ఎవ డీజగత్తును లోబరచుకొన గలడు? ప్రియహితవచనముల బల్కు వాడును, ధర్మనిరతుడును. ౨౭

విద్వన్మనోహర మగున దేది ? - సత్కవితయును, జ్ఞానప్రబోధమును. ఆపద లెవ్వని నంటకుండును ? - పెద్దలమాటను లక్షించువానిని, ఇంద్రియ నిగ్రహవంతుని. ౨౮

లక్ష్మీప్రసన్ను డెవడు ? సోమరితనము లేనివాడును, నీతిమంతుడును. లక్ష్మి హఠాత్తుగ ఎవరిని వదలిపెట్టును? బ్రాహ్మణ, గురు, దేవతానిందకుని, సోమరిని. ౨౯

కేనాశోచ్యః పురుషః ప్రణతకళత్రేణ ధీరవిభవేన,
ఇహ భువనే కః శోచ్యః సత్యపి విభవే నయో దాతా.

కుత్ర విధేయో వాసః సజ్జననికటేఽథవా కాశ్యామ్,
కః పరిహార్యో దేశః పిశునయుతో లుబ్ధభూపశ్చ.

కిం లఘుతయా మూలం ప్రాకృతపురుషేషు యా యా
రామాదపి కః శూరః స్మరశరనిహతో న యశ్చలతి.

కిమహర్నిశమనుచిన్త్యం భగవచ్చరణం న సంసారః,
చక్షుష్మన్తోఽప్యన్ధాః కే స్యుర్యే నాస్తికా మనుజాః.

కః పఙ్గురిహ ప్రథితో వ్రజతి చ యో వార్ధకే తీర్థమ్,
కిం తీర్థమపి చ ముఖ్యం చిత్తమలం యన్నివర్తయతి.

దుఃఖము నందనివా డెవడు? లొంగుబాటులోనున్న భార్య నిలుకడగల సిరియును గల వ్యక్తి. దుఃఖమునందువా డెవడు? కలిగియ లేనివాడు.

వాసయోగ్యప్రదేశ మేది? సజ్జనులకడ, లేదా కాశీక్షేత్రము. దగిన దేశ మేది? క్రూరుడును, లోభియును అగు రాజుగల రాజ్యము.

లాఘవము నందుటకు కారణ మేమి? ప్రాకృతజనుల నర్థించుట. కంటెను శూరు డెవడు? కాముని బాణముల తాకిడికి చలింపనివాడు.

నిరంతరము ధ్యానింపదగిన దేది? భగవంతుని పాదపద్మములు, సంసారము కాదు. కళ్లుండియు గ్రుడ్డియగువా రెవరు? నాస్తికులగు మా

కుంటివా డెవడు? వృద్ధాప్యమున తీర్థసేవకు వెడలువాడు. ప్రధ మేది? చిత్తమాలిన్యమును బోగొట్టునది.

కిం స్మర్తవ్యం పురుషైః హరినామ సదా న యావనీ భాషా,
కో హి న వాచ్యః సుధియా పరదోషశ్చానృతం తద్వత్.

కిం సమ్పాద్యం మనుజైః విద్యా విత్తం బలం యశం పుణ్యమ్,
కః సర్వగుణవినాశీ లోభః శత్రుశ్చ కః కామః. ౩౬

కా చ సభా పరిహార్యా హీనా యా వృద్ధసచివేన,
ఇహ కుత్రావహితః స్యాత్ మనుజః కిల రాజసేవాయామ్.

ప్రాణాదపి కో రమ్యః కులధర్మః సాధుసఙ్గశ్చ,
కా సంరక్ష్యా కీర్తిః పతివ్రతా నైజబుద్ధిశ్చ. ౩౮

కా కల్పలతా లోకే సచ్ఛిష్యాయార్పితా విద్యా,
కోఽక్షయవటవృక్షః స్యాత్ విధివత్సత్పాత్రదత్తదానం యత్.

సర్వదా స్మరింపదగిన దేది? హరినామము, కాని యవనభాష కాదు. బుద్ధిమంతులు నుడువదగని దేది? పరదోషమును, అనృతమును. ౩౫

మానవుడు సంపాదింప దగిన వేవి? విద్య, విత్తము, బలము, కీర్తి, పుణ్యము. సర్వగుణ వినాశకరమగున దేది? లోభము. శత్రు వెవరు? కామము. ౩౬

త్యజింపవలసిన సభ ఏది? వృద్ధామాత్యుడు లేనిది. మానవుడు సావధానముగ నుండవలసిన విషయ మేది? రాజసేవ. ౩౭

ప్రాణముకంటెను రమణీయమగున దేది? కులధర్మము, సాధుసాంగత్యమును. రక్షింపదగిన దేది? కీర్తి, పతివ్రత, స్వబుద్ధియును. ౩౮

లోకమున కల్పవల్లియగున దేది? సత్‌శిష్యున కొసగిన విద్య. అక్షయవటవృక్ష మేది? శాస్త్రవిధిననుసరించి సత్పాత్రమున కొసగిన దానము. ౩౯

కిం శాస్త్రం సర్వేషాం యుక్తిర్మాతా చ కా ధేనుః,
కింను బలం యద్ధైర్యం కో మృత్యుర్యదవధానరహితత్వమ్.

కుత్ర విషం దుష్టజనే కిమిహాశౌచం భవేదృణం నృణామ్,
కిమభయమిహ వైరాగ్యం భయమపి కిం విత్తమేవ సర్వేషామ్.

కా దుర్లభా నృణాం హరిభక్తిః పాతకం చ కిం హింసా,
కోహి భగవత్ప్రియః స్యాద్యోఽన్యం నోద్వేజయేదనుద్విగ్నః.

కస్మాత్సిద్ధిస్తపసో బుద్ధిః క్వ ను భూసురే కుతో బుద్ధిః,
వృద్ధోపసేవయా కే వృద్ధా యే ధర్మతత్త్వజ్ఞాః. ౪౩

సమ్భావితస్య మరణాదధికం కిం దుర్యశో భవతి,
లోకే సుఖీ భవేత్ కో ధనవాన్ ధనమపి కిం యతశ్చేష్టమ్.

సర్వులకును శాస్త్ర మేది? యుక్తి. మాత ఎవరు? గోవు. బలమేది? ధైర్యము. మృత్యువేది? సావధానముగ లేకుండుట. ౪౦

విష మెక్కడ నుండును? దుష్టులయందు. అశౌచ మేమి? ఋణమే. అభయవస్తు వేది? వైరాగ్యము. సర్వులకును భయప్రదమగున దేది? ధనమే.

మానవులకు దుర్లభమగున దేది? హరిభక్తి. పాపమేది? హింస. భగవంతునకు ప్రియు డెవడు? ఇతరులకు ఉద్వేగము నొసగక, తా నుద్వేగము నందనివాడు. ౪౨

సిద్ధికి కారణ మేది? తపస్సు. బుద్ధిని ఎవరిమీద నిలుప నగును? బ్రాహ్మణులయందు. బుద్ధి ఎట్లు లభించును? వృద్ధులను సేవించుటవలన. వృద్ధు లెవరు? ధర్మతత్త్వజ్ఞులు. ౪౩

లోకమాన్యునకు మరణముకంటె అధికమగున దే.? నింద. లోకమున సుఖపడువా డెవడు? ధనికుడు. ధనమనగా నేమి? అభిలషి.వస్తువును బొంద జేయునది. ౪౪

సర్వసుఖానాం బీజం కిం పుణ్యం దుఃఖమపి కుతః పాపాత్,
కస్యైశ్వర్యం యః కిల శఙ్కరమారాధయేద్భక్త్యా. ౪౫
కో వర్ధతే వినీతః కో వా హీయతే యో దృప్తః,
కో న ప్రత్యేతవ్యో బ్రూతే యశ్చానృతం శశ్వత్. ౪౬
కుత్రానృతేప్యపాపం యచ్చోక్తం ధర్మరక్షార్థమ్,
కో ధర్మోఽభిమతో యః శిష్టానాం నిజకులీనానామ్. ౪౭
సాధుబలం కిం దైవం కః సాధుః సర్వదా తుష్టః,
దైవం కిం యత్సుకృతం కః సుకృతీ శ్లాఘ్యతే చ యః సద్భిః.
గృహమేధినశ్చ మిత్రం కిం భార్యా కో గృహీ చ యో యజతే.
కో యజ్ఞో యః శ్రుత్యా విహితః శ్రేయస్కరో నృణామ్. ౪౯

సమస్త సుఖములకును బీజ మేది? పుణ్యము. దుఃఖ మెట్లు కలుగుచున్నది? పాపమువలన. ఐశ్వర్య మెవని కుండును? భక్తితో శంకరుని ఆరాధించువానికి. ౪౫

అభివృద్ధిలోనికి వచ్చువా డెవడు? వినయవంతుడు. నశించువా డెవడు? గర్వితుడు. నమ్మదగనివా డెవడు? వెనుకాడక అబద్ధము చెప్పువాడు ౪౬

అనృతము నుడివినను పాపములేని పట్టేది? ధర్మరక్షణ మొనర్పవలసిన చోట. దేనిని ధర్మముగా నంగీకరింప నగును? కులపరంపరాగతమై, శిష్టులచే గ్రహింపబడినదానిని. ౪౭

సాధువ్యక్తికి బల మేమి? – దైవము. సాధు వెవరు? – సర్వదా సంతుష్టుడు దైవమనగా నేమి? – పుణ్యము. సుకృతి ఎవడు? – సత్పురుష ప్రశంస నందినవాడు. ౪౮

గృహస్థునకు హితు లెవరు? భార్య. గృహస్థు ఎవడు? యాగముల నొనర్చువాడు. యజ్ఞమనగా నేమి? వేదవిహితమును శ్రేయస్కరమును నగునది. ౪౯

కస్య క్రియా హి సఫలా యః పునరాచారవాన్ శిష్టః,
కః శిష్టో యో వేదప్రమాణవాన్ కో హతః క్రియాభ్రష్టః.
కో ధన్యః సన్న్యాసీ కో మాన్యః పణ్డితః సాధుః,
కః సేవ్యో యో దాతా యోఽర్థితృప్తిమాతనుతే. ౫౧
కిం భాగ్యం దేహవతా మారోగ్యం కః ఫలీ కృషికృత్,
కస్య న పాపం జపతః కః పూర్ణో యః ప్రజావాన్ స్యాత్.
కిం దుష్కరం నరాణాం యన్మనసో నిగ్రహః సతతమ్,
కో బ్రహ్మచర్యవాన్ స్యాద్ యశ్చాస్ఖలితోర్ధ్వరేతస్కః.
కా చ పరదేవతోక్తా చిచ్ఛక్తిః కో జగత్ భర్తా,
సూర్యః సర్వేషాం కో జీవనహేతుః స పర్జన్యః. ౫౪

ఎవరి యజ్ఞములు సఫలము లగును ? శిష్టుడును, ఆచారవంతుడును అగు వ్యక్తి క్రియలు. శిష్టు డెవడు ? వేదప్రమాణ విశ్వాసి. హతు డెవ్వడు ? కర్మ భ్రష్టుడు. ౫౦

ధన్యు డెవడు ? సన్న్యాసి. మాన్యు డెవడు ? పండితుడును సాధువును. సేవింపదగినవా డెవడు ? దాత.దాత ఎవరు ? యాచకులను తృప్తినందించువాడు.

శరీరధారులకు భాగ్య మేమి ? ఆరోగ్యము. సఫలు డెవడు ? కృషీవలుడు. నిష్పాపి ఎవడు ? జపకర్త. పూర్ణు డెవడు ? సంతానవంతుడు. ౫౨

మానవులకు దుష్కరమగున దేది ? మనోనిగ్రహము. బ్రహ్మచారి ఎవడు? అస్ఖలిత రేతస్కుడును, ఊర్ధ్వరేతస్కుడును అగువాడు. ౫౩

పరదేవత ఎవరు ? చిత్ శక్తి. జగద్భర్త ఎవరు ? సూర్యుడు. సర్వులకును జీవనహేతు వేది ? మేఘుడు. ౫౪

కః శూరో యో భీతత్రాతా త్రాతా చ కః స గురుః,
కో హి జగద్గురురుక్తః శమ్భుర్జ్ఞానం కుతః శివాదేవ. ౫౫

ముక్తిం లభతే కస్మాద్ ముకున్దభక్తేః ముకున్దః కః,
యస్తారయేదవిద్యాం కా చావిద్యా యదాత్మనోఽస్ఫూర్తిః.

కస్య న శోకో యః స్యాద్ అక్రోధః కిం సుఖం తుష్టిః,
కో రాజా రఞ్జనకృత్ కశ్చ శ్వా నీచసేవకో యః స్యాత్.

కో మాయీ పరమేశః క ఇన్ద్రజాలాయతే ప్రపఞ్చోఽయమ్,
కః స్వప్ననిభో జాగ్రద్ వ్యవహారః సత్యమపి చ కిం బ్రహ్మ.

కిం మిథ్యా యద్ విద్యానాశ్యం తుచ్ఛం తు శశవిషాణాది,
కా చానిర్వచనీయా మాయా కిం కల్పితం ద్వైతమ్. ౫౯

శూరు డెవడు ? _ భీతులను రక్షించువాడు. రక్షకు డెవడు ?_ గురువు. జగద్గురు వెవడు ?_ శంభువు. జ్ఞాన మెవనినుండి లభించును ?_ శివునినుండియే.

ముక్తి దేనివలన లభించును ?_ముకుంద _ భక్తివలన. ముకుందు డెవడు?_ అవిద్యను దాటించువాడు. అవిద్యయనగా నేమి?_ ఆత్మప్రకాశమును అడ్డునది.

ఎవనికి శోకము కలుగదు ?_కోపము లేనివానికి. సుఖ మేది ?_ తృప్తి. రాజెవడు ?_ప్రజలకు సంతోషమును గూర్చువాడు. శునక మెవడు ?_ నీచులను సేవించువాడు. ౫౭

మాయావి ఎవడు ?_ ఈశ్వరుడు. ఇంద్రజాలతుల్య మగున దేది ?_ఈ ప్రపంచము. స్వప్నసదృశ మగునదేది ?_ జాగ్రత్కాల వ్యవహారము. సత్యవస్తు వేది ?_బ్రహ్మము. ౫౮

మిథ్య యనగా నేమి ?_ ఎరుకవలన (జ్ఞానము వలన) నశించునది. తుచ్ఛ మేది ?_కుందేటికొమ్ము మొదలగునవి. అనిర్వాచనీయము ఏది ?_మాయ. కల్పిత మైన దేది ?_ద్వైతము. ౫౯

కిం పారమార్థికం స్యాదద్వైతం చాజ్ఞతా కుతోఽనాదిః,
వపుశ్చ పోషకం కిం ప్రారబ్ధం చాన్నదాయి కిం చాయుః.

కో బ్రాహ్మణైరుపాస్యో గాయత్ర్యర్కాగ్నిగోచరః శమ్భుః,
గాయత్ర్యామాదిత్యే చాగ్నౌ శమ్భౌ చ కిం నుతత్ తత్త్వమ్.

ప్రత్యక్షదేవతా కా మాతా పూజ్యో గురుశ్చ కస్తాతః,
కః సర్వదేవతాత్మా విద్యాకర్మాన్వితో బ్రాహ్మణః. ౬౨

కశ్చ కులక్షయహేతుః సన్తాపః సజ్జనేషు యోఽకారి,
కేషామమోఘవచనం యే చ పునః సత్యమౌనశమశీలాః.

కిం జన్మ విషయసఙ్గః కిముత్తరం జన్మ పుత్రః స్యాత్,
కోఽపరిహార్యో మృత్యుః కుత్ర పదం విన్యసేచ్చ దృక్పూతే.

పారమార్థికము యథార్థము ఏది ?_ అద్వైతము. అజ్ఞాన మెటనుండి వచ్చినది ?_అనాది కాలమునుండి కలదు. శరీరమును నిలబెట్టిన దేది ?_ ప్రారబ్ధ కర్మము. అన్నము నొసగున దేది ?_ ఆయువు ౬౦

బ్రాహ్మణుల కుపాస్య మేది ?_గాయత్రి, అగ్ని, సూర్యుడు. వీని ద్వారమున శివుని ఉపాశింపనగును. వీని నుపాసించుట ఏల ?_ అదియే తత్త్వము, సత్యవస్తువు. ౬౧

ప్రత్యక్షదేవత ఎవరు ?_తల్లి. పూజ్యుడగు గురు వెవరు ?_ తండ్రి. సర్వదేవతాస్వరూపు డెవడు ?_జ్ఞానకర్మశోభితుడగు బ్రాహ్మణుడు. ౬౧

కులక్షయకారణ మేది ?_ సజ్జనులకు కలిగించిన దుఃఖము. అమోఘవచస్కు లెవరు ?_సత్యమౌన జితేంద్రియగుణములు_కలవారు. ౬౩

జన్మ మేల ?_ విషయాసక్తివలన. ఉత్తరజన్మ మేది ?_ పుత్రుడే. అపరిహార్య మేది ?_ మృత్యువు. అడు గెక్కడ నుంచనగును ?_ దృష్టి చక్కగా నిలిచిన తావున. ౬౪

పాత్రం కిమన్నదానే క్షుధితం కోఽర్చ్యో హి భగవదవతారః,
కశ్చ భగవాన్ మహేశః శఙ్కర నారాయణాత్మైకః. ౬౫
ఫలమపి భగవద్భక్తేః కిం తల్లోకస్వరూపసాక్షాత్త్వమ్,
మోక్షశ్చ కో హ్యవిద్యాస్తమయః కః సర్వవేదభూరథచోమ్.
ఇత్యేషా కంఠస్థా ప్రశ్నోత్తర రత్నమాలికా యేషామ్,
తే ముక్తాభరణా ఇవ విమలాశ్చాభాన్తి సత్సమాజేషు.* ౬౭

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత ప్రశ్నోత్తర రత్నమాలికా ॥౨౨॥

అన్నదానపాత్రు డెవడు?_ క్షుధార్తుడు. అర్చింపబడిన దేది?_భగవదవతారము. భగవంతు డెవడు?_హరిహరనాథుడగు మహేశుడు. ౬౫

భగవద్భక్తికి ఫల మేమి?_ఆలోకస్వరూపసాక్షాత్కారములు. మోక్ష మనగా నేమి?_ అవిద్యాస్తమయము. సర్వవేదములకు ఉత్పత్తిస్థాన మేది?_ ఓంకారము. ౬౬

ఈ ప్రశ్నోత్తరరత్నమాలికను కంఠస్థ మొనర్చినవారు, ముత్యాలమాలను ధరించినవారివలె నిర్మలులై సాధుసమాజముల ప్రకాశింతురు. ౬౭

ఇది ప్రశ్నోత్తర రత్నమాలిక ఆంధ్రానువాదము. ॥౨౨॥

---

* "ఇతి కంఠగతా విమల ప్రశ్నోత్తర రత్నమాలికా యేషాం,
తేఽముక్తాభరణా అపి విభాన్తి విద్వత్సమాజేషు."

— పాఠాంతరము.

దీనిని కంఠస్థ మొనర్చినవారు ఆభరణ రహితులయ్యు పండిత సభలలో ప్రకాశింతురు.

## ౨౩. ప్రశ్నోత్తర మణిరత్నమాలా

అపార సంసార సముద్రమధ్యే,
నిమజ్జతో మే శరణం కిమస్తి,
గురో కృపాలో కృపయా వదైతద్
విశ్వేశపాదామ్బుజదీర్ఘనౌకా. ౧

బద్ధో హి కో యో విషయానురాగీ
కా వా విముక్తిర్విషయే విరక్తిః,
కో వాస్తి ఘోరో నరకః స్వదేహ
స్తృష్ణాక్షయః స్వర్గపదం కిమస్తి. ౨

సంసారహృత్ కః శ్రుతిజాత్మబోధః
కో మోక్షహేతుః సతతం స ఏవ,
ద్వారం కిమేకం నరకస్య నారీ
కా స్వర్గదా ప్రాణభృతామహింసా. ౩

శిష్యుడు: కృపాళుడవగు ఓ గురుదేవా! అంతులేని సంసారసముద్రమున మునిగిపోవుచుండిన నాకు ఆశ్రయ మేది?_ దయతో నుడువుము.
గురువు: విశ్వేశ్వరుని పాదపద్మములను దీర్ఘనౌకయే నీ కాశ్రయము. ౧

బద్ధు డెవడు?_విషయానురాగి. ముక్తి అనగా నేమి?_ విషయ వైరాగ్యము. ఘోరనరక మేది?_శరీరము. స్వర్గమన నేమి?_తృష్ణాక్షయము. * ౨

సంసారదుఃఖమును బోగొట్టున దేది?_వేదోక్తమగు ఆత్మబోధ. మోక్షకారణ మేది?_అదియే. నరకద్వార మేది?_నారి (పురుషునిపట్ల నారియును, నారియగుచో పురుషుడనియు భావము. ఇచ్చట స్త్రీ పురుషశబ్దములు కాకు పరములు.) ప్రాణులకు సర్వప్రదమగున దేది?_అహింస. 3

---

* ఇకనుండి ప్రశ్నలన్నియును శిష్యవాక్యములుగను, ప్రత్యుత్తరములన్నియును గురువాక్యములుగను భావింపవలెను.

శేతే సుఖం కస్తు సమాధినిష్ఠో
జాగర్తి కో వా సదసద్వివేకీ,
కే శత్రవః సన్తి నిజేన్ద్రియాణి
తాన్యేవ మిత్రాణి జితాని యాని. ౪

కో వా దరిద్రో హి విశాలతృష్ణః
శ్రీమాంశ్చ కో యస్య సమస్తతోషః,
జీవన్మృతః కస్తు నిరుద్యమో యః
కో వాఽమృతః స్యాత్ సుఖదా నిరాశా. ౫

పాశో హి కో యో మమతాభిమానః
సమ్మోహయత్యేవ సురేవ కా స్త్రీ,
కో వా మహాన్ధో మదనాతురో యో
మృత్యుశ్చ కో వా ఽపయశః స్వకీయమ్. ౬

సుఖనిద్ర బొందువా డెవడు ?_ సమాధినిష్ఠుడు. జాగరూకు డెవడు ?
సద్వివేకి. శత్రువు లెవరు ?_తన ఇంద్రియములే. మిత్రు లెవరు ?_వశీభూతము
న ఇంద్రియములే. ౪

దరిద్రు డెవడు ?_అధికతృష్ణ గలవాడు. లక్ష్మీయుతు డెవడు ?_ సర్వదా
ప్తుడు. జీవన్మృతు డెవ్వడు ?_ ఎట్టి ప్రయత్నము లేనివాడు. అమృత మేది?_
లేకుండుట. ౫

పాశ మేది ?_మమత్వాభిమానము. కల్లువలె మత్తెక్కించున దేది?_స్త్రీ
హాంధు డెవడు ?_ కామాతురుడు. మృత్యువనగా నేమి ?_ స్వకీయమగు
యశము. ౬

కో వా గురుర్యో హి హితోపదేష్టా
శిష్యస్తు కో యో గురుభక్త ఏవ,
కో దీర్ఘరోగో భవ ఏవ సాధో
కిమౌషధం తస్య విచార ఏవ. ౭

కిం భూషణాద్భూషణమస్తి శీలం
తీర్థం పరం కిం స్వమనో విశుద్ధమ్,
కిమత్ర హేయం కనకఞ్చ కాన్తా
శ్రావ్యం సదా కిం గురువేదవాక్యమ్. ౮

కే హేతవో బ్రహ్మగతేస్తు సన్తి
సత్సఙ్గతి ర్దానవిచారతోషాః,
కే సన్తి సన్తోఖిలవీతరాగా
అపాస్తమోహాః శివతత్త్వనిష్ఠాః. ౯

గురు వెవరు ?_ మంచిని చెప్పువాడు. శిష్యు డెవడు ?_ గురుభక్తుడు. దీర్ఘరోగ మేది ?_సంసారమే. దీనికి మందుఏది ?_ విచారమే. ౭

అలంకారములకు అలంకారమగున దేది ?_ శీలము. శ్రేష్ఠతీర్థ మేది ?_ విశుద్ధమగు మానస తీర్థము. జగత్తున త్యజింపదగిన వేవి ?_ కాంతాకనకములు. సదా వినదగిన వేవి ?_గురు, వేదవాక్యములు. ౮

బ్రహ్మప్రాప్తికి కారణము (ఉపాయము) లేవి ?_ సత్సంగ, దాన, విచార, సంతోషములు. సాధువు లెవరు ?_విషయానురాగమును, మోహమును, విడచి శివతత్త్వనిష్ఠు లగువారు. ౯

కో వా జ్వరః ప్రాణభృతాం చ చిన్తా
మూర్ఖోఽస్తి కో యస్తు వివేకహీనః,
కార్యా ప్రియా కా శివవిష్ణుభక్తిః
కిం జీవనం దోషవివర్జితం యత్. ౧౦

విద్యా హి కా బ్రహ్మగతి ప్రదా యా
బోధో హి కో యస్తు విముక్తి హేతుః,
కో లాభ ఆత్మావగమో హి యో వై
జితం జగత్ కేన మనో హి యేన. ౧౧

శూరాన్మహాశూరతమోఽస్తి కో వా
మనోజబాణైర్వ్యథితో న యస్తు,
ప్రాజ్ఞో హి ధీరశ్చ సమశ్చ కో వా
ప్రాప్తో న మోహం లలనాకటాక్షైః. ౧౨

జీవులకు జ్వర మేది ?_ చింత. మూర్ఖు డెవడు ?_ వివేకహీనుడు. ఏ కార్యము ప్రియకరము ?_ శివకేశవభక్తి. జీవన మేది ?_ దోషరహితమైనదియే జీవితము. ౧౦

విద్య ఏది ?_ బ్రహ్మగతి నొసంగునది. బోధ ఏది ?_ముక్తిదాయక మగు నది. లాభ మేది ?_ ఆత్మలాభము. జగత్తును జయింపగలుగువా డెవడు ?_ తన మనస్సును జయించినవాడు. ౧౧

వీరాధివీరు డెవడు ?_ మదనశరవ్యధితుడు కానివాడు. ప్రాజ్ఞుడును, ధీరుడును, సమదృష్టియును అగువా డెవడు ?_ లలనాకటాక్షముల మోహాము నందనివాడు. ౧౨

విషాద్ విషం కిం విషయాః సమస్తా
దుఃఖీ సదా కో విషయానురాగీ,
ధన్యస్తు కో యస్తు పరోపకారీ
కః పూజనీయః శివతత్త్వ నిష్ఠః. ౧౩

సర్వాస్వవస్థాస్వపి కిన్న కార్యం,
కిం వా విధేయం విదుషా ప్రయత్నాత్,
స్నేహశ్చ పాపం పఠనఞ్చ ధర్మః
సంసారమూలం హి కిమస్తి చిన్తా. ౧౪

విజ్ఞాన్ మహావిజ్ఞతమోఽస్తి కో వా
నార్యాపిశాచ్యా న చ వఞ్చితో యః,
కా శృఙ్ఖలా ప్రాణభృతాం చ నారీ
దివ్యం వ్రతం కిఞ్చ సమస్తదైన్యమ్. ౧౫

విషమునుమించు విష మేది ?_సమస్తములగు ఇంద్రియ విషయములును. శర్వదా దుఃఖము నందువా డెవడు ?_విషయానురాగి. ధన్యు డెవడు ?_పరోపకారి. పూజనీయు డెవడు ?_శివతత్త్వనిష్ఠుడు. ౧౩

సర్వావస్థలలో చేయఁగూడని వేవి ?_ చేయదగిన వేవి ?_ స్నేహము, పాపము ఇవి చేయఁగూడనివి. శాస్త్రాధ్యయనము, ధర్మానుష్ఠానము ఇవి చేయ దగినవి. సంసారమూల మేది ? _చింత. ౧౪

విజ్ఞాతివిజ్ఞు డెవడు?_ నారీపిశాచవంచితుడు కానివాడు. జీవునకు సంకెల యేది ?_ స్త్రీ. దివ్యవ్రత మేది ?_ సంపూర్ణదైన్యము. ౧౫

జ్ఞాతుం న శక్యం చ కిమస్తి సర్వై
ర్యోషిన్మనో యచ్చరితం తదీయమ్,
కా దుస్త్యజా సర్వజనైర్దురాశా
విద్యావిహీనః పశురస్తి కో వా. ౧౬

వాసో న సఙ్గః సహ కైర్విధేయో
మూర్ఖైశ్చ నీచైశ్చ ఖలైశ్చ పాపైః,
ముముక్షుణా కిం త్వరితం విధేయం
సత్సఙ్గతిర్నిర్మమతేశభక్తిః. ౧౭

లఘుత్వమూలఞ్చ కిమర్థితైవ
గురుత్వమూలం యదయాచనఞ్చ,
జాతో హి కో యస్య పునర్న జన్మ
కో వాఽమృతో యస్య పునర్న మృత్యుః, ౧౮

సర్వులకును ఎరుగరాని దేది ?_ స్త్రీలమనస్సుయును, శీలమును. త్యజింపరాని దేది ?_ దురాశ. పశు వెవడు ?_ విద్యావిహీనుడు. ౧౬

ఎవరితో నివసింపగూడదు ?_ మూర్ఖులును, ఖలులును అగువారితోడ. పాపులును అగువారితోడ. ముముక్షువులు త్వరగా సంపాదింపదగిన వేవి ?_ సత్సంగము, నిర్మమత్వము, ఈశ్వరభక్తియును. ౧౭

లాఘవకారణ మేది ?_ యాచన. గురుత్వకారణ మేది ?_ చేయిజాపకుండుట. ఎవని పుట్టుక సార్థకము ?_ మరిజన్మములేనివాని పుట్టుక. అమృతు డెవడు ?_ మరి ఈమీదట మృతి నందనివాడు. ౧౮

మూకోఽస్తి కో వా బధిరశ్చ కో వా
వక్తుం న యుక్తం సమయే సమర్థమ్,
తథ్యం సుపథ్యం న శృణోతి వాక్యం
విశ్వాసపాత్రం న కి మస్తి నారీ. ౧౯

తత్త్వం కిమేకం శివమద్వితీయం
కిముత్తమం సచ్చరితం యదస్తి,
త్యాజ్యం సుఖం కిం స్త్రియమేవ సమ్యక్
దేయం పరం కిం త్వభయం సదైవ. ౨౦

శత్రోర్మహాశత్రుతమోఽస్తి కో వా
కామః సకోపోఽనృతలోభ తృష్ణాః,
న పూర్యతే కో విషయైః స ఏవ
కిం దుఃఖమూలం మమతాభిధానమ్. ౨౧

మూకబధిరు లెవరు ?_యథాకాలమున యథార్థమును నుడువజాలనివాడు మూగ; హితకరవాక్యములు విననివాడు చెవిటివాడు. విశ్వాసయోగ్యముకాని దేది ?_నారి. ౧౯

ఏకమాత్రమగు తత్త్వ మేది ?_ అద్వితీయమగు శివతత్త్వము. ఉత్తమ వస్తు వేది ?_ సచ్చరితము. ఏ సుఖమును సర్వాత్మభావముగ త్యజింపనగును ?_ స్త్రీసుఖము. అపూర్వమగు దాన మేది ?_అభయదానము. ౨౦

శత్రువునుమించిన శత్రు వెవరు ? కామము, క్రోధము, మిథ్య, లోభము తృష్ణ అనునవి. విషయభోగమువలన పరితృప్తినందని దెవరు?_విషయములే. దుఃఖ కారణ మేది ? మమత్వమే. ౨౧

కిం మణ్డనం సాక్షరతా ముఖస్య
సత్యఞ్చ కిం భూతహితం సదైవ,
కిం కర్మ కృత్వా న హి శోచనీయం
కామారికంసారి సమర్చనాఖ్యమ్. ౨౨

కస్యాస్తి నాశో మనసో హి మోక్షః
క్వ సర్వథా నాస్తి భయం విముక్తౌ,
శల్యం పరం కిం నిజమూర్ఖతైవ
కే కే హ్యుపాస్యా గురుదేవ వృద్ధాః. ౨౩

ఉపస్థితే ప్రాణహరే కృతాన్తే
కిమాశు కార్యం సుధియా ప్రయత్నాత్,
వాక్కాయచిత్తైః సుఖదం యమఘ్నం
మురారి పాదామ్బుజ చిన్తనఞ్చ. ౨౪

ముఖమున కలంకార మేది ?_ విద్య. సదా ప్రాణులకు హితకరమగున దేది ?_సత్యము. ఏ కర్మము నొనర్చిన శోచనీయము కాదు ?_కామారి [శివుడు] యొక్కయు, కంసారి [కృష్ణుడు] యొక్కయు పూజ. ౨౨

ఏది నాశనమైన మోక్షము లభించును ?_మనస్సు. సర్వథా భయరహిత స్థితి ఏది ?_ స్వీయమూర్ఖత్వము. ఉపాసింపదగినవా రెవరు ? _ గురు, దేవతా, వృద్ధులు. ౨౩

ప్రాణహారియగు యముడువచ్చి ఎదురుగా నిలచినప్పుడు, బుద్ధిమంతు డగువాడు వెంటనే యొనర్పదగిన దేది ?_ మనోవాక్కాయములతో, సుఖము నొసగునదియు, యమభయమును నివారించునదియును అగు శ్రీహరి పాదపద్మ చింతనము. ౨౪

కే దస్యవః సన్తి కువాసనాఖ్యాః
కః శోభతే యః సదసి ప్రవిద్యః,
మాతేవ కా వా సుఖదా సువిద్యా
కి మేధతే దానవశాత్ సువిద్యా. ౨౫

కుతో హి భీతిశ్చ సదా విధేయా
లోకాపవాదాద్ భవకాననాచ్చ,
కో వాఽతిబన్ధుః పితరశ్చ కేవా
విపత్సహాయాః పరిపాలకాయే. ౨౬

బుద్ధ్వా న బోధ్యం పరిశిష్యతే కిం
శివప్రసాదాత్ సుఖబోధరూపమ్,
జ్ఞాతే చ కస్మిన్ విదితం జగత్ స్యాత్
సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే. ౨౭

చోరు లెవరు ?_కువాసనలు. సభలో శోభిల్లున దెవరు ?_సుపండితుడు. మాతవలె సుఖము నొసగున దేది ?_ సువిద్య. దాన మొనర్చిన వర్ధిల్లున దేది ?_ సువిద్య. ౨౫

సర్వదా దేనినిగూర్చి భయపడదగును ?_ లోకాపవాదము, సంసారార ణ్యమును. అత్యంతము స్నేహితు డెవడు ?_ ఆపదలో అడ్డుకొనువాడు. పితృ తుల్యు లెవరు ?_పోషకులు. ౨౬

దేని నెరిగిన మరి తెలిసికొనదగిన దుండదు ? _ శివప్రసాదమున సుఖ స్వరూపమగు బ్రహ్మమును. దేని నెరిగిన జగత్తు తెలియబడును ? _ పూర్ణ రూపమును, సర్వాత్మకమును అగు పరబ్రహ్మమును. ౨౭

కిం దుర్లభం సద్గురురస్తి లోకే
సత్సఙ్గతిర్బ్రహ్మవిచారణా చ,
త్యాగో హి సర్వస్య శివాత్మబోధః
కో దుర్జయం సర్వజనైర్మనోజః. ౨౮

పశోః పశుః కో న కరోతి ధర్మం
ప్రాచీనశాస్త్రేఽపి న చాత్మబోధః,
కిం తద్ విషం భాతి సుధోపమం స్త్రీ
కే శత్రవో మిత్రవదాత్మజాద్యాః. ౨౯

విద్యుచ్చలం కిం ధన యౌవనాయు
ర్దానం పరం కిం చ సుపాత్ర దత్తమ్,
కంఠంగతైరప్యసుభిర్న కార్యం
కిం కిం విధేయం మలినం శివార్చా. ౩౦

లోకమున దుర్లభమగున దేది ?_సద్గురువు, సత్సంగము, బ్రహ్మవిచారము. సర్వత్యాగ మెప్పుడు కలుగును ?_ నేను శివస్వరూపుడనను ఆత్మబోధ కలిగి నప్పుడు. దుర్జయు డెవడు ?_ మనోజుడు. ౨౮

పశువులలోకెల్ల పశు వెవరు ? _ ధర్మానుష్ఠాన మొనర్పనివాడును, ప్రాచీనశాస్త్రములవలన ఆత్మజ్ఞానము బొందజాలనివాడును. విషమయ్యును అమృతమువలె తోచున దేది ?_ స్త్రీ. శత్రువు లెవరు ?_ మిత్రులవలె తోచు పుత్రాదులు. ౨౯

విద్యుత్ చంచలము లేవి ?_ధన యౌవ నాయువులు. గొప్పదాన మేది?_ సత్పాత్రదానము. ప్రాణము పోయినను చేయదగని దేది ?_ చెడ్డపని; అట్టి స్థితిలో నొనర్పదగిన దేది ?_ శివారాధన. ౩౦

అహర్నిశం కిం పరిచిన్తనీయం
సంసారమిథ్యాత్వశివాత్మ తత్త్వమ్,
కిం కర్మ యత్ప్రీతికరం మురారేః,
క్వాస్థా న కార్యా సతతం భవాబ్ధౌ. ౩౧

కంఠంగతా వా శ్రవణం గతా వా
ప్రశ్నోత్తరాఖ్యా మణిరత్నమాలా,
తనోతు మోదం విదుషాం సురమ్యం
రమేశ గౌరీశ కథేవ సద్యః. ౩౨

ఇతి శ్రీ శఙ్కర భగవత్పూజ్యపాద విరచిత ప్రశ్నోత్తరమణిరత్నమాలా ॥౨౩॥

రాత్రిం దినములు చింతింపదగిన దేది ?_ సంసార మిథ్యాత్వమును, జీవశివైక్యమును. కర్మమనగా నేమి ?_ విష్ణుప్రీతికర మగునది. విశ్వాసింపదగని దేది ?_ సంసార సముద్రము. ౩౧

కంఠస్థమైనను, శ్రవణగతమైనను ఈ ప్రశ్నోత్తర-మణిరత్నమాల హరి కథవలెను, విద్వాంసులకు తక్షణము ఆనందము నొసగును గాక ॥ ౩౨

ఇది ప్రశ్నోత్తరమణిరత్నమాల ఆంధ్రానువాదము ॥౨౩॥

# ౨౪. ప్రౌఢానుభూతిః

ప్రౌఢ - ప్రౌఢనిజానుభూతిగలితద్వైతేన్ద్రజాలో గురు
గ్గూఢం గూఢమఘౌఘదుష్టసుధియాం స్పష్టం సుధీశాలినామ్,
స్వాన్తే సమ్యగ్ ఇహానుభూతమపి సచ్ఛిష్యావబోధాయ తత్
సత్యం సంస్మృతవాన్ సమస్తజగతాం నైజం నిజాలోకనాత్. ౧

ద్వైతం మయ్యఖిలం సముత్థితమిదం మిథ్యా మనఃకల్పితం
తోయం తోయవివర్జితే మరుతలే భ్రాన్త్యైవ సిద్ధం న హి,
యద్వైతం ఖలు దృశ్యమేతదఖిలం నాహం న వా తన్మమ
ప్రౌఢానన్దచిదేకసన్మయవపుః శుద్ధోఽస్మ్యఖణ్డోఽస్మ్యహమ్. ౨

ఆత్మస్వరూపమగు సత్యము, పాపకలుషిత బుద్ధులకు అత్యంతము గూఢమై యున్నది. కాని పరిణతబుద్ధులు దానిని చక్కగ స్వాంతమున అనుభవమునకు దెచ్చుకొని, అత్యంతప్రౌఢమగు ఈ దృగ్జ్ఞానుభూతివలన, ద్వైత రూపమగు కనికట్టును విప్పివేయుచున్నారు. ఇట్టి సత్యానుభూతిని బొందిన ఒకానొక గురువు (అంతటితో తృప్తిపడక) సత్ - శిష్యప్రబోధనిమిత్తము, సమస్త జగత్తుయొక్క పారమార్థిక స్వరూపమగు ఆ సత్యమును సంస్మరించు చున్నాడు.

మనః కల్పితమును, ద్వైతరూపమును, మిథ్యయును అగు ఈ జగత్తు నాయం దావిర్భవించు చున్నది. నీరు లేని ఎడారియందు పొరబడినను నీరు ఊబుకదు కదా! ఈదృశ్యజగత్తు నేను కాదు? లేక అది నాదియును కాదు. ప్రౌఢ సచ్చిదానందమయ మూర్తినగు నేను శుద్ధుడను, అఖండుడను. ౨

దేహో నాహమచేతనోఽయమనిశం కుడ్యాదివన్నిశ్చితో
నాహంప్రాణమయోఽపివా దృతిధృతో వాయుర్యథానిశ్చితః,
సోఽహం నాఽపి మనోమయః కపిచలః కార్పణ్యదుష్టో న వా
బుద్ధిస్సద్ధకువృత్తికేవ కుహనా నాజ్ఞానమస్తం తమః. ౩

నాహం ఖాదిరపి స్ఫుటం మరుతలభ్రాజత్పయఃసామ్యత
స్తేభ్యో నిత్యవిలక్షణోఽఖిలదృశః సౌరప్రకాశో యథా,
దృశ్యైః సఙ్గవివర్జితో గగనవత్ సంపూర్ణరూపోఽస్మ్యహం
తస్మిస్తిష్ఠత్యనురోధత స్త్వహమిదం నీచ్యాది సిన్ధుర్యథా. ౪

నేను స్తంభాదులవలె అచేతనమగు శరీరమను కాను - అను విషయము సుస్పష్టము. కమ్మరివాని కొలిమితిత్తివలె, వాయుపూరితమగు ప్రాణమయ కోశముకూడ నేను కాదు. కోతివలె చంచలమును, కార్పణ్యదుష్టమును అగు మనోమయకోశముగూడ నేను కాదు. (తన్ను విజ్ఞునిగా నెన్నుకొను) ప్రబుద్ధుని కుత్సిత బుద్ధివలె కుహనాగతియగు విజ్ఞానమయకోశముకూడ నేను కాదు. అంధకారసదృశమగు అజ్ఞానము - ఆనందమయకోశము - కూడ నేను కాదు. (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములలో నేయొకటియును నేను కాదు, అని భావము) ౩

మరుమరీచికలవలె, మిథ్యయయ్యును స్పష్టముగ ప్రకాశించెడు, ఈ ఆకాశాది పంచభూతములుకూడ నేను కాదనుట నిక్కము. ఘటాదివస్తువులను ప్రదర్శించు సూర్యకాంతి వానికంటె వేరగునట్లు, ఈ ఆకాశాదులను ప్రకాశింపజేయుచు, నేను వానికంటె వేరుగనున్నాడను. నేను ఆకాశమువలె నిర్లిప్తుడను, పూర్ణస్వరూపుడను. ఇవి అన్నియును నేనే - సముద్రమున తరంగ ఫేన బుద్బుదములవలె, ఈ సర్వమును నాయందు ధారోపితమై తోచుచున్నది. ౪

నిర్ద్వైతోఽస్మ్యహమస్మి నిర్మలచిదాకాశోఽస్మి పూర్ణోఽస్మ్యహం
నిర్దేహోఽస్మి నిరిన్ద్రియోఽస్మి నితరాం నిష్ప్రాణవర్గోఽస్మ్యహమ్
నిర్ముక్తాశుభమానసోఽస్మి విగలద్విజ్ఞానకోశోఽస్మ్యహం
నిర్మాయోఽస్మి నిరన్తరోఽస్మి విపులప్రౌఢప్రకాశోఽస్మ్యహమ్. ౫

మత్తోఽన్యన్న హి కిఞ్చిదస్తి యది చిద్భాస్యం తత్ స్వస్వరూపా
గుఞ్జావహ్నివదేవ సర్వకలనాధిష్ఠానభూతోఽస్మ్యహమ్
సర్వస్యాపి దృగస్మ్యహం సమరసః శాన్తోఽస్మ్యపాపోఽస్మ్యహం
పూర్ణోఽస్మ్యద్వయవర్జితోఽస్మి విపులాకాశోఽస్మి నిత్యోఽస్మ్య
హమ్. ౬

నేను నిర్ - ద్వైతుడను, నిర్మలచిదాకాశమును, పూర్ణుడను, అశరీరిని, నిరింద్రియుడను, పంచప్రాణములకు అతీతుడను, అశుభమనోరహితుడను, విజ్ఞానమయకోశరహితుడను, మాయారహితుడను, మరియు నేను నిరంతరాయమానుడనై, విశాలగాఢప్రకాశస్వరూపుడ నగుచున్నాను. ౫

నాకంటె వేరగు వస్తు వింకొకటి లేదు. ఉండినపక్షమున అది చైతన్యప్రకాశ్యమగుటవలన, గురివిందగింజలయం దగ్నిభ్రమవలె, మిథ్యయే. సమస్తకల్పనలకును అధిష్ఠానమగునది నేనే. సమస్తమునకును ద్రష్టయును నేనే. నేను సమరసస్వరూపుడను. ఏకరసస్వరూపుడను. శాంతుడను. నిష్పాపుడను. పూర్ణుడను, ద్వైతరహితుడను, అనంతాకాశస్వరూపుడను. నిత్యుడను. ౬

మయ్యస్మిన్ పరమార్థకే శ్రుతిశిరోవేద్యే స్వతో భాసనే
కా వా విప్రతిపత్తిరేతదఖిలం భాత్యేవ యత్సన్నిధేః
సౌరాలోకవశాత్ ప్రతీతమఖిలం పశ్యన్న తస్మిన్ జనః
సన్దిగ్ధోఽస్త్యత ఏవ కేవలశివః కోఽపి ప్రకాశోఽస్మ్యహమ్. ౭

నిత్యస్ఫూర్తిమయోఽస్మి నిర్మలసదాకాశోఽస్మి శాన్తోఽస్మ్యహం
నిత్యానన్దమయోఽస్మి నిర్గతమహామోహాన్ధకారోఽస్మ్యహమ్
విజ్ఞాతం పరమార్థతత్త్వమఖిలం నైజం నిరస్తాశుభం
ముక్తప్రాప్యమపాస్తభేదకలనాకైవల్యసంజ్ఞోఽస్మ్యహమ్. ౮

దేని సాన్నిధ్యమువలన ఈ సర్వవస్తువులును ప్రకాశము నందుచున్నవో, ఆ పరమార్థభూతుడనగు నాయందు విరుద్ధజ్ఞాన మెట్లుండగలదు? నేను వేదాంతవేద్యుడను. స్వప్రకాశస్వరూపుడను. సర్వమును సూర్యుని ప్రకాశమువలన కంటికి కనబడుచుండ, ఆ వెలుగును ఎవ్వరును సందేహింపరు. నేను కేవల శివస్వరూపుడను. ఒకానొక ప్రకాశస్వరూపుడను. ౭

నేను నిరంతరప్రకాశస్వరూపుడను, నిర్మలసదాకాశరూపుడను, శాంతుడను, నిత్యానందమయుడను, మహామోహాంధకారరహితుడను. అశుభసంపర్కలేశములేని నా నిజస్వరూపమును, పరమార్థతత్త్వమగు దానిని తెలిసికొంటిని. ఇది కేవలము ముక్తులు బొందదగిన స్థితియే. భేదజ్ఞానలవలేశమునుగూడ పరాభవించెడు కైవల్యస్వరూపము నాది. ౮

స్వాప్నద్వైతవదేవ జాగ్రతమపి ద్వైతం మనోమాత్రకం
మిథ్యేత్యేవ విహాయ సచ్చిదమలం స్వాత్మైకరూపోఽస్మ్యహమ్
యద్వా వేద్యమశేషమేతదనిశం మద్రూపమేవేత్యపి
జ్ఞాత్వా త్యక్తమరున్మహాబ్ధిరివ ప్రౌఢో గభీరోఽస్మ్యహమ్.

గన్తవ్యం కిమిహాఽస్తి సర్వపరిపూర్ణస్యాఽఖణ్డాకృతేః
కర్తవ్యం కిమిహాఽస్తి నిష్క్రియతనోర్మోక్షైకరూపస్య మే
నిర్ద్వైతస్య న హేయమన్యదపి వా నో హ్యుపేయాన్తరం
శాన్తోఽద్యాస్మి విముక్తతోయవిమలో మేఘో యథా నిర్మలః.

స్వప్నమున అనుభవింపబడు ద్వైతమువలెనే, జాగ్రదనుభూతమగు ద్వైతముకూడ మనఃకల్పనయే. కనుక దీనిని మిథ్యగా గ్రహించి, త్యజించి సచ్చిదమలస్వస్వరూపముననే నెలకొనియుందును. లేదా, ఈజ్ఞేయవస్తుసముదాయమంతయును నాస్వరూపమేయని ఎరిగి, వాయురహితమగు మహాసముద్రమువలె ప్రౌఢగంభీరుడనై యుందును. ౯

నేను సర్వవస్తువులయందున, పరిపూర్ణుడనై అఖండముగ విరాజిల్లుచున్నాడను. నాకు వెడలదగిన స్థానమేది? నేను నిష్క్రియమూర్తిని, మోక్షరూపుడను. నాకిక కర్తవ్యమెట్లుండగలదు? ద్వైతరహితుడనగు నాకు పరిగ్రహింపవలసినదిగాని, త్యజింపదగినదిగాని (హేయోపాదేయములు) లేవు. జలరహితమగు మేఘమువలె నేను నిర్మలుడనై, ఇప్పుడు శాంతుడనైతిని. ౧౦

కిన్ను ప్రాప్తమితః పురా కిమధునా లబ్ధం విచారాదినా
యస్మాత్ తత్సుఖరూపమేవ సతతంజాజ్వల్యమానోఽస్మ్యహమ్
కిం వాపేక్ష్యమిహాపి మయ్యతితరాం మిథ్యావిచారాదికం
ద్వైతాద్వైతవివర్జితే సమరసే మౌనం పరం సమ్మతమ్. ౧౧

శ్రోతవ్యం చ కిమస్తి పూర్ణసుదృశో మిథ్యాపరోక్షస్య మే
మన్తవ్యం చ న మేఽస్తి కిఞ్చిదపి వా నిఃసంశయజ్యోతిషః
ధ్యాతృధ్యేయవిభేదహానివపుషో న ధ్యేయమస్త్యేవ మే
సర్వాత్మైకమహారసస్య సతతం నో వా సమాధిర్మమ. ౧౨

ఆత్మానాత్మవివేచనాపి మమ నో విద్వత్కృతా రోచతే
నాత్మా నాస్తి యదస్తి గోచరవపుః కో వా వివేక్తుం క్షమః,

ఇంతకుముందు విచారాదులవలన నేను పొందిన వస్తువేది? ఇప్పుడు పొందిన దేమి? నిరంతర జాజ్వల్యమానమగు ప్రకాశస్వరూపమే నాది. నేను సుఖస్వరూపుడను, ద్వైతాద్వైతరహితుడను. సమరసస్వరూపుడను అగు నాకు మిథ్యయగు విచారాదులతో పనియేమి? మౌనమే శోభిల్లును. ౧౧

పరిపూర్ణద్రష్టనగుచు బ్రహ్మాన్యమగుదానిని మిథ్యగాజూచు నాకు శ్రవణ మొనర్పదగిన దేమికలదు? నిఃసందిగ్ధప్రకాశ స్వరూపుడనగు నాకు మనన యోగ్యమగునదియును లేదు. త్రిపుటీనాశనమొనర్చిన నాకు, ధ్యేయమే లేదు. సర్వాత్మకమగు ఏకరసస్వరూపము నాది. నాకు సమాధియును లేదు. ౧౨

విద్వాంసులొనర్చిన ఆత్మానాత్మ వివేచనముయెడకూడ నాకు అభిరుచి లేదు. ఏలయన, అనాత్మయనునదియే లేదు. కలదేదియో అది ప్రత్యక్షమగు

మిథ్యావాదవిచారచిన్తనమహో కుర్వన్త్యదృష్టాత్మకా
భ్రాన్తా ఏవ న పారగా దృఢధియస్తూష్ణీం శిలావత్ స్థితాః.

వస్తుస్థిత్యనురోధతస్త్వహమహో కశ్చిత్పదార్థో న చా-
ప్యేవం కోఽపి విభామి సన్తతదృశీ వాఙ్మానసాగోచరః,
నిష్పాపోఽస్మ్యభయోఽస్మ్యహం విగతదుశ్శఙ్కాకలఙ్కోఽస్మ్యహం
శంశ్రాన్తానుపమానశీతలమహః ప్రౌఢప్రకాశోఽస్మ్యహమ్ ౧౪

యోఽహంపూర్వమితః ప్రశాన్తకలనాశుద్ధోస్మిబుద్ధో స్మ్యహం
యస్మాన్మత్త ఇదం సముత్థితమభూదేతన్మయా ధార్యతే,
మయ్యేవ ప్రలయం ప్రయాతి నిరధిష్ఠానాయ తస్మై సదా
సత్యానన్దచిదాత్మకాయ విపులప్రజ్ఞాయ మహ్యం నమః. ౧౫

ఆత్మయే. దానిని వివేకింప సమర్థు లెవరు ?– ఆత్మను వీక్షింపనివారే వ్యర్థమగు వాదవిచారచింతనము లొనర్తురు. వారు భ్రాంతులే. పారంగతులు గారు. దృఢచిత్తులగువా రన్ననో : శిలవలె అచలులై మౌనమునుదాల్చి యుందురు. ౧౩

వాస్తవమునకు నేను అను పదార్థమే లేదు. కాని నేను సర్వదా దృక్స్వరూపుడను. అవాఙ్మానస గోచరుడను. శుద్ధుడను. అభయస్వరూపుడను. దుశ్శంకా కళంకరహితుడను. ప్రౌఢప్రకాశ స్వరూపుడనయ్యు అనుపమాన శాంతశీతల తేజస్కుడను. ౧౪

ఇతః పూర్వమే భేదజ్ఞానము నశింప శుద్ధత్వమును, బోధస్వరూపమును బొందిన నాయందే ఈజగత్తు ఉదయించి, ఉన్నతినిబొంది, ఉడుగుచున్నది. అప్పుడు నేను నిరధిష్ఠానము నే యగుచున్నాను. అట్టి సత్యానందచిదాత్మకునకు, విపులప్రజ్ఞునకు, నీకు, నమస్కారము. ౧౫

సత్తాచిత్సుఖరూపమస్తి సతతం నాహం చ న త్వం మృషా
నేదం నాపి జగత్ ప్రదృష్టమఖిలం నాస్తీతి జానీహి భో,
యచ్ఛ్రీశంకరుణావశాత్త్వయిమయా తత్సత్యమేతత్ స్ఫుటం
శ్రద్ధత్స్వానఘ శుద్ధబుద్ధిరసి చేత్తన్మాత్రాస్తు తే సంశయః.
స్వారస్యైకసుభోగచారుమనసే ప్రౌఢానుభూతిస్త్వియం
దాతవ్యా న తు మోహముగ్ధకుధియే దుష్టాన్తరజ్ఞాయ చ
యేయం రమ్యవిదర్భితోత్తమశిరఃప్రాప్తా చకాస్తి స్వయం,
సాచేన్మర్కటహస్తదేశపతితే కిం రాజతే కేతకీ. ౧౭

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత ప్రౌఢానుభూతిః ॥౨౩॥

నేను సతతము సచ్చిదానందస్వరూపుడను. నీవు, నేను అను భేదమే లేదు. ఏలయన, అది మిథ్య. దృష్టిగోచరమగు ఈ జగత్తుకూడ లేదని ఎరుంగుమోయి! శుద్ధుడా! నా ఉపదేశమును శ్రద్ధతో విశ్వసింపుము. నీబుద్ధి పవిత్రమగుచో నీ కీషణ్మాత్రమును సందేహముండదు. ౧౬

స్వారస్యము ననుభవింపగ ఉత్తమచిత్తునకే ఈ ప్రౌఢానుభూతి నొసగదగును. మోహకలుషితచిత్తునకును, దుష్టవ్యక్తికిని జెప్పకూడదు. రమణీయతాజ్ఞానముగల వ్యక్తికి శిరోభూషణమై కేతకీపుష్పము (మొగలి పువ్వు) రాజిల్లును గాని, కోతిచేత బడిన అట్లగునా? ౧౭

ఇది ప్రౌఢానుభూతి - ఆంధ్రానువాదము ॥౨౩॥

# ౨౫. బ్రహ్మజ్ఞానావలీమాలా

## ( బ్రహ్మనామావలీమాలా )

సకృత్ శ్రవణమాత్రేణ బ్రహ్మజ్ఞానం యతో భవేత్,
బ్రహ్మజ్ఞానావలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే. ౧

అసఙ్గోఽహమసఙ్గోఽహమసఙ్గోఽహం పునః పునః,
సచ్చిదానన్దరూపోఽహమహమేవాహమవ్యయః. ౨

నిత్యశుద్ధవిముక్తోఽహం నిరాకారోఽహమక్షరః,
భూమానన్దస్వరూపోఽహమహమేవాహమవ్యయః. ౩

నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహమక్షరః,
పరమానన్దరూపోఽహమహమేవాహమవ్యయః. ౪

సర్వులకును ముక్తి లభించు నిమిత్తము, ఒక్కమారు వినినంతనే బ్రహ్మజ్ఞానమును లభింపజేయు బ్రహ్మజ్ఞానావలీమాలను చెప్పుచున్నాను. ౧

నేను అసంగుడను, నిర్లిప్తుడను, సంగరహితుడను. మరల మరల భావింపవలసిన దిదియే. మరియును, నేను సచ్చిదానంద స్వరూపుడను. *నేను నేనే, నాయందెట్టి మార్పుయును లేదు.– నేను అవ్యయుడను, అనగా అవినాశిని.*

నేను నిత్యశుద్ధుడను, నిత్యముక్తుడను, నిరాకారుడను, అక్షరుడను, సర్వవ్యాపిని, ఆనందస్వరూపుడను – అవ్యయుడను. ౩

నేను నిత్యుడను, దోషరహితుడను, నిరాకారుడను, అక్షరుడను, పరమానంద స్వరూపుడను – అవ్యయుడను. ౪

---

* * ఈ చిహ్నము మధ్యగల భాగమును ఇక మీదట ౧౭ వ శ్లోకము వరకు ప్రతిశ్లోక – అనువాదముతో కలిపి పఠింప నగును.

శుద్ధచైతన్యరూపోఽహమాత్మారామోఽహమేవ చ,
అఖణ్డానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౫

స్వయం ప్రకాశరూపోఽహం చిన్మయోఽహం పరోస్మ్యహం,
అద్వైతానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౬

ప్రత్యక్ చైతన్యరూపోఽహం శాన్తోఽహం ప్రకృతేః పరః,
శాశ్వతానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౭

తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరః శివః,
మాయాతీతః పరంజ్యోతిరహమేవాహ మవ్యయః. ౮

నామరూపవ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః,
సుఖప్రకాశరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౯

నేను శుద్ధచైతన్యరూపుడను, ఆత్మారాముడగునది నేనే. అఖండానంద స్వరూపుడను - అవ్యయుడను. ౫

నేను స్వయంప్రకాశ స్వరూపుడను, చిద్రూపుడను, పరమాత్మను, అద్వైతానందరూపుడను - అవ్యయుడను. ౬

నేను ప్రత్యక్ - చైతన్యస్వరూపిని. శాంతుడను. ప్రకృతికి అతీతుడను. శాశ్వతానందస్వరూపుడను - అవ్యయుడను. ౭

నేను చతుర్వింశతి తత్త్వముల కతీతుడను, పరాత్మను, మధ్యావస్థ యనగా శరీరాతీతుడనగు పరశివుడను. మాయాతీతుడను. పరంజ్యోతిని - అవ్యయుడను. ౮

నేను నామరూపాతీతుడను, జ్ఞానమూర్తిని, అచ్యుతుడను, సుఖస్వరూపుడను, ప్రకాశస్వరూపుడను - అవ్యయుడను. ౯

మాయాతత్కార్యదేహాదిర్మమ నాస్త్యేవ సర్వదా,
స్వప్రకాశైకరూపోఽహమహమేవాహ మవ్యయః. ౧౦

గుణత్రయవ్యతీతోఽహం బ్రహ్మాదీనాఞ్చ సాక్ష్యహమ్,
అనన్తానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౧౧

అన్తర్యామిస్వరూపోఽహం కూటస్థః సర్వగోఽస్మ్యహమ్,
పరమానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౧౨

ద్వన్ద్వాదిసాక్షిరూపోఽహమచలోఽహం సనాతనః,
సర్వసాక్షిస్వరూపోఽహ మహమేవాహ మవ్యయః. ౧౩

నిష్కలోఽహం నిష్క్రియోఽహం సర్వాత్మా చ సనాతనః,
అక్షరస్వరూపశ్చాహ మహమేవాహ మవ్యయః. ౧౪

మాయయును, మాయాకార్యములగు శరీరాదులును నాకెన్నడును లేవు. నేను సర్వదా స్వప్రకాశాద్వైతస్వరూపుడను - అవినాశిని. ౧౦

నేను గుణాతీతుడనై బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు గూడ సాక్షిగ నుంటిని. అనంతానందరూపుడను - అవ్యయుడను. ౧౧

నేను సర్వాంతర్యామిని. కూటస్థుడను. సర్వగతుడను. పరమానంద స్వరూపుడను - అవ్యయుడను. ౧౨

నేను ద్వంద్వాతీతుడను, సాక్షిని, అచలుడను, సనాతనుడను. సర్వసాక్షిని - అవ్యయుడను. ౧౩

నేను నిష్కలుడను, నిష్క్రియుడను, సర్వాత్ముడను, సనాతనుడను, అక్షరస్వరూపుడను - అవ్యయుడను. ౧౪

ప్రజ్ఞానఘన ఏవాహం విజ్ఞానఘన ఏవ చ,
అకర్తాఽహమభోక్తాఽహ మహమేవాహ మవ్యయః. ౧౫
నిరాధారస్వరూపోఽహం సర్వాధారోఽహమేవ చ,
ఆప్తకామస్వరూపోఽహమహమేవాహ మవ్యయః. ౧౬
తాపత్రయవిముక్తోఽహం దేహత్రయవిలక్షణః,
అవస్థాత్రయసాక్ష్యస్మి చాహమేవాహ మవ్యయః. ౧౭
దృగ్దృశ్యౌ ద్వౌ పదార్థౌ స్తః పరస్పరవిలక్షణౌ,
దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి సర్వవేదాన్త డిణ్డిమః. ౧౮
అహం సాక్షీతి యో విద్యాద్ వివిచ్యైవ పునః పునః,
స ఏవ ముక్తో విద్వాన్ స ఇతి వేదాన్తడిణ్డిమః. ౧౯

నేను ప్రజ్ఞానస్వరూపిని; విజ్ఞానస్వరూపియగునది కూడ నేనే. నేను అకర్తను, అభోక్తను – అవ్యయుడను. ౧౫

[నా కాధారమగునదేదియును లేకుండుటచే] నేను నిరాధార స్వరూపుడను; అయినను సర్వమునకు ఆధారము నేనే. నేను ఆప్తకాముడను – అవ్యయుడను. ౧౬

నేను తాపత్రయవిముక్తుడనై, దేహత్రయాతీతుడనై అవస్థాత్రయసాక్షి నగుచున్నాను. నేను అవ్యయుడను. ౧౭

దృక్–దృశ్యము లను రెండువస్తువులు కలవు. ఇవి పరస్పర విరుద్ధములు. వీనిలో దృక్ అనగా ద్రష్టయగునది బ్రహ్మము; దృశ్యము మాయ – ఇదియే సర్వవేదాంతముల [ఉపనిషత్తుల] డిండిమము. [ఘోషణ] ౧౮

శరీరేంద్రియాదులనుండి ఆత్మను వేరొనర్చి, 'నేను సాక్షిస్వరూపుడను' అని గ్రహించినవాడే విద్వాంసుడును, ముక్తుడును అని వేదాంతములు ఢంకా కొట్టి చెప్పుచున్నవి. ౧౯

ఘటకుడ్యాదికం సర్వం మృత్తికామాత్రమేవ హి,
తద్వద్ బ్రహ్మ జగత్సర్వమితి వేదాన్తడిణ్డిమః. ౨౦

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః,
ఇదమేవతు సచ్ఛాస్త్రమితి వేదాన్తడిణ్డిమః. ౨౧

అన్తర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః,
జ్యోతిర్జ్యోతిః స్వయంజ్యోతిరాత్మజ్యోతిః శివోఽస్మ్యహమ్. *

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత బ్రహ్మజ్ఞానావలీమాలా||౨౫||

కుండ, గోడ మున్నగున వన్నియును మన్నుయేకద! అవి ఘటకుడ్యాది రూపమున గోచరించుచున్నను వాస్తవమునకు వాని స్వరూపము మృత్తికయే. అట్లే ఈ జగత్తుకూడ బ్రహ్మస్వరూపమేయని వేదాంతములు ఘోష పెట్టు చున్నవి. ౨౦

బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మమే, బ్రహ్మమునుండి వేరు కాదు - ఇదియే శుభప్రదమగు శాస్త్రసిద్ధాంతము. (లేక సర్వకాలముల నిలబడగలిగిన సూక్తి.) - ఇదియే వేదాంత డిండిమము. ౨౧

అంతఃకరణమును ప్రకాశింపజేయు అంతర్జ్యోతియును, వెలుపలనుండు వెలుగును, మరల (ప్రత్యగ్జ్యోతియును) పరాత్పరమగు జ్యోతియును, సూర్య చంద్రాగ్నులనుగూడ ప్రకాశింపజేయు జ్యోతియును, అన్యప్రకాశము నపే క్షింపని స్వయంజ్యోతియును, శుభప్రదమగు ఆత్మజ్యోతియును నేనే యగు చున్నాను. ౨౨

ఇది బ్రహ్మజ్ఞానావలీమాల-ఆంధ్రానువాదము. ||౨౫||

---

* ఈ తుది మూడు శ్లోకములును అధిక పాఠము.

# ౨౬. బ్రహ్మానుచిన్తనమ్

## (ఆత్మానుచిన్తనమ్)

అహమేవ పరం బ్రహ్మ వాసుదేవాఖ్యమవ్యయమ్,
ఇతి స్యాన్నిశ్చితో ముక్తో బద్ధ ఏవాన్యథా భవేత్. ౧

అహమేవ పరం బ్రహ్మ నిశ్చితం చిత్త చిన్త్యతామ్,
చిద్రూపత్వాదసఙ్గత్వాదబాధ్యత్వాత్ ప్రయత్నతః. ౨

అహమేవ పరం బ్రహ్మ న చాహం బ్రహ్మణః పృథక్,
ఇత్యేవం సముపాసీత బ్రాహ్మణో బ్రహ్మణి స్థితః. ౩

సర్వోపాధివినిర్ముక్తం చైతన్యం చ నిరన్తరమ్
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా కథం వర్ణాశ్రమీ భవేత్. ౪

నేనే వాసుదేవు డనబడు పరబ్రహ్మతత్త్వమును, అవ్యయుడను - అను నిశ్చయబుద్ధి గలవాడే ముక్తుడు. ఇట్టి దృఢనిశ్చయము లేనివారు బద్ధులు.

చిత్తమా ! నేను జ్ఞానస్వరూపుడ నగుటవలనను, అసంగుడ నగుటవలనను' కాలత్రయాబాధితుడ నగుటవలనను నేనే "పరబ్రహ్మమును" అని దృఢనిశ్చయముతో చింతింపుము. ౨

బ్రాహ్మణుడగువాడు బ్రహ్మమున నెలకొని 'నేనే పరబ్రహ్మమును, బ్రహ్మమునుండి నేను వేరు కాదు '- అని ఉపాసింపనగును. ౩

"శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మున్నగు ఉపాధులు లేనిదియును, సర్వదా చైతన్యస్వరూపమును అగు పరబ్రహ్మమే నేను" అని గ్రహించినవ్యక్తి తన్ను ఒకానొక వర్ణమునకును ఆశ్రమమునకును సంబంధించినట్లు, ఎట్లు చెప్పుకొనగలడు. ? ౪

అహం బ్రహ్మాస్మి యో వేద స సర్వం భవతి త్విదమ్,
నాభూత్యా ఈశతే దేవాస్తేషామాత్మాభవేద్ధి సః. ౫

అన్యోఽసావహమన్యోఽస్మీత్యుపాస్తే యోఽన్యదేవతామ్,
న స వేద నరో బ్రహ్మ స దేవానాం యథా పశుః. ౬

అహమాత్మా న చాన్యోఽస్మి బ్రహ్మైవాహం న శోకభాక్,
సచ్చిదానన్దరూపోఽహం నిత్యముక్తస్వభావవాన్. ౭

ఆత్మానం సతతం బ్రహ్మ సంభావ్య విహరన్తి యే,
న తేషాం దుష్కృతం కిఞ్చిద్ దుష్కృతోత్థా న చాపదః. ౮

ఆత్మానం సతతం బ్రహ్మ సంభావ్య విహరేత్ సుఖమ్,
క్షణం బ్రహ్మాహమస్మీతి యః కుర్యాదాత్మచిన్తనమ్. ౯

“నేను బ్రహ్మమను” అని ఎరిగినవాడు, ఈ సర్వరూపమును తానే యగును. దేవతలు అతని కెట్టివిఘ్నమును కలిగింపజాలరు. ఏలయన, అతడు దేవతలకుగూడ ఆత్మయగును. ౫

ఉపాస్యదేవతకంటె తన్ను వేరుగా భావించి, అన్యదేవతోపాసన మొనర్చువాడు, బ్రహ్మము నెరుగక దేవతలకడ పశుసదృశు డగును. [అనగా మానవులకెట్లు పశువులు భోగ్యవస్తువులో, అట్లే ఈ ఆత్మాన్యదేవోపాసికూడ అజ్ఞుడగుటవలన యజ్ఞాదులనొనర్చి దేవతలను సంతోషపెట్టవలసినవా డగును.] ౬

నేను ఆత్మను, శరీరాదులను గాను. బ్రహ్మమే నేను. నాకు దుఃఖము లేదు. నేను సచ్చిదానందస్వరూపుడను. ఎల్లకాలముల నేను ముక్తుడనై యుంటిని – ఇదియే నా సహజస్వరూపము. ౭

ఎవరు ఆత్మను సర్వదా బ్రహ్మముగ భావించుచు సుఖవిహారము సల్పుచున్నారో, వారి పాపములన్నియును తొలగిపోవును. పాపఫలితములగు ఆపదలుకూడ అంటవు. ౮

నిరంతరము ఆత్మను బ్రహ్మముగ భావించుచు సుఖముగ విహరింప నగును. ఇట్లు క్షణకాలమైనను “నేను బ్రహ్మమను”అను ఆత్మచింతన మొనర్చినయెడ,

తన్మహాపాతకం హన్తి తమః సూర్యోదయో యథా,
అజ్ఞానాద్ బ్రహ్మణో జాత మాకాశం బుద్బుదోపమమ్. ౧౦
ఆకాశాద్ వాయురుత్పన్నో వాయో స్తేజ స్తతః పయః,
అద్భ్యశ్చ పృథివీ జాతా తతో వ్రీహియవాదికమ్. ౧౧
పృథివ్యప్సు పయో వహ్నౌ వహ్నిర్వాయౌ నభస్యసౌ,
నభోఽప్యవ్యాకృతే తచ్చ శుద్ధే శుద్ధోఽస్మ్యహం హరిః. ౧౨
అహం విష్ణురహం విష్ణురహం విష్ణురహం హరిః,
కర్తృభోక్త్రాదికం సర్వం తదవిద్యోత్థమేవ చ. ౧౩
అచ్యుతోఽహమనన్తోఽహం గోవిన్దోఽహమహం హరిః,
ఆనన్దోఽహ మశేషోఽహమజోఽహమమృతోఽస్మ్యహమ్.

ఆధ్యానము మహాపాతకములను, సూర్యోదయము చీకట్లను నశింపజేయునట్లు, పోగొట్టును. బ్రహ్మమునుండి అజ్ఞానమువలన, బుడగవంటి ఆకాశము కలిగినది. ౯-౧౦

ఆకాశమునుండి వాయువును, దానినుండి తేజస్సును, దానినుండి జలమును, దానినుండి పృథివియును, దానినుండి వ్రీహియవాది సస్యములును కలిగినవి. ౧౧

పృథివి జలముననును, జలము అగ్నియందునను, అగ్ని వాయువునను, వాయు వాకాశముననను, ఆకాశ మవ్యాకృతముననను, అనగా మాయయందునను, మాయ శుద్ధబ్రహ్మముననను వెలయుచున్నవి. నే నా శుద్ధుడనగు హరిని. ౧౨

నేను విష్ణుడను, విష్ణుడను, విష్ణుడను, హరిని. కర్తృత్వభోక్తృత్వములు మున్నగునవన్నియును బ్రహ్మసంబంధమగు ఆ అవిద్యనుండియే కలిగినవి. ౧౩

నేను అచ్యుతుడను, అనంతుడను, గోవిందుడను, హరిని. నేను ఆనందుడను, అశేషుడను, అజుడను, అమృతుడను. ౧౪

నిత్యో౽హం నిర్వికల్పో౽హం నిరాకారో౽హ మవ్యయః,
సచ్చిదానన్దరూపో౽హం పఞ్చకోశాతిగో౽స్మ్యహమ్. ౧౫
అకర్తాహ మభోక్తాహ మసఙ్గః పరమేశ్వరః,
సదా మత్సన్నిధానేన చేష్టతే సర్వమిన్ద్రియమ్. ౧౬
ఆదిమధ్యాన్తముక్తో౽హం న బద్ధో౽హం కదాచన,
స్వభావనిర్మలః శుద్ధః స ఏవాహం న సంశయః. ౧౭
బ్రహ్మైవాహం న సంసారీ ముక్తో౽హమితి భావయేత్,
అశక్నువన్ భావయితుం వాక్యమేతత్ సదాభ్యసేత్. ౧౮
యదభ్యాసేన తద్భావో భవేద్భ్రమరకీటవత్,
అత్రాపహాయ సన్దేహమభ్యసేత్ కృతనిశ్చయః. ౧౯

నేను నిత్యుడను, నిర్వికల్పుడను, నిరాకారుడను, అవ్యయుడను, సచ్చిదానందరూపుడను, పంచకోశాతీతుడను. ౧౫

నేను కర్తయును, భోక్తయును గాని అసంగుడను. పరమేశ్వరుడను. నా సాన్నిధ్యమువలననే, సర్వేంద్రియములును సర్వవ్యవహారముల నొనర్చు చున్నవి.

నేను ఆదిమధ్యాంత రహితుడను. నాకు బంధ మెన్నడును లేదు. నేను స్వభావనిర్మలుడను. శుద్ధుడను. ఈవిషయమున ఎట్టిసంశయమును లేదు. ౧౭

నేను బ్రహ్మస్వరూపుడను, సంసారిని గాను, ముక్తుడను–అని ధ్యానింపవలెను. ఇట్లు భావించుటకు అసమర్థులగువారు సర్వదా ఈ వాక్యమును ఉచ్చరించుచుండవలెను. [అనగా జపించుమనడి.] ౧౮

భ్రమరకీటన్యాయము ననుసరించి దేనిని నిరంతరము ధ్యానింతువో, ఆ భావమే లభించును. అట్లే జీవుడు “నేనే బ్రహ్మము” అని పౌనఃపున్యముగ ఉచ్చరింప బ్రహ్మమే యగును. ఈ విషయమున సందేహమును దొలగద్రోచి, దృఢనిశ్చయముతో బ్రహ్మాభ్యాసము నొనర్పవలెను. ౧౯

ధ్యానయోగేన మాసైకాద్ బ్రహ్మహత్యాం వ్యపోహతి,
సంవత్సరం సదభ్యాసాత్ సిద్ధ్యష్టకమవాప్నుయాత్. ౨౦

యావజ్జీవం సదాభ్యాసాజ్జీవన్ముక్తో భవేద్ యతిః,
నాహం దేహో న చ ప్రాణో నేన్ద్రియాణి తథైవ చ. ౨౧

న మనోఽహం న బుద్ధిశ్చ నైవ చిత్తమహంకృతిః,
నాహం పృథ్వీ న సలిలం న చ వహ్నిస్తథాఽనిలః. ౨౨

న చాకాశో న శబ్దశ్చ న చ స్పర్శస్తథా రసః,
నాహం గన్ధో న రూపం చ న మాయాహం న సంసృతిః. ౨౩

సర్వదా సాక్షిరూపత్వాత్ శివ ఏవాఽస్మి కేవలః,
మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్. ౨౪

ఈ రీతిగ ధ్యానయోగమును ఒక్క మాసము అనుష్ఠించినయెడల, బ్రహ్మహత్యాపాపము తొలగును. ఇట్లొక సంవత్సరము సర్వదా అభ్యసించినయెడల, అష్టసిద్ధులు లభింపగలవు. ౨౦

ఏ సన్న్యాసి యావజ్జీవము ఈరీతిగ అభ్యసించునో, అతడు జీవన్ముక్తుడగును. శరీరము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, శబ్దము, స్పర్శ, రసము, గంధము, రూపము, ఇవి నేను కాదు. నాకు మాయలేదు. నాకు సంసారములేదు. ౨౧-౨౩

నేను సర్వదా సాక్షినగుటవలన కేవలస్వరూపుడనగు శివుడనే. నాయందే సర్వమును కలిగి, నాయందే నిలచియున్నది. ౨౪

మయి సర్వం లయం యాతి తద్ బ్రహ్మాస్మ్యహమద్వయమ్,
సర్వజ్ఞోఽహమనన్తోఽహం సర్వేశః సర్వశక్తిమాన్. ౨౫

ఆనన్దః సత్యబోధోఽహమితి బ్రహ్మానుచిన్తనమ్,
అయం ప్రపఞ్చో మిథ్యైవ సత్యం బ్రహ్మాఽహమవ్యయమ్.

అత్ర ప్రమాణం వేదాన్తా గురవోఽనుభవస్తథా,
బ్రహ్మైవాఽహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక్.

నాహం దేహో న మే దేహః కేవలోఽహం సనాతనః,
ఏకమేవాద్వితీయం వై బ్రహ్మణో నేహ కిఞ్చన. ౨౮

తుదకు సర్వమును నాయందే లయమగుచున్నది. నేనే అద్వితీయబ్రహ్మ స్వరూపుడను.సర్వజ్ఞుడను. అనంతుడను. సర్వేశ్వరుడను సర్వశక్తిమంతుడను.౨౫

నేను ఆనందుడను, సత్యబోధస్వరూపుడను, – ఈరీతిగ బ్రహ్మానుచింతన మొనర్పనగును. ఈ ప్రపంచము మిథ్యయే. సత్యమగునది నా అవ్యయబ్రహ్మ స్వరూపమే. ౨౬

ఈ విషయమున సర్వవేదాంతములును, గురువాక్యమును, అనుభవమును ప్రమాణములు. నేను బ్రహ్మస్వరూపుడను. సంసారిని కాదు. నేను బ్రహ్మభిన్నుడను కాదు. ౨౭

నేను శరీరమనుగాను – నాకు శరీరము లేదు. నేను కేవలుడను, సనాతనుడను, ఈ జగత్తున ఒకే అద్వితీయమగు బ్రహ్మము గాక, వేరొక వస్తువు లేదు. ౨౮

హృదయకమలమధ్యే దీపవత్ వేదసారం
ప్రణవమయమతర్క్యం యోగిభిర్ధ్యానగమ్యమ్,
హరి గురు శివయోగం సర్వభూతస్థమేకం
సకృదపి మనసా వై చిన్తయేద్ యః స ముక్తః. ౨౯

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత - బ్రహ్మానుచిన్తనమ్ ॥౨౬॥

హృదయ కమలమధ్యమున దీపకళికవలె వెలుగునదియును, వేదసారమును, ప్రణవస్వరూపమును, తర్కాసాధ్యము కానిదియును, యోగుల వలన ధ్యానమున బొందబడునదియును, హరిగురుశివుల శుభసమ్మేళనా స్వరూపమును, సర్వభూతస్థమును అగు ఆ అద్వైతతత్త్వమును ఒక్కసారియైనను మనస్సుతో చింతింపగలుగువాడు. ముక్తుడగును. ౨౯

ఇది బ్రహ్మానుచింతన - ఆంధ్రానువాదము ॥౨౬॥

## * ౨౭. మనీషాపఞ్చకమ్

సత్యాచార్యస్య గమనే కదాచిన్ముక్తిదాయకమ్,
కాశీక్షేత్రం ప్రతి సహ గౌర్యా మార్గే తు శఙ్కరమ్. ౧

అన్త్యవేషధరం దృష్ట్వా గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్,
శఙ్కరం సోఽపి చణ్డాలస్తం పునః ప్రాహ శఙ్కరమ్. ౨

అన్నమయా దన్నమయ మథవా చైతన్యమేవ చైతన్యాత్,
ద్విజవర దూరీకర్తుం వాఞ్ఛసి కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి. ౩

కిం గఙ్గామ్బుని బిమ్బితేఽమ్బరమణౌ చణ్డాలవాటీపయః
పూరే చాన్తరమస్తి కాఞ్చనఘటీమృత్కుమ్భయోర్వామ్బరే,
ప్రత్యగ్వస్తుని నిస్తరఙ్గసహజానన్దావబోధామ్బుధౌ
విప్రోఽయంశ్వపచోఽయమిత్యపి మహాన్కోఽయంవిభేదభ్రమః.*

ఒకప్పుడు సత్యాచార్యుడగు శంకరుడు ముక్తిప్రదమగు కాశీక్షేత్రమునకు బోవుచుండెను. మార్గమున గౌరీశంకరులుగూడ అంత్యజవేషధారులై తారసిల్ల, వారిని జూచి, శంకరుడు, "తొలగుడు, తొలగుడు" అనెను. అప్పుడు ఆ కైతవచండాలుడు శంకరునితో నిట్లనెను. "ద్విజశ్రేష్ఠా! నీవు అన్నమయమగు శరీరమునుండి శరీరమును దూరమొనర్ప గోరుచుంటివా? లేక చైతన్యమునుండి చైతన్యమును దూరమొనర్ప గోరుదువా?" (శరీరమగుచో రెంటికిని పార్థక్యము లేదు. చైతన్యమగుచో ఉన్నది ఒకే చైతన్యమగుటవలన ఎట్లు తొలగగలదు? - అని భావము.) గంగాజలమునను చండాలవాటికయందలి జలాశయమునను ప్రతిబింబించిన సూర్యునియందేమైన ప్రభేదముండునా? నిస్తరంగ - సహజానంద - బోధసముద్రమగు ఆత్మయందు 'ఇతడు చండాలుడు, ఇతడు విప్రుడు' అను భేద విభ్రమ మెట్లు నీకు కలిగినది?" (అప్పుడు శంకరుడు ఇట్లనెను :) ౧_౪

---

* ఈ నాలుగు శ్లోకములును అధికపాఠముగ దోపట్టును.

దీనికి గోపాలబాలయతి రచించిన 'మధుమంజరి' యను టీక గలదు.

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే
యా బ్రహ్మాది పిపీలికాన్తతనుషు ప్రోతా జగత్సాక్షిణీ,
సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చేత్
చణ్డాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ. ౫

బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైతదవిద్యయా త్రిగుణయాశేషం మయా కల్పితమ్,
ఇత్థం యస్య దృఢా మతిః సుఖతరే నిత్యే పరే నిర్మలే
చణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ. ౬

శశ్వన్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచా గురో
ర్నిత్యం బ్రహ్మ నిరన్తరం విమృశతా నిర్వ్యాజశాన్తాత్మనా,

జాగ్రత్స్వప్న సుషుప్తులయం దే చైతన్యము అత్యంతస్ఫుటముగ ప్రకాశించుచున్నదో, ఏది ఆబ్రహ్మపిపీలికాపర్యంతము సర్వదేహముల సాక్షియై నెలకొనియున్నదో నేనా చైతన్యస్వరూపమను; నేను జడదృశ్యమును గాను - అను దృఢజ్ఞాన మెవనికి గలదో అతడు చండాలుడే యగుగాక, ద్విజుడే యగుగాక ! - అతడు నాకు గురువు. ఇది నా మనీష అనగా నిశ్చయము. ౫

నేను బ్రహ్మస్వరూపుడను. ఈ జగత్తు కేవలమాత్రమగు చైతన్యమువలన అవభాసించుచున్నది. త్రిగుణాత్మకమగు అవిద్యవలన నాయందు కల్పితమై యున్నది - అను దృఢబుద్ధి ఎవనికి సచ్చిదానందరూపమును, నిష్కళంకమును, నిత్యమును అగు పరబ్రహ్మమున నిలచినదో, అతడు చండాల ద్విజులలో నెవడైనను నాకు వందనీయుడే : అని నా నిశ్చయము. ౬

గురువాక్యమున శ్రద్ధావిశ్వాసములనుంచి విశ్వమఖిలమును అనిత్యమని నిశ్చయించి నిష్కపటచిత్తముతో నిరంతరము నిత్యమగు బ్రహ్మమును ధ్యానించుచు, భూతభవిష్యద్వర్తమానకాలముల నేనొనర్చిన దుష్కృతముల నన్నిటిని

భూతం భావి చ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషా మమ. ౩
యా తిర్యఙ్నరదేవతాభిరహమిత్యన్తః స్ఫుటా గృహ్యతే
యద్భాసా హృదయాక్షదేహవిషయా భాన్తి స్వతోఽచేతనాః,
తాం భాస్యైఃపిహితార్కమణ్డలనిభాం స్ఫూర్తిం సదా భావయన్
యోగీ నిర్వృతమానసో హి గురురిత్యేషా మనీషా మమ. ౪
యత్సౌఖ్యాంబుధిలేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతా
యచ్చిత్తే నితరాం ప్రశాన్తకలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః,
యస్మిన్నిత్యసుధాంబుధౌ గలితధీర్బ్రహ్మైవ న బ్రహ్మవిద్
యః కశ్చిత్ స సురేన్ద్రవన్దితపదో నూనం మనీషా మమ. ౫

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాద విరచిత - మనీషాపంచకమ్ ||౨౩||

దగ్ధమొనర్చితిని; ఇక సంవిన్మయాగ్నియందు ప్రారబ్ధభోగ (హోమ) మొనర్ప, ఈ శరీరము నర్పించితిని. ఇదియే నా నిశ్చయము. ౩

దేనిని దేవమానవమృగాదులు 'నేను' అని అంతఃకరణమున అత్యంత స్పష్టముగ గ్రహించుచున్నవో, దేనివలన అచేతనములగు శరీరేంద్రియాంతఃకరణములు ప్రకాశము నందుచున్నవో, ఏది సూర్యునివలన ప్రకాశింపబడు మేఘములవలననే కప్పబడిన సూర్యమండలమును బోలుచు స్వయంప్రకాశమానమై యున్నదో, ఆ చైతన్యమును ఏ యోగిపురుషుడు సదా భావించుచు, శాంతచిత్తుడై యుండునో, అతడే గురువు - గొప్పవాడు అని నా మనీష అనగా అభిప్రాయము. ౪

ఏ సుఖసముద్రకణలేశమును బొంది ఇంద్రాదిదేవతలు ఆనందతుందిలులగుచున్నారో; ప్రశాంతచిత్తుడగు ముని స్వచిత్తమున దేనిని బొంది ఆనందించుచున్నాడో; ఆ నిత్యసుధాసముద్రమున ఎవని చిత్తము కరగిపోయినదో, అతడు బ్రహ్మవేత్త కాడు. బ్రహ్మమే. అట్టి మహాపురుషుని పాదములకు దేవేంద్రుడుకూడ నమస్కరించును - అని నా నిశ్చితాభిప్రాయము. ౫

ఇది మనీషాపంచక - ఆంధ్రానువాదము ||౨౩||

# ౨౮. మాయాపఞ్చకమ్

నిరుపమనిత్యనిరంశకేఽప్యఖణ్డే
మయి చితి సర్వవికల్పనాదిశూన్యే,
ఘటయతి జగదీశజీవభేదం
త్వఘటితఘటనాపటీయసీ మాయా. ౧

శ్రుతిశతనిగమాన్తశోధకాన
ప్యహహ ధనాదిదర్శనేన సద్యః,
కలుషయతి చతుష్పదాద్యభిన్నాన్
త్వఘటితఘటనాపటీయసీ మాయా. ౨

సుఖచిదఖణ్డవిబోధమద్వితీయం
వియదనలాదివినిర్మితే నియోజ్య,
భ్రమయతి భ్రమసాగరే నితాన్తం
త్వఘటితఘటనాపటీయసీ మాయా. ౩

నిత్యుడను, నిరుపముడను, నిరంశుడను, అఖండుడను, జ్ఞానస్వరూపుడను అగు నాయందు మాయ, జగత్తు, ఈశ్వరుడు, జీవుడు అను భేదమును కలుగజేయుచున్నది. ఈ మాయ ఎన్నడును ఘటిల్లనిదానిని ఘటింపజేయుటలో ఎంతటి సామర్థ్యమును జూపుచున్నది! ౧

పరశ్శతములగు వేదవాక్యములతోడను, ఉపనిషత్సూక్తులతోడను ప్రబోధమొనర్చి, పశుతుల్యులగు మానవులను సంస్కరించినను ఆహా! ఈమాయ వారికి వెంటనే భోగింపదగు ధనాదులను జూపి, (పదచ్యుతుల నొనర్చి) కలుషితుల నొనర్చుచున్నది; ఈ మాయ అఘటిత-ఘటనా-పటీయసి. ౨

అఖండసచ్చిదానంద సుఖబోధస్వరూపమగు ఆత్మను ఈ మాయ ఆకాశాది పంచభూతనిర్మితమగు భవసాగరమున బడద్రోసి, నిరంతరము కొట్టుకొను నట్లు చేయుచున్నది; ఈ మాయ అఘటిత-ఘటనా-పటీయసి కదా! ౩

అపగతగుణజాతివర్ణభేదే
సుఖచితి విప్రవిదాద్యహఙ్కృతిం చ,
స్ఫుటయతి సుతదారగేహమోహం
త్వఘటిత - ఘటనాపటీయసీ మాయా. ౪

విధిహరహరివిభేదమప్యఖణ్డే
బత విరచయ్య బుధానపి ప్రకామమ్,
భ్రమయతి హరిహరభేదభావా
నఘటితఘటనాపటీయసీ మాయా. ౫

ఇతి శ్రీ శఙ్కరభగవత్పూజ్యపాదరచిత - మాయాపఞ్చకమ్ ॥౨౮॥

ఈ మాయ గుణవర్ణజాతి భేదరహితుడును, సుఖచిత్స్వరూపుడును నగు ఆత్మయందు బ్రాహ్మణవైశ్యాదిరూపమగు అహంకారమును, పుత్రకళత్ర గృహ మోహమును కలుగజేయుచున్నది; ఈ మాయ అఘటితఘటనా-పటీయసి కదా !

అఖండస్వరూపమున బ్రహ్మవిష్ణుశివాది భేదములను నిర్మించి, పండిత శ్రేష్ఠులగు వారిని గూడ శివవిష్ణుభేదబుద్ధులుగా నొనర్చి భ్రమ గొల్పుచు, ఈ అఘటిత-ఘటనా-పటీయసి యగు మాయ యొప్పుచున్నది కదా ! ౫

ఇది మాయాపంచక - ఆంధ్రానువాదము ॥౨౮॥

# ౨. మఠామ్నాయః

## శ్రీ శ్రీ ద్వారకానాథో విజయతేతరామ్

### అథ ద్వారకాపుర్యాం ప్రతిష్ఠితః శారదామఠామ్నాయః.



ప్రథమః పశ్చిమామ్నాయః శారదామఠ ఉచ్యతే,
కీటవారః సమ్ప్రదాయ స్తస్య తీర్థాశ్రమైః శుభైః. ౧

ద్వారకాఖ్యం క్షేత్రం స్యాత్ దేవః సిద్ధేశ్వరః స్మృతః,
భద్రకాలీ తు దేవీ స్యాదాచార్యో విశ్వరూపకః. ౨

గోమతీ తీర్థమమలం బ్రహ్మచారీ స్వరూపకః,
సామవేదస్య వక్తా చ తత్ర ధర్మం సమాచరేత్. 3

### శ్రీ శ్రీ ద్వారకానాథునకు జయము

ద్వారకాపురియందు ప్రతిష్ఠింపఁబడిన శారదామఠమును గురించిన విషయములు.



మొదట భారతదేశ పశ్చిమప్రాంతమున ప్రతిష్ఠింపబడిన మఠమును గురించి : దీని పేరు శారదామఠము. సంప్రదాయము కీటవార మనబడును. తీర్థ, ఆశ్రమ పదములచే ఈ మఠసన్న్యాసు లెరుగబడుదురు. ౧

ఈ మఠమునకు క్షేత్రము ద్వారక. పీఠదేవత సిద్ధేశ్వరుడు. దేవి భద్రకాళి. ఆచార్యుడు విశ్వరూపనామాంతగముగల సురేశ్వరుడు. ౨

వీరికి తీర్థము గోమతి. బ్రహ్మచారి స్వరూపు డనబడును. అతడు సామవేదము నధ్యయన మొనర్చుచు ధర్మానుష్ఠాన మొనర్చును గాక ! [తదనంతరము సన్న్యాసాశ్రమము గ్రహించినప్పుడు తీర్థాశ్రమపదవులలో నొకదానిని గ్రహించును _ అను] 3

జీవాత్మపరమాత్మైక్యబోధో యత్ర భవిష్యతి,
తత్త్వమసి - మహావాక్యం గోత్రోఽవిగత ఉచ్యతే. ౪
సింధు - సౌవీర - సౌరాష్ట్ర - మహారాష్ట్రాస్తథాన్తరాః,
దేశాః పశ్చిమదిక్స్థాయే శారదామఠభాగినః. ౫
త్రివేణీసఙ్గమే తీర్థే తత్త్వమస్యాదిలక్షణే,
స్నాయాత్ తత్త్వార్థభావేన తీర్థనామా స ఉచ్యతే. ౬
ఆశ్రమగ్రహణే ప్రౌఢ ఆశాపాశవివర్జితః,
యాతాయాతవినిర్ముక్త ఏష ఆశ్రమ ఉచ్యతే. ౭
కీటాదయో విశేషేణ వార్యన్తే జీవజన్తవః,
భూతానుకమ్పయా నిత్యం కీటవారః స ఉచ్యతే. ౮

జీవబ్రహ్మైక్యబోధపరమగు "తత్త్వమసి" మహావాక్యమును ఈమఠ
ముపదేశించును. వీరిది 'అవిగత' గోత్రము. ౪

సింధు, సౌవీర, సౌరాష్ట్ర, మహారాష్ట్రదేశములును, వీని మధ్యగ
పశ్చిమమునున్న ప్రాంతమంతయును ఈ శారదామఠాధికారమునకు లోబడి
యుండును. ౫

'తత్త్వమసి' అను త్రివేణీసంగమతీర్థమున ఎవడు స్నానమొనర్చెనో
అనగా తత్ వాక్యప్రతిబోధి - తీర్థమును గ్రహించెనో, అతడే తీర్థుడు. ౬

సన్న్యాసాశ్రమగ్రహణనిపుణుడును, ఆశాపాశవివర్జితుడును, యాతా
యాతగతివినిర్ముక్తుడును అనగా ముక్తిపొందినవాడును, అగు వ్యక్తియే
"ఆశ్రమ" పదముచే నలంకరింపబడును. ౭

భూతదయతో ఎవడు నిత్యము కీటాదులను హింసింపకుండునో, అతడు
కీటవారసంప్రదాయమునకు చెందినవాడని చెప్పబడును. ౮

స్వస్వరూపం విజానాతి స్వధర్మపరిపాలకః,
స్వానన్దే క్రీడతో నిత్యం స్వరూపో వటురుచ్యతే. ౯

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పూజ్యపాద
శ్రీశఙ్కరాచార్య ప్రతిష్ఠిత - శారదామఠామ్నాయః.



## శ్రీ శ్రీ జగన్నాథో విజయతేతరామ్

### అథ జగన్నాథపుర్యాం ప్రతిష్ఠితః గోవర్ధనమఠామ్నాయః



పూర్వామ్నాయో ద్వితీయః స్యాద్ గోవర్ధనమఠః స్మృతః,
భోగవారః సమ్ప్రదాయో వనారణ్యే పదే స్మృతే. ౧

స్వస్వరూపము నెరుగును, స్వధర్మమును పరిపాలించును. స్వానందమున క్రీడించును - అందువలన ఈ ఆశ్రమమునందలి బ్రహ్మచారి - బాలకుడు స్వరూప నామమున పేర్కొనబడును. ౯

ఇది శ్రీశంకరప్రతిష్ఠిత - శారదామఠామ్నాయము.



శ్రీ శ్రీ జగన్నాథునకు జయము.

జగన్నాథపురియందు ప్రతిష్ఠింపబడిన గోవర్ధనమఠ సంప్రదాయము.



భారతదేశపూర్వప్రాంతమున ప్రతిష్ఠింపబడిన మఠము గోవర్ధనమఠ మనబడును. ఇది ద్వితీయము. భోగవారసంప్రదాయము. పదవులు వన, అరణ్య, నామములు కలవి. ౧

పురుషోత్తమం తు క్షేత్రం స్యాత్ జగన్నాథోఽస్య దేవతా,
విమలాఖ్యా హి దేవీ స్యాదాచార్యః పద్మపాదకః. ౨
తీర్థం మహోదధిః ప్రోక్తం బ్రహ్మచారీ ప్రకాశకః,
మహావాక్యం చ తత్ర స్యాత్ ప్రజ్ఞానం బ్రహ్మ చోచ్యతే. ౩
ఋగ్వేదపఠనం చైవ కాశ్యపగోత్రముచ్యతే,
అఙ్గ-వఙ్గ-కలిఙ్గాశ్చ మగధోత్కలబర్బరాః. ౪
గోవర్ధనమఠాధీనా దేశాః ప్రాచీవ్యవస్థితాః,
సురమ్యే నిర్జనే స్థానే వనే వాసం కరోతి యః. ౫
ఆశాబన్ధవినిర్ముక్తో వననామా స ఉచ్యతే,
అరణ్యే సంస్థితో నిత్యమానన్దే నన్దనే వనే. ౬

ఈ మఠమునకు క్షేత్రము పురుషోత్తమమే. జగన్నాథుడు దేవత. దేవి విమల. ఆచార్యుడు పద్మపాదుడు. ౨

ఈ మఠమునకు తీర్థము మహోదధి _ సముద్రము. బ్రహ్మచారి పేరు ప్రకాశకుడు. మహావాక్యము "ప్రజ్ఞానం బ్రహ్మ. – ప్రజ్ఞానమే బ్రహ్మము" ౩

ఋగ్వేదము పఠనీయము. గోత్రము కాశ్యపము. అంగ, వంగ, కళింగ దేశములు_

_ పూర్వదిక్కుననున్నవి ఈ మఠాధీనములు. సురమ్యమగు నిర్జనవన స్థానమున నివసించువాడును_ ౫

_ ఆశాబంధములు లేనివాడును అగు వ్యక్తి 'వన' పదమునకు అర్హుడు. ఆనందనందనవనమను అరణ్యమున వెలయువాడును._ ౬

త్యక్త్వా సర్వమిదం విశ్వమారణ్యః పరికీర్త్యతే,
భోగో విషయ ఇత్యుక్తో వార్యతే యేన జీవినామ్. ౭

సమ్ప్రదాయో యతీనాఞ్చ భోగవారః స ఉచ్యతే,
స్వయంజ్యోతిర్విజానాతి యోగయుక్తివిశారదః. ౮

తత్త్వజ్ఞానప్రకాశేన తేన ప్రోక్తః ప్రకాశకః. ౯

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పూజ్యపాద
శ్రీ శఙ్కరాచార్య ప్రతిష్ఠిత - గోవర్ధనమఠామ్నాయః

- ఈ విశ్వారణ్యము నంతటిని త్యజించినవాడును అగు పురుషుడు ‘ అరణ్య ’ పదవిచే నలంకృతుడగును. భోగమనగా విషయములు. ఎవరు జీవులను విషయములనుండి వారింతురో - ౭

- ఆ యతుల సంప్రదాయము భోగవారము. స్వయంజ్యోతి నెరిగినవాడును, యోగ, యుక్తి విశారదుడును, తత్త్వజ్ఞానప్రకాశకుడును అగు బ్రహ్మచారి ప్రకాశకు డనబడును. ౮ - ౯

ఇది శ్రీ గోవర్ధన-మఠామ్నాయము.



## శ్రీశ్రీ బదరీనారాయణో విజయతేతరామ్

### అథ జ్యోతిర్ధామ్ని ప్రతిష్ఠితః జ్యోతిర్మఠామ్నాయః.

తృతీయస్తూత్తరామ్నాయో జ్యోతిర్నామ మఠో భవేత్,
శ్రీమఠశ్చేతి వా తస్య నామ్నాన్తరముదీరితమ్. ౧

ఆనన్దవారవిజ్ఞేయః సమ్ప్రదాయోఽస్య సిద్ధిదః,
పదాని తస్య ఖ్యాతాని గిరిపర్వతసాగరాః. ౨

బదరీకాశ్రమః క్షేత్రః దేవో నారాయణః స్మృతః,
పూర్ణాగిరీ చ దేవీ స్యాదాచార్యస్తోటకః స్మృతః. ౩

తీర్థఞ్చాలకనన్దాఖ్యా హ్యానన్దో బ్రహ్మచార్యభూత్,
అయమాత్మా బ్రహ్మ చేతి మహావాక్యముదాహృతమ్. ౪

శ్రీ శ్రీ బదరీనారాయణునకు జయము.

శ్రీజ్యోతిర్ధామమున ప్రతిష్ఠితమైన జ్యోతిర్మఠామ్నాయము.

భారతోత్తరప్రాంతమున ప్రతిష్ఠింపబడిన జ్యోతిర్మఠామ్నాయమా చెప్ప బడుచున్నది. ఇది మూడవది. శ్రీమఠమనికూడ దీనికి పేరు. ౧

సిద్ధినొసగగల శక్తితోగూడిన ఈసంప్రదాయముపేరు 'ఆనందవారము'. గిరి, పర్వత, సాగరములని దీనికి పదములు. ౨

ఈ సంప్రదాయమువారికి క్షేత్రము బదరికాశ్రమము. దేవత - నారాయణుడు. దేవి - పూర్ణాగిరి. ఆచార్యుడు తోటకుడు. ౩

వీరికి తీర్థమూ అలకనంద. బ్రహ్మచారిపేరు ఆనందుడు. 'అయమాత్మా బ్రహ్మ - ఈ ఆత్మయే బ్రహ్మము.' అనునది వీరి మహావాక్యము. ౪

అథర్వవేదవక్తా చ భృగ్వాఖ్యం గోత్రముచ్యతే,
కురుకాశ్మీరకాంబోజపాంచాలాదివిభాగతః. ౫

జ్యోతిర్మఠవశా దేశా హ్యుదీచీదిగవస్థితాః,
వాసో గిరివనే నిత్యం గీతాధ్యయనతత్పరః. ౬

గమ్భీరాచలబుద్ధిశ్చ గిరినామా స ఉచ్యతే,
వసన్ పర్వతమూలేషు ప్రౌఢం జ్ఞానం బిభర్తి యః. ౭

సారాసారం విజానాతి పర్వతః పరికీర్త్యతే,
తత్త్వసాగరగమ్భీరో జ్ఞానరత్నపరిగ్రహః. ౮

మర్యాదాం నైవలఙ్ఘతే సాగరః పరికీర్త్యతే. ౯

ఆనన్దో హి విలాసశ్చ వార్యతే యేన జీవినామ్,
సమ్ప్రదాయో యతీనాం చానన్దవారః స ఉచ్యతే. ౧౦

బ్రహ్మచారికి అథర్వవేదము పఠనీయము. భృగుగోత్రము. కురు, కాశ్మీర, కాంభోజ, పాంచాలాదికమగు ఉత్తరదేశము లన్నియును ఈ మఠాధీనములు.

గిరివనవాసియును, గీతాధ్యయనతత్పరుడును, గంభీరమును, స్థిరమును అగు బుద్ధిగలవాడును అగు సన్న్యాసి గిరి. ౬

పర్వతమూల ప్రదేశముల నివసించుచు, పరిపక్వజ్ఞానముతో నుండి, సారాసారముల నెరుగువాడు "పర్వత" సంజ్ఞకుడు. ౭

తత్త్వసాగర గంభీరుడును, జ్ఞానరత్నశోభితుడును, శాస్త్రమర్యాద నుల్లంఘింపనివాడును అగు సన్న్యాసి సాగరుడు. ౮_౯

ఆనందమనగా, విషయవిలాసములనుండి మానవులను నివారించువా రగుటవలన, ఈ సంప్రదాయస్థులగు యతులు 'ఆనందవార' సంజ్ఞచే వ్యవహరింప బడుదురు. ౧౦

సత్యం జ్ఞానమనన్తం యో నిత్యం ధ్యాయతే తత్త్వవిత్,
స్వానన్దే రమతే నిత్యమానన్దః పరికీర్తితః. ౧౧

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య పూజ్యపాద
శ్రీశఙ్కరాచార్య ప్రతిష్ఠిత - జ్యోతిర్మఠామ్నాయః.

—०॰—

## శ్రీశ్రీ రామేశ్వరో విజయతేతరామ్

## అథ దక్షిణదిశిప్రతిష్ఠిత శృఙ్గేరీమఠామ్నాయః.

చతుర్థో దక్షిణామ్నాయః శృఙ్గేరీ తు మఠో భవేత్,
సమ్ప్రదాయో భూరివారః భూర్భువో గోత్రముచ్యతే. ౧
పదాని త్రీణి ఖ్యాతాని సరస్వతీ భారతీ పురీ,
రామేశ్వరాహ్వయం క్షేత్రమాదివరాహ దేవతా. ౨

తత్త్వజ్ఞుడై సత్యజ్ఞానానన్తస్వరూపమగు బ్రహ్మమును నిత్యము ధ్యానించుచు, ఎల్లప్పుడును స్వానందముననే క్రీడించు బ్రహ్మచారి - బాలకుడు ఆనందుడనబడును. ౧౧

ఇది జ్యోతిర్మఠామ్నాయము.

—◆—

### శ్రీశ్రీ రామేశ్వరునకు జయము.

### దక్షిణమున ప్రతిష్ఠితమైన శృంగేరీమఠామ్నాయము.

భారతమున దక్షిణదిక్కున స్థాపింపబడిన మఠము శృంగేరీమఠము. ఇది నాల్గవది. "భూరివార" సంప్రదాయము. "భూర్భువః" గోత్రము. ౧

సరస్వతి, భారతి, పురి - అని మూడు పదవులు ఈ సంప్రదాయము వారి కుండును. తీర్థము రామేశ్వరము. దేవత ఆదివరాహమూర్తి. ౨

కామాక్షీ తస్య దేవీ స్యాత్ సర్వకామఫలప్రదా,
పృథివీధరాఖ్య ఆచార్యస్తుఙ్గభద్రేతి తీర్థకమ్. ౩

చైతన్యాఖ్యో బ్రహ్మచారీ యజుర్వేదస్య పాఠకః,
అహం బ్రహ్మాస్మి తత్రైవ మహావాక్యం సమీరితమ్. ౪

ఆన్ధ్రద్రావిడకర్ణాటకేరలాదిప్రభేదతః,
శృఙ్గేర్యధీనా దేశాస్తే హ్యవాచీదిగవస్థితాః. ౫

స్వరజ్ఞానరతో నిత్యం స్వరవాదీ కవీశ్వరః,
సంసారసాగరాసారహన్తాసౌ హి సరస్వతీ. ౬

విద్యాభారేణ సమ్పూర్ణః సర్వభారం పరిత్యజన్,
దుఃఖభారం న జానాతి భారతీ పరికీర్త్యతే. ౭

దేవి సర్వమంగళయగు కామాక్షి. పృథివీధరు డాచార్యుడు. తీర్థము తుంగభద్ర. ౩

బ్రహ్మచారి పేరు చైతన్యుడు. యజుర్వేదము పఠనీయము. 'అహం బ్రహ్మాస్మి – నేను బ్రహ్మమను' అనునది మహావాక్యము. ౪

దక్షిణముననున్న ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, కేరల దేశములు శృంగేరీ మఠాధీనమున నుండును. ౫

వేదోచ్చారణ నెరిగి, అందు నిపుణుడై, కవిశ్రేష్ఠుడై అసారమగు సంసారసాగరమును తుడిచివేయువాడు సరస్వతి. ౬

ఇతరభారముల నన్నిటిని త్యజించి, విద్యాభారముతో నిండి, దుఃఖభారము నెరుంగనివాడు భారతి. ౭

జ్ఞానతత్త్వేన సమ్పూర్ణః పూర్ణతత్త్వపదే స్థితః,
పరం బ్రహ్మరతో నిత్యం పురీనామా స ఉచ్యతే. ౮

భూరిశబ్దేన సౌవర్ణ్యం వార్యతే యేన జీవినామ్,
సమ్ప్రదాయజ్ఞో యతీనాఞ్చ భూరివారః స ఉచ్యతే. ౯

చిన్మాత్రం చేత్యరహితమనన్తమజరం శివమ్,
యో జానాతి స వై విద్వాన్ చైతన్యం తద్విధీయతే. ౧౦

మర్యాదైషా సువిజ్ఞేయా చతుర్మఠవిధాయినీ,
తమేతాం సముపాశ్రిత్య ఆచార్యాః స్థాపితాః క్రమాత్. ౧౧

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య భగవత్పూజ్యపాద
శ్రీ శఙ్కరాచార్యప్రతిష్ఠిత - శృఙ్గేరీ మఠామ్నాయః.

జ్ఞానతత్త్వముతో పూర్ణుడై, పూర్ణమగు తత్త్వపదమున నిలచి, నిత్యము పరబ్రహ్మరతుడగు వాడు పురి. ౮

భూరిశబ్దమున కర్థము కాంచనము. ఏ సంప్రదాయము మానవులను కాంచనాసక్తినుండి వారించునో దాని పేరు భూరివారసంప్రదాయము. * ౯

చిన్మాత్రమును, చిత్తసంబంధరహితమును, అనంతమును, జరామరణ రహితమును అగు శివస్వరూపము నెరిగిన విద్వాంసుడే చైతన్యుడు. ♦ ౧౦

ఇవి నాలుగు * మఠములకును సంబంధించిన మర్యాద. దీనిని చక్కగ గ్రహింపనగును. ఈ నియమముల ననుసరించియే ఆచార్యులు క్రమముగ స్థాపింపబడినారు. ౧౧

ఇది శృంగేరీమఠామ్నాయము.

---

* శ్రీరామకృష్ణపరమహంసులవారి గురువు తోతాపురి. పరమహంసులవారి కామకాంచన త్యాగబోధ జగద్విదితము !

♦ శ్రీకృష్ణచైతన్యులవారును వారి గురువులగు మాధవేంద్రపురి, ఈశ్వరపురి, కేశవ భారతి ఈ సంప్రదాయమువారే !

* ఈ మఠామ్నాయగ్రంథము కొంత పోయినదనిపించుచున్నది. ఇన్ని మఠములు స్థాపించిన శంకరులు కాశీక్షేత్రమున మఠమును నిల్పలేదనుట విచి

# అథ మహానుశాసనమ్



ఆమ్నాయాః కథితా హ్యేతే యతీనాఞ్చ పృథక్ పృథక్,
తే సర్వే చతురాచార్యా నియోగేన యథాక్రమమ్. ౧
ప్రయోక్తవ్యాః స్వధర్మేషు శాసనీయాస్తతోఽన్యథా,
కుర్వన్తు ఏవ సతతమటనం ధరణీతలే. ౨
స్వ స్వ రాష్ట్రప్రతిష్ఠిత్యై సఞ్చారః సువిధీయతామ్,
మఠే తు నియతో వాసో ఆచార్యస్య న యుజ్యతే. ౩

వేరువేరుగ యతులనిమిత్తము ధర్మములు చెప్పబడినవి. ఈ ఆచార్యులు నలుగురును యథాక్రమముగ నిర్దేశము ననుసరించి స్వధర్మము ననువర్తింతురు గాక! కానిచో దండనీయు లగుదురు. వీరు సర్వదా (ధర్మప్రచార మొనర్చుచు) పర్యటన మొనర్చుచుండవలెను. ౧-౨

తమతమ రాష్ట్రములలో ప్రతిపత్తి సంపాదించునిమిత్తము వీరు చక్కగా సంచార మొనర్పవలెను. నిరంతరము మఠములో కూరుచుండుట ఆచార్యునకు తగదు. ౩

---

త్రము కదా! శ్రీవారు సుమేరుమఠమును కాశీలో ప్రతిష్ఠించిరనియు, అది ౨౫౦ ఏండ్లక్రితము కారణాంతరములచే నేఁడు శృంగేరీమఠశాఖగ పరిగణింపబడు గురుస్వామిమఠముగ మారినదనియు, తలఁచుచున్నారు. అదియునుగాక ప్రస్తుతము కుంభకోణమునమున్న కంచీకామకోటిమఠముకూడ శంకరప్రతిష్ఠితమైనదే అనుచున్నారు. — అగుచో నాలుగుగాక ఆరుమఠములగును - అను

వర్ణాశ్రమసదాచారా అస్మాభిర్యే ప్రసాధితాః,
రక్షణీయాస్తు ఏవైతే స్వే స్వే భాగే యథావిధి. ౪

యతో వినష్టిర్మహతీ ధర్మస్యాత్ర ప్రజాయతే,
మాన్ద్యం సంత్యాజ్యమేవాత్ర దాక్ష్యమేవ సమాశ్రయేత్. ౫

పరస్పరవిభాగే తు ప్రవేశో న కదాచన,
పరస్పరేణ కర్తవ్యా ఆచార్యేణ వ్యవస్థితిః. ౬

మర్యాదాయా వినాశేన లుప్యేరన్ నియమాః శుభాః,
కలహాఙ్గారసంపత్తిరతస్తాం పరివర్జయేత్. ౭

పరివ్రాడార్యమర్యాదాం మామకీనాం యథావిధి,
చతుఃపీఠాధిగాం సత్తాం ప్రయుఞ్జ్యాచ్చ పృథక్ పృథక్. ౮

మేము సాధించిన సదాచారములను వర్ణాశ్రమధర్మములు, ఈ మఠాచార్యులు తమతమ భాగమునకుగాను నిర్ణయింపబడిన రాజ్యములలో, చక్కగ రక్షితములగునట్లు చూతురుగాక ! ౪

ప్రస్తుతము ధర్మగ్లాని ఎంతగనో సంభవించియున్నది. కనుక వీరు మందకొడితనము వదలి, సామర్థ్యమును చూపుదురుగాక ! ౫

వారికివారికిగాను నిర్ణయింపబడిన ప్రదేశములలో ఇంకొకరు ప్రవేశింపగూడదు - అను నిర్ణయమునకు ఈ ఆచార్యులు పరస్పరామోదములతో కట్టుబడుదురుగాక ! ౬

హద్దుమీరి ప్రవర్తించినచో శుభప్రదములగు నియమములుగూడ లోపించును. కలహాంగారము పుట్టును. కనుక నియమోల్లంఘనము వర్జనీయము. ౭

సన్న్యాసియగువాడు నేను నిర్మించిన ఈ ఆర్యమర్యాద యథావిధిగ నాలుగుమఠముల అధిపతులద్వారా రక్షింపబడునట్లు తనశక్తిని వినియోగింపనగును. ౮

శుచిర్జితేన్ద్రియో వేదవేదాఙ్గాదివిశారదః,
యోగజ్ఞః సర్వశాస్త్రాణామస్మదాస్థానమాప్నుయాత్. ౯

ఉక్తలక్షణసంపన్నః స్యాచ్చేన్మత్పీఠభాగ్ భవేత్,
అన్యథారూఢపీఠోఽపి నిగ్రహార్హో మనీషిణామ్. ౧౦

న జాతు మఠముచ్ఛిన్ద్యాదధికారిణ్యుపస్థితే,
విఘ్నానామపి బాహుల్యాద్ ఏష ధర్మః సనాతనః. ౧౧

అస్మత్పీఠే సమారూఢః పరివ్రాడుక్తలక్షణః,
అహమేవేతి విజ్ఞేయో 'యస్య దేవ'ఇతి శ్రుతేః. ౧౨

పవిత్రుడును, జితేంద్రియుడును, వేదవేదాంగపారగుడును, సర్వశాస్త్రజ్ఞుడును, యోగిపురుషుడును అగువాడే నా ఆస్థానమున ప్రవేశించునుగాక! (అనగా తంత్రోక్త దక్షిణవామమార్గములలో వామమార్గమును పరిత్యజించి, ఆజన్మశుద్ధుడై శుష్కపాండిత్యమేగాక యోగానుభవజ్ఞులగువారే ఆచార్య పదము నలంకరింతురుగాక! ౯

ఇట్టి లక్షణములుగల పురుషుడే నా పీఠము నలంకరించునుగాక! ఇందులకు వ్యతిక్రమముగ పీఠము నెట్లో సంపాదించిన పక్షమున బుద్ధిమంతులగు వారి నిగ్రహమునకు పాల్పడును. ౧౦

ఉపయుక్తుడగు ఆచార్యుడు లభించిన, ఎట్టి విఘ్నపరంపరలనైన ఎదుర్కొని, మఠక్రమమును కాపాడి సనాతనధర్మమును రక్షించునుగాక! ౧౧

పూర్వోక్తలక్షణశోభితుడగు యతీంద్రుడు నా పీఠమును అలంకరించిన ప్రజలు అతనిని నన్నుగానే భావించి 'యస్య దేవః' అను శ్రుతి వాక్యానుసారము మర్యాద నొనర్తురుగాక! (ఉక్తశ్రుతివాక్యము ననుసరించి గురుభక్తిని ప్రదర్శింతురు గాక!) ౧౨

ఏక ఏవ అభిషేచ్యః స్యాదన్తే లక్షణసమ్మతః,
తత్పీఠే క్రమేణైవ న బహుర్యుజ్యతే క్వచిత్. ౧౩

సుధన్వనః సమౌత్సుక్యనివృత్త్యై ధర్మహేతవే,
దేవరాజ్యవచారాంశ్చ యథావదనుపాలయేత్. ౧౪

కేవలం ధర్మముద్దిశ్య విభవో బ్రాహ్యచేతసామ్,
విహితశ్చోపకారాయ పద్మపత్రనయం వ్రజేత్. ౧౫

సుధన్వా హి మహారాజస్తదన్యే చ నరేశ్వరాః,
ధర్మపరమ్పరామేతాం పాలయన్తు నిరన్తరమ్. ౧౬

చాతుర్వర్ణ్యం యథాయోగ్యం వాఙ్మనః కాయకర్మభిః,
గురోః పీఠం సమర్చేత విభాగానుక్రమేణ వై. ౧౭

ఒక్కొక్క పీఠమునకు ఆయా ఆచార్యుల కంతిమదశ ప్రాప్తించినప్పుడు, ఒక్కొక్కనికే పట్టము నొసగవలెనే గాని, ఒక మఠమునకు ఆచార్యులు పెక్కుమంది ఉండదగదు. ౧౩

ధర్మరక్షణార్థము సుధన్వరాజునకు గల ఔత్సుక్యమును గమనించి, ఇంద్రాజ్ఞవలె, అతని వాక్యములను పాలింతురుగాక! ౧౪

సాధువుల ఐశ్వర్యము ధర్మరక్షణనిమిత్తమే; మరియును బాహ్యచిత్తులగు జనులకు ఉపకరించుటకును. కనుక తామరాకు నీరు అంటించుకొననట్లు నిర్లిప్తులై యుండనగును. ౧౫

సుధన్వమహారాజును, మిగిలిన రాజులునుగూడ ఈ ధర్మపరంపరను రక్షింతురుగాక! ౧౬

చాతుర్వర్ణ్యమునకు జెందిన ప్రజలు యథాయోగ్యముగ దానిని రక్షించుచు, పూర్వము జెప్పిన విభాగానుసారము గురుపీఠము నర్చింతురుగాక! ౧౭

ధరామాలమ్బ్య రాజానః ప్రజాభ్యః కరభాగినః,
కృతాధికారా ఆచార్యా ధర్మతస్తద్వదేవ హి. ౧౮

ధర్మో మూలం మనుష్యాణామ్ సదాచార్యావలమ్బనః,
తస్మాదాచార్యసుమణేః శాసనం సర్వతోఽధికమ్. ౧౯

తస్మాత్ సర్వప్రయత్నేన శాసనం సర్వసమ్మతమ్,
ఆచార్యస్య విశేషేణ హ్యౌదార్యభరభాగినః. ౨౦

నిర్మలా స్వర్గమాయాన్తి కృత్వా పాపాని మానవాః,
ఆచార్యాత్తప్తదణ్డాస్తు సన్తః సుకృతినో యథా. ౨౧

ఇత్యేవం మనురవ్యాహ గౌతమోఽపి విశేషతః,
విశిష్టశిష్టాచారోఽపి మూలాదేవ ప్రసిధ్యతి. ౨౨

రాజ్యాధికారమును బొందిన రాజులు ప్రజలనుండి కరము (పన్ను) గ్రహించునట్లు, ధర్మాధికారమును బొందిన ఆచార్యులు దానిని రక్షించు నిమిత్తము కరమును గ్రహింతురు. ౧౮

మానవులకు ఆధారము ధర్మమే; అది సదాచార్యుని అవలంబించియుండును. కనుక ఆచార్యానుశాసనము అన్నిటిని మించినది. ౧౯

ఆచార్యుడు ప్రయత్నముతో నొసగు ఉపదేశము నందరును, ముఖ్యముగా ఉదారులగువారు, స్వీకరింపనగును. ౨౦

పాపులుగూడ ఆచార్యుని దండనమును బొందినచో శుద్ధులై, పుణ్యపురుషులవలెనే, స్వర్గమును బొందగలరు. ( – ఆచార్యుని మహిమ అట్టిది.) ౨౧

ఇట్టి నియమములు స్వకపోలకల్పితములు కావు; మనువు, గౌతముడు మున్నగువారుకూడ చెప్పియుండిరి. విశిష్టమగు శిష్టాచారముగూడ మూలభూతమగు వేదమువలననే ప్రసిద్ధమైనది. ౨౨

తానాచార్యోపదేశాంశ్చ దణ్డాంశ్చ పరిపాలయేత్,
తస్మాద్రాజా చాచార్యశ్చ ద్వావనిన్ద్యాభివన్దితౌ. ౨౩
ధర్మస్య పద్ధతిరేషా జగతః స్థితిహేతవే,
సర్వవర్ణాశ్రమాణాం హి యథాశాస్త్రం విధీయతే. ౨౪
కృతే విశ్వగురుర్బ్రహ్మా త్రేతాయాం ఋషిసత్తమః,
ద్వాపరే వ్యాస ఏవ స్యాత్ కలావత్ర భవామ్యహమ్. ౨౫

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత - మహానుశాసనమ్ ॥౨౫॥

కనుక ఆచార్యోపదేశదండములు పరిపాలనీయములు; రాజును ఆచార్యుడును వందనీయులు. నిందనీయులు గారు. ౨౩

జగత్తుయొక్క శుభమును గోరి, సర్వవర్ణములకును, ఆశ్రమములకును శాస్త్రవిహితమైన ఈ పద్ధతి విధింపబడుచున్నది. ౨౪

కృతయుగమున బ్రహ్మయును, త్రేతాయుగమున వసిష్ఠుడును, ద్వాపరమున వ్యాసుడును జగద్గురువులు; కలియుగమున జగద్గురువునై నేనే అవతరించితిని. ౨౫

ఇది మహానుశాసన - ఆంధ్రానువాదము.

ఇది మఠామ్నాయము ॥౨౫॥

# ౩౦. యోగతారావలీ

వన్దే గురూణాం చరణారవిన్దే
సన్దర్శితస్వాత్మసుఖావబోధే,
నిఃశ్రేయసే జాఙ్గలికాయమానే
సంసారహాలాహలమోహశాన్త్యై. ౧

సదాశివోక్తాని సపాదలక్ష -
లయావధానాని వసన్తి లోకే,
నాదానుసన్ధానసమాధిమేకం
మన్యామహే మాన్యతమం లయానామ్. ౨

సరేచపూరైరనిలస్య కుమ్భైః
సర్వాసు నాడీషు విశోధితాసు,
అనాహతాదమ్బురుహాదుదేతి
స్వాత్మావగమ్యః స్వయమేవ బోధః. ౩

స్వాత్మసుఖానుభూతిని సందర్శించుచు, ముక్తిపథప్రదర్శకుడగుచు మంగళమయుడగు గురువర్యుని చరణారవిందములను, సంసార - హాలాహలమను మోహము శాంతించునిమిత్తము వందన మొనర్చుచున్నాను. ౧

సదాశివునిచే చెప్పబడిన లయయోగవిధానములు ఒకలక్షాపాతికవేలం ఈ లోకమున ప్రచారములో కలవు. వానిలో నాదానుసంధానరూపమగు సమాధినే అయా లయయోగములలోనికెల్ల శ్రేష్ఠతమముగా ఎంతుము. ౨

రేచక, పూరక, కుంభకములవలన నాడులన్నియును పరిశుద్ధినందగా, (వికసితమైన) అనాహతపద్మమునుండి ఆత్మలాభోపాయమగు తత్త్వజ్ఞానము స్వయముగ ఉదయించును. ౩

నాదానుసన్ధాన! నమోఽస్తు తుభ్యం
త్వాం సాధనం తత్త్వపదస్య జానే,
భవత్ప్రసాదాత్ పవనేన సాకం
విలీయతే విష్ణుపదే మనో మే. ౪

జాలన్ధరోడ్యాణనమూలబన్ధాన్
జల్పన్తి కంఠోదరపాయుమూలాన్,
బన్ధత్రయేఽస్మిన్ పరిచీయమానే
బన్ధః కుతో దారుణకాలపాశాత్. ౫

ఉడ్యానజాలన్ధరమూలబన్ధై
రున్నిద్రితాయామురగాఙ్గనాయామ్,
ప్రత్యఙ్ముఖత్వాత్ ప్రవిశన్ సుషుమ్నాం
గమాగమే ముఞ్చతి గన్ధవాహః.

నాదానుసంధానమా! నీకు నమస్కారము. ఏలయన, నిన్ను తత్త్వపదమునకు సాధనముగ గ్రహించితిని. నీ అనుగ్రహమున నా మనస్సు ప్రాణముతో గలసి, విష్ణుపదము (బ్రహ్మము) న విలీనమగును. ౪

జలంధర, ఉడ్యాన మూలబంధములను యథాక్రమముగ కంఠ, ఉదర, గుహ్యదేశముల నభ్యసింపవలెనని యోగు లందురు. ఈ మూడు బంధములను అభ్యసించినయెడల దారుణమగు కాలపాశబంధము ఇక ఎట్లుండగలదు? ౫

ఈ మూడుబంధములవలన మలకుండలిని నిద్రలేచి, ప్రాణవాయువు అధోముఖమగు సుషుమ్నానాడియందు ప్రవేశించి స్థిరమై నిల్చును. ౬

ఉత్థాపితాధారహుతాశనోల్కై-
రాకుఞ్చనైః శశ్వదపానవాయోః,
సన్తాపితాచ్చాన్ద్రమసః పతన్తీం
పీయూషధారాం పిబతీహ ధన్యః. ౭

బన్ధత్రయాభ్యాస విపాకజాతాం
వివర్జితాం రేచకపూరకాభ్యామ్,
విశోధయన్తీం విషయప్రవాహాం
విద్యాం భజే కేవలకుంభరూపామ్. ౮

అనాహతే చేతసి సావధానై
రభ్యాసశూరైరనుభూయమానా,
సంస్తమ్భితశ్వాస మనః ప్రచారా
సా జృమ్భతే కేవల కుమ్భకశ్రీః. ౯

మూలాధారమునుండి లేచిన అగ్నిశిఖలవలన వెంటనే అపానవాయువు సంకుచితముకాగా, సహస్రారపద్మమునందలి చంద్రుడు ఆవేడికి కరుగ, అట నుండి స్రవించిన అమృతధారలను ధన్యులగు పురుషులే పానమొనర్తురు. ౭

బంధత్రయాభ్యాసఫలితమును, రేచన పూరకములు లేనిదియును, విషయ ప్రవాహమును అడ్డునదియును అగు కేవల కుంభరూపమగు ఏ విద్య కలదో దానిని భజించుచున్నాను. ౮

సావధానచిత్తులగు అభ్యాసశూరులు (క్రమప్రయత్నమువలన) ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్కయు, మనస్సుయొక్కయు కదలికను అరికట్టగా, చిత్తము అప్పుడు అనాహతపద్మముననే స్థిరమగుచున్నది. ఇది కేవలకుంభకమువలననే సాధ్యమగుచున్నది. అట్టి స్థితిలో కుంభకశ్రీయే విజృంభించుచున్నది. ౯

సహస్రశః సన్తి హఠేషు కుమ్భాః
సమ్భావ్యతే కేవలకుమ్భ ఏవ,
కుమ్భోత్తమే యత్ర తు రేచపూరౌ
ప్రాణస్య న ప్రాకృత వైకృతాఖ్యౌ. ౧౦

త్రికూటనామ్ని స్తిమితేన్తరఙ్గే
ఖే స్తమ్భితే కేవలకుమ్భకేన,
ప్రాణానిలో భానుశశాఙ్కనాడ్యౌ
విహాయ సద్యో విలయం ప్రయాతి. ౧౧

ప్రత్యాహృతః కేవల కుమ్భకేన
ప్రబుద్ధ కుణ్డల్యుపభుక్త శేషః,
ప్రాణః ప్రతీచీన పథేన మన్దం
విలీయతే విష్ణుపదాన్తరాలే. ౧౨

హఠయోగశాస్త్రమున సహస్రములగు కుంభకములు వర్ణింపబడియున్నవి. కాని కేవలకుంభకమే శ్రేష్ఠముగ పరిగణింపబడియున్నది. ఈ కుంభకదశయందు ప్రాణవాయువు ప్రాకృతవైకృతములనబడు రేచకపూరకములను నిర్వహింపదు.

హృదయమున త్రికూటమనబడు ఆకాశము నిశ్చలమై వెలయుచున్నది. కేవలకుంభకమువలన ప్రాణవాయువును అక్కడ నిల్పినచో, ప్రాణవాయువు సూర్యచంద్రనాడులను (ఇడా పింగళులను) పరిత్యజించి లయమొందును. ౧౧

కేవల కుంభకమువలన ప్రాణవాయువు ప్రత్యాహృతమైనప్పుడు, అది జాగరితమైన కుండలినివలన భక్షింపబడుచున్నది. మిగిలినది అధోదేశమునకు దిగి నెమ్మదిగా విష్ణుపదమున లీనమగుచున్నది. ౧౨

నిరఙ్కుశానాం శ్వసనోద్గమానాం
నిరోధనైః కేవలకుమ్భకాఖ్యైః,
ఉదేతి సర్వేన్ద్రియ వృత్తి శూన్యో
మరుల్లయః కోఽపి మహామతీనామ్. ౧౩

న దృష్టిలక్ష్యాణి న చిత్తబన్ధో
న దేశకాలౌ న చ వాయురోధః,
న ధారణాధ్యానపరిశ్రమో వా
సమేధమానే సతి రాజయోగే. ౧౪

అశేషదృశ్యోజ్ఝిత దృగ్జయానాం
మనస్థితానామిహ రాజయోగే,
న జాగరో నాపి సుషుప్తిభావో
నో జీవితం నో మరణం విచిత్రమ్. ౧౫

నిరంకుశములగు ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిరోధింపబడు కుంభకస్థితి వలననే మహామతులగు యోగులకు సర్వేంద్రియవృత్తిరహితమగు ప్రాణనిరోధ మనబడు ఒకానొక స్థితి లభించుచున్నది. ౧౩

ఈ కేవలకుంభకమగు రాజయోగము కరాయత్తమైనయెడల, దృష్టిని స్థిరమొనర్పవలసిన త్రాటకాదులతో నిమిత్తము లేదు; ఒకానొక నిర్దిష్టస్థానమున చిత్తమును బంధింపనక్కరలేదు. ఈ పుణ్యక్షేత్రమున, (దేశము) ఈ పుణ్యకాలమున, ఇట్టి కర్మమొనర్పనగునను నియమములతో పనిలేదు. వాయువును నిరోధింపవలసిన అవసరము లేదు. ధ్యానధారణాపరిశ్రమయే కలుగదు. ౧౪

రాజయోగమున వెలయువారు సమస్త దృశ్య వస్తువులను విసర్జించి, నయనేంద్రియమును జయించినప్పుడు, జాగ్రత్సుషుప్తులుగాని, జీవనమరణములుగాని లేని ఒక విచిత్రస్థితి సంభవించును. ౧౫

అహం మమత్వాది విహాయ సర్వం
శ్రీరాజయోగే స్థిరమానసానామ్,
న ద్రష్టృతా నాస్తి చ దృశ్యభావః
సా జృమ్భతే కేవల సంవిదేవ. ౧౬

నేత్రే యయోన్మేషనిమేషశూన్యే
వాయుర్యయా వర్జితరేచపూరః,
మనశ్చ సంకల్ప వికల్ప శూన్యం
మనోన్మనీ సా మయి సన్నిధత్తామ్. ౧౭

చిత్తేన్ద్రియాణాం చిరనిగ్రహేణ
శ్వాసప్రచారే శమితే యమీన్ద్రాః,
నివాతదీపా ఇవ నిశ్చలాఙ్గా
మనోన్మనీ మగ్నధియో భవన్తి. ౧౮

అహంకారమమకారముల నన్నిటిని విడచి శ్రీరాజయోగమున మనస్సును స్థిరమొనర్చిన యోగులకు, దృక్‌దృశ్యభావ ముండదు. అట్టి స్థితిలో కేవలము సంవిత్తే విజృంభించుచుండును. ౧౬

ఏ తెలివిడివలన కంటిరెప్పలు మూతబడుటయు, లేచుటయు నిలచిపోవు చున్నదో; ఊపిరి లోపలికి గొనుటయును, వెలికి విడుచుటయును ఆగిపోవు చున్నదో; మనస్సు "అవును, కాదు" అనుట ఆగిపోవుచున్నదో, ఆ మనోన్మనీ (మనోలయ స్థితి (అనగా నిర్వికల్పసమాధి) నాయం దావిర్భవించును గాక! ౧౭

చిత్తమును, ఇంద్రియములును మరి చలింపకుండునట్లు నిగ్రహింపబడి నప్పుడు; శ్వాసక్రియ నిరోధింపబడినప్పుడు; గాలిలేనిచోట నుంచబడిన దీపము వలె శరీరాంగములు కంపించకుండనప్పుడు యోగులు ఈ మనోన్మనీ స్థితి యందు నిమగ్నచిత్తులగుదురు. ౧౮

ఉన్మన్యవస్థాధిగమాయ విద్వాన్
ఉపాయమేకం తవ నిర్దిశామః,
పశ్యన్నుదాసీనతయా ప్రపఞ్చం
సంకల్పమున్మూలయ సావధానః. ౧౯

ప్రసహ్య సంకల్పపరమ్పరాణాం
సంఛేదనే సన్తత సావధానమ్,
ఆలమ్బనాశాదపచీయమానం
శనైః శనైః శాన్తిముపైతి చేతః. ౨౦

నిఃశ్వాసలోపైర్నిభృతైః శరీరై
ర్నేత్రామ్బుజై రర్ధనిమీలితైశ్చ,
ఆవిర్భవన్తీ మమనస్కముద్రా
మాలోకయామో మునిపుఙ్గవానామ్. ౨౧

విద్వాంసుడా! ఈ ఉన్మనీస్థితిని బొందునిమిత్తము నీకొక ఉపాయమును నిర్దేశించుచున్నాను. ఉదాసీనభావముతో ఈ జగత్తును జూచుచు, సావధానముగ సంకల్ప (వికల్ప) ములనన్నిటిని సమూలముగ పెకలించుము.

ఓర్మితో నిరంతరసావధానుడవగుచు, సంకల్పపరంపరలను ఛేదింపుము. ఆలంబనము అనగా ఆధారము లేకుండిన, (ఈ సంకల్పములు ఉదయింపవు. అప్పుడు) చిత్తము క్రమముగ శాంతినందును. ౨౦

నిశ్వాసము నిలచిపోయి, నేత్రపద్మములు అర్ధనిమీలితములై, తనువు దృఢముగ నుండిన పరిస్థితిలో యోగిపుంగవులయందు అమనస్కముద్ర (నిర్వికల్ప స్థితి) ఆవిర్భవించుచుండుట, మేము ప్రత్యక్షముగ చూచుచున్నాము. ౨౧

అమీ యమీన్ద్రాః సహజామనస్కా-
దహంమమత్వే శిథిలాయమానే,
మనోఽతిగం మారుతవృత్తిశూన్యం
గచ్ఛన్తి భావం గగనావశేషమ్. ౨౨

నివర్తయన్తీం నిఖిలేన్ద్రియాణి
ప్రవర్తయన్తీం పరమాత్మయోగమ్,
సంవిన్మయీం తాం సహజామవస్థాం
కదా గమిష్యామి గతాన్యభావః. ౨౩

ప్రత్యగ్ విమర్శాతిశయేన పుంసాం
ప్రాచీనసఙ్గేషు పలాయితేషు,
ప్రాదుర్భవేత్ కాచిదజాడ్యనిద్రా
ప్రపఞ్చచిన్తాం పరివర్జయన్తీ. ౨౪

ఈ సంయమీంద్రులు సహజమగు అమనస్కస్థితినిబొంద, అహంకార మమకారములు శిథిలీభావమును బొందుచున్నవి. అప్పుడు మనస్సునకు అతీతమై వాయువృత్తిరహితమైన ఆకాశభావమును బొందుచున్నారు. ౨౨

ఏస్థితియందు సర్వేంద్రియములును విషయవ్యాపారవర్జితములై, పరమాత్మయోగమున ప్రవర్తిల్లునట్టి సంవిన్మయ - సహజావస్థను నే నెన్నడు అనన్యభావముతో పొందగలను ? ౨౩

ప్రత్యగాత్మయందు మనస్సును నిలుపుటవలన పూర్వసంస్కారము లన్నియును తొలగిపోగా, ప్రపంచచింతారహితమును, జడత్వరహితమును అగు ఒకానొక అపూర్వనిద్ర ఆవిర్భవించును. ౨౪

విచ్ఛిన్న సంకల్ప వికల్పమూలే
నిఃశేష నిర్మూలిత కర్మజాలే,
నిరన్తరాభ్యాసనితాన్తభద్రా
సా జృమ్భతే యోగిని యోగనిద్రా. ౨౫

విశ్రాన్తిమాసాద్య తురీయతల్పే
విశ్వాద్యవస్థాత్రితయోపరిస్థే,
సంవిన్మయీం కామపి సర్వకాలం
నిద్రాం సఖే నిర్విశ నిర్వికల్పమ్. ౨౬

ప్రకాశమానే పరమాత్మభానౌ
నశ్యత్యవిద్యాతిమిరే సమస్తే,
అహో బుధా నిర్మలదృష్టయోఽపి
కిఞ్చిన్న పశ్యన్తి జగత్ సమగ్రమ్. ౨౭

సంకల్పవికల్పములకు మూలమగు అవిద్య నశింప, పూర్వకర్మలన్నియును క్షీణింప, నిరంతరాభ్యాస ప్రాబల్యమున, అత్యంత శుభప్రదమగు యోగనిద్ర, యోగిజనులందు ఆవిర్భవించును. ౨౫

సఖుడా! విశ్వతైజసప్రాజ్ఞులనబడు త్రయమునకు ఊర్ధ్వమునవెలయు తురీయపర్యంకమున చిన్మయమగు నిర్వికల్పనిద్రను సర్వకాలముల అనుభవింపుము. ౨౬

పరమాత్మ - సూర్యోదయమై అవిద్యాంధకారము సమస్తమును నశింపగా, విద్వాంసులు నిర్మలదృష్టులయ్యు, అహో, ఏమి ఆశ్చర్యము! ఇంత పెద్దదియగు జగత్తు ఉండ, ఒకించుకయును చూడజాలకున్నారు. ౨౭

సిద్ధిం తథావిధమనోనిలయాం సమాధౌ
శ్రీశైల శృఙ్గ కుహరేషు కదోపలప్స్యే,
గాత్రం యదా మమ లతాః పరివేష్టయన్తి
కర్ణే యదా విరచయన్తి ఖగాశ్చ నీడాన్. ౨౮

విచరతు మతిరేషా నిర్వికల్పే సమాధౌ
కుచకలశయుగే వా కృష్ణసారేక్షణానామ్,
చరతు జడమతే వా సజ్జనానాం మతే వా
మతికృతగుణదోషా మాం విభుం న స్పృశన్తి. ౨౯

బ్రహ్మరన్ధ్రగతే వాయౌ గిరేః ప్రస్రవణం భవేత్,
* శృణోతి శ్రవణాతీతం నాదం ముక్తిర్న సంశయః.

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత - యోగతారావలీ ॥30॥

నా శరీరమున లతలు పెనవేసికొన, చెవులలో పక్షులు గూడుకట్టుకొన నేను శ్రీశైలగిరి గుహలయందు స్థిరముగ గూరుచుండ, నామనస్సు ఎప్పు డిట్టి నిర్వికల్పసమాధిని బొందును ? ౨౮

ఈ నామనస్సు నిర్వికల్పసమాధియందే విహరించును గాక, లేక హరిణేక్షణల కుచభూముల విహరించును గాక ! జడుల మతమునను సరించి గాని, సజ్జనుల మతము ననురించి గాని తిరుగనిమ్ము - ఆయాబుద్ధిదోషములు సర్వవ్యాపినగు నన్ను అంటజాలవు. ౨౯

ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమున అనగా సహస్రదళపద్మమున ప్రకాశించినప్పుడు, ఆ మేరుగిరినుండి అమృతము స్రవించును. ఈ స్థితిలో అపూర్వనాదము వినబడును. అప్పుడు ముక్తి నిశ్చయము. ౩౦

ఇది యోగతారావళి - ఆంధ్రానువాదము ॥30॥

* ఈ చివరి మూడుశ్లోకములును అధికపాఠము.

# ౩౧. వాక్యవృత్తిః

సర్గస్థితిప్రలయహేతుమచిన్త్యశక్తిం
విశ్వేశ్వరం విదితవిశ్వమనన్తమూర్తిమ్,
నిర్ముక్తబన్ధనమపారసుఖామ్బురాశిం
శ్రీవల్లభం విమలబోధఘనం నమామి. ౧

యస్య ప్రసాదాదహమేవ విష్ణు
ర్మయ్యేవ సర్వం పరికల్పితం చ,
ఇత్థం విజానామి సదాత్మరూపం
* తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్. ౨

తాపత్రయార్కసన్తప్తః కశ్చిదుద్విగ్నమానసః,
శమాదిసాధనైర్యుక్తః సద్గురుం పరిపృచ్ఛతి. ౩

అనాయాసేన యేనాస్మాన్ముచ్యేయం భవబన్ధనాత్,
తన్మే సంక్షిప్య భగవన్! కేవలం కృపయా వద. ౪

ఒకానొక వ్యక్తి తాపత్రయ - సూర్యసంతప్తుడై, ఉద్విగ్నుడయ్యెను. శమాదిసాధనషట్కసంపత్తిని సంపాదించి అనంతరము సద్గురుని సమీపించి ఇట్లు ప్రశ్నించెను : ౩

భగవంతుడా ! నేను తేలికగ ఈ సంసారబంధమునుండి విడివడు ఉపాయ మేదికలదో, దానిని సూక్ష్మముగ దయతో నాకు జెప్పుము. ౪

---

* ఈ రెండుశ్లోకముల అనువాదము నిమిత్తము చూ : అద్వైతానుభూతిః ౧ - ౨.

గురురువాచ :

సాధ్వీ తే వచనవ్యక్తిః ప్రతిభాతి వదామి తే,
ఇదం తదితి విస్పష్టం సావధానమనాః శృణు. 5
తత్త్వమస్యాదివాక్యోత్థం యజ్జీవపరమాత్మనోః,
తాదాత్మ్యవిషయం జ్ఞానం తదిదం ముక్తిసాధనమ్. 6

శిష్య ఉవాచ :

కో జీవః కః పరశ్చాత్మా తాదాత్మ్యం వా కథం తయోః,
తత్త్వమస్యాదివాక్యం వా కథం తత్ ప్రతిపాదయేత్. 7

గురురువాచ :

అత్ర బ్రూమః సమాధానం కోఽన్యో జీవ స్త్వమేవ హి,
యస్త్వం పృచ్ఛసి మాం కోఽహం బ్రహ్మైవాసి న సంశయః.

గురువు : నీవు ప్రశ్నించెడు రీతి చక్కగానే తోచుచున్నది. కనుక నీవడిగిన విషయమును అత్యంతస్పష్టముగ చెప్పుచున్నాను. శ్రద్ధతో ఆలకింపుము. "తత్త్వమసి" వాక్యమువలన ఉత్పన్నమగు ఏ జీవబ్రహ్మైక్యజ్ఞానము కలదో, అదియే ముక్తిసాధనము. 5-6

శిష్యుడు : జీవు డెవరు ? పరమాత్మ యెవరు ? ఈ ఉభయులకు ఐక్యమెట్లు సిద్ధింపగలదు ? తత్త్వమస్యాది - మహావాక్యములు ఈ ఐక్యము నెట్లు ప్రతిపాదించుచున్నవి ? 7

గురువు : నీ ప్రశ్నకు సమాధానము - జీవు డింకెవడు ? నీవే ! 'నేను ఎవడను?' అని నన్ను అడుగు నీవే బ్రహ్మమవు. సందేహములేదు. 8

శిష్య ఉవాచ:

పదార్థమేవ జానామి నాద్యాపి భగవన్ స్ఫుటమ్,
అహం బ్రహ్మేతి వాక్యార్థం ప్రతిపద్యే కథం వద. ౯

గురురువాచ:

సత్యమాహ భవానత్ర విగానం నైవ విద్యతే,
హేతుః పదార్థబోధో హి వాక్యార్థావగతేరిహ. ౧౦

అన్తఃకరణతద్వృత్తిసాక్షీ చైతన్యవిగ్రహః,
ఆనన్దరూపః సత్యః సన్ కిం నాత్మానం ప్రపద్యసే. ౧౧

సత్యానన్దస్వరూపం ధీసాక్షిణం బోధవిగ్రహమ్,
చిన్తయాత్మతయా నిత్యం త్యక్త్వా దేహాదిగాం ధియమ్. ౧౨

శిష్యుడు: భగవంతుడా! నాకింతవరకు 'తత్, త్వం' పదముల అర్థమే చక్కగ తెలియదు. ఇక "అహం బ్రహ్మాస్మి" అను వాక్యార్థము నెట్లు గ్రహింపగలనో చెప్పుడు? ౯

గురువు: నీవు యథార్థమునే పలికినావు. పదముల అర్థమును గ్రహించినయెడలనే వాక్యముయొక్క అర్థము బోధపడుననను విషయమున యెట్టి భేదాభిప్రాయమును లేదు. ౧౦

అంతఃకరణమునకును దాని వృత్తులకును సాక్షివగుచు, జ్ఞానమూర్తివియును, ఆనందరూపుడవును అగుచు, సత్యస్వభావుడవగు నీవు, (నీ) ఆత్మనే తెలిసికొనజాలకుంటివేమి? ౧౧

నీవు దేహాత్మబుద్ధిని పరిత్యజించి సత్యానంద స్వరూపమును బుద్ధికి సాక్షియును, జ్ఞానవిగ్రహమును అగుదానిని నిత్యము స్వాత్మగ భావించి ధ్యానింపుము. ౧౨

రూపాదిమాన్ యతః పిణ్డస్తతో నాత్మా ఘటాదివత్,
వియదాదిమహాభూతవికారత్వాచ్చ కుమ్భవత్. ౧౩

అనాత్మా యది పిణ్డోఽయముక్తహేతుబలాన్మతః,
కరామలకవత్ సాక్షాదాత్మానం ప్రతిపాదయ. ౧౪

ఘటద్రష్టా ఘటాద్భిన్నః సర్వథా న ఘటో యథా,
దేహద్రష్టా తథా దేహో నాఽహమిత్యవధారయ. ౧౫

ఏవమిన్ద్రియదృఙ్ నాహమిన్ద్రియాణీతి నిశ్చిను,
మనోబుద్ధిస్తథా ప్రాణో నాహమిత్యవధారయ. ౧౬

సఙ్ఘాతోఽపి తథా నాహమితి దృశ్యవిలక్షణమ్,
ద్రష్టారమనుమానేన నిపుణం సమ్ప్రధారయ. ౧౭

శరీరము ఆత్మ కాదు; ఏలయన దానికి రూపము కలదు. వికారదోషము కలదు. ఉదాహరణ : ఘటము. దీనికి రూపమును, వికృతియును కలవు. ఇది మృత్కార్యమైనట్లు, శరీరముకూడ ఆకాశాది _ పంచభూతముల కార్యమై (అనిత్యమై) యున్నది. ౧౩

ఉక్తహేతుబలమున శరీరము అనాత్మయైనయెడల అరచేతిలోని ఉసిరిక వలె ఇక ఆత్మ ఏదియో దానిని సాక్షాత్తుగ ప్రతిపాదింపుము. ౧౪

కుండను జూచువాడు సర్వవిధముల కుండకానట్లును, ఆకుండకంటె వేరైనట్లును; దేహద్రష్టకూడ దేహము కాదు. కనుక శరీరమునకు సాక్షినగు నేను శరీరమును గాను _ అని గ్రహింపుము. ౧౫

ఈరీతిగనే ఇంద్రియద్రష్టనగు నేను, ఇంద్రియములనుగూడ కాను _ అని నిశ్చయించుకొనుము; మనోబుద్ధిప్రాణములుకూడ నేను కాదని అవధరింపుము.

(ఆయా శరీరేంద్రియమనోబుద్ధ్యాదుల) సమష్టికూడ నేను కాదు, అని గ్రహింపుము. ఇట్లు దృశ్యముకంటె విలక్షణమగు ద్రష్టను అనుమానప్రమాణ సాహాయ్యమున నైపుణ్యముతో నిర్ణయించుకొనుము. ౧౭

దేహేన్ద్రియాదయో భావా హానాదివ్యాపృతిక్షమాః,
యస్య సన్నిధిమాత్రేణ సోఽహమిత్యవధారయ. ౧౮

అనాపన్నవికారః సన్నయస్కాన్తవదేవ యః,
బుద్ధ్యాదీంశ్చాలయేత్ ప్రత్యక్ సోఽహమిత్యవధారయ. ౧౯

అజడాత్మవదాభాన్తి యత్సాన్నిధ్యాజ్జడా అపి,
దేహేన్ద్రియమనఃప్రాణాః సోఽహమిత్యవధారయ. ౨౦

అగమన్మే మనోఽన్యత్ర సామ్ప్రతం చ స్థిరీకృతమ్,
ఏవం యో వేత్తి ధీవృత్తిం సోఽహమిత్యవధారయ. ౨౧

స్వప్నజాగరితే సుప్తిం భావాభావౌ ధియాం తథా,
యో వేత్త్యవిక్రియః సాక్షాత్ సోఽహమిత్యవధారయ. ౨౨

దేని సాన్నిధ్యమువలన దేహేంద్రియాది పదార్థములు ఉత్పత్తివినాశాదికమునుబొందు యోగ్యతను బడయుచున్నవో ఆ ఆత్మయే నేను అని గ్రహింపుము. ౧౮

అయస్కాంతమణి అవికృతముగనుండియే లోహాదుల నాకర్షించునట్లు, ఏది స్వయముగ ఎట్టి వికారమును బొందకుండ బుద్ధ్యాదులను నడుపుచున్నదో, నేనా ప్రత్యగాత్మను అని గ్రహింపుము. ౧౯

దేని సాన్నిధ్యమువలన జడములగు దేహేంద్రియ మనఃప్రాణములు చైతన్యమయాత్మవలె తోచుచున్నవో, అదియే నేను అని అవధరింపుము. ౨౦

నామనస్సు నిలుకడలేక ఎక్కడికో వెళ్లినది, ఇప్పుడు స్థిరమైనది_ అని బుద్ధివృత్తిని ఎవరు గ్రహించుచున్నారో, అదియే నేను అని గ్రహింపుము. ౨౧

జాగ్రత్, స్వప్న, సుషుప్తులను, బుద్ధియొక్క నిశ్చలతా చాంచల్యములను, ఎవడు తాను నిలుకడగనుండి గ్రహించుచున్నాడో, సాక్షాత్తుగ వాడే నేను అని గ్రహింపుము. ౨౨

ఘటావభాసకో దీపో ఘటాదన్యో యథేష్యతే,
దేహావభాసకో దేహీ తథాహం బోధవిగ్రహః. ౨౩

పుత్రవిత్తాదయో భావా యస్య శేషతయా ప్రియాః,
ద్రష్టా సర్వప్రియతమః సోఽహమిత్యవధారయ. ౨౪

పరప్రేమాస్పదతయా మా న భూవమహం సదా,
భూయాసమితి యో ద్రష్టా సోఽహమిత్యవధారయ. ౨౫

యః సాక్షిలక్షణో బోధస్త్వంపదార్థః స ఉచ్యతే,
సాక్షిత్వమపి బోద్ధృత్వమవికారితయాత్మనః. ౨౬

దేహేన్ద్రియమనః ప్రాణాహంకృతిభ్యో విలక్షణః,
ప్రోజ్ఝితాశేషషడ్భావవికారస్త్వంపదాభిధః. ౨౭

ఘటప్రకాశకమగు దీపము ఘటమునుండి వేరైనట్లు, శరీరమును ప్రకాశింపజేయు దేహినగు నేను, దేహముకంటె వేరగు బోధమూర్తి నగుచున్నాను.

పుత్రవిత్తాదికములగు వస్తువులు దేని అంగములగుటవలన ప్రియకరములగుచున్నవో, ఆ సర్వప్రియతమమును, సాక్షియును అగు ఆత్మయే నేను— అని గ్రహింపుము. ౨౪

పరమప్రేమాస్పద మగుటవలన, నాకు వినాశము సంభవింపకుండును గాక, నేను ఎల్లకాలముందును గాక! అను భావమును ఏద్రష్ట పొందుచున్నాడో, అతడే నేను అని గ్రహింపుము. ౨౫

సాక్షిస్వరూపమగు ఏబోధ కలదో దానినే త్వంపదార్థ మందురు. అవికారి యగుటవలన ఆత్మ సాక్షియును, జ్ఞాతయును. ౨౬

శరీరేంద్రియ మనః ప్రాణాహంకారముల కంటె వేరైనదియును, షడ్విధ భావవికార రహితమును అగునదియే త్వంపద — వాచ్యార్థము. ౨౭

త్వమర్థమేవం నిశ్చిత్య తదర్థం చిన్తయేత్ పునః,
అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేన చ. ౨౮

నిరస్తాశేషసంసారదోషోఽస్థూలాదిలక్షణః,
అదృశ్యత్వాదిగుణకః పరాకృతతమోమలః. ౨౯

నిరస్తాతిశయానన్దః సత్యః ప్రజ్ఞానవిగ్రహః,
సత్తాస్వలక్షణః పూర్ణః పరమాత్మేతి గీయతే. ౩౦

సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణశక్తితా,
వేదైః సమర్థ్యతే యస్య తద్బ్రహ్మేత్యవధారయ. ౩౧

యజ్జ్ఞానాత్ సర్వవిజ్ఞానం శ్రుతిషు ప్రతిపాదితమ్,
మృదాద్యనేకదృష్టాన్తైస్తద్బ్రహ్మేత్యవధారయ. ౩౨

ఈరీతిగ త్వంపదార్థమును నిశ్చయించుకొని, ఆ అర్థమును మరల మరల చింతింప నగును. మరియును, నిషేధముఖమునను, విధిముఖమునను గూడ తత్-పదార్థమును ధ్యానింప నగును. ౨౮

సంసృతి దోషరహితమును, అస్థూలాది లక్షణమును, అదృశ్యత్వాది గుణకమును, అజ్ఞానమాలిన్య రహితమును, ఆనందపరమావధియును, సత్యస్వరూపమును, ప్రజ్ఞానమూర్తియును, సల్లక్షణమును, పూర్ణమును అగునదియే పరమాత్మయని ఉపనిషత్తులు గాన మొనర్చుచున్నవి. ౨౯-౩౦

సర్వజ్ఞుడనియు, పరేశుడనియు, సంపూర్ణశక్తిమంతుడనియు వేదము లెవ్వనిని సమర్థించుచున్నవో, అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౩౧

ఉపనిషత్తులలో, మృత్తిక మున్నగు బహుదృష్టాంతములవలన, దేని నెరిగిన సర్వము గ్రహింపబడునని ప్రతిపాదింపబడి యున్నదో, అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౩౨

యదానన్త్యం ప్రతిజ్ఞాయ శ్రుతిస్తత్ సిద్ధయే జగౌ,
తత్కార్యత్వం ప్రపఞ్చస్య తద్బ్రహ్మేత్యవధారయ. ౩౩

విజిజ్ఞాస్యతయా యచ్చ వేదాన్తేషు ముముక్షుభిః,
సమర్థ్యతేఽతియత్నేన తద్బ్రహ్మేత్యవధారయ. ౩౪

జీవాత్మనా ప్రవేశశ్చ నియన్తృత్వఞ్చ తాన్ ప్రతి,
శ్రూయతే యస్య వేదేషు తద్బ్రహ్మేత్యవధారయ. ౩౫

కర్మణాం ఫలదాతృత్వం యస్యైవ శ్రూయతే శ్రుతౌ,
జీవానాం హేతుకర్తృత్వం తద్బ్రహ్మేత్యవధారయ. ౩౬

తత్త్వం పదార్థౌ నిర్ణీతే వాక్యార్థశ్చిన్త్యతేఽధునా,
తాదాత్మ్యమత్ర వాక్యార్థస్తయోరేవ పదార్థయోః. ౩౭

శ్రుతులు ఎవ్వని అనంతత్వమును ప్రతిజ్ఞ యొనర్చి, దానిని ప్రతిష్ఠించు జగత్ - ప్రపంచమును అతనికార్యముగ వర్ణించినవో, అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౩౩

ముముక్షుజిజ్ఞాస్యముగ సర్వవేదాంతములును దేనిని సమర్థించుచున్నవో, అదియే బ్రహ్మమని అవధరింపుము. ౩౪

దేనినిగురించి శ్రుతులు జీవాత్మరూపమున శరీరమున బ్రవేశించుటయును, అంతర్యామిరూపమున సర్వనియంత యగుటయును వర్ణించుచున్నవో, అదియే బ్రహ్మమని గ్రహింపుము. ౩౫

కర్మఫలదాతయనియు, జీవులను కర్మములయందు వినియోగించువాడనియు ఎవనినిగూర్చి శ్రుతిశ్రుతమగుచున్నదో అదియే బ్రహ్మమని గ్రహింపుము.

తత్, త్వం - పద ప్రతిపాద్యమగు వస్తువు నిర్ణయింపబడినది. ఇక వాక్యార్థము ఆలోచింపబడుచున్నది : ఈ ఉభయపదార్థముల ఐక్యమే వాక్యార్థము. ౩౭

సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః,
అఖణ్డైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః. ౩౮

ప్రత్యగ్బోధో య ఆభాతి సోఽద్వయానన్దలక్షణః,
అద్వయానన్దరూపశ్చ ప్రత్యగ్బోధైక లక్షణః. ౩౯

ఇత్థమన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తిర్యదా భవేత్,
అబ్రహ్మత్వం త్వమర్థస్య వ్యావర్తేత తదైవ హి. ౪౦

తదర్థస్య చ పారోక్ష్యం యద్యేవం కిం తతః శృణు,
పూర్ణానన్దైకరూపేణ ప్రత్యగ్బోధోఽవతిష్ఠతే. ౪౧

తత్త్వమస్యాదివాక్యైశ్చ తాదాత్మ్యప్రతిపాదనే,
లక్ష్యౌ తత్త్వంపదార్థౌ ద్వావుపాదాయ ప్రవర్తతే. ౪౨

సంసర్గార్థము కాని, విశిష్టార్థము కాని వాక్యమునకు ఇట అన్వయింపదు. అఖండమును, ఏకరసస్వరూపమును అగు వస్తువును వర్ణించుటయే వాక్య ప్రయోజనమని విద్వాంసుల మతము. ౩౮

బోధస్వరూపమగు ప్రత్యగాత్మయే అద్వితీయానంద స్వరూపమగు బ్రహ్మము; అద్వితీయానందస్వరూపమగు బ్రహ్మమే ప్రత్యగ్బోధస్వరూపము.

ఈ రీతిగ పరస్పరతాదాత్మ్యజ్ఞానము ప్రతిపాదింపబడినప్పుడు, త్వం పదార్థముయొక్క అబ్రహ్మత్వము వీగిపోవుచున్నది - నిషిద్ధమగుచున్నది. ౪౦

తత్ ప్రతిపాద్య వస్తువుయొక్క పరోక్షత్వముకూడ వ్యావృత్తమగుచున్నది. (శిష్యుడు:) అయిన నేమి? (గురువు:) చెప్పుచుంటిని, వినుము: పరస్పరతాదాత్మ్యజ్ఞాన మంకురించినప్పుడు పూర్ణానందస్వరూపమున ప్రత్యగ్బోధ వెలయుచుండును. ౪౧

తత్త్వమస్యాదిమహావాక్యములు ఉభయుల ఐక్యమును ప్రతిపాదించునప్పుడు తత్, త్వం పదముల లక్ష్యార్థముననే ప్రవర్తిల్లును. లక్ష్యార్థము చైతన్యమే. ౪౨

హిత్వా ద్వౌ శబలౌ వాచ్యౌ వాక్యం వాక్యార్థబోధనే,
యథా ప్రవర్తతేఽస్మాభి స్తథా వ్యాఖ్యాతమాదరాత్. ౪౩
ఆలమ్బనతయా భాతి యోఽస్మత్ప్రత్యయశబ్దయోః,
అన్తఃకరణసమ్భిన్నబోధః స త్వంపదాభిదః. ౪౪
మాయోపాధిర్జగద్యోనిః సర్వజ్ఞత్వాదిలక్షణః,
పారోక్ష్యశబలః సత్యాద్యాత్మక స్తత్పదాభిదః. ౪౫
ప్రత్యక్పరోక్షతైకస్య సద్వితీయత్వపూర్ణతా,
విరుధ్యతే యత స్తస్మాల్లక్షణా సంప్రవర్తతే. ౪౬
మానాన్తరవిరోధే తు ముఖ్యార్థస్యాపరిగ్రహే,
ముఖ్యార్థేనావినాభూతే ప్రతీతిర్లక్షణోచ్యతే. ౪౭

తత్త్వమస్యాదివాక్యములు నిజార్థమును ప్రతిపాదింపబోయి, సర్వజ్ఞత్వాది కించిజ్జత్వాదికమగు వాచ్యార్థమును పరిత్యజించి, ఏరీతిగ లక్ష్యార్థమున ప్రవర్తిల్లుచున్నవో, మేము ఆదరముతో వివరించితిమి. ౪౩

ఏది అస్మత్ - ప్రత్యయముయొక్కయు, అస్మత్ - శబ్దముయొక్కయు ఆలంబనత్వము అనగా విషయత్వరూపమున ప్రకాశము నందుచున్నదో, దేని బోధ అంతఃకరణముతోగూడ మిశ్రితమై కలుగుచున్నదో, అదియే త్వం పద - వాచ్యార్థము. ౪౪

మాయయే ఉపాధికాగా తాను జగత్కారణమగుచు సర్వజ్ఞత్వాది లక్షణములతో శోభిల్లువాడును, పరోక్షత్వముతో మిశ్రితుడై సచ్చిదానంద స్వరూపుడై వెలుగువాడును అగు ఈశ్వరుడే త్వంపద-వాచ్యార్థము. ౪౫

ఒకేవస్తువున ప్రతక్ - త్వ, పరోక్షత్వములును, సద్వితీయత్వ, అఖండత్వములును అగు విరుద్ధధర్మము లుండజాలవుగాన, లక్షణ యొనర్పబడుచున్నది. ౪౬

ప్రమాణాంతరవిరోధమువలన ముఖ్యార్థము పరిగ్రహింపబడక, ముఖ్యార్థ వ్యతిరిక్తముగాని మరియొక అర్థమును స్వీకరించుటయే లక్షణ నాబడును. ౪౭

తత్త్వమస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా,
సోఽయమిత్యాదివాక్యస్థపదయోరివ నాపరా. ౪౮

అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్,
శమాదిసహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్. ౪౯

శ్రుత్యాచార్యప్రసాదేన దృఢో బోధో యదా భవేత్,
నిరస్తాశేషసంసారనిదానః పురుషస్తదా. ౫౦

విశీర్ణకార్యకరణో భూతసూక్ష్మైరనావృతః,
విముక్తకర్మనిగడః సద్య ఏవ విముచ్యతే. ౫౧

"సోఽయం దేవదత్తః - అతడే ఈ దేవదత్తుడు" - ఇత్యాది వాక్యములలోని పదములకువలె, తత్త్వమస్యాది-వాక్యమునకు ఒనర్పబడు లక్షణ భాగలక్షణయేగాని వేరొండు కాదు. ౪౮

"అహం బ్రహ్మాఽస్మి - నేనే బ్రహ్మమను" అను వాక్యార్థబోధ దృఢము కానంతవరకు, శమాదిషట్కసంపత్తిని ఆర్జించి, శ్రవణ మనన నిధిధ్యాసనముల నొనర్పనగును. ౪౯

శ్రుతి, ఆచార్యుడు, ఈ ఉభయుల అనుగ్రహమున దృఢజ్ఞానము లభింప, సంసారకారణమగు అవిద్య ఆమూలాగ్రముగ ఆ పురుషునినుండి తొలగిపోవును.

కార్యకరణ రూపములగు శరీరేంద్రియములును, సూక్ష్మభూతముల ఆవరణమును తొలగిపోవ కర్మపాశము సడలిపోవును. అప్పుడాసాధకుడు వెనువెంటనే పరమపురుషార్థమగు ముక్తిని బొందును. ౫౧

ప్రారబ్ధకర్మభోగేన జీవన్ముక్తో యదా భవేత్,
కిఞ్చిత్కాలమనారబ్ధ కర్మబన్ధస్య సంక్షయే. ౫౨

నిరస్తాతిశయానన్దం వైష్ణవం పరమం పదమ్,
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే. ౫౩

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాద విరచిత - వాక్యవృత్తిః ॥౩౧॥

అనారబ్ధములగు సంచితకర్మజాలము క్షీణించిపోవ, ప్రారబ్ధకర్మబలమున జీవన్ముక్తి స్థితియందు వెలయునప్పుడు, ఆనందతారతమ్యమును, పునరావృత్తియును లేని ఏ విష్ణుని పరమపదము కలదో, ఆ కైవల్యము లభించును. ౫౨ - ౫౩

ఇది వాక్యవృత్తి - ఆంధ్రానువాదము ॥౩౧॥

# ౩౨. లఘువాక్యవృత్తిః

స్థూలో మాంసమయో దేహో సూక్ష్మః స్యాద్వాసనామయః
జ్ఞానకర్మేంద్రియైః సార్ధం ధీప్రాణౌ తచ్ఛరీరగౌ. ౧

అజ్ఞానం కారణం సాక్షీ బోధస్తేషాం విభాసకః,
బోధాభాసో బుద్ధిగతః కర్తా స్యాత్ పుణ్యపాపయోః. ౨

స ఏవ సంసరేత్ కర్మవశాల్లోకద్వయే సదా,
బోధాభాసాత్ శుద్ధబోధం వివిచ్యాదతియత్నః. ౩

జాగరస్వప్నయోరేవ బోధాభాసవిడమ్బనా,
సుప్తౌతు తల్లయే బోధః శుద్ధో జాడ్యం ప్రకాశయేత్. ౪

స్థూలశరీరము మాంసమయము; సూక్ష్మశరీరము వాసనామయము, అనగా సంస్కారమయము. జ్ఞానేంద్రియము [లైదు]ను, కర్మేంద్రియము [లైదు]ను, [పంచ] ప్రాణములును, మనోబుద్ధులును కలసి సూక్ష్మశరీరము. ౧

అజ్ఞానమే కారణశరీరము. సాక్షియగు బోధయే ఈ మూడుశరీరములను ప్రకాశింపజేయుచున్నది. బుద్ధి-ప్రతిబింబితమగు బోధాభాసయే కర్తయై, పుణ్యపాపముల నొనర్చుచున్నది. ౨

బోధాభాసుడగు కర్తయే కర్మవశమున ఇహ-పరలోకముల సర్వదా సంసరించు చున్నాడు. అత్యంత ప్రయత్నముతో ఈ బోధాభాసనుండి శుద్ధబోధను వేరొనర్పనగును. ౩

జాగ్రత్స్వప్నములయందే ఈ బోధాభాసుని గోల - వ్యర్థప్రకాశము. సుషుప్తియందు ఇతడు లీనమై పోవును. అప్పుడు శుద్ధబోధయే జడత్వమును, అనగా అజ్ఞానమును ప్రకాశింపజేయును. ౪

జాగరేఽపి ధియస్తూష్ణీంభావః శుద్ధేన భాస్యతే,
ధీవ్యాపారాశ్చ చిద్భాస్యాశ్చిదాభాసేన సంయుతాః. ౫

వహ్నితప్తజలం తాపయుక్తం దేహస్య తాపకమ్,
చిద్భాస్యా ధీస్తథాభాసయుక్తాన్యం భాసయేత్ తథా. ౬

రూపాదౌ గుణదోషాదివికల్పా బుద్ధిగాః క్రియాః,
తాః క్రియా విషయైః సార్ధం భాసయన్తీ చితిర్మతా. ౭

రూపాచ్చ గుణదోషాభ్యాం వివిక్తా కేవలా చితిః,
సైవానువర్తతే రూపరసాదీనాం వికల్పనే. ౮

క్షణే క్షణేఽన్యథాభూతా ధీవికల్పాశ్చితిర్నతు,
ముక్తాసు సూత్రవద్బుద్ధివికల్పేషు చితిస్తథా. ౯

జాగ్రదవస్థయందుకూడ బుద్ధియొక్క నిశ్చలభావము శుద్ధబోధవలననే ప్రకాశిత మగును. చిదాభాసునితోఁగూడిన బుద్ధివ్యాపారములుకూడ సాక్షిచైతన్యమువలననే ప్రకాశితము లగును. ౫

అగ్నితప్తజలము వేడితోఁగూడి శరీరమునకు తాపమొసగునట్లు, ఆభాసతోఁగూడిన బుద్ధి సాక్షిచైతన్యమువలన తాను ప్రకాశిత మగుచు, ఇతరవస్తువులను గూడ ప్రకాశింపజేయు చున్నది. ౬

రూపరసాదులగు పంచేంద్రియ విషయములయందు గుణదోషాదులగు వికల్పములు బుద్ధిక్రియలు మాత్రమే; చైతన్యమే రూపాదివిషయములతోఁగూడ ఆక్రియల నన్నిటినిగూడ ప్రకాశింపజేయు చున్నది. ౭

గుణదోషముల నుండియు, రూపాదుల నుండియు చైతన్యము వేరు; అయినను అదియే రూపరసాదుల వెంటనంటి, ఆయా వికల్పనలనుగూడ ప్రకాశింపజేయుచున్నది. ౮

బుద్ధివికల్పములు క్షణక్షణము మారుచుండును. కాని చైతన్యములో మార్పు లేదు. ముత్యాలమాలయందలి ముత్తెములు వేరువేరుగ నున్నను, దారము ఒకటిగనే యుండునట్లు, బుద్ధివ్యాపారములు మారుచుండినను చైతన్యమేకము గనే యుండి, సర్వానుగతమై ఎట్టి మార్పును లేకుండ వెలయుచుండును. ౯

ముక్తాభిరావృతం సూత్రం ముక్తయోర్మధ్య ఈక్ష్యతే,
తథా వృత్తివికల్పైశ్చిత్ స్పష్టా మధ్యే వికల్పయోః. ౧౧

నష్టే పూర్వవికల్పే తు యావదన్యస్య నోదయః,
నిర్వికల్పకచైతన్యం స్పష్టం తావద్ విభాసతే. ౧౨

ఏకద్విత్రిక్షణేష్వేవం వికల్పస్య నిరోధనమ్,
క్రమేణాభ్యస్యతాం యత్నాద్ బ్రహ్మానుభవకాంక్షిభిః.

సవికల్పక జీవోఽయం బ్రహ్మ తన్నిర్వికల్పకమ్,
అహం బ్రహ్మేతి వాక్యేన సోఽయమర్థోభిధీయతే. ౧౩

సవికల్పక చిద్ యోఽహం బ్రహ్మైకం నిర్వికల్పకమ్,
స్వతః సిద్ధా వికల్పాస్తే నిరోద్ధవ్యాః ప్రయత్నతః. ౧౪

దారము ముత్యములవలన ఆవరింపబడియున్నను, ప్రతిరెండు ముత్యముల నడుమ కనిపించుచునేయుండునట్లు; బుద్ధి వృత్తి - వికల్పములవలన చైతన్యము ఆవృతమైయుండినను, వికల్ప - ద్వయ - మధ్యమున స్పష్టముగ తోచుచునే యున్నది. ౧౧

ఒక వికల్పము తొలగిపోయి మరియొకవికల్పము ఉదయించుటకుమధ్య ఏకాలము కలదో,అందు నిర్వికల్పకచైతన్యము స్పష్టముగనే ప్రకాశించుచున్నది.

బ్రహ్మానుభూతినందగోరువారు ఈ రీతిగ ఒకటి, రెండు లేక మూడు లక్షణములు బుద్ధి - వృత్తి - వికల్పములను క్రమముగ నిరోధింప ప్రయత్నము చేయదగును. ౧౨

ఈ జీవుడు సవికల్పకుడు; ఆ బ్రహ్మము నిర్వికల్పకము. "అహం బ్రహ్మాఽస్మి - నేను బ్రహ్మమను" అను వాక్యమున "ఆ బ్రహ్మమే ఈ జీవుడు" అను అర్థము వ్యక్తమొనర్పబడినది. ౧౩

సవికల్పక - చైతన్యమగు నేనే నిర్వికల్పక బ్రహ్మమను. వికల్పములు స్వతఃసిద్ధములు - అనగా, స్వాభావికమగు అవిద్యచే కల్పింపబడినవి. ప్రయత్నముతో ఈ వికల్పములనన్నిటిని నిరోధింపవలెను. ౧౪

శక్యః సర్వనిరోధేన సమాధిర్యోగినాం ప్రియః,
తదశక్తౌ క్షణం రుద్ధ్వా శ్రద్ధాలుర్బ్రహ్మతాత్మనః. ౧౫

శ్రద్ధాలుర్బ్రహ్మతాం స్వస్య చిన్తయేద్బుద్ధివృత్తిభిః,
వాక్యవృత్త్యా యథాశక్తి జ్ఞాత్వాఽభ్యస్యతాం సదా. ౧౬

తచ్చిన్తనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్,
ఏతదేకపరత్వఞ్చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః. ౧౭

దేహాత్మధీవద్బ్రహ్మాత్మధీదార్ఢ్యే కృతకృత్యతా,
యదా తదాఽయం మ్రియతాం ముక్తోఽసౌ నాత్ర సంశయః.

ఇతి శ్రీ శఙ్కర భగవత్పూజ్యపాద విరచితా _ లఘువాక్యవృత్తిః ॥౩౨॥

సర్వవ్యాపారములను నిరోధించి యోగులకు ప్రియమగు సమాధిని బొందవచ్చును. అందులకు అసమర్థుడైన శ్రద్ధాళువు, ఒక్క క్షణకాలము నిరోధ మొనర్చి, ఆత్మను బ్రహ్మ మొనర్పనగును. ౧౫

శ్రద్ధాళువు బుద్ధివృత్తుల అవలంబనముననే, తన బ్రహ్మత్వమును చింతింపనగును; వాక్యవృత్తిని యథాశక్తి గ్రహించి, బ్రహ్మాభ్యాసము నొనర్పనగును.

ఆత్మబ్రహ్మైక్యమునుగురించి సర్వదా చింతించుట, పలుకుట, పరస్పరము ప్రబోధించుకొనుట, అదియే పరమావధియని ఎంచి తన్మయుడగుట : బ్రహ్మాభ్యాసమనిన ఇదియే అని పండితు లందురు. ౧౭

(జనులకు సహజముగనుండు) దేహాత్మబుద్ధివలె బ్రహ్మాత్మబుద్ధి దృఢము అయినప్పుడు, కృతకృత్యుడగును. అప్పు డాతడు మృతినందినను ముక్తుడే యగును. సందేహము లేదు. ౧౮

ఇది లఘువాక్యవృత్తి – ఆంధ్రానువాదము ॥౩౨॥

# ౩౩. వాక్యసుధా *

రూపం దృశ్యం లోచనం దృక్ తద్ దృశ్యం దృక్ తు
మానసమ్,
దృశ్యా ధీవృత్తయః సాక్షీ దృగేవ న తు దృశ్యతే. ౧

నీలపీత స్థూల సూక్ష్మ హ్రస్వ దీర్ఘాది భేదతః,
నానావిధాని రూపాణి పశ్యేల్లోచనమేకధా. ౨

ఆన్ధ్యమాన్ద్యపటుత్వేషు నేత్రధర్మేషు చైకధా,
సంకల్పయేన్మనః శ్రోత్రత్వగాదౌ యోజ్యతామిదమ్. ౩

రూపము దృశ్యమైనపట్ల చక్షువు దృక్కు అనగా ద్రష్ట. చక్షువు దృశ్యమైనచోట మనస్సు దృక్కు. బుద్ధివృత్తులు దృశ్యమైనయెడల దృక్కు సాక్షిచైతన్యము. ఈ సాక్షి ఎన్నడును దర్శనవిషయము కాజాలదు. ౧

రూపము నీలపీతాది వర్ణభేదములతోడను, స్థూలసూక్ష్మాది - ఆకృతి భేదములతోడను, హ్రస్వదీర్ఘాది పరిమాణ భేదములతోడను, వివిధమై యొప్పుచుండినను, ఆయీ రూపములను చూచుచుండు మనస్సు ఒక్కటియే. ౨

అంధత్వ, మందత్వ, పటుత్వాది బహువిధనేత్రధర్మములను మనస్సే గ్రహించుచున్నది. (కనుక మనస్సు చక్షురాదికమునకు ద్రష్టయగుట సుస్పష్టము.) ఈ నియమమునే శ్రోత్ర, త్వగాది - ఇంద్రియములకుకూడ అన్వయింపుము. (అప్పుడు ఇంకను విస్పష్టముగ మనస్సుయొక్క ద్రష్టృత్వము బోధపడగలదు.) ౩

---

* దీనికి ఆనందగిరి, బ్రహ్మానందభారతీస్వాములు విరచించిన టీకలు రెండు లభించుచున్నవి. దృగ్ - దృశ్యవివేక మనికూడ ఇంకొక పేరు. బ్రహ్మానందుడును, మరికొందరు నవీనులును ఇది విద్యారణ్యరచన అనుచున్నారు. ప్రాచీనుడగు ఆనందగిరి శంకరకృతముగనే స్వీకరించెను.

కామః సంకల్పసన్దేహౌ శ్రద్ధాశ్రద్ధే ధృతీతరే,
హ్రీర్ధీర్భీరిత్యేవమాదీన్ భాసయత్యేకధా చితిః. ౪
నోదేతి నాస్తమేత్యేషా న వృద్ధిం యాతి న క్షయమ్,
స్వయం విభాత్యథాఽన్యాని భాసయేత్ సాధనం వినా. ౫
చిచ్ఛాయావేశతో బుద్ధౌ భానం ధీస్తు ద్విధా స్థితా,
ఏకాహంకృతిరన్యా స్యాదన్తఃకరణరూపిణీ. ౬
ఛాయాఽహంకారయోరైక్యం తప్తాయఃపిణ్డవన్మతమ్,
తదహంకారతాదాత్మ్యాత్ దేహశ్చేతనతామగాత్. ౭
అహంకారస్య తాదాత్మ్యం చిచ్ఛాయాదేహసాక్షిభిః,
సహజం కర్మజం భ్రాన్తిజన్యఞ్చ త్రివిధం క్రమాత్, ౮

కామము, సంకల్పము, సందేహము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, జ్ఞానము, భయము : మొదలగు చిత్తవృత్తు లన్నిటిని చైతన్య మొక్కటియే ప్రకాశింపజేయుచున్నది. ౪

ఈ చైతన్యము అనస్తమిత దేవత. దీనికి ఉదయాస్తమయములు అనగా, ఉత్పత్తివినాశములు లేవు. ఇది పెరుగదు, తరుగదు. ఇది స్వయంప్రభయై సాధనాంతరము నపేక్షింపక, అన్యమగు సర్వమును ప్రకాశింప జేయుచున్నది. ౫

బుద్ధియందు చిచ్ఛాయ అనగా చైతన్యఛాయ ప్రతిఫలించుటవలన, బుద్ధి ప్రకాశించుచున్నది. ఈబుద్ధి రెండువిధములు. ఒకటి అహంకారము, రెండవది అంతఃకరణము. ౬

తప్తాయఃపిండమునకును అగ్నికిని గలసంబంధమే ఈచైతన్యాహంకారములపట్లకూడ అనువర్తించును. అనగా అహంకారము చైతన్యమువలె నగపడును, అయఃపిండము చేతిని కాల్చునట్లు, శరీరమునుగూడ చేతనయుక్తముగ తోపజేయు చున్నది. ౭

చైతన్యఛాయ, శరీరము, సాక్షి : ఈ మూడిటితోడను అహంకారమునకు తాదాత్మ్యసంబంధము ఏర్పడుచున్నది. ఈ సంబంధము క్రమముగ సహజాతము, కర్మజము, భ్రాంతిజన్యము _ అని మూడువిధములు. ౮

సమ్బన్ధినోః సతోర్నాస్తి నివృత్తిః సహజస్య తు,
కర్మక్షయాత్ ప్రబోధాచ్చ నివర్తేతే క్రమాదుభే. ౯

అహఙ్కారలయే సుప్తౌ భవేద్దేహోఽప్యచేతనః,
అహఙ్కారవికాసార్ధః స్వప్నః సర్వస్తు జాగరః. ౧౦

అన్తఃకరణవృత్తిశ్చ చితిచ్ఛాయైక్యమాగతా,
వాసనాః కల్పయేత్ స్వప్నే బోధేఽక్షైర్విషయాన్ బహిః. ౧౧

మనోఽహఙ్కృత్యుపాదానం లిఙ్గమేకం జడాత్మకమ్,
అవస్థాత్రయమన్వేతి జాయతే మ్రియతే తథా. ౧౨

అహంకారమునకును చిచ్ఛాయకునుగల సంబంధము సహజాత మగుట వలన, అది తొలగదు. (అనగా అహంకారము పోయినప్పుడే, అది పోవును.) అహంకారమునకును శరీరమునకునుగల కర్మజసంబంధము కర్మక్షయమైన తొలగును. ఇక అహంకారమునకు సాక్షికినిగల భ్రాంతిజన్యసంబంధము వివేక జ్ఞానమువలన ప్రబోధోదయమున సమసిపోవును. ౯

సుషుప్తిదశయందు అహంకారము లీనముకాగా శరీరము అచేతన మగుచున్నది. సుషుప్తియందు అహంకారమునకు అర్ధవికాసము మాత్రమే; జాగరమున పరిపూర్ణవికాసము. ౧౦

అంతఃకరణవృత్తి చిచ్ఛాయతో ఐక్యమునంది స్వప్నకాలమున వాసనలను కల్పించుచున్నది; జాగ్రదవస్థయందు ఇంద్రియముల నవలంబించికొని వెలుపల విషయములను కల్పించుచున్నది. ౧౧

మనస్సును అహంకారమును ఉపాదానముగాగల అంతఃకరణము జడము; ఈ జడలింగమే అవస్థాత్రయము, జననమరణములు అను పరిణామములను బొందుచున్నది. ౧౨

శక్తిద్వయం హి మాయాయా విక్షేపావృతిరూపకమ్,
విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్ సృజేత్. ౧౩

సృష్టిర్నామ బ్రహ్మరూపే సచ్చిదానందవస్తుని,
అబ్ధౌ ఫేనాదివత్ సర్వనామరూపప్రసారణా. ౧౪

అంతర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మసర్గయోః,
ఆవృణోత్యపరా శక్తిః సా సంసారస్య కారణమ్. ౧౫

సాక్షిణః పురతో భాంతం లింగం దేహేన సంయుతమ్,
చితిచ్ఛాయాసమావేశాజ్జీవః స్యాద్వ్యావహారికః. ౧౬

అస్య జీవత్వమారోపాత్ సాక్షిణ్యప్యవభాసతే,
ఆవృతౌ తు వినష్టాయాం భేదే భాతేఽపయాతి తత్. ౧౭

ఈమాయకు రెండు శక్తులు. ఒకటి విక్షేపశక్తి, రెండవది ఆవరణశక్తి. విక్షేపశక్తియే లింగశరీరమునుండి బ్రహ్మాండమువరకుగల సంసారము నంతటిని సృష్టించుచున్నది. ౧౩

సృష్టి యనగా: సముద్రమున తరంగబుద్బుదఫేనాదికమువలె, సచ్చిదానందరూపమగు బ్రహ్మమున నామరూపప్రసారము. ౧౪

లోపల దృక్ - దృశ్యములకుగల భేదమును, వెలుపల సృష్టికిని బ్రహ్మమునకునుగల భేదమును ఆవరించి, కనబడకుండ జేయునదియే ఆవరణశక్తి. ఇదియే సంసారకారణము. ౧౫

స్థూలశరీరముతో సంయుక్తమైన లింగదేహము సాక్షికి ఎదుటగనే వెలయుచు, చైతన్యఛాయవలన సంబద్ధమై జీవుడని వ్యవహరింపబడుచున్నది.

జీవుని జీవత్వము ఆరోపమువలన సాక్షియందు ప్రకాశిత మగుచున్నది. అనగా, అధ్యాసవలన సాక్షియే జీవు డనిపించును. ఆవరణశక్తి తొలగిపోయి ఉభయుల భేదము ప్రకాశితమైనయెడల, జీవత్వముకూడ పోవును. ౧౭

తథా సర్గబ్రహ్మణోశ్చ భేదమావృత్య తిష్ఠతి,
యా శక్తిస్తద్వశాద్ బ్రహ్మ వికృతత్వేన భాసతే. ౧౮

అత్రాప్యావృతినాశేన విభాతి బ్రహ్మసర్గయోః,
భేదస్తయోర్వికారః స్యాత్ సర్గే న బ్రహ్మణి క్వచిత్. ౧౯

అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పఞ్చకమ్,
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్. ౨౦

ఖ వాయ్వగ్ని జలోర్వీషు దేవ తిర్యఙ్ నరాదిషు,
అభిన్నాః సచ్చిదానన్దాః భిద్యతే రూపనామనీ. ౨౧

ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానన్దతత్పరః,
సమాధిం సర్వదా కుర్యాద్ హృదయే వాఽథవా బహిః.

ఆవరణశక్తి సృష్టిబ్రహ్మములకుగల భేదము నాచరించియున్నది. కనుక దీనివలననే బ్రహ్మము వికృతరూపముగ అనగా కార్యజగద్రూపమున ప్రకాశించుచున్నది. ౧౮

ఈఆవృతి నాశనమైనయెడల బ్రహ్మమునకును సృష్టికినిగల భేదము ప్రకాశించును. నామరూపాత్మకమగు వికారము సృష్టికి సంబంధించినదేకాని, బ్రహ్మమున ఒకించుకయును ఎన్నడును లేదు. ౧౯

అస్తిత్వ, ప్రకాశత్వ, ప్రియత్వములును, నామరూపములును అను పంచవిధములుగ జగత్తు మనకు గోచరించు చున్నది. మొదటి మూడును బ్రహ్మలక్షణములు; తుది రెండును జగత్ - లక్షణములు. ౨౦

భూతపంచకము, నర దేవతా మృగాదులు మున్నగు వాటియందు సచ్చిదానందములు అభిన్నముగనే కలవు. కేవలము నామరూపములు భేదించు చున్నవి. ౨౧

నామరూపముల రెంటిని పరిత్యజించి, సచ్చిదానందతత్పరుడగుచు సర్వకాలముల హృదయమునగాని, వెలుపలగాని సమాధి నభ్యసింప నగును. ౨౨

సవికల్పో నిర్వికల్పః సమాధిర్ద్వివిధో హృది,
దృశ్యశబ్దానువేధేన సవికల్పం పునర్ద్విధా. ౨౩

కామాద్యాశ్చిత్తగా దృశ్యా స్తత్సాక్షిత్వేన చేతనమ్,
ధ్యాయేద్ దృశ్యానువిద్ధోఽయం సమాధిః సవికల్పకః. ౨౪

అసఙ్గః సచ్చిదానన్దః స్వప్రభో ద్వైతవర్జితః,
అస్మీతి శబ్దవిద్ధోఽయం సమాధిః సవికల్పకః. ౨౫

స్వానుభూతి రసావేశా ద్దృశ్యశబ్దావుపేక్ష్య తు,
నిర్వికల్పః సమాధిః స్యాన్నివాతస్థిత దీపవత్. ౨౬

సమాధి సవికల్పము నిర్వికల్పము అని రెండు విధములు. ఇవి హృదయమున ధ్యానము నభ్యసించుట వలననే లభించును. సవికల్పము మరల దృశ్యానువిద్ధము, శబ్దానువిద్ధము అని రెండు తెరగులు. ౨౩

కామాదులు మనోధర్మములు : కనుక అవి దృశ్యములు _ అని ఎంచి ఈ దృశ్యములకు సాక్షియగు ఆత్మను చైతన్యయుక్తముగ ధ్యానింపుము. దీని వలన లభించు సవికల్పసమాధినే దృశ్యానువిద్ధ మందురు. ౨౪

"అసంగుడును, సచ్చిదానందుడును, స్వప్రకాశుడును, ద్వైతవర్జితుడును అగు ప్రత్యగాత్మయే నేను" అని నిరంతరధ్యాన మొనర్చుటవలన లభించెడు సవికల్పసమాధినే శబ్దానువిద్ధ మందురు. (ఇది దృశ్యానువిద్ధము అనంతరము కలుగు స్థితి.) ౨౫

స్వానుభూతి రసావేశమున ఏకత్వస్థితిని బొంద, దృశ్యములగు కామాదులనుండియు; పూర్వోక్తములగు అసంగత్వాది శబ్దములనుండియు మనస్సు విడివడి నిర్వాత నిష్కంప దీపమువలె వెలయు స్థితినే నిర్వికల్పసమాధి అందురు. (ఉపయుక్త _ అధికారికి ఇది సహజముగనే సిద్ధించును గాన, దీనిని సహజ సమాధియనియు, ప్రతిబంధక రాహిత్యమువలన అసంప్రజ్ఞాత సమాధి అనియుకూడ అందురు _ అను) ౨౬

హృదీవ బాహ్యదేశే౽పి యస్మిన్ కస్మింశ్చ వస్తుని,
సమాధిరాద్యః సన్మాత్రాన్నామరూపపృథక్కృతిః. ౨౭
అఖండైకరసం వస్తు సచ్చిదానందలక్షణమ్,
ఇత్యవచ్ఛిన్నచింతేయం సమాధిర్మధ్యమో భవేత్. ౨౮
స్తబ్ధీభావో రసాస్వాదవత్ తృతీయః పూర్వవన్మతః,
ఏతైః సమాధిభిః షడ్భిర్నయేత్ కాలం నిరంతరమ్. ౨౯
దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని,
యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః. 30

ఏరీతిగ హృదయదేశమున చిత్తమును చిత్తధర్మములను దృశ్యముగ ఎంచి, వీనికి సాక్షిగ ఆత్మను ధ్యానించినట్లు, బాహ్యమునగూడ సూర్యాది వస్తువుల సన్మాత్రస్వరూపమునుండి నామరూపములను వేరొనర్చి సన్మాత్రముగ భావించుటవలన ఏ ఏకతానత లభించునో, అదియే ప్రథమప్రకారమగు దృశ్యానువిద్ధసమాధి. (నామరూపములు అనిర్వచనీయము లగుటవలన మిథ్య - కనుక దృశ్యవస్తువున ఆత్మసత్తయే కలదు. అని ధ్యానమొనర్చుటవలన ఈ సమాధి సిద్ధించుచున్నది.) ౨౭

దేశకాలములకును కార్యకారణ - సంబంధమునకును, అతీతమై; సజాతీయ, విజాతీయ, స్వగతభేదరహితమై, అద్వితీయమగునదియే అఖండవస్తువు. ఇట్టి అఖండైకరస - సచ్చిదానందవస్తువును ఎడతెరపి లేకుండ చింతించుటవలన కలుగు సమాధి, శబ్దానువిద్ధమగు బాహ్యసవికల్పసమాధి - మధ్యమసమాధి. ౨౮

బ్రహ్మరసాస్వాదమువలన బయటకు చూపట్లు నిశ్చలత్వమే తృతీయమగు నిర్వికల్పసమాధి. ఇది పూర్వోక్తప్రకారముగనే యుండును. ఈ ఆరువిధములగు సమాధిసుఖము ననుభవించుచు, కాలక్షేప మొనర్పనగును. ౨౯

శరీరాభిమానము తొలగిపోన, పరమాత్మజ్ఞానము లభించినప్పుడు; మనస్సు ఎటకు వెళ్ళినను ఈ ఆరువిధములగు సమాధులలో ఒకటి పొందునునే యుండును. (ఇది అయత్నాయత్తమగు నిత్యసమాధి) 30

"భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే." ౩౧

అవచ్ఛిన్నశ్చిదాభాసస్తృతీయః స్వప్నకల్పితః,
విజ్ఞేయస్త్రివిధో జీవస్తత్రాద్యః పారమార్థికః. ౩౨

అవచ్ఛేదః కల్పితః స్యాదవచ్ఛేద్యం తు వాస్తవమ్,
తస్మిన్ జీవత్వమారోపాద్ బ్రహ్మత్వం తు స్వభావతః. ౩౩

అవచ్ఛిన్నస్య జీవస్య తాదాత్మ్యం బ్రహ్మణా సహ,
తత్త్వమస్యాదివాక్యాని జగుర్నేతర జీవయోః. ౩౪

బ్రహ్మణ్యవస్థితా మాయా విక్షేపావృతిరూపిణీ,
ఆవృత్యాఖణ్డతాం తస్మిన్ జగజ్జీవౌ ప్రకల్పయేత్. ౩౫

పరావరబ్రహ్మసాక్షాత్కారమైనయెడల హృదయము నాశ్రయించుకొని యుండు అహంకార గ్రంథి చీలిపోవును. సర్వసంశయములు తొలగిపోయి - గతసందేహుడగును. సంచితకర్మములన్నియును క్షీణించును. ౩౧

అవచ్ఛిన్నుడనియు, చిదాభాసుడనియు, స్వప్నకల్పితుడనియు జీవుడు మూడువిధములుగ నున్నాడు. వీనిలో ఆద్యుడు పారమార్థికుడు. ౩౨

చిదాత్మయొక్క అవచ్ఛేదమగు జీవత్వము కల్పితమే యగుచున్నది. అవచ్ఛేద్యమగు శుద్ధచైతన్యమే వాస్తవము. ఆ వాస్తవవస్తువుయందే జీవత్వమారోపితమగుచున్నది. కాని స్వాభావికముగ ఉండునది బ్రహ్మత్వమే. ౩౩

తత్త్వమస్యాది - మహావాక్యములు అవచ్ఛిన్నజీవుడు అనగా సాక్షిచైతన్యముతోడనే బ్రహ్మతాదాత్మ్యమును అభివర్ణించుచున్నవి; చిదాభాసుని తోడను, స్వప్నకల్పితునితోడను ఈఐక్యమును చెప్పుటలేదు. ౩౪

ఆవరణ విక్షేపరూపమగు మాయాశక్తి బ్రహ్మమున వెలయుచు, అఖండత్వమును ఆవరించి జగత్, జీవకల్పనను విస్తరించుచున్నది. ౩౫

జీవో ధీస్థ చిదాభాసో భవేద్ భోక్తా హి కర్మకృత్,
భోజ్యరూపమిదం సర్వం జగత్ స్యాద్ భూతభౌతికమ్. ౩౬

అనాదికాలమారభ్య మోక్షాత్ పూర్వమిదం ద్వయమ్,
వ్యవహారే స్థితం తస్మాదుభయం వ్యావహారికమ్. ౩౭

చిదాభాసస్థితా నిద్రా విక్షేపావృతిరూపిణీ,
ఆవృత్య జీవజగతీ పూర్వే నూత్నన్తు కల్పయేత్. ౩౮

ప్రతీతికాల ఏవైతే స్థితత్వాత్ ప్రాతిభాసికే,
న హి స్వప్నప్రబుద్ధస్య పునః స్వప్నే స్థితిస్తయోః. ౩౯

బుద్ధిస్థుడగు చిదాభాసునే జీవు డందురు. ఇతడే కర్తయును, భోక్తయును. భూత భౌతికమగు ఈ జగత్తంతయును అతనికి భోజ్యము - భోగ స్థానము. ౩౬

అనాదికాలమునుండి మోక్షకాల పర్యంతము ఉండుకాలము వ్యావహారికము, పారమార్థికము కాదు. ఈ మధ్యకాలముననే జీవజగత్తుల ఉనికి; కనుక ఈ రెండును వ్యావహారికములే. ౩౭

చిదాభాసుని అనగా వ్యావహారిక - జీవుని ఆశ్రయించుకొనియుండిన అవిద్యాఖ్యమగు తమోరూప నిద్ర - దీనియందు ఆవరణవిక్షేపశక్తులు రెండును కలవు - ఆవరణ శక్తివలన పూర్వానుభూతులగు జాగ్రత్కాలీన జీవజగత్తులను ఆవృతమొనర్చి, విక్షేపశక్తివలన స్వప్నమున నూతన జీవజగత్తులను సృష్టించుచున్నది. ౩౮

స్వప్నానుభూతములగు ఈ జీవజగత్తులు రెండును స్వప్నప్రతీతి కాలముననే అనుభూతములై, జాగరమునగాని, మరల స్వప్నమునగాని గోచరింప కుండుటవలన ప్రాతిభాసికము లనబడుచున్నవి. ౩౯

ప్రాతిభాసికజీవో యస్తజ్జగత్ ప్రాతిభాసికమ్,
వాస్తవం మన్యతేఽన్యస్తు మిథ్యేతి వ్యావహారికః. ౪౦

వ్యావహారికజీవో యస్తజ్జగద్వ్యావహారికమ్,
సత్యం ప్రత్యేతి మిథ్యేతి మన్యతే పారమార్థికః. ౪౧

పారమార్థికజీవస్తు బ్రహ్మైక్యం పారమార్థికమ్,
ప్రత్యేతి వీక్షతే నాన్యద్వీక్షతే త్వనృతాత్మనా. ౪౨

మాధుర్యద్రవశైత్యాని నీరధర్మాస్తరఙ్గకే,
అనుగమ్యాథ తన్నిష్ఠే ఫేనేఽప్యనుగతా యథా. ౪౩

సాక్షిస్థాః సచ్చిదానన్దాః సమ్బన్ధా వ్యావహారికే,
తద్ద్వారేణానుగచ్ఛన్తి తథైవ ప్రాతిభాసికే. ౪౪

ప్రాతిభాసిక జీవుడు తన లోకమునే వాస్తవముగ ఎంచును; కాని వ్యావహారిక - జీవుడు దానిని మిథ్యగ తలపోయును. ౪౦

వ్యావహారికజీవుడు జాగ్రత్కాలవ్యవహారము లన్నిటిని సత్యముగ భావించును. కాని పరమార్థదృష్టికలవాడు దీనినిగూడ మిథ్యగనే ఎంచును.

పారమార్థికజీవుడు జీవబ్రహ్మైక్యమునే పారమార్థికముగ గ్రహించి, బ్రహ్మమునొక్కదానినే వీక్షించును. మరియొకటి అతనికి గోచరింపదు. గోచరించినను మిథ్యయే యనిపించును. ౪౨

జలధర్మములగు మాధుర్యద్రవత్వశైత్యాదులు తరంగమననుసరించి ఫేనమునకుగూడ సంక్రమించునట్లు: సాక్షిస్థితమగు సచ్చిదానందత్వము వ్యావహారిక జీవునిద్వారమున ప్రాతిభాసికజీవునకుగూడ అనుక్రమించును. ౪౩ - ౪౪

లయే ఫేనస్య తద్ధర్మా ద్రవాద్యాః స్యుస్తరఙ్గకే,
తస్యాపి విలయే నీరే తిష్ఠన్త్యేతే యథా పురా. ౪౫
ప్రాతిభాసిక జీవస్య లయే స్యుర్వ్యావహారికే,
తల్లయే సచ్చిదానన్దాః పర్యవస్యన్తి సాక్షిణి. ౪౬

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచితా వాక్యసుధా ॥౩౩॥

ఫేనము లీనమైన దాని ధర్మములగు ద్రవాదులు తరంగమునను, తరంగము లయమైన నీరమునను వెలయునట్లు : సచ్చిదానందాది - ధర్మములు ప్రాతిభాసిక జీవుడు లయమైన వ్యావహారికునియందునను, అతడు లయమైన యథాపూర్వము సాక్షియందునను వెలయుచుండును. ౪౫ - ౪౬

ఇది వాక్యసుధ - ఆంధ్రానువాదము ॥౩౩॥

# ౩౮. విజ్ఞాననౌకా
## (స్వరూపానుసన్ధానము)

తపోయజ్ఞదానాదిభిః శుద్ధబుద్ధిః
విరక్తో నృపాదౌ పదే తుచ్ఛబుద్ధ్యా,
పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౧

దయాలుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాన్తం
సమారాధ్య భక్త్యా విచార్య స్వరూపమ్,
యదాప్నోతి తత్త్వం నిదిధ్యాస్య విద్వాన్
పరం ప్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౨

యదానన్దరూపం ప్రకాశస్వరూపం
నిరస్తప్రపఞ్చం పరిచ్ఛేదశూన్యమ్,
అహం బ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౩

యజ్ఞ, దాన, తపశ్చర్యలవలన శుద్ధబుద్ధియై, సార్వభౌమాది - పదవులను తుచ్ఛముగ పరిగణించి విరక్తుడై, (బ్రహ్మలోకము వరకుగల) సర్వసుఖములను త్యాగమొనర్చినవాడు ఏ తత్త్వమును బొందుచున్నాడో, ఆ నిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౧

బ్రహ్మవేత్తయును, ప్రశాంతుడును, కరుణామయుడును అగు గురువును భక్తితో పూజించి, స్వరూపవిచారమొనర్చి, తత్త్వమును ధ్యానమొనర్చి విద్వాంసుడగువాడు దేనిని పొందుచున్నాడో, ఆ నిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౨

ఆనందరూపమును, ప్రకాశస్వరూపమును, ప్రపంచాతీతమును, పరిచ్ఛేదరహితమును, "అహం బ్రహ్మాఽస్మి - నేనే బ్రహ్మమను" అను అంతఃకరణవృత్తి ఒక్కదానివలననే తెలియబడునదియును, తురీయమును అగునదేది కలదో, ఆ నిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౩

యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం
వినష్టం చ సద్యో యదాత్మప్రబోధే,
మనోవాగతీతం విశుద్ధం విముక్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౪

నిషేధే కృతే నేతి నేతీతివాక్యైః
సమాధిస్థితానాం యదాభాతి పూర్ణమ్,
అవస్థాత్రయాతీతమేకం తురీయం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౫

యదానన్దలేశైః సమానన్ది విశ్వం
యదాభాతి సత్త్వే తదాభాతి సర్వమ్,
యదాలోకనే రూపమన్యత్ సమస్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౬

దేనిని ఎరుగకపోవుటవలన జగత్తు తోచుచున్నదో, దేనిని ఆత్మగా ఎరుగుటవలన వెంటనే జగత్తు వినష్టమై పోవుచున్నదో, ఏది అవాఙ్మానసగోచరమో, విశుద్ధమో, విముక్తమో, ఆనిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను.

"ఇది ఆత్మకాదు, ఇది ఆత్మకాదు" అను శ్రుతివాక్యములు 'నేతి నేతీతి' వాక్యములు; ఈవాక్యములవలన సమస్తమును నిషిద్ధముకాగా — సమాధిస్థితులగువారి హృదయమున ఏది పూర్ణస్వరూపమై ప్రకాశించుచున్నదో, ఏది అవస్థాత్రయాతీతమగు తురీయతత్త్వమో, ఆ నిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౫

దేని ఆనందలేశమువలన విశ్వమంతయును ఆనందతుందిలమగుచున్నదో, దేని సత్ప్రకాశమువలన సమస్తమును వెలుగందుచున్నదో, దేనిని వీక్షించిన నామరూపాత్మకమగు ప్రపంచము అన్యవిధముగనిరీక్షితమగునో, ఆనిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౬

అనన్తం విభుం సర్వయోనిం నిరీహం
శివం సఙ్గహీనం యదోఙ్కారగమ్యమ్,
నిరాకార మత్యుజ్జ్వలం మృత్యుహీనం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౭

యదానన్దసిన్ధౌ నిమగ్నః పుమాన్ స్యాద్
అవిద్యావిలాసః సమస్త ప్రపఞ్చః,
తదా న స్ఫురత్యద్భుతం యన్నిమిత్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి. ౮

ఇతి శ్రీశఙ్కర భగవత్పూజ్యపాదవిరచిత - విజ్ఞాననౌకా ॥38॥

అనంతమై, అపారమై, అఖిలజగత్కారణమై, అచంచలమై, అసంగస్థమై శివస్వరూపమగుచు, ఓంకారవేద్యమును, నిరాకారమును, తేజోమయమును, అమృతస్వరూపమును అగు ఏవస్తువు గలదో; ఆనిత్యస్వరూపమగు పరబ్రహ్మమే నేను. ౭

ఏఆనందసముద్రమున పురుషుడు నిమగ్నుడైన అవిద్యావిలాసమగు ప్రపంచము తోచకుండునో, అయ్యు దేనివలన అద్భుతమగు ఈజగత్తు తోచుచున్నదో, ఆనిత్యస్వరూపమగు పరబ్రహ్మ నేను. * ౮

ఇది విజ్ఞాననౌక - ఆంధ్రానువాదము ॥38॥

---

*స్వరూపానుసన్ధానరూపాం స్తుతిం యః, పఠే, దాదరాద్భక్తిభావో మనుష్యః,
శృణోతీహ వా నిత్యముద్యుక్తచిత్తో, భవేద్విష్ణురత్రైవ వేదప్రమాణాత్ ॥౯॥
విజ్ఞాననావం పరిగృహ్య కశ్చిత్ తరేద్యదజ్ఞానమయం భవాబ్ధిమ్,
జ్ఞానామృతాస్వాదవిధూతతృష్ణః స యాతి విష్ణోః పదమేవ ధన్యః ॥౧౦॥
— ఈరెండు శ్లోకములును అధికపాఠము.

# ౩౫. వేదాన్తడిణ్డిమః

వేదాన్తడిణ్డిమా స్తత్త్వం ఏకముద్ఘోషయన్తి యత్,
ఆస్తాం పురస్తాత్ తత్తేజో దక్షిణామూర్తి సంజ్ఞితమ్.
ఆత్మానాత్మపదార్థౌ ద్వౌ భోక్తృభోగ్యత్వలక్షణౌ,
బ్రహ్మైవాత్మా న దేహాదిః ఇతి వేదాన్త డిణ్డిమః.
జ్ఞానాజ్ఞానే పదార్థౌ ద్వౌ ఆత్మనో ముక్తిబన్ధదౌ,
జ్ఞానాన్ముక్తి ర్నిబన్ధోఽన్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః.
సుఖదుఃఖే పదార్థౌ ద్వౌ ప్రియవిప్రియకారకే,
సుఖం బ్రహ్మ జగద్దుఃఖం ఇతి వేదాన్త డిణ్డిమః.
సమష్టివ్యష్టిరూపౌ ద్వౌ పదార్థౌ సర్వసమ్మతౌ,
సమష్టిరీశ్వరో వ్యష్టిః జీవో వేదాన్త డిణ్డిమః.

వేదాన్తభేరీనినాదములు ఏ ఏకసూత్రతత్త్వమును ఉద్ఘోషించుచు
దక్షిణామూర్తి సంజ్ఞకమగు ఆ తేజము నాకు సాక్షాత్కరించును గాక

ఆత్మ అనియు అనాత్మ అనియు పదార్థములు రెండు; ఒకటి
మరియొకటి భోగ్యము. బ్రహ్మమే ఆత్మ, దేహాదులు కావు : అని వేద
భాంకారము.

జ్ఞానమనియు, అజ్ఞానమనియు పదార్థములు రెండు; ఒకటి
మరియొకటి బంధమును గూర్చుచున్నవి. జ్ఞానమువలన ముక్తి, అజ్ఞాన
బంధము. అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

సుఖదుఃఖములని రెండు పదార్థములు. ఒకటి సుఖముచు, మరి
దుఃఖమును గూర్చును. బ్రహ్మము సుఖస్వరూపము, జగత్తు దుఃఖరూపవ
వేదాంత డిండిమము.

సమష్టిఅనియు, వ్యష్టిఅనియు సర్వసమ్మతములగు పదార్థములు
సమష్టి ఈశ్వరుడు, వ్యష్టి జీవుడు అని వేదాంత డిండిమము.

జ్ఞానకర్మపదార్థౌ ద్వౌ వస్తుకర్త్రాత్మతన్త్రికౌ.
జ్ఞానాన్మోక్షో న కర్మభ్యః ఇతి వేదాన్తడిణ్డిమః. ౬
శ్రోతవ్యాఽశ్రావ్యరూపౌ ద్వౌ పదార్థౌ సుఖదుఃఖదౌ,
శ్రోతవ్యం బ్రహ్మ నైవాన్యత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౭
చిన్త్యాఽచిన్త్యపదార్థౌ ద్వౌ విశ్రాన్తిశ్రాన్తిదాయకౌ,
చిన్త్యం బ్రహ్మ పరం నాన్యత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౮
ధ్యేయాధ్యేయపదార్థౌ ద్వౌ ధీసమాధ్యసమాధిదౌ,
ధ్యాతవ్యం బ్రహ్మ నైవాన్యత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౯
యోగినో భోగినో వాఽపి త్యాగినో రాగిణోఽపి చ,
జ్ఞానాన్మోక్షో న సన్దేహః ఇతి వేదాన్తడిణ్డిమః. ౧౦

జ్ఞానమనియు, కర్మమనియు పదార్థములు రెండు. ఒకటి ఆత్మ (వస్తు) తంత్రము, రెండవది కర్తృతంత్రకము. జ్ఞానమువలననే మోక్షము, కర్మముల వలన కాదు : అని వేదాంతడిండిమము. ౬

శ్రోతవ్యము, అశ్రావ్యము అని రెండు పదార్థములు. ఒకటి సుఖమును, రెండవది దుఃఖమును గూర్చును. బ్రహ్మమునుగూర్చియే వినదగును, మరియొక దానిని దేనిని గూర్చియును గాదు: అని వేదాంతడిండిమము. ౭

మననమొనర్పదగినది, కూడనిది అని పదార్థములు రెండు. ఒకటి శాంతిని, మరియొకటి శ్రాంతిని ఒసగును. పరబ్రహ్మమే మననీయము, మరేదియును కాదు; అని వేదాంతడిండిమము. ౮

ధ్యానింపదగినది, కూడనిది అని పదార్థములు రెండు. ఒకటి సమాధిని, మరియొకటి విక్షేపమును చిత్తమునకు గూర్చును. బ్రహ్మ మొక్కటియే ధ్యాతవ్యము, మరి ఏదియును కాదు: అని వేదాంతడిండిమము. ౯

యోగియే కానిమ్ము, భోగియే కానిమ్ము, త్యాగియే కానిమ్ము, విషయానురాగియే కానిమ్ము- జ్ఞానమువలన మోక్షము నందుననుటలో సంశయము లేదు, అని వేదాంతడిండిమము. ౧౦

న వర్ణాశ్రమసంకేతైః న కర్మోపాసనాదిభిః,
బ్రహ్మజ్ఞానం వినా మోక్షః ఇతి వేదాన్త డిణ్డిమః. ౧

అసత్య స్సర్వసంసారో రసాభాసాది దూషితః,
ఉపేక్ష్య బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః. ౧

వృథా క్రియా వృథాలాపాః వృథావాదాః మనోరథాః,
త్యక్త్వైకం బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః. ౧

స్థితో బ్రహ్మాత్మనా జీవో బ్రహ్మ జీవాత్మనా స్థితమ్,
ఇతి సమ్పశ్యతాం ముక్తిః ఇతి వేదాన్త డిణ్డిమః. ౧

జీవో బ్రహ్మాత్మనా జ్ఞేయో జ్ఞేయం జీవాత్మనా పరమ్,
ముక్తి స్తదైక్యవిజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౧

వర్ణాశ్రమచిహ్నధారణముగాని, కర్మోపాసనలుగాని మోక్షము నొసగజాలవు. బ్రహ్మజ్ఞానమువినా మోక్షము లభింపదు. అని వేదాంతడిండిమము. ౧

(ఆబ్రహ్మస్తంబపర్యంతముగల) సంసారము అసత్యము, రసాభాసదోషములతో నిండియున్నది. దీనిని ఉపేక్షించి బ్రహ్మము నొక్కదానిని చక్కగ ఎరుగనగును: అని వేదాంతడిండిమము. ౧

వ్యర్థకార్య, ప్రసంగ, వాద, వాంఛలను పరిత్యజించి బ్రహ్మము నొక్క దానినే ఎరుగనగును. అని వేదాంతడిండిమము. ౧

"జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు" అని చక్కగ పరికించువారి ముక్తి: అని వేదాంత డిండిమము. ౧

జీవుని బ్రహ్మస్వరూపునిగను, బ్రహ్మమును జీవస్వరూపునిగను గ్రహింపగును. ఉభయుల ఐక్యవిజ్ఞానముననే ముక్తి: అని వేదాంతడిండిమము. ౧

సర్వాత్మనా పరం బ్రహ్మ శ్రోతురాత్మతయా స్థితమ్,
నాయాసస్తత్వ విజ్ఞప్తౌ ఇతి వేదాన్త డిణ్డిమః. ౧౬
ఐహికం చాముష్మికం చ తాపాన్తం కర్మసఞ్చయమ్,
త్యక్త్వా బ్రహ్మైవ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః. ౧౭
అద్వైత ద్వైతవాదా ద్వౌ సూక్ష్మస్థూలదశాం గతౌ,
అద్వైతవాదాన్మోక్షస్స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౧౮
కర్మిణో వినివర్తన్తే నివర్తన్తే ఉపాసకాః,
జ్ఞానినో న నివర్తన్తే ఇతి వేదాన్త డిణ్డిమః. ౧౯
పరోక్షాఽసత్ఫలం కర్మజ్ఞానం ప్రత్యక్ష సత్ఫలమ్,
జ్ఞానమేవాఽభ్యసేత్తస్మాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౦

శ్రోతయొక్క ఆత్మరూపముననే పరబ్రహ్మము వెలయుచుండుటచే, తత్త్వమును ఎరిగించుటలో పరిశ్రమయే లేదు: అని వేదాంతడిండిమము. ౧౬

ఐహికాముష్మిక సుఖముల నందగోరి నరుడొనర్చు కర్మసంగ్రహమంతయును పరితాప (శ్రమ) రూపమే; ఇట్టి కర్మముల నన్నిటిని పరిత్యజించి (సుఖస్వరూపమగు) బ్రహ్మమునే ఎరుగదగును: అని వేదాంతడిండిమము. ౧౭

అద్వైతమనియు, ద్వైతమనియు వాదములు (దర్శనములు) రెండు. ఒకటి సూక్ష్మము, మరియొకటి స్థూలము, అద్వైతదర్శనమువలననే ముక్తి: అని వేదాంతడిండిమము. ౧౮

కర్మపరులు మరల ఈలోకమునకు తిరిగి వచ్చుచున్నారు. ఉపాసకులు మరల జన్మించుచున్నారు. జ్ఞానులకు పుట్టుక లేదు: అనివేదాంతడిండిమము. ౧౯

కర్మఫలము ఎక్కడనో పరలోకమున లభించి, అనిత్యమగునది. జ్ఞానఫలము ఈలోకముననే లభ్యమై, నిత్యమై నిలుచుచున్నది. కనుక జ్ఞానాభ్యాసమునేయొనర్పనగును; అని వేదాంతడిండిమము. ౨౦

వృథాశ్రమోఽయం విదుషాం వృథాఽయం కర్మిణాం శ్రమః,
యది న బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౧

అలం యాగైరలం యోగైరలం భుక్తైరలం ధనైః.
పరస్మిన్ బ్రహ్మణి జ్ఞాతే ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౨

అలం వేదైరలం శాస్త్రైరలం స్మృతి పురాణకైః,
పరమాత్మని విజ్ఞాతే ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౩

నర్చా న యజుషార్థోఽస్తి న సామ్నార్థోఽస్తి కశ్చన,
జ్ఞాతే బ్రహ్మాత్మవిజ్ఞానే ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౪

కర్మాణి చిత్తశుద్ధ్యర్థం ఐకాగ్ర్యార్థముపాసనా,
మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౫

బ్రహ్మజ్ఞానమే లభింపకుండిన విద్వాంసుల ఈ పాండిత్యకృషియును, కర్మిష్ఠుల కర్మనిష్ఠయును వ్యర్థములు: అని వేదాంతడిణ్డిమము. ౨౧

పరబ్రహ్మము నెరిగినచో ఇక యాగ, యోగ, ధనాదులతో నేమి ప్రయోజనము ? అని వేదాంతడిండిమము. ౨౨

పరమాత్మను తెలిసికొనినచో ఇక వేద, శాస్త్ర, స్మృతి, పురాణాదులతో నేమి పని ? అని వేదాంత డిండిమము. ౨౩

బ్రహ్మాత్మవిజ్ఞానము కలిగిన ఋగ్యజుస్సామవేదములద్వారా సాధించవలసినదేమియును ఉండదు: అని వేదాంతడిండిమము. ౨౪

అంతఃకరణమును పవిత్రమొనర్ప కర్మములును, ఏకాగ్రతనుగూర్ప ఉపాసనయు (ధ్యానము) ను విధింపబడినవి; [చిత్తశుద్ధి, ఉపాసనములవలన లభ్యమగు] బ్రహ్మవిజ్ఞానమొక్కటియే మోక్షమును ప్రసాదింపగలదు: అని వేదాంతడిండిమము. ౨౫

సంచితాగామి కర్మాణి దహ్యన్తే జ్ఞానవహ్నినా,
ప్రారబ్ధానుభవా న్ముక్తిః ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౬

న పుణ్యకర్మణా వృద్ధిః న హానిః పాపకర్మణా,
నిత్యాసఙ్గాత్మ నిష్ఠానాం ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౭

బుద్ధిపూర్వాఽబుద్ధిపూర్వకృతానాం పాపకర్మణామ్,
ప్రాయశ్చిత్తమహో జ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౮

దృగ్దృశ్యౌ తౌ పదార్థౌ ద్వౌ పరస్పరవిలక్షణౌ,
దృగ్బ్రహ్మ దృశ్యం మాయా స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః.

(జీవన్ముక్తుని) సంచితాగామి కర్మజాలము జ్ఞానాగ్నివలన భస్మీపటల మగుచున్నది. ప్రారబ్ధభోగానంతరము (విదేహ) ముక్తి లభించుచున్నది : అని (అజ్ఞులకు తెలియజెప్పు నిమిత్తము) వేదాంత డిండిమము. (వాస్తవమునకు జీవన్ముక్తునకు ప్రారబ్ధముకూడ లేదు. చూ : ౯౨ - శ్లో.) ౨౬

నిరంతరము అసంగాత్మ నిష్ఠయందుండు వారికి పుణ్యకర్మములవలన ఔన్నత్యముగాని, లేక పాపకర్మములవలన పతనముగాని లభింపదు : అని వేదాంత డిండిమము. (జ్ఞానప్రభావ మిట్టిది! - అని జ్ఞానమహిమను స్తుతించుటయే ఈ శ్లోకముయొక్క భావార్థము కాని, "జ్ఞాని మంచిని చేయనక్కర లేదు, చెడుగును చేయవచ్చును" అని భావింపకూడదు. వాస్తవమునకు, మనకు సత్పథమున చరించుట ఎంతకష్టమో, జీవన్ముక్తునకు తప్పటడుగు వేయుటకూడ అంత కష్టతర మగుమ.) ౨౭

అహో! జ్ఞానమహిమ ఎట్టిది! తెలిసియో, తెలియకయో చేసిన పాపము లన్నిటికిని బ్రహ్మజ్ఞానము ప్రాయశ్చిత్త మగుచున్నది : అని వేదాంతడిండిమము నినదించు చున్నది. ౨౮

దృగ్, దృశ్యములని పదార్థములు రెండు. ఈ రెండును పరస్పర విరుద్ధములు. అందు దృక్కు బ్రహ్మము, దృశ్యము మాయ : అని వేదాంతడిండిమము.

అవిద్యోపాధికో జీవో మాయోపాధిక ఈశ్వరః,
మాయాఽవిద్యా గుణాతీతః ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౦

సాకారం చ నిరాకారం నిర్గుణం చ గుణాత్మకమ్,
తత్త్వం తత్పరమం బ్రహ్మ ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౧

ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః,
బ్రాహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౨

సర్వాత్మనా స్థితం బ్రహ్మ సర్వం బ్రహ్మాత్మనా స్థితమ్,
న కార్యం కారణాద్భిన్నం ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౩

సత్తాస్ఫురణసౌఖ్యాని భాసన్తే సర్వవస్తుషు,
తస్మాద్బ్రహ్మమయం సర్వం ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౪

జీవునకు అవిద్య ఉపాధి; ఈశ్వరునకు మాయ ఉపాధి. అవిద్యకును, మాయకును, ఈ రెంటిగుణములకును అతీతమగునది బ్రహ్మము : అని వేదాంత డిండిమము. ౩౦

ఆపరబ్రహ్మతత్త్వము సాకారమును, నిరాకారమును, నిర్గుణమును, సగుణమును గూడ : అని వేదాంత డిండిమము. ౩౧

వేదవిధిని అనుష్ఠించుటవలన ద్విజత్వమును, వేదపఠనమువలనవిప్రత్వమును, బ్రహ్మజ్ఞానమువలన బ్రాహ్మణత్వమును లభించుచున్నవి : అని వేదాంత డిండిమము. ౩౨

కార్యము కారణముకంటె వేరు కాదు. కనుక బ్రహ్మమే ఈసర్వమును తానగుచు వెలయుచున్నది. అట్లే, మరల, ఈ సర్వమును బ్రహ్మ మగుచున్నది : అని వేదాంత డిండిమము. ౩౩

సర్వవస్తువులును సత్ – చిత్ – ఆనంద (సచ్చిదానంద) లక్షణములనే కలిగియున్నవి. కనుక ఇదంతయును బ్రహ్మమయమే : అని వేదాంతడిండిమము

అవస్థాత్రితయం యస్య క్రీడాభూమితయా స్థితమ్,
తదేవ బ్రహ్మ జానీయాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౫
యన్నాదౌ యచ్చ నాస్త్యన్తే తన్మధ్యే భాతమప్యసత్,
అతో మిథ్యా జగత్సర్వం ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౬
యదస్త్యాదౌ యదస్త్యన్తే యన్మధ్యే భాతి తత్సత్యమ్,
బ్రహ్మైవైకమిదం సత్యం ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౭
పురుషార్థత్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువమ్,
మోక్షార్థీ పురుషః శ్రేష్ఠః ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౮
ఘటకుడ్యాదికం సర్వం మృత్తికామాత్రమేవ చ,
తథా బ్రహ్మ జగత్సర్వం ఇతి వేదాన్త డిణ్డిమః. ౩౯

జాగ్రత్స్వప్న సుషుప్తులనబడు అవస్థా త్రయము దేనికి క్రీడాభూమి యగుచు వెలయుచున్నదో, అదియే బ్రహ్మమని తెలిసికొన నగును : అని. ౩౫

ఆది - అంతములయందు లేక, మధ్యకాలమున గోచరించినను, అసత్యమే యగును : కనుక జగత్తంతయును మిథ్య : అని వేదాంత డిండిమము. ౩౬

ఆదిమధ్యాంత కాలముల గోచరించునదియే సత్యము; అట్టి సత్యవస్తువు బ్రహ్మ మొక్కటియే ; అని వేదాంత డిండిమము ౩౭

ధర్మము, అర్థము, కామము అనబడు ఈమూడు పురుషార్థములను సాధించు మానవులు పశువులనుట నిక్కమే. కేవలము మోక్షమును బొందగోరు పురుషుడే శ్రేష్ఠుడు : అని వేదాంత డిండిమము. ౩౮

ఘటకుడ్యాదికమగు సర్వమును మృత్తికయే యైనట్లు, జగత్తంతయును బ్రహ్మమే ; అని వేదాంత డిండిమము. (చూ : 'ఘట పట శకటాదికం చ సర్వం విభురితి చేద్గలితైవ సా త్వవిద్యా, ఘట పట శకటాదికం చ సర్వం న విభురితిత్యుదితేహ సా త్వవిద్యా' యో. వా.) ౩౯

షణ్ణిహత్య త్రయం హిత్వా ద్వయం భిత్వాఽఖిలాతిగమ్,
ఏకం బుద్ధ్వాఽశ్నుతే మోక్షం ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౦

భిత్వా షట్పఞ్చ భిత్వాఽథ భిత్వాఽథ చతురస్త్రికమ్,
ద్వయం హత్వాఽఽశ్రయేదేకం ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౧

దేహో నాహమహం దేహీ దేహసాక్షీతి నిశ్చయాత్,
జన్మ మృత్యు ప్రహీణోఽసౌ ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౨

ప్రాణో నాహమహం దేవః ప్రాణసాక్షీతి నిశ్చయాత్,
క్షుత్పిపాసోపశాన్తిస్స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౩

మనో నాహమహం దేవః మనస్సాక్షీతి నిశ్చయాత్,
శోకమోహాపహానిస్స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౪

అరిషడ్వర్గమును చంపి, త్రిగుణములను వదలి, ద్వైతదృష్టిని భేదించుకొనిపోయి, అతీంద్రియమగు ఏకమాత్రవస్తువు నెరిగిన యెడల మోక్షము : అని వేదాంత డిండిమము. ౪౦

అరిషడ్వర్గమును, ఇంద్రియ పంచకమును, అంతఃకరణ వికారములను నాల్గిటిని, ఏషణాత్రయమును, ద్వంద్వములను త్యజించి, ఏకమగు బ్రహ్మవస్తువునే ఆశ్రయింప నగును : అని వేదాంత డిండిమము. ౪౧

“నేను దేహమును గాను, దేహసాక్షియగు దేహిని” అను నిశ్చయము వలననే జననమరణ-రహితు డగును: అని వేదాంత డిండిమము. ౪౨

“నేను ప్రాణమును గాను, ప్రాణిసాక్షియగు స్వప్రకాశస్వరూపుడను” అను నిశ్చయమువలన క్షుత్పిపాసలు శాంతించును:అని వేదాంత డిండిమము. ౪౩

“నేను మనస్సును గాను, మనః సాక్షియగు స్వప్రకాశస్వరూపుడను” అను నిశ్చయమువలన శోకమోహములు శాంతించును: అని వేదాంతడిండిమము.

బుద్ధిర్నాహమహం దేవః బుద్ధిసాక్షీతి నిశ్చయాత్,
కర్తృభావనివృత్తిస్స్యాత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౪౫
నాజ్ఞానం స్యామహం దేవోఽజ్ఞానసాక్షీతి నిశ్చయాత్,
సర్వానర్థ నివృత్తిస్స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౪౬
అహం సాక్షీతి యో విద్యాత్ వివిచ్యైవ పునఃపునః,
స ఏవ ముక్తోఽసౌ విద్వాన్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౪౭
నాహం మాయా న తత్కార్యం న సాక్షీ పరమోఽస్మ్యహమ్,
ఇతి నిస్సంశయజ్ఞానాత్ ముక్తిః వేదాన్తడిణ్డిమః. ౪౮
నాహం సర్వమహం సర్వం మమ సర్వమితి స్ఫుటమ్,
జ్ఞాతే తత్త్వే కుతో దుఃఖం ఇతి వేదాన్తడిణ్డిమః. ౪౯

“నేను బుద్ధిని కాదు, బుద్ధిసాక్షియగు స్వప్రకాశస్వరూపుడను” అను నిశ్చయమువలన కర్తృత్వము తొలగిపోవును. ౪౫

“నేను అజ్ఞానమను (ఆనందమయకోశమను) గాను, అజ్ఞానసాక్షియగు స్వప్రకాశస్వరూపుడను” అను నిశ్చయమువలన సర్వానర్థములును తొలగిపోవుచున్నవి: అని వేదాంతడిండిమము. ౪౬

ఈరీతిగ నిరంతరవిచారమొనర్చి, తత్ఫలముగ “నేను సాక్షిని” అను అనుభూతిని పొందినయతడే ముక్తుడు, విద్వాంసుడు: అని వేదాంతడిండిమము.

“నేను మాయను కాదు, దాని కార్యమును కాదు, ఈ కార్యమునకు సాక్షినిగూడ కాదు” అను నిస్సందిగ్ధజ్ఞానమువలననే ముక్తి: అని వేదాంత డిండిమము. ౪౮

“ఈ (దృశ్యజాతము) సర్వమును నేను కాదు; (ఈ సర్వమునకును అధిష్ఠానమగుటవలన) సర్వమును నేనే; సర్వమును (ఆత్మాధీనమైనందువలన) నాదియే అను తత్త్వమును గ్రహించిన, ఇక దుఃఖమెట్లుండగలదు ? అని వేదాంతడిండిమము. ౪౯

దేహాదిపఞ్చకోశస్థా యా సత్తా ప్రతిభాసతే,
సా సత్తాఽఽత్మా న సన్దేహః ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౦

దేహాదిపఞ్చకోశస్థా యా స్ఫూర్తిరనుభూయతే,
సా స్ఫూర్తిరాత్మా నైవాన్యత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౧

దేహాదిపఞ్చకోశస్థా యా ప్రీతిరనుభూయతే,
సా ప్రీతిరాత్మా కూటస్థః ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౨

వ్యోమాదిపఞ్చభూతస్థా యా సత్తా భాసతే నృణామ్,
సా సత్తా పరమం బ్రహ్మ ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౩

వ్యోమాదిపఞ్చభూతస్థా యా చిదేవానుభూయతే,
సా చిదేవ పరం బ్రహ్మ ఇతి వేదాన్త డిణ్డిమః. ౫౪

అన్నమయాది - పంచకోశములందు గోచరించెడు సత్తయే ఆత్మ, ఇందులకు సందేహము లేదు: అని వేదాంత డిండిమము. ౫౦

అన్నమయాది - పంచకోశములందు స్ఫురించెడు ప్రకాశము ఆత్మయే, ఇంకొకటి కాదు: అని వేదాంతడిండిమము. ౫౧

అన్నమయాది - పంచకోశములప్రతి అనుభూతమగు ప్రీతి, యథార్థమునకు కూటస్థమగు ఆత్మపరమే యగును. ఎలయన: అన్నమయాదులు ఏహ్యాములును, అనిత్యములును అగుటవలన, ప్రీతియోగ్యములు కానేరవు: అని వేదాంత డిండిమము. ౫౨

'ఆకాశాది పంచభూతములు కలవు' అని ఏదనికి మానవులకు గోచరించుచున్నదో, ఆసత్తయే పరబ్రహ్మము: అని వేదాంతడిండిమము. ౫౩

ఆకాశాది పంచభూతములయందు గోచరించెడు ప్రకాశమానత్వ మేది కలదో, ఆప్రకాశమే పరబ్రహ్మము: అని వేదాంతడిండిమము. ౫౪

వ్యోమాదిపఞ్చభూతస్థా యా ప్రీతిరనుభూయతే,
సా ప్రీతిరేవ బ్రహ్మ స్యాత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౫
దేహాదికోశగా సత్తా యా సా వ్యోమాదిభూతగా,
మానాభావాన్న తద్భేదః ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౬
దేహాదికోశగా స్ఫూర్తి యా సా వ్యోమాదభూతగా,
మానాభావాన్న తద్భేదః ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౭
దేహాదికోశగా ప్రీతిః యా సా వ్యోమాదిభూతగా,
మానాభావాన్న తద్భేదః ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౮
సచ్చిదానన్దరూపత్వాత్ బ్రహ్మైవాత్మా న సంశయః,
ప్రమాణకోటిసంధానాత్ ఇతి వేదాన్తడిణ్డిమః. ౫౯

ఆకాశాది పంచభూత (నిర్మితపదార్థ) ములయందు అనుభూతమగు ప్రీతి ఏది కలదో, అదియే బ్రహ్మము: అని వేదాంతడిండిమము. ౫౫

పంచకోశములయందలి సత్తయే, పంచభూతముల యందును కలదు. అన్యవిధముగ నిరూపించెడు ప్రమాణము లేదు; కనుక, ఈరెంటికిని భేదము లేదు, ఒకటియే: అని వేదాంతడిండిమము. ౫౬

పంచకోశములయందు స్ఫురించెడు ప్రకాశమే, పంచభూతములయందును కలదు. దీనిని కాదనుటకు ప్రమాణము లేదు కనుక, ఈరెంటికిని భేదము లేదు: అని వేదాంతడిండిమము. ౫౭

పంచకోశములయెడ కలుగు ప్రీతియును, పంచభూతముల (తో నిర్మింపబడిన వస్తువుల) యెడ కలుగు ప్రీతియును ఒకటియే; భేదమును నిరూపించు ప్రమాణము లేదు_ కనుక, ఈరెండును ఒకటియే: అని వేదాంతభేరి. ౫౮

సచ్చిదానందరూపత్వమువలన ఆత్మయే బ్రహ్మమనుటకు సంశయము లేదు. ప్రమాణకోటిసంధానముకూడ ఇటులనే నిరూపించుచున్నది: అని వేదాంతడిండిమము. ౫౯

న నామరూపే నియతే సర్వత్ర వ్యభిచారతః,
అనామరూపం సర్వం స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౦

న జీవబ్రహ్మణోర్భేదః సత్తా రూపేణ విద్యతే,
సత్తా భేదే న మానంస్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౧

న జీవబ్రహ్మణోర్భేదః స్ఫూర్తిరూపేణ విద్యతే,
స్ఫూర్తిభేదే న మానం స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౨

న జీవబ్రహ్మణోర్భేదః ప్రియరూపేణ విద్యతే,
ప్రియభేదే న మానం స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౩

న జీవబ్రహ్మణోర్భేదః నామ్నారూపేణ విద్యతే,
నామ్నోరూపస్య మిథ్యాత్వాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౪

నామరూపములు నియతములు కావు, వ్యభిచారయుక్తములు. (అనగా, నిత్యముగ నుండనోల్లక ఏర్పడుచు పోవుచున్నవి.) కనక, ఈసర్వమును నామరూపరహితమగు బ్రహ్మమే యగును: అని వేదాంతడిండిమము. ౬౦

సత్తవిషయమున జీవబ్రహ్మములకు భేదము లేదు; కలదనుటకు ప్రమాణము లేదు: అని వేదాంతభేరి. ౬౧

జ్ఞాన (స్ఫూర్తి) విషయమున జీవబ్రహ్మములకు భేదము లేదు. కలదనుటకు ప్రమాణము లేదు: అని వేదాంతభేరి. ౬౨

ప్రీతి (ఆనంద) విషయమున జీవబ్రహ్మములకు భేదము లేదు. కలదనుటకు ప్రమాణము లేదు: అని వేదాంతభేరి. ౬౩

నామరూపముల ననుసరించి చూచినను, జీవబ్రహ్మములకు భేదము లేదు. ఏలయన, నామరూపములు రెండును మిథ్య: అని వేదాంతభేరి. ౬౪

న జీవబ్రహ్మణోర్భేదః పిణ్డబ్రహ్మాణ్డభేదతః,
వ్యష్టేస్సమష్టేరేకత్వాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౫

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః,
జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౬

అనామరూపం సకలం సన్మయం చిన్మయం పరమ్,
కుతో భేదః కుతో బన్ధ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౭

న తత్త్వాత్కథ్యతే లోకః నామాద్యైః వ్యభిచారతః,
వటుః కులట ఇత్యాద్యైః ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౮

**నామరూపాత్మకం విశ్వం ఇన్ద్రజాలం విదుర్బుధాః,**
**అనామత్వాదయుక్తత్వాత్ ఇతి వేదాన్త డిణ్డిమః.** ౬౯

పిండాండ, బ్రహ్మాండ భేదము ననుసరించి చూచినను జీవబ్రహ్మములకు భేదము లేదు. ఏలయన, వ్యష్టియును సమష్టియును(మాయాకార్యమై మిథ్య యగుటవలనగాని, లేక వ్యష్టి, సమష్టి-అంతర్గత మగుటవలనగాని) ఒకటియే యగుచున్నవి. అని వేదాంతడిండిమము. ౬౫

బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య. జీవుడు బ్రహ్మమే. వేరు కాదు- ఇట్లు గ్రహించినవాడే జీవన్ముక్తుడు. అని వేదాంతభేరి. ౬౬

సర్వమును నామరూపరహితమగు సచ్చిదానందమయమగు పరబ్రహ్మమే యగుచుండగ, ఇక భేద మెక్కడ? బంధ మెక్కడ? అని వేదాంతభేరి. ౬౭

లోకవ్యవహారమున తత్త్వము లేదు. నామాదులుకూడ స్థిరముగ నుండుట లేదు. వటువునే మరల దత్తపుత్రుడనియు, [యువకుడనియు (వయస్సుమళ్లిన) వృద్ధుడనియు] అనుచున్నారు. కనుక దృశ్యప్రపంచము తత్త్వము (సత్యము) కాదు. అని వేదాంతభేరి. ౬౮

“నిత్యములగు నామరూపములు లేక, సత్యయోగ్యము కానందువలన, నామరూపాత్మకమగు ఈవిశ్వ మొక ఇంద్రజాలము” అని విద్వదనుభవము: ఇట్లు వేదాంతభేరి ఘోషించుచున్నది. ౬౯

అభేదదర్శనం మోక్షః సంసారో భేదదర్శనః,
సర్వవేదాన్తసిద్ధాన్తః ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౦

న మతాభినివేశిత్వాత్ న భాషాఽఽవేశమాత్రతః,
ముక్తిర్వినాఽఽత్మవిజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౧

న కామ్యప్రతిషిద్ధాభిః క్రియాభిర్మోక్షవాసనా,
ఈశ్వరానుగ్రహాత్సా స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౨

అవిజ్ఞాతే జన్మ నష్టం విజ్ఞాతే జన్మ సార్థకమ్,
జ్ఞాతురాత్మా న దూరే స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౩

దశమస్య పరిజ్ఞానే నాయాసోఽస్తి యథా తథా.
స్వస్య బ్రహ్మత్వవిజ్ఞానే ఇతి వేదాన్త డిణ్డిమః. ౨౪

అభేదదర్శనము, అనగా అద్వైతదృష్టియే మోక్షము; భేదదర్శనము, అనగా ద్వైతదృష్టియే సంసారము_ సర్వవేదాంత (ఉపనిషత్-) సిద్ధాంత మిదియే: అని వేదాంతభేరి. ౨౦

ఒకానొక మత_సంప్రదాయమున పిచ్చిపట్టుదల, వేషభావలలో ఆవేశము ఉండిన ముక్తి లభించుననుకొనరాదు. ఆత్మజ్ఞానమువినా ముక్తి లేదు: అని వేదాంతభేరి. ౨౧

కామ్యనిషిద్ధకర్మాచరణమువలన మోక్షవాసన కలుగదు; ఈశ్వరానుగ్రహమువలననే లభించును. అని వేదాంతభేరి. ౨౨

ఆత్మ నెరుగకుండిన జన్మ వ్యర్థము, ఎరిగిన సార్థకము. జ్ఞాతకు ఈ ఆత్మ దూరమున లేదు. (స్వస్వరూపముగనే యున్నది.) అని వేదాంతభేరి. ౨౩

(పదుగురుండిన ఒకడు లెక్కపెట్టునప్పుడు) పదవవానిని గుర్తించుటలో శ్రమ లేనట్లు; (ఆలెక్కపెట్టువాడే పదవవాడు అగునట్లు) తానే బ్రహ్మమని ఎరుగుటలో శ్రమ లేదు. అని వేదాంతభేరి. ౨౪

ఉపేక్ష్యోపాధికాన్ దోషాన్ గృహ్యన్తే విషయా యథా,
ఉపేక్ష్య దృశ్యం యద్బ్రహ్మ ఇతి వేదాన్త డిణ్డిమః. ౭౫

సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్,
అనన్తం బ్రహ్మనిష్ఠానాం ఇతి వేదాన్త డిణ్డిమః. ౭౬

ధనైర్వా ధనదైః పుత్ర దారాగార సహోదరైః,
ధ్రువం ప్రాణహరైర్దుఃఖం ఇతి వేదాన్త డిణ్డిమః. ౭౭

సుప్తేరుత్థాయ సుప్త్యన్తం బ్రహ్మైక్యం ప్రవిచిన్త్యతామ్,
నాతిదూరే నృణాం మృత్యుః ఇతి వేదాన్త డిణ్డిమః. ౭౮

పఞ్చానామపి కోశానాం మాయానర్థవ్యయోచితా,
తత్సాక్షీ బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః. ౭౯

ఉపాధి-దోషములను విసర్జించి, లోకమున మనము వస్తువులను గ్రహించెడు రీతిగనే, దృశ్య-దోషములను విసర్జించి, బ్రహ్మమగుదానినే గ్రహింపనగును: అని వేదాంత భేరి. ౭౫

విషయాసక్తులకు సుఖము తక్కువ, క్లేశ మెక్కువ. బ్రహ్మనిష్ఠులకు ప్రయాస అల్పము, సుఖము అనంతము: అని వేదాంత భేరి. ౭౬

ధనమును, ధనోపార్జనకగు ఉపాయములును, సోదరులు, పుత్రులు, భార్య, గృహము మున్నగునవియును ప్రాణాంతకమగు దుఃఖమునే కలిగించు చున్నవనుట తథ్యము: అని వేదాంత భేరి. ౭౭

నిద్రలేచిననుండి, మరలనిద్రించువరకు బ్రహ్మము నొక్కదానినే చింతింపనగును; ఏలయన, మృత్యువు నరులకు దరిదాపుననే యున్నది: అని వేదాంత భేరి.

పంచకోశములును మాయ, అనర్థదాయకములు, అనిత్యములు; బ్రహ్మము వీనికి సాక్షి: అని వేదాంత భేరి. ౭౯

దశమత్వపరిజ్ఞానే నవజ్ఞస్య యథా సుఖమ్,
తథా జీవస్య సమ్ప్రాప్తిః ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౦

నవభ్యోఽస్తి పరం ప్రత్యక్ నవవేద పరం పరమ్,
తద్విజ్ఞానాత్ భవేత్తుర్యా ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౧

నవాభాసా నవజ్ఞత్వాత్ నవోపాధీన్నవాత్మనా,
మిథ్యా జ్ఞాత్వాఽవశిష్టే తు మానం వేదాన డిణ్డిమః. ౮౨

పరమే బ్రహ్మణి స్వస్మిన్ ప్రవిలాప్యాఖిలం జగత్,
గాయన్నద్వైతమాత్మానం ఆస్తే వేదాన్త డిణ్డిమః. ౮౩

(పదిమందిని లెక్కపెట్టుటలో) తన్ను పదవవానిగ తెలిసికొనిన పురుషునకు మిగిలిన తొమ్మిదిగురిని ఎరిగిన సుఖము లభించునట్లు, 'నేనే బ్రహ్మమను' అని ఎరిగిన జీవునకుగూడ నిరతిశయసుఖము లభించుచున్నది. అని వేదాంతభేరి.

(జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, అంతఃకరణ చతుష్టయము, పంచప్రాణములు, పంచభూతములు, అవిద్య, కామము,కర్మము: అనబడు పుర్యష్టకమును చిదాభాసుడును కలిసి తొమ్మిది) ఈ తొమ్మిదిటికిని అతీతముగనుండి, తొమ్మిదిటిని ప్రకాశింపజేయుచుండిన ప్రత్యక్కును తెలిసికొనుట వలననే తురీయమనబడు ముక్తి: అని వేదాంతభేరి. ౮౧

తొమ్మిది ఉపాధులును, తొమ్మిది దృశ్యములగుచు తొమ్మిది ఆత్మల వలె తోచుచున్నవి. ఇది భ్రాంతి, అని ఈ తొమ్మిదిటి తత్త్వమును ఎరిగిన, మిగులునది మానమే: అని వేదాంతభేరి. ౮౨

(జ్ఞాని) పరబ్రహ్మరూపుగు తనయందు ఈ జగత్తు నంతటిని లీన మొనర్చుకొని, అద్వైతాత్మగాన మొనర్చుచు సుఖముగ నుండును: అని వేదాంతభేరి.

ప్రతిలోమానులోమాభ్యాం విశ్వారోపాపవాదయోః,
చిన్తనే శిష్యతే తత్త్వం ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౪
నామరూపాభిమానస్స్యాత్ సంసారః సర్వదేహినామ్,
సచ్చిదానన్ద దృష్టిస్స్యాత్ ముక్తిర్వేదాన్త డిణ్డిమః. ౮౫
సచ్చిదానన్దసత్యత్వే మిథ్యాత్వే నామరూపయోః,
విజ్ఞాతే కిమిదం జ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౬
సాలమ్బనం నిరాలమ్బం సర్వాలమ్బావలమ్బితమ్,
ఆలమ్బనాఖిలాలమ్బం ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౭
న కుర్యాత్ న విజానీయాత్ సర్వం బ్రహ్మేత్యనుస్మరన్,
యథా సుఖం తథా తిష్ఠేత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౮౮

అనులోమ, విలోమములగు అధ్యారోప, అపవాదములను చింతింపగ మిగులునది పరతత్త్వమే: అని వేదాంతభేరి. (పరమాత్మనుండి పంచభూతాత్మక సృష్టి _ అని భావించుట అనులోమము; వచ్చినక్రమము ననుసరించి మరల వెనకకు అందే లీనమగును_ అని భావించుట విలోమము. ఏరీతిగ చూచినను శేషించునది పరమాత్మయే.) ౮౪

శరీరధారులకు నామరూపాభిమానమే సంసారబంధ మగుచున్నది; సచ్చిదానందాత్మాభిమానమే ముక్తి: అని వేదాంతభేరి. ౮౫

నామరూపముల మిథ్యాత్వమును, సచ్చిదానందసత్యత్వమును గ్రహించిన, ఇక ఎఱుగవలసిన దేముండును? అని వేదాంతభేరి. ౮౬

నిరాలంబతత్త్వమగు పరబ్రహ్మమే సర్వదృశ్యములకును ఆశ్రయమై, తానే సర్వమగుచు, సర్వాధారమగుచున్నది. (కాకుండిన లోకమున శూన్యబోధయొక్కటియే గోచరింపవలసియుండును.) అని వేదాంతభేరి. ౮౭

అన్యమగుదాని నెద్దానిని యొనర్పక, చింతింపక; కేవలము 'బ్రహ్మమే ఈసర్వమును' అని ధ్యానించుచు తనకు సరిపడినచోట నివసింపనగును: అని వేదాంతభేరి. ౮౮

స్వకర్మపాశవశగః ప్రాజ్ఞోఽన్యో వా జనో ధ్రువమ్,
ప్రాజ్ఞస్సుఖం నయేత్కాలం ఇతి వేదాన్త డిణ్డిమః. ౫౯

న విద్వాన్ సంతపేచ్చిత్తం కరణాఽకరణో ధ్రువమ్,
సర్వమాత్మేతి విజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౦

నైవాభాసం స్పృశేత్కర్మ మిథ్యోపాధిమపి స్వయమ్,
కుతోఽధిష్ఠానమత్యచ్ఛం ఇతి వేదాన్త డిణ్డిమః. ౬౧

అహాహాస్మాకమలం మోహైః ఆత్మా బ్రహ్మేతి నిర్భయమ్,
శ్రుతిభేరీరవోఽద్యాపి శ్రూయతే శ్రుతిరంజనః. ౬౨

జ్ఞానియును, అజ్ఞానియును ప్రారబ్ధమునకు లోబడియే యున్నారు; ఐనను జ్ఞాని సుఖచిత్తముతో ప్రారబ్ధకాలమును గడుపును. (అజ్ఞాని అశాంతితో విలవిల తన్నుకొనును.) అని వేదాంతభేరి. ౫౯

లౌకికదృష్టికి గోచరించు కర్తవ్యాకర్తవ్యములు అధ్రువములగుటవలనను, సర్వమును ఆత్మయేయని గ్రహించుటవలనను, జ్ఞానిపురుషుడు దేనివలనను దుఃఖమును బొందడు: అని వేదాంతభేరి. ౬౦

(మనఃప్రాణబుద్ధీంద్రియాదులే కర్మనిర్వాహకము లగుటవలన), చిదాభాసుని కర్మము స్పృశింపనేరదు. ఉపాధి మిథ్యయగుటవలన, దానినికూడ ముట్టజాలదు. ఇక అత్యంతనిర్మలమగు ఆత్మను తాకగలదా? అని వేదాంత డిండిమము. (చూ: అధ్యస్తస్య కుతస్సత్త్వం అసతస్తు కుతో జనిః, అజాతస్య కుతో మృత్యుః ప్రారబ్ధమసతః కుతః.) ౬౧

అహహో! ఇక మోహము (అవివేకము) తో నిమిత్తము లేదు. 'ఆత్మయే అభయస్వరూపమగు బ్రహ్మము' అను శ్రుతి (ఉపనిషత్) భేరీరవము నేటికిని వీనులకు విందుగూర్చుచు వినిపించుచునేయున్నది. ౬౨

వేదాన్తభేరీఝఙ్కారః ప్రతివాదిభయఙ్కరః,
శ్రూయతాం బ్రాహ్మణైః శ్రీమద్దక్షిణామూర్త్యనుగ్రహాత్.

ఇతి శ్రీ శఙ్కర భగవత్పూజ్యపాద విరచిత - వేదాన్త డిణ్డిమమ్ ॥౩౫॥

శ్రీమద్దక్షిణామూర్తి అనుగ్రహమును బడసిన ద్విజులు, ప్రతివాదిభయం కరమగు ఈవేదాంతభేరీఝుంకారమును విందురు గాక ! ౯౩

ఇది వేదాంతడిణ్డిమ - ఆంధ్రానువాదము ॥౩౫॥

## ౩౭. సదాచారః

సచ్చిదానన్ద కన్దాయ జగదఙ్కుర హేతవే,
సదోదితాయ పూర్ణాయ నమోఽనన్తాయ విష్ణవే. ౧

సర్వవేదాన్త సిద్ధాన్త గ్రథితం నిర్మలం శివమ్,
సదాచారం ప్రవక్ష్యామి యోగినాం జ్ఞానసిద్ధయే. ౨

ప్రాతః స్మరామి దేవస్య సవితుర్భర్గ ఆత్మనః,
వరేణ్యం తద్ధియో యో నః సచ్చిదానన్దే ప్రచోదయాత్. ౩

అన్వయవ్యతిరేకాభ్యాం జాగ్రత్స్వప్న సుషుప్తిషు,
యదేకం కేవలం జ్ఞానం తదేవాస్మి పరం బృహత్. ౪

జ్ఞానాజ్ఞానవిలాసోఽయం జ్ఞానాజ్ జ్ఞానే చ శామ్యతి,
జ్ఞానాజ్ఞానే పరిత్యజ్య జ్ఞానమేవావ శిష్యతే. ౫

సచ్చిదానందకందుడును, జగత్ - అంకురమునకు గూడ కారణమగు వాడును, అనస్తమితుడై సదా ఉదయించియేయుండువాడును, పూర్ణుడును, అనంతుడును అగు విష్ణుమూర్తికి నమస్కారము. ౧

సర్వోపనిషత్-సిద్ధాంత-సిద్ధమును, నిర్మలమును, శుభమును అగుదానిని, (కర్మ) యోగు లేసదాచారమును అవలంబించి, జ్ఞానసిద్ధిద్వారమున బొందగలరో, దానిని చెప్పుచున్నాను. ౨

స్వయంప్రకాశస్వరూపమును, జగత్ప్రసూతియును, పూజ్యమును అగుచు మా బుద్ధివృత్తులను సచ్చిదానందబ్రహ్మమున ప్రేరేపించు ఆత్మజ్యోతిని ప్రాతఃకాలమున స్మరించుచున్నాను. ౩

అనువృత్తి, వ్యావృత్తిపూర్వకమగు ఏ ఏకమాత్రజ్ఞానము జాగ్రత్స్వప్న సుషుప్తులయందు వెలయుచున్నదో, ఆ కేవలపరబ్రహ్మచైతన్యమే నేను. ౪

జ్ఞానాజ్ఞానవిలాస మెట్టిదనిన: తత్త్వజ్ఞానమువలన విషయజ్ఞానము తొలగిపోవ, జ్ఞానాజ్ఞానములు రెండును పరిత్యజింపబడ, బ్రహ్మ మొక్కటియే మిగులును. ౫

అత్యన్తమలినో దేహో దేహీ చాత్యన్త నిర్మలః,
అసఙ్గోఽహమితి జ్ఞాత్వా శౌచమేతత్ ప్రచక్షతే. ౬
మన్మనో మీనవన్నిత్యం క్రీడత్యానన్ద వారిధౌ,
సుస్నాతస్తేన పూతాత్మా సమ్యగ్ విజ్ఞానవారిణా. ౭
అథాఘమర్షణం కుర్యాత్ ప్రాణాపాననిరోధతః,
మనః పూర్ణే సమాధాయ మగ్నకుమ్భం యథార్ణవే. ౮
లయనిక్షేపయోః సన్ధౌ మనస్తత్ర నిరామిషమ్,
స సన్ధిః సాధితో యేన స ముక్తో నాత్ర సంశయః. ౯
సర్వత్ర ప్రాణినాం దేహే జపో భవతి సర్వదా,
హంసః సోఽహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే. ౧౦

శరీరము అత్యంతమలినము, శరీరియన్ననో అత్యంత - నిర్మలుడు. నేను అసంగుడను - శరీరసంపర్కములేని శరీరధారిని - అని గ్రహించుటయే శౌచము.

నామనస్సు ఆనందసముద్రమున మత్స్యమువలె, క్రీడించుచున్నది. * ఈజ్ఞానవారితో స్నానము ముగిసినది- పవిత్రుడనైతిని- అను భావనయే స్నానక్రియ. ౭

సముద్రమగ్నమగు కుంభమువలె మనస్సును పూర్ణవస్తువున ముంచి, కుంభకప్రాణాయామము నొనర్చుటయే అఘమర్షణము. ౮

ధ్యానసమయమున నిద్రాలయమందుటకును, చలించుటకును మధ్యగనుండు సంధికాలమున మనస్సు నిర్విషయమగును. ఈసంధిస్థానమును సాధించినవాడు ముక్తుడనుట కెట్టిసంశయమును లేదు. ౯

సర్వదా సర్వత్ర జీవుల శరీరమున "హంస"జపము జరుగుచునేయున్నది. ఆ ఈ "సోఽహం"జ్ఞానము లభించిన సర్వబంధనములును విడిపోవును. ౧౦

* ఇది కేవలము ఉపమాలంకారము కాదు. యోగిజనప్రత్యక్షము- అను.

తర్పణం స్వసుఖేనైవ స్వేన్ద్రియాణాం ప్రతర్పణమ్,
మనసా మన ఆలోక్య స్వయమాత్మా ప్రకాశతే. ౧౧

ఆత్మని స్వప్రకాశాగ్నౌ చిత్తమేకాహుతిం క్షిపేత్,
అగ్నిహోత్రీ స విజ్ఞేయ శ్చేతరా నామధారకాః. ౧౨

దేహో దేవాలయః ప్రోక్తో దేహీ దేవో నిరఞ్జనః,
అర్చితః సర్వభావేన స్వానుభూత్యా విరాజతే. ౧౩

మౌనం స్వాధ్యయనం ధ్యానం ధ్యేయబ్రహ్మానుచిన్తనమ్,
జ్ఞానేనేతి తయోః సమ్యఙ్ నిషేధాత్ తత్త్వదర్శనమ్. ౧౪

అతీతానాగతం కిఞ్చిన్న స్మరామి న చిన్తయే,
రాగద్వేషం వినా ప్రాప్తం భుఞ్జామ్యన్నం శుభాశుభమ్. ౧౫

ఆత్మసుఖమువలన ఇంద్రియతృప్తినిగూర్చుటయే తర్పణము. (దీనివలన మనశ్శాంతి లభించును. విషయసుఖమునవలె విషయసంపాదనకు కష్టపడనక్కర లేదు.) మనస్సుతో మనస్సును జూచుచు, ఆత్మ స్వయముగ ప్రకాశించుచునే యున్నది. ౧౧

ఆత్మయే స్వయంప్రకాశమానమగు అగ్ని; దీనియందు చిత్తమను ఒక్క ఆహుతిని అర్పించిన జాలును. ఇట్టి క్రియ నొనర్చువాడే వాస్తవమునకు అగ్నిహోత్రి. మిగిలినవారు పేరుకు మటుకే నామధారులు. ౧౨

శరీరమే దేవాలయము, ఆత్మయే శుద్ధుడగు దేవుడు. ఈయన సర్వభావముల పూజింపబడి నిజానుభూతితో విరాజిల్లుచున్నాడు. ౧౩

మౌనమే స్వాధ్యాయము; ధ్యానము బ్రహ్మచింతనము. ఈరెండిటిని కూడ అతిక్రమించిన తత్త్వదర్శనము. ౧౪

గడచినదానిని స్మరింపను, రాబోవుదానినిగూర్చి చింతింపను. రాగద్వేషములు లేకుండ యథాప్రాప్తములగు శుభాశుభములను అనుభవించుచున్నాను.

హఠాభ్యాసో హి సన్న్యాసో నైవ కాషాయవాససా,
నాహం దేహోఽహమాత్మేతి నిశ్చయో న్యాసలక్షణమ్.
అభయం సర్వభూతానాం దానమాహుర్మనీషిణః,
నిజానన్దే స్పృహా నేచ్ఛా వైరాగ్యస్యావధిర్మతః. ౧౭
వేదాన్తశ్రవణం కుర్యాన్మననం చోపపత్తిభిః,
యోగేనాభ్యసనం నిత్యం తతో దర్శనమాత్మనః. ౧౮
శబ్దశక్తేరచిన్త్యత్వా చ్ఛబ్దాదేవాపరోక్షధీః,
ప్రసుప్తః పురుషో యద్వచ్ఛబ్దేనైవావబుధ్యతే. ౧౯
ఆత్మానాత్మ వివేకేన జ్ఞానం భవతి నిశ్చలమ్,
గురుణా బోధితః శిష్యః శబ్దబ్రహ్మాతివర్తతే. ౨౦

హఠయోగము నభ్యసించుటవలనగాని, కావిగుడ్డలను కట్టుటవలనగాని సన్న్యాసము లభింపదు. 'నేను ఆత్మను' అని నిశ్చయించుకొని, శరీరాభిమానమును త్యజించుటయే సన్న్యాసము. ౧౬

సర్వప్రాణులకును అభయము నొసగుటయే దానము. కేవలము ఆత్మానందస్పృహనే కలిగియుండుట_అన్యవిషయేచ్ఛ కించిత్తైన లేకుండుట_వైరాగ్య పరమావధి. ౧౭

నిత్యము, నిరంతరముగ వేదాంతశ్రవణ మొనర్చుచు, అనుకూలతర్కము నాశ్రయించి మనన మొనర్చుచు, యోగము నాశ్రయించి ధ్యాన మొనర్పనగును. అనంతరము ఆత్మదర్శనము లభింపగలదు. ౧౮

(శ్రవణమననాదులు కేవలము శబ్దోచ్చారణయే కద !_ అని లాఘువపరచ కూడదు.) శబ్దశక్తి అచింతనీయము, అద్భుతము. శబ్దమువలననే అపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఉదాహరణ :_ నిద్రితుడు శబ్దశక్తివలననే మేల్కొనుచున్నాడు. ౧౯

ఆత్మానాత్మవివేకమువలన నిశ్చలజ్ఞానము లభించును. గురుబోధితుడగు శిష్యుడు శాస్త్రోక్తమగు బ్రహ్మమును ప్రత్యక్ష మొనర్చుకొనును. ౨౦

న త్వం దేహో నేన్ద్రియాణి న ప్రాణో న మనో న ధీః,
వికారిత్వా ద్వినాశిత్వాద్ దృశ్యత్వాచ్చ ఘటో యథా.

విశుద్ధం కేవలం జ్ఞానం నిర్విశేషం నిరఞ్జనమ్,
యదేకం పరమానన్దం తత్త్వమస్యద్వయం పరమ్. ౨౧

శబ్దస్యాద్యన్తయోః సిద్ధం మనసోఽపి తథైవ చ,
మధ్యే సాక్షితయా నిత్యం తదేవ త్వం భ్రమం జహి. ౨౩

స్థూలవైరాజయోరైక్యం సూక్ష్మహైరణ్యగర్భయోః,
అజ్ఞానమాయయోరైక్యం ప్రత్యగ్విజ్ఞానపూర్ణయోః. ౨౪

చిన్మాత్రైకరసే విష్ణౌ బ్రహ్మాత్మైక్యస్వరూపకే,
భ్రమేణైవ జగజ్జాతం రజ్జ్వాం సర్పభ్రమో యథా. ౨౫

దృశ్యమగు ఘటము నీవు కానట్లు, ఈశరీరముకూడ దృశ్యమగుటవలన, నీవు శరీరమవు కాదు. అట్లే ప్రాణేంద్రియములుకూడ నీవు కాదు. ఈమూడును దృశ్యములగుటయేకాక, వికారవినాశశీలములై యున్నవి. ఆత్మస్వరూపుడవగు నీకు ఇవి లేవు. ౨౦

విశుద్ధమును, కేవలమును, నిర్విశేషమును, నిరంజనమును, అద్వైతమును, పరమానందస్వరూపమును అగు అద్వయవస్తువే నీవు; నీవే పరతత్త్వమవు. ౨౧

మనస్సునకును, వాక్కునకును ఆద్యంతముల వెలయుచు; మధ్యకూడ సాక్షియై వెలయు నిత్యస్వరూపివే నీవు; శరీరభ్రమను విడువుము. ౨౩

స్థూలశరీరమునకును విరాట్టునకును, సూక్ష్మశరీరమునకును హిరణ్యగర్భునకును, అజ్ఞానమునకును మాయకును, (అనగా కారణశరీరమునకును ఈశ్వరునకును,) ప్రత్యక్కునకును పరాక్కునకునుగల ఐక్యమును గ్రహింపుము. ౨౪

జీవబ్రహ్మైక్యమూర్తియును, చిన్మాత్రస్వరూపుడును అగు విష్ణుని యందు, రజ్జుసర్పభ్రాంతివలె, జగద్భ్రమ కలుగుచున్నది. ౨౫

తార్కికాస్తు జీవేశౌ వాచ్యావేతౌ విదుర్బుధాః,
లక్ష్యౌ చ సాంఖ్యయోగాభ్యాం వేదాన్తైరైక్యతా తయోః.
కార్యకారణవాచ్యాంశౌ జీవేశౌ యౌ జహచ్చ తౌ,
అజహచ్చ తయోర్లక్ష్యౌ చిదంశావేక రూపిణౌ. ౨౭
కర్మశాస్త్రే కుతో జ్ఞానం తర్కే నైవాస్తి నిశ్చయః,
సాంఖ్యయోగౌ భిదాపన్నౌ శాబ్దికాః శబ్దతత్పరాః. ౨౮
అన్యే పాషణ్డినః సర్వే జ్ఞానవార్తాసుదుర్లభాః,
ఏకం వేదాన్త విజ్ఞానం స్వానుభూత్యా విరాజతే. ౨౯

తార్కికులు ( న్యాయవైశేషికులు ) "తత్త్వమసి" వాక్యమునకు వాచ్యార్థమగు జీవేశ్వరులనే గ్రహించుచున్నారు. సాంఖ్యులును, యోగులును లక్ష్యార్థమునే గ్రహించి తృప్తి నందుచున్నారు. వేదాంతదర్శన మొక్కటియే ఐక్యమును గ్రహించుచున్నది. ౨౬

కార్యకాగణరూపులగు జీవేశ్వరులిర్వురును వాచ్యార్థము. ఈఉభయాంశములను పరిత్యజించి, ఉభయసామాన్యమగు చిదంశద్వయమును పరిత్యజింపకుండ, ఏకస్వరూపమగు బ్రహ్మమునే "తత్త్వమసి" వాక్యము లక్షించుచున్నది. ౨౭

కర్మశాస్త్రమున (పూర్వమీమాంసయందు) జ్ఞానప్రసక్తియే లేదు. తర్కశాస్త్రమున నిశ్చయమగు నిర్ణయము లేదు. యోగసాంఖ్యములు ద్వైతప్రతిపాదకములు. వైయాకరణులు శబ్దములనుగురించియే మథనపడుచున్నారు. ౨౮

మిగిలిన వారందరును పాషండులు _ వేదశాస్త్రములను పరలోకమును ఒప్పనివారు; వీరికడ జ్ఞానవార్తయే దుర్లభము కద! ఇక ఉపనిషద్ - (వేదాంత) విజ్ఞాన మొక్కటియే ఆత్మానుభూతితో విరాజిల్లుచున్నది. ౨౯

అహం మమేత్యయం బన్ధో మమాహం నేతి ముక్తతా,
బన్ధమోక్షౌ గుణైర్భాతః గుణాః ప్రకృతిసమ్భవాః. 30

జ్ఞానమేకం సదా భాతి సర్వావస్థాసు నిర్మలమ్,
మన్దభాగ్యా న జానన్తి స్వరూపం కేవలం బృహత్. 3౧

సంకల్పసాక్షి యజ్జ్ఞానం సర్వలోకైక జీవనమ్,
తదేవాస్మీతి యో వేద సముక్తో నాత్ర సంశయః. 3౨

ప్రమాతా చ ప్రమాణఞ్చ ప్రమేయం ప్రమితిస్తథా,
యస్య భాసాఽవభాసన్తే మానం జ్ఞానాయ తస్య కిమ్. 33

అర్థాకారా భవేద్వృత్తిః ఫలేనార్థం ప్రకాశతే,
అర్థజ్ఞానం విజానాతి స ఏవార్థః ప్రకాశతే. 3౪

‘నేను _ నాది’ అను భావమే బంధము; ఈ అహమ్మను భావము లేకుండుటయే ముక్తి. ఈ బంధమోక్షములు రెండును (సత్వరజస్తమో) గుణతులవలన ఏర్పడుచున్నవి. మరల ఈ గుణములు ప్రకృతినుండి కలుగుచున్నవి.

సదా, సర్వావస్థలలో నిర్మలజ్ఞాన మొక్కటియే ప్రకాశించు చున్నది. దురదృష్టవంతులు స్వస్వరూపమగు ఈ కేవలబ్రహ్మమును ఎరుగజాలకున్నారు.

సమస్త సంకల్పములకును సాక్షియగుచు, సర్వలోకైక జీవనమగుచు వెలయునదే నేను _ అని గ్రహించినవాడు ముక్తుడే యనుట కెట్టిసంశయమును లేదు.
3౨

ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయములును : ప్రమితియును దేని ప్రకాశము వలన ప్రకాశింపబడు చున్నవో అట్టిదాని జ్ఞానము నిమిత్తము ప్రమాణము నడుగనేల ?
33

అంతఃకరణవృత్తి విషయాకృతినందు ప్రమితి ఫలమగుచున్నది; దీనివలననే విషయప్రకాశనము. ప్రమాత గ్రహించెడు విషయజ్ఞానమేదికలదో, ఆవిషయమే ప్రకాశించుచున్నది.
3౪

వృత్తివ్యాప్యత్వమేవాస్తు ఫలవ్యాప్తిః కథం భవేత్,
స్వప్రకాశస్వరూపత్వాత్ సిద్ధత్వాచ్చ చిదాత్మనః. ౩౫
చిత్తం చైతన్య మాత్రేణ సంయోగాచ్చేతనా భవేత్,
అర్థాదర్థాన్తరే వృత్తిర్గన్తుం చలతి చాన్తరే. ౩౬
నిరాధారా నిర్వికారా యా దశా సోన్మనీ స్మృతా,
చిత్తం చిదితి జానీయాత్ తకారరహితం యదా. ౩౭
తకారో విషయాధ్యాసో జపారాగో యథా మణౌ,
జ్ఞేయవస్తుపరిత్యాగాత్ జ్ఞానం తిష్ఠతి కేవలమ్. ౩౮
త్రిపుటీ క్షీణతామేతి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి,
మనోమాత్రమిదం సర్వం తన్మనో జ్ఞానమాత్రకమ్. ౩౯

ఆత్మకు వృత్తివ్యాప్యత్వ ముండుగాక, కాని, ఫలవ్యాప్తిత్వ మెట్లుండ గలదు? ఏలయన చిదాత్మ స్వప్రకాశ స్వరూపమును సిద్ధవస్తువును అయి యున్నది. ౩౫

చైతన్యసంయోగముననే చిత్తమున చైతన్య మావిర్భవించుచున్నది. చిత్తవృత్తి విషయమునుండి విషయాంతరమునకు పోవునప్పుడుకూడ చైతన్యము దానిని అనుగమించుచు, మధ్యకాలమునగూడ, వెలయుచున్నది. ౩౬

ఈ నిరాధార నిర్వికారదశను ఉన్మని యనికూడ అందురు. చిత్తమే విషయాధ్యాసారహితమైనప్పుడు 'తకార' రహితము అనగా 'చిత్' అగును.

చిత్తముయొక్క చిత్తత్వము - తకారము - విషయాధ్యాసయే; ఇది స్ఫటికమణియందు జపాకుసుమలాలిమ ప్రతిఫలించుటను బోలునదియే కాని. వాస్తవమునకు లేదు. జ్ఞేయవస్తు భ్రాంతిని విడచిన, కేవలము జ్ఞానమేమిగులును.

త్రిపుటీక్షయమైనచో బ్రహ్మనిర్వాణము లభించును. ఈ ద్వైతప్రపంచ మంతయును మనఃకల్పనమే. ఈ మనస్సు (పరిశుద్ధమైనచో) జ్ఞానముననే పర్యవసించును. ౩౯

అజ్ఞానం భ్రమ ఇత్యాహుర్విజ్ఞానం పరమం పదమ్,
అజ్ఞానం చాన్యథాజ్ఞానం మాయామేతాం వదన్తి తే. ౪౦
ఈశ్వరం మాయినం విద్యాన్మాయాతీతం నిరంజనమ్,
సదానన్దే చిదాకాశే మాయా మేఘస్తటిన్మనః. ౪౧
అహన్తా గర్జనం తత్ర ధారాసారా హి వృత్తయః,
మహామోహాన్ధకారేఽస్మిన్ దేవో వర్షతి లీలయా. ౪౨
తస్యా వృష్టేర్విరామాయ ప్రబోధైకసమీరణః,
జ్ఞానం దృగ్దృశ్యయోర్భావం విజ్ఞానం దృశ్యశూన్యతా. ౪౩
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం తజ్జ్ఞానం జ్ఞానముచ్యతే. ౪౪

అజ్ఞానమన భ్రమయే; విజ్ఞానమే పరమపదము. అజ్ఞానమన జ్ఞానాభావము కాదు, అన్యథాజ్ఞానమగు భ్రమయే – ఇదియే మాయ. ౪౦

ఈశ్వరుడే మాయావి, మాయాసంపర్కలేశము లేనిది పరబ్రహ్మము. సదానందస్వరూపమగు చిదాకాశమున మాయ, మేఘమువలె, తోచుచున్నది; మనస్సే విద్యుల్లత. ౪౧

అహంకారమే మేఘగర్జనకాగా, చిత్తవృత్తులను ధారాపాతము (తెంపు లేనివాన) పడుచున్నది. ఇట్టి మహామోహాంధకారమున ఈశ్వరుడు లీలావిలాసముగ వర్షమును గురిపించుచున్నాడు. ౪౨

ఈవర్షమును ప్రబోధమను వాయువు నిలుపగలదు. ప్రబోధము జ్ఞానమనియు, విజ్ఞానమనియు రెండు విధములు. జ్ఞానమన: దృగ్దృశ్యభేదమును గ్రహించుట; విజ్ఞానమన: దృశ్యము మరుగుపడి, తెలివియొక్కటియే మిగులుపడి యుండుట. ౪౩

ఏకమును, అద్వితీయమును అగు బ్రహ్మవస్తువుగాక, నానావిధమగున దేదియును లేదు. (అని శ్రుతి) క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమే జ్ఞానము (అని స్మృతి).

విజ్ఞానం చోభయోరైక్యం క్షేత్రజ్ఞపరమాత్మనోః,
పరోక్షం శాస్త్రజం జ్ఞానం విజ్ఞానం చాత్మదర్శనమ్. ౪౫

ఆత్మనో బ్రహ్మణః సమ్యగుపాధిద్వయవర్జితమ్,
త్వమర్థవిషయం జ్ఞానం విజ్ఞానం తత్పదాశ్రయమ్. ౪౬

పదయోరైక్యబోధస్తు జ్ఞానవిజ్ఞానసంజ్ఞితమ్,
ఆత్మానాత్మవివేకస్య జ్ఞానమాహుర్మనీషిణః. ౪౭

అజ్ఞానం చాన్యథా లోకే విజ్ఞానం తన్మయం జగత్,
అన్వయవ్యతిరేకాభ్యాం సర్వత్రైకం ప్రపశ్యతి. ౪౮

యత్ తత్ వృత్తిజం జ్ఞానం విజ్ఞానం జ్ఞానమాత్రకమ్,
అజ్ఞానధ్వంసకం జ్ఞానం విజ్ఞానం చోభయాత్మకమ్. ౪౯

క్షేత్రజ్ఞపరమాత్మల ఐక్యజ్ఞానమే విజ్ఞానము; శాస్త్రజ్ఞానము పరోక్షజ్ఞానము. ఆత్మదర్శనమగు విజ్ఞానమన్ననో, అపరోక్షజ్ఞానము. ౪౫

ఆత్మయును, బ్రహ్మమును ఉపాధులనుండి విడివడినప్పుడు; త్వం- పదార్థము జ్ఞానవిషయమును, తత్ - పదార్థము విజ్ఞాన-విషయమును అగును. ౪౬

తత్-త్వం పదముల ఐక్యబోధయే జ్ఞాన-విజ్ఞానము. ఆత్మానాత్మవివేకజ్ఞానమే జ్ఞానము. ౪౭

అన్యవిధమగునదియే లోకమున అజ్ఞానముగ పరిగణింపబడుచున్నది. విజ్ఞానము లభించిన జగత్తు బ్రహ్మమయమగును. అన్వయ - వ్యతిరేకములవలన సర్వత్ర లభించునది ఏకాత్మదర్శనమే. ౪౮

అంతఃకరణ-వృత్తివలన లభించునది జ్ఞానమగుచో, వృత్తిరహితమును శుద్ధమును అగునది విజ్ఞానము. జ్ఞానము అజ్ఞాననివర్తకమగుచో, విజ్ఞానము ఈ రెంటినిగూడ బోగొట్టుచున్నది! (లేక: అజ్ఞాననివర్తకమును, బ్రహ్మస్వరూపమునుగూడ అగుచున్నది.) ౪౯

జ్ఞానవిజ్ఞాననిష్ఠోఽయం తత్ సద్ బ్రహ్మణి చార్పణమ్,
భోక్తా సత్త్వగుణః శుద్ధో భోగానాం సాధనం రజః. ౫౦
భోగ్యం తమోగుణః ప్రాహురాత్మా చైషాం ప్రకాశకః,
బ్రహ్మాధ్యయనసంయుక్తో బ్రహ్మచర్యరతః సదా. ౫౧
సర్వం బ్రహ్మేతి యో వేద బ్రహ్మచారీ స ఉచ్యతే,
గృహస్థః గుణమధ్యస్థః శరీరం గృహముచ్యతే. ౫౨
గుణాః కుర్వన్తి కర్మాణి నాహం కర్తేతి బుద్ధిమాన్,
కిముగ్రైశ్చ తపోభిశ్చ యస్య జ్ఞానమయం తపః. ౫౩
హర్షామర్షవినిర్ముక్తో వానప్రస్థః స ఉచ్యతే,
స యతిర్యో గృహాతీతః శరీరం గృహముచ్యతే. ౫౪

సత్ స్వరూపబ్రహ్మార్పణమే జ్ఞాన విజ్ఞాన నిష్ఠ. (మిగిలిన దంతయును భోగము) భోక్త శుద్ధమగు సత్త్వగుణము; భోగసాధనము రజోగుణము. ౫౦

భోగ్యము తమోగుణము; ఆత్మ ఈమూడిటిని ప్రకాశింపజేయుచున్నది. (ఇక ఆశ్రమవిషయ మెట్టిదనః) వేదాధ్యయనరతుడై, వీర్యధారణావ్రతము నవలంబించి, సర్వమును బ్రహ్మముగ గ్రహించినవాడు బ్రహ్మచారి. శరీరము గుణమయమగు గృహము; ఇందు నివసించువాడు గృహస్థు. ౫౧_౫౨

గుణములే కర్మముల నొనర్చుచున్నవి, నేను కర్తను గాను - అని భావించువాడే బుద్ధిమంతుడు. ఈవిధమగు జ్ఞానమయతపస్సు నొనర్చువానికి, (కాయక్లేశాదిరూపమగు) ఉగ్రతపములతో బనియేమి? ౫౩

హర్షామర్షరహితుడే వానప్రస్థుడు. శరీరరూపమగు గృహము నతిక్రమించినవాడే యతి. ౫౪

సదాచారమిమం నిత్యం యోఽనుసన్ధత్తే జనః,
సంసారసాగరాచ్ఛీఘ్రం స ముక్తో నాత్రసంశయః. ౫౫

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత-సదాచారానుసన్ధానప్రకరణమ్॥౩౭

ప్రతిదినము ఈసదాచారము ననుసంధానించువాడు, శీఘ్రమే సంసార సాగరమునుండి ముక్తుడగును. సంశయ మక్కరలేదు. ౫౫

ఇది పదాచారానుసంధాన ప్రకరణ - ఆంధ్రానువాదము ॥౩౭॥

# ౩౭. సాధనపఞ్చకమ్

## (ఉపదేశపఞ్చకమ్)

### పఞ్చరత్నమాలికా

వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతామపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్,
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసన్ధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్ తూర్ణం వినిర్గమ్యతామ్.
సఙ్గః సత్సు విధీయతాం భగవతో భక్తిర్దృఢాధీయతాం
శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాశు సన్త్యజ్యతామ్,
సద్విద్వానుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకా సేవ్యతాం
బ్రహ్మైకాక్షరమర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్.

ప్రతిదినము వేదాధ్యయన మొనర్పుము; అందు చెప్పబడిన కర్మములను చక్కగ ఆచరింపుము. ఈ కర్మాచరణమే ఈశ్వరపూజయగును గాక! కామ్య కర్మములను త్యజింపుము. పాపములను బోగొట్టుకొనుము. సంసార - సుఖమునగల [ అనిత్యత్వాది ] దోషములను అను సంధానింపుము. ఆత్మ - జ్ఞానేచ్ఛను పెంపొందించుకొనుము. శీఘ్రమే గృహమునుండి వెలువడుము. ౧

సజ్జనులతో కలసి మెలసి యుండుము. భగవంతునియందు దృఢభక్తిని గలిగి యుండుము. శాంత్యాదిగుణములను ఉపార్జింపుము. కామ్యకర్మములను వర్జింపుము. సద్ - విద్వాంసులను ఉపాసింపుము. వారి పాదుకలను ప్రతిదినము సేవింపుము. బ్రహ్మప్రాప్తికి తోడ్పడు ఏకాక్షరబ్రహ్మమంత్రమగు ఓంకారమంత్రమును అర్థింపుము. శ్రుతిశిరస్సులగు ఉపనిషత్తుల వాక్యములను వినుము. ౨

వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరఃపక్షః సమాశ్రీయతాం
దుస్తర్కాత్ సువిరమ్యతాం శ్రుతిమతస్తర్కోఽనుసన్ధీయతామ్,
బ్రహ్మాస్మీతి విభావ్యతామహరహర్గర్వః పరిత్యజ్యతాం
దేహేఽహం మతిరుజ్ఝ్యతాం బుధజనైర్వాదః
పరిత్యజ్యతామ్. ౩

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం న తు యాచ్యతాం విధివశాత్ ప్రాప్తేన సంతుష్యతామ్,
శీతోష్ణాది విషహ్యతాం న తు వృథా వాక్యం సముచ్చార్యతాం
ఔదాసీన్యమభీప్స్యతాం జనకృపానైష్ఠుర్యముత్సృజ్యతామ్. ౪

ఏకాన్తే సుఖమాస్యతాం పరతరే చేతః సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతామ్,

తత్త్వమస్యాది - వాక్యముల అర్థమును విచారింపుము. వేదాంతపక్షమును ఆశ్రయింపుము. కుతర్కమును వీడుము, శ్రుతిసమ్మతమగు తర్కమును గ్రహింపుము. 'నేను బ్రహ్మమను' అని ప్రతిదినము భావింపుము. గర్వాహంకారములను వీడుము. శరీరమున అహంబుద్ధిని పరిత్యజింపుము. పెద్దలతో వాదులాడకుము. ౩

ఆకలిదప్పులను వ్యాధికి చికిత్సయొనర్పుము; భిక్షాన్నమను ఔషధమును సేవింపుము. రుచికరములగు భోజనపదార్థములను యాచింపక, విధివశమున లభించినదానితో తృప్తిని బొందుము. శీతోష్ణాది ద్వంద్వములను తితిక్షాబుద్ధితో సహింపుము. వ్యర్థముగ వాక్యోచ్చారణ మొనర్పకుము. ఔదాసీన్యమును వహింపుము. లోకులయెడ నిష్ఠురుడవు కాడగదు. ౪

ఏకాంతప్రదేశమున సుఖముగ గూరుచుండుము. పరబ్రహ్మమున చిత్తమును సమాధాన మొనర్పుము. ఈజగత్తును పూర్ణబ్రహ్మముగ జూచుచు, అ

ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలాన్నాప్యుత్తరైః శ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహ భుజ్యతామథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్. ౫

యః శ్లోకపఞ్చకమిదం పఠతే మనుష్యః
సఞ్చిన్తయత్యనుదినం స్థిరతాముపేత్య,
తస్యాశు సంసృతిదవానలతీవ్రఘోర
తాపః ప్రశాన్తిముపయాతి చితి ప్రసాదాత్. ౬

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచితం - సాధనపఞ్చకమ్ ॥౩౭॥

విలీనమైనట్లు పరిగణింపుము. పూర్వకర్మములను క్షయమొనర్పుము. జ్ఞానము నాశ్రయించి రాబోవు కర్మములయం దాసక్తుడవు కాకుండుము. ప్రారబ్ధ భోగము ననుభవించుచు, బ్రహ్మమున నెలకొనియుండుము. ౫

ఏ మానవుడు అనుదినము ఈ శ్లోకపంచకమును పఠించుచు, స్థిరచిత్తముతో భావార్థమును చింతించుచుండునో, అతడు శీఘ్రముగనే సంసృతి - తీవ్ర దావానల-తీవ్ర - ఘోర - తాపమును, చైతన్యస్వరూపుడగు ఈశ్వరుని ప్రసాదమున, బోగొట్టుకొనును. ౬

ఇది సాధనపంచక - ఆంధ్రానువాదము ॥౩౭॥

# ౩౮. సారతత్త్వోపదేశః

గురుర్బ్రహ్మస్వయం సాక్షాత్ సేవ్యో వన్ద్యో ముముక్షుభిః,
నోద్వేజనీయ ఏవాయం కృతజ్ఞేన వివేకినా. ౧

యావదాయుస్త్రయో వన్ద్యో వేదాన్తో గురురీశ్వరః,
మనసా కర్మణా వాచా శ్రుతేరేవైష నిశ్చయః. ౨

భావాద్వైతం సదా కుర్యాత్ క్రియాఽద్వైతం న కర్హిచిత్
అద్వైతం త్రిషు లోకేషు నాఽద్వైతం గురుణా సహ. ౩

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచితః - సారతత్త్వోపదేశః ॥౩౮॥

గురువు సాక్షాత్తుగ బ్రహ్మస్వరూపుడు; ముముక్షువులకు సేవనీయుడు, వందనీయుడు. వివేకియును, కృతజ్ఞుడును అగు శిష్యుడు గురువునకెన్నడును కష్టమును కలిగించకూడదు. ౧

బ్రతికియున్నంతకాలము మనోవాక్కాయపూర్వముగ వేదాంతములు, అనగా ఉపనిషత్తులకును, గురువునకును, ఈశ్వరునకును వందన మొనర్పదగును - శ్రుతియే ఇట్లు నిశ్చయమొనర్చి ఉపదేశించుచున్నది. ౨

అద్వైతము భావమున నెలకొని యుండును గాక, కాని ఎన్నడును క్రియలో అద్వైతబుద్ధిని జూపకూడదు. ముల్లోకముల అద్వైతబుద్ధిని ప్రదర్శింపవచ్చును గాని, ఎన్నడును గురునిపట్ల చూపకూడదు. (అనగా ఎంతటివానికైనను గురువు వందనీయుడే!) ౩

ఇది సారతత్త్వోపదేశ - ఆంధ్రానువాదము ॥౩౮॥

# ౩౬. స్వాత్మప్రకాశికా

జగత్కారణమజ్ఞానమేకమేవ చిదన్వితమ్,
ఏక ఏవ మనస్సాక్షీ జానాత్యేవం జగత్త్రయమ్. ౧

వివేకయుక్తబుద్ధ్యాహం జానామ్యాత్మానమద్వయమ్,
తథాపి బన్ధమోక్షాదిర్వ్యవహారః ప్రతీయతే. ౨

నివర్త్తోఽపి ప్రపఞ్చో మే సత్యవద్భాతి సర్వదా,
ఇతి సంశయపాశేన బద్ధోఽహం ఛిన్ధి సంశయమ్. ౩

ఏవం శిష్యవచః శ్రుత్వా గురురాహాత్మగం స్ఫుటమ్,
నాజ్ఞానం నచ బుద్ధిశ్చ న జగన్న చ సాక్షితా. ౪

బన్ధమోక్షాదయః సర్వే కృతాః సత్యేఽద్వయే త్వయి,
భాతీత్యుక్తే జగత్సర్వం సద్రూపం బ్రహ్మ తద్భవేత్. ౫

బ్రహ్మాశ్రితమగు అజ్ఞానమే జగత్కారణము. మనస్సాక్షియగు ఆత్మ యొక్కటియే లోకత్రయమును ఎరుగుచున్నది. ౧

వివేకముతో గూడిన బుద్ధివలన నేను అద్వయమగు ఆత్మను ఎరుగుచున్నాను; అయినను బంధమోక్షాదికమగు వ్యవహారములు తోచుచునే యున్నవి. ౨

"ఈ ప్రపంచము బ్రహ్మనివర్తమైనను నాకు సర్వకాలముల సత్యముగనే తోపట్టుచున్నది.– ఇట్టి సందిగ్ధస్థితిలో బడిన నాచిక్కును, గురువర్యా! విడదీయుము." ౩

ఈశిష్యవాక్యములను విని, గురువు స్ఫుటముగ ప్రత్యుత్తర మొసగును: అజ్ఞానము, బుద్ధి, జగత్తు, సాక్షి– అనునవేమియును లేవు. ౪

సత్యస్వరూపుడవును, అద్వితీయుడవును అయిన నీయందు బంధమోక్షములు కల్పితము లైనవి; జగత్తు అంతయును నీయందే ప్రకాశించుచున్నది– అని నుడివిన: సద్రూపమగు బ్రహ్మ మొక్కటియే కలదని చెప్పినట్లగును. ౫

సర్పాదౌ రజ్జుసత్తైవ బ్రహ్మసత్తైవ కేవలమ్,
ప్రపఞ్చాధారరూపేణ వర్తతే సజ్జగన్న హి. ౬

యథేక్షుమభిసంవ్యాప్య శర్కరా వర్తతే తథా,
ఆశ్చర్యబ్రహ్మరూపేణ త్వం వ్యాప్తోసి జగత్త్రయమ్. ౭

మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్,
జగత్త్రయమిదం సర్వం చిన్మాత్రం సువిచారతః. ౮

బ్రహ్మాదిస్తమ్బపర్యన్తాః ప్రాణినస్త్వయి కల్పితాః,
బుద్బుదాదితరఙ్గాన్తా వికారాః సాగరే యథా. ౯

తరఙ్గత్వం ధ్రువం సిన్ధుర్న వాఞ్ఛతి యథా తథా,
విషయానన్దవాఞ్ఛా తే మహానన్దస్వరూపతః. ౧౦

రజ్జుసర్పమున రజ్జుసత్తయే యుండునట్లు, బ్రహ్మసత్తయే జగదాధారముగా వెలయుచున్నది. (సర్పము లేనట్లుగా) సత్యమగు జగత్తు లేదు. ౬

చెరకుగడనంతటిని అలముకొని పంచదార యుండునట్లుగానే, ఆశ్చర్య బ్రహ్మరూపమున నీవే ముల్లోకముల వ్యాపించియుంటివి ౭

ఎడారియందు కనిపించు నీరంతయును ఎడారియే యైనట్లు, చక్కగ విచారించిన జగత్త్రయము చిన్మాత్రమేయని తేలును. ౮

బుద్బుదతరంగాది - వికారములన్నియును సముద్రమున కల్పితములైనట్లు, (చతుర్ముఖ-) బ్రహ్మనుండి చీమదుబ్బవరకుగల సమస్తమును బ్రహ్మస్వరూపుడవగు నీయందు కల్పితములైనవి. ౯

సముద్రము తరంగముగ మారగోరనట్లు, మహానందస్వరూపుడవగు నీకును విషయానందవాంఛ కలుగనేరదు. ౧౦

పిష్టం వ్యాప్య గుడం యద్వన్మాధుర్యం న హి వాఞ్ఛతి,
పూర్ణానన్దో జగద్వ్యాప్య తదానన్దం న వాఞ్ఛతి. ౧౧

దారిద్ర్యాశా యథా నాస్తి సమ్పన్నస్య యథా తవ,
బ్రహ్మానన్ద నిమగ్నస్య విషయాశా న సమ్భవేత్. ౧౨

విషం దృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్,
ఆత్మానమపి దృష్ట్వా త్వం త్యజానాత్మానమాదరాత్. ౧౩

ఘటావభాసకో భానుర్ఘటనాశే న నశ్యతి,
దేహావభాసకః సాక్షీ దేహనాశే న నశ్యతి. ౧౪

నిరాకారం జగత్ సర్వం నిర్మలం సచ్చిదాత్మకమ్,
ద్వైతభావాత్ కథం కస్మాద్ భయం పూర్ణస్య మే వద. ౧౫

పిష్టకమును (రొట్టెముక్కను)అలముకొనియుండు బెల్లము, మాధుర్యమే స్వభావముగాగలది యగుటవలన, మాధుర్యమును వాంఛింపనట్లు; పూర్ణానంద స్వరూపమగు పరమాత్మ ఈజగత్తును వ్యాపించియుండి, ఆ ఆనందమును అభిలషింపదు. ౧౧

ధనికునకు దారిద్ర్యమున కోర్కెగలుగనట్లు, బ్రహ్మానందనిమగ్నుడవగు నీకును విషయాశ కలుగనేరదు. ౧౨

బుద్ధిమంతుడగువాడు విషామృతములను జూచి విషమును త్యజించును. అట్లే నీవును ఆత్మానాత్మలను జూచి, ప్రయత్నముతో (విషసదృశమగు) అనాత్మను త్యజింపుము. ౧౩

ఘటమును ప్రకాశింపజేయుసూర్యుడు ఘటము వినష్టమైనను తాను నశింపకుండునట్లు, శరీరమును ప్రకాశింపజేయు సాక్షిస్వరూపుడు శరీరము వినష్టమైనను నశింపడు. ౧౪

జగత్తంతయును నిరాకార - నిర్మల - సచ్చిత్స్వరూపమే! అట్టి పూర్ణ స్వరూపుడనగు నాకు ద్వైతభావమునుండి భయ మెట్లు కలుగగలదు? (నీవు అభయస్వరూపుడవు.) ౧౫

బ్రహ్మాదికం జగత్ సర్వం త్వయ్యానన్దే ప్రకల్పితమ్,
జగత్ త్వయ్యేవ లీనం తత్ కథం త్వం లీయసే వద. ౧౬

న హి ప్రపఞ్చో న హి భూతజాతం
నచేన్ద్రియం ప్రాణగణో న దేహః,
న బుద్ధిచిత్తం న మనో న కర్తా
బ్రహ్మైవ సత్యం పరమార్థరూపమ్. ౧౭

సర్వం సుఖం విద్ధి సుదుఃఖనాశాత్
సర్వం చ సద్రూపమసత్యనాశాత్,
చిద్రూపమేవ ప్రతిభానయుక్తం
తస్మాదఖణ్డం పరమాత్మరూపమ్. ౧౮

చిదేవ దేహాస్తు చిదేవ లోకా
శ్చిదేవ భూతాని చిదిన్ద్రియాణి,
కర్తా చిదన్తఃకరణం చిదేవ
చిదేవ సత్యం పరమార్థరూపం. ౧౯

ఆబ్రహ్మస్తంబపర్యంతముగల జగత్తంతయును ఆనందస్వరూపుడవగు నీయందే కల్పింపబడి, నీయందే లీనమగుచున్నది; అట్టి నీ వెట్లు లయమంద గలవో చెప్పుము? (నీవు అవినాశివి.) ౧౬

ప్రపంచము, జీవులు, ఇంద్రియములు, పంచప్రాణములు, శరీరము, బుద్ధి, చిత్తము, మనస్సు, కర్తయగు అహంకారము: ఇవి ఏవియును లేవు. పరమార్థసత్యమై బ్రహ్మమొక్కటియే వెలయుచున్నది. ౧౭

ఆత్యంతికదుఃఖనాశనమైన సర్వము సుఖమయమే యగును. అసత్యము నాశనమైన సర్వము సన్మయమే యగును. ప్రాతిభాసికము నాశనమైన సర్వము చిన్మయమే యగును. కనుక సర్వకాలముల, సర్వవిధముల వెలయునది అఖండ మగు పరమాత్మస్వరూపమే యని గ్రహింపుము. దేహము, లోకములు,

న మే బన్ధో న మే ముక్తిర్న మే శాస్త్రం న మే గురుః,
మాయామాత్రవిలాసో హి మాయాతీతోఽహమద్వయః.

రాజ్యం కరోతు విజ్ఞానీ భిక్షామటతు నిర్భయః,
దోషైర్న లిప్యతే శుద్ధః పద్మపత్రమివామ్భసా. ౨౧

పుణ్యాని పాపకర్మాణి స్వప్నగాని న జాగ్రతి,
ఏవం జాగ్రత్పుణ్యపాపకర్మాణి న హి మే ప్రభోః. ౨౨

కాయః కరోతు కర్మాణి వృథా వాగుచ్యతాం బహు,
రాజ్యం ధ్యాయతు వా బుద్ధిః పూర్ణస్య మమ కా క్షతిః.

ప్రాణాశ్చరన్తు తద్ధర్మైః కామైర్వా హన్యతాం మనః,
ఆనన్దామృతపూర్ణస్య మమ దుఃఖం కథం భవేత్. ౨౪

భూతములు, ఇంద్రియములు, కర్త, అంతఃకరణము: ఇవి అన్నియును చైతన్యమే. పరమార్థసత్యమునది బ్రహ్మాత్మైతన్యమే. ౧౮-౧౯

నాకు బంధమోక్షములు లేవు. శాస్త్రము లేదు. గురువు లేడు. అయీ కల్పన లన్నియును మాయావిలాసములే. నేనన్ననో : మాయాతీతుడనగు అద్వయుడను. ౨౦

విజ్ఞాని రాజ్యమే ఏలును గాక, లేక బిచ్చమెత్తును గాక! అభయస్థితిని పొందిన ఈశుద్ధస్వరూపుడు, తామరాకు నీటిని అంటనట్లు, దోషముల వలన లిప్తుడు కాడు. ౨౧

స్వప్నమునందలి పాపపుణ్యములు జాగ్రద్దశలో ఉండనట్లు, జాగ్రద్దశయందలి పాపపుణ్యములు ప్రభుడనగు నాకు లేవు. ౨౨

శరీరము కర్మములనే ఆచరించును గాక, వాక్కు వ్యర్థప్రలాపమే యొనర్చును గాక, బుద్ధి రాజ్యవిషయములనే చింతించును గాక! పూర్ణుడనగు నాకు హాని ఏమి? ౨౩

ప్రాణపంచకము స్వస్వకర్మనిర్వహణ మొనర్చును గాక, మనస్సు వాంఛాప్రపీడితమగు గాక! ఆనందామృతపూర్ణుడనగు నాకు దుఃఖమెట్లు కలుగగలదు? ౨౪

ఆనన్దామ్బుధిమగ్నోఽసౌ దేహీ తత్ర నదృశ్యతే,
లవణం జలమధ్యస్థం యథా తత్ర లయం గతమ్. ౨౫

ఇన్ద్రియాణి మనః ప్రాణా అహఙ్కారః పరస్పరమ్,
జాడ్యసఙ్గతిముత్సృజ్య మగ్నా మయి చిదర్ణవే. ౨౬

ఆత్మానమఞ్జసా వేద్మి త్వజ్ఞానం ప్రపలాయితమ్,
కర్తృత్వమద్య మే నష్టం కర్తవ్యం వాపి న క్వచిత్. ౨౭

చిదమృతసుఖరాశౌ చిత్తఫేనం విలీనం
క్షయమధిగత ఏవ వృత్తిచఞ్చత్తరఙ్గః,
స్థిమితసుఖసముద్రో నిర్విచేష్టః సుపూర్ణః
కథమిహ మమ దుఃఖం సర్వదైకోఽహమస్మి. ౨౮

నీటిలోపడినఉప్పు కరిగిపోయి కనిపించనట్లు, ఆనందసాగరమగ్నుడగు జీవుడు, అందు లీనమై వేరుగ తోచడు. ౨౫

ఇంద్రియములు, మనస్సు, ప్రాణములు, అహంకారము: ఇవి జడత్వమును వదలి చిత్సముద్రుడనగు నాయందు నిమగ్నములైనవి. ౨౬

నేను ఆత్మను సాక్షాత్తుగ గ్రహించితిని. అజ్ఞానము పలాయన మొనర్చినది. నా కర్తృత్వబుద్ధి వినష్టమైనది. నాకు కర్తృత్వమనునదే లేదు. ౨౭

చిదమృత_సుఖసముద్రమున చిత్త_ఫేనము లీనమై పోయినది. చిత్త-వృత్తులను చంచలతరంగములు క్షీణించినవి అగుటవలన ప్రశాంత_సుఖ_సాగరుడనగు నేను ఎట్టిప్రయత్నము లేకుండగనే పరిపూర్ణత నందితిని. సర్వదా ఏకస్వరూపుడనగు నాకు దుఃఖమెట్లు సంభవింపగలదు? ౨౮

ఆనన్దరూపో౽హ మఖణ్డబోధః
పరాత్ పరో౽హం ఘనచిత్ప్రకాశః,
మేఘా యథా వ్యోమ న చ స్పృశన్తి
సంసారదుఃఖాని న మాం స్పృశన్తి.

అస్థిమాంస పురీషాన్త్ర చర్మలోమసమన్వితః,
అన్నాదః స్థూలదేహః స్యాదతో౽హం శుద్ధచిద్ఘనః,
స్థూలదేహాశ్రితా ఏతే స్థూలాద్భిన్నస్య మే న హి,
లిఙ్గం జడాత్మకం నాహం చిత్స్వరూపో౽హ మద్వయ
క్షుత్పిపాసాన్ధ్య బాధిర్య కామక్రోధాదయో౽ఖిలాః,
లిఙ్గదేహాశ్రితా హ్యేతే నైవాలిఙ్గస్య మే విభోః.

నేను ఆనందరూపుడను, అఖండబోధస్వరూపిని. (చతుర్ముఖు-) కంటె శ్రేష్ఠమగు బ్రహ్మమను. పరాత్పరుడను. చిద్ఘనప్రకాశమను. మే ఆకాశము నంటజాలనట్లు, సంసారదుఃఖములు నన్ను అంటజాలవు.

ఎముకలు, మాంసము, మలము, పేగులు, చర్మము, లోమములు: గూడి అన్నమును భక్షించునదే స్థూలశరీరము. ఇది అశుచి. ఇక నే న శుద్ధ చిద్ఘనస్వరూపుడను; అగుటచే, నేను ఈశరీరమును గాను.

స్థూలదేహము నాశ్రయించుకొని యుండునవియును, పూర్వో లును అగు అస్థిమాంసాది వికారములు శరీరాతీతుడనగు నాకు ఎట్లుండ ఇక సూక్ష్మశరీరమో, జడము. నే నన్నో : చిత్స్వరూపుడను, అద్వ

ఆకలి దప్పులు; గ్రుడ్డితనము, చెవిటితనము; కోర్కె, కోపము మొదలైన వన్నియును లింగదేహమునకు సంబంధించినవి. నేను సర్వవ్యా లింగశరీర రహితుడనై వెలుగొందుచున్నాను. ఆ యీ గుణములు నా కె గలవు ?

అనాద్యజ్ఞానమేవాఽత్ర కారణం దేహ ఉచ్యతే,

నాఽహం కారణదేహోఽస్మి స్వప్రకాశో నిరఞ్జనః. ౩౩

జడత్వప్రియత్వమోదత్వ ధర్మాః కారణదేహగాః,

న సన్తి మమ నిత్యస్య నిర్వికారస్వరూపిణః. ౩౪

జీవాద్ భిన్నః పరేశోఽస్తి పరేశత్వం కుతస్తవ,

ఇత్యజ్ఞ జనసంవాదో విచారః క్రియతేఽధునా. ౩౫

అధిష్ఠానం చిదాభాసో బుద్ధిరేతత్త్రయం యదా,

అజ్ఞానాదేకవద్ భాతి జీవ ఇత్యుచ్యతే తదా. ౩౬

అధిష్ఠానం న జీవః స్యాత్ ప్రత్యేకం నిర్వికారతః,

అవస్తుత్వాచ్చిదాభాసో నాస్తి తస్య న జీవతా. ౩౭

అనాదియగు అజ్ఞానమే కారణశరీర మనబడుచున్నది. నేను స్వయం ప్రకాశజ్ఞానస్వరూపుడను, ఒకించుకయును మకిలి లేనివాడను. అగుచో: నేను కారణశరీర మెట్లగుదును? ౩౩

జడత్వ, ప్రియత్వ, మోదత్వాది ధర్మములు కారణశరీరమునకు గలవు. నిత్యుడను, నిర్వికారుడను అగు నాకు ఆ యీ ధర్మములు లేవు. ౩౪

'జీవునికంటె వేరగు పరమేశ్వరుడు కలడు. నీకు పరమేశ్వరత్వము ఎక్కడిది?' అను అజ్ఞభ్రాంతిని గూర్చి, ఇక విచారింప బడుచున్నది. ౩౫

అధిష్ఠానము, చిదాభాస, బుద్ధి: ఈ మూడును అజ్ఞానమువలన ఒకటిగా తోచినప్పుడు జీవసంజ్ఞ నందుచున్నది. ౩౬

అధిష్ఠానము (కూటస్థుడు) నిర్వికార మగుటవలన జీవుడు కాడు. చిదాభాసుడు (బుద్ధియందలి చిత్ ప్రతిబింబము) అవస్తువు అనగా మిథ్యయగుటవల జీవుడు కాడు. ౩౭

ప్రత్యేకం జీవతా నాస్తి బుద్ధేరపి జడత్వతః,
జీవ ఆభాసకూటస్థ బుద్ధిత్రయమతో భవేత్. ౩౮

మాయాభాసో విశుద్ధాత్మా త్రయమేతన్మహేశ్వరః,
మాయాభాసోఽప్యవస్తుత్వాత్ ప్రత్యేకం నేశ్వరో భవేత్.

పూర్ణత్వాన్నిర్వికారిత్వా ద్విశుద్ధత్వా న్మహేశ్వరః,
జడత్వహేతోర్మాయాయా మీశ్వరత్వం తు దుర్ఘటమ్. ౪౦

తస్మాదేతత్త్రియం మిథ్యా తదర్థో నేశ్వరో భవేత్,
ఇతి జీవేశ్వరాభాతః స్వాజ్ఞానాన్న హి వస్తుతః. ౪౧

ఘటాకాశ - మఠాకాశౌ మహాకాశే ప్రకల్పితౌ,
ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ. ౪౨

మాయా తత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా,
తతః శుద్ధచిదేవాహం వ్యోమవద్వ్యోమ నిరుపాధితః. ౪౩

అధిష్ఠానము, చిదాభాస, బుద్ధి: ఈమూటిలో నేదియును విడిగ జీవుడు కాజాలదు. బుద్ధి జడము. ఈమూడును కలిసినయెడలనే జీవసంజ్ఞ. ౩౮

మాయ, చిదాభాస, శుద్ధాత్మ: ఈమూడును గలిసినయెడల ఈశ్వర సంజ్ఞ. మాయయును, చిదాభాసయును అవాస్తవములగుటవలన ఇవి విడిగ ఈశ్వరసంజ్ఞను బొందజాలవు. ౩౯

పూర్ణుడును, నిర్వికారుడును, విశుద్ధుడును అగుటవలననే మహేశ్వర సంజ్ఞ. జడ మగుటవలన మాయ యెన్నటికిని ఈశ్వరత్వమును బొందజాలదు.

కనుక, ఈమూడును మిథ్యయే. తత్పద - అర్థము ఈశ్వరుడు కాదు. స్వాజ్ఞానమువలననే జీవేశ్వర - భ్రాంతి. వాస్తవమునకు వేరు లేదు. ౪౧

ఘటాకాశ, మఠాకాశములు మహాకాశమున పరికల్పితములైనట్లు, చిదాకాశస్వరూపుడనగు నాయందు జీవేశ్వరులు కల్పింపబడుచున్నారు. ౪౨

సకార్యముగ మాయ విపరిలోపము నందినప్పుడు జీవేశ్వరు లుండరు. చిదాకాశము నిరుపాధిక మగుటవలన, అప్పుడు, శుద్ధచిత్స్వరూపుడనగు నే నొక్కడనే మిగిలియుందును. ౪౩

సత్యచిద్ఘన మనన్త మద్వయం
సర్వదృశ్యరహితం నిరామయమ్,
యత్పదం విమలమద్వయం శివః
తత్ పదాహమితి మౌనమాశ్రయే. ౭౭

పూర్ణ మద్వయ మఖణ్డ చేతనం
విశ్వభేదకలనా వివర్జితమ్,
అద్వితీయపరసంవిదంశకం
తత్పదాహమితి మౌనమాశ్రయే. ౭౮

జన్మ మృత్యు సుఖ దుఃఖ వర్జితం
జాతి నీతి కులగోత్ర దూరగమ్,
చిద్వివర్తజగతోఽస్య కారణం
తత్పదాహమితి మౌనమాశ్రయే. ౭౯

సత్యమును, చిద్ఘనమును, అనంతమును, అద్వయమును, దృశ్యరహిత
మును, నిరామయమును, విమలమును అగు శివపదమే నేను; సర్వకాలముల
ఈనాస్థితిలో మార్పు లేదు. కనుక మౌనమును వహించి యుందును. ౭౭

పూర్ణమును, అద్వితీయమును, అఖండచైతన్యమును, విశ్వభేదకల్పనా
వర్జితమును, అగునదియే సదా నేను; వృత్తిరూపమగు జ్ఞానముకూడ ఈ చైత
న్యాంశమే — ఇట్లు గ్రహించి నేను మౌనమును అవలంబించి యుంటిని. ౭౮

జరామరణములును, సుఖదుఃఖములును, జాతిధర్మములును, కులగోత్రము
లును లేనిది అగుచు, ఏ చైతన్యము వివర్తరూపమున జగత్కారణమగుచున్నదో,
ఆసత్స్వరూపబ్రహ్మమే నేను — ఇట్లు గ్రహించి నేను మౌనమును అవలంబించి
యుంటిని. ౭౯

ఉలూకస్య యథాభానావన్ధకారః ప్రతీయతే,
స్వప్రకాశే పరానన్దే తమో మూఢస్య భాసతే. ౪౭

యథా దృష్టినిరోధాదార్తః సూర్యో నాస్తీతి మన్యతే,
తథా జ్ఞానావృతో దేహీ బ్రహ్మ నాస్తీతి మన్యతే. ౪౮

యథామృతం విషాద్భిన్నం విషదోషైర్న లిప్యతే,
న స్పృశామి జడాద్భిన్నో జడదోషాన్ ప్రకాశయన్. ౪౯

స్వల్పాపి దీపకణికా బహులం నాశయేత్ తమః,
స్వల్పోపి బోధో మహతీమవిద్యాం శమయేత్ తథా. ౫౦

చిద్రూపత్వాన్న మే జాడ్యం సత్యత్వాన్నానృతం మమ,
ఆనన్దత్వాన్న మే దుఃఖమజ్ఞానాద్భాతి హి త్రయమ్. ౫౧

సూర్యునియందు గ్రుడ్లగూబకు చీకటి తోచునట్లు, మూఢులకు స్వయం ప్రకాశస్వరూపమును, పరానందమును అగు బ్రహ్మమున అజ్ఞానము గోచరించుచున్నది. ౪౭

నేత్రరోగపీడితుడు సూర్యుడు లేడని తలచునట్లు, అజ్ఞానావృతుడగు జీవుడుకూడ బ్రహ్మము లేదని ఎంచుచున్నాడు. ౪౮

విషముకంటె వేరగు అమృతము విషదోషములవలన స్పృశింపబడనట్లు, జడదోషములవలన అంటబడకుండ ఉండియే, వానిని ప్రకాశింప జేయుచున్నాను. ౪౯

అల్పమగు దీపపువత్తి ఎంతటిదియో చీకటిని బోగొట్టునట్లు, బోధ అల్పమేయైనను, గొప్పదియగు అవిద్యను తొలగించుచున్నది. ౫౦

చిద్రూపుడనగుటవలన నాకు జడత్వము లేదు. సత్యస్వరూపుడనగుటవలన నాకు అనృతము (వినాశనము) లేదు, ఆనందస్వరూపుడనగుటవలన నాకు దుఃఖము లేదు. ఈజాడ్యాసత్యదుఃఖములు మూడును అజ్ఞానమువలననే తోచుచున్నవి. ౫౧

కాలత్రయే యథా సర్పో రజ్జౌ నాస్తి తథా మయి,
అహఙ్కారాదిదేహాన్తం జగన్నాస్త్యహ మద్వయః. ౫౨
భానౌ తమః ప్రకాశత్వాన్నాఙ్గీకుర్వన్తి సజ్జనాః,
తమస్తత్కార్యసాక్షీత భ్రాన్తబుద్ధిరహో మయి. ౫౩
యథా శీతం జలం వహ్నిసమ్బన్ధా దుష్ణవద్ భవేత్,
బుద్ధి తాదాత్మ్య సమ్బన్ధాత్ కర్తృత్వం వస్తుతో న హి. ౫౪
జలబిన్దుభిరాకాశం న సిక్తం న చ శుష్యతి,
తథా గఙ్గాజలేనాయం న శుద్ధో నిత్యశుద్ధతః. ౫౫
వృక్షోత్పన్న ఫలైర్వృక్షో యథా తృప్తిం న గచ్ఛతి,
మయ్యధ్యస్తాన్నపానాద్యైస్తథా తృప్తిర్నవిద్యతే. ౫౬

త్రాటియందు పాము మూడుకాలములలోను కల్ల; అట్లే అహంకారము మొదల్కొని శరీరమువరకుగల జగత్తు నాయందు ఉండుటయును మిథ్యయే- నాయందు జగత్తు లేదు; నేను అద్వితీయుడను. ౫౨

స్వప్రకాశస్వరూపు డగుటవలన సూర్యునియందు సజ్జనులు తమస్సును అంగీకరింపరు. అజ్ఞానమునకును, దాని కార్యమగు జగత్తునకును సాక్షినగు నాయందు, అహో! అజ్ఞులు, అజ్ఞానమును కల్పించుచున్నారు. ౫౩

స్వభావశీతలమగు జలము అగ్నిసంయోగమున వేడెక్కినట్లు తోచునట్లు అకర్తయగు ఆత్మ బుద్ధితో కలయికవలన కర్తవలె తోచుచున్నది. ౫౪

ఆకాశము నీటి బొట్లవలన తడియుటగాని, మరల ఎండుటగాని లేదు; అట్లే ఈ ఆత్మ గంగాజలమున శుద్ధమగుచుండుట లేదు. అది నిత్యశుద్ధమై యున్నది. ౫౫

చెట్టున పండిన పళ్లవలన చెట్టు తృప్తిని బొందదు. అట్లే నాయందు ఆరోపింపబడిన (క్షుత్ తృష్ణల నిమిత్తము అర్పింపబడిన) అన్నపానాదులవలన నాకు తృప్తి కలుగదు. (నేను నిత్యతృప్తుడను.) ౫౬

స్థాణౌ ప్రకల్పితశ్చోరః స స్థాణుత్వం న బాధతే,
స్వస్మిన్ కల్పితజీవశ్చ స్వం బాధితుం న శక్యతే. ౫౭

అజ్ఞానే బుద్ధివిలయే నిద్రా సా భణ్యతే బుధైః,
విలీనాజ్ఞానతత్కార్యే మయి నిద్రా కథం భవేత్. ౫౮

బుద్ధేః పూర్ణవికాసోఽయం జాగరః పరికీర్త్యతే,
వికారాది విహీనత్వా జ్జాగరో మే న విద్యతే. ౫౯

సూక్ష్మనాడీషు సఞ్చారో బుద్ధేః స్వప్నః ప్రజాయతే,
సఞ్చారధర్మరహితే స్వప్నో నాస్తి యథా మయి. ౬౦

పరిపూర్ణస్య నిత్యస్య శుద్ధస్య జ్యోతిషో మమ,
ఆగన్తుకమలాభావాత్ కిం స్నానేన ప్రయోజనమ్. ౬౧

కల్పితచోరునివలన స్థాణువుయొక్క స్థాణుత్వము బాధింపబడనట్లు, కల్పితజీవత్వమువలన ఆత్మయొక్క ఆత్మత్వమును బాధింపబడజాలదు. ౫౭

అజ్ఞానమున బుద్ధి లీనమగుస్థితినే నిద్రయని పండితు లందురు. అజ్ఞానమును, దాని కార్యముకూడ నా యందు లీన మగుచున్నవి. అట్టి నాకు నిద్ర ఏమి ? ౫౮

బుద్ధియొక్క పూర్ణవికాసమే ఈ జాగ్రదవస్థ. [ వికాస, విలీనాది ] వికారరహితుడ నగుటవలన నా యందు జాగరణముకూడ లేదు. ౫౯

బుద్ధి సూక్ష్మనాడులయందు సంచరించిన స్వప్నము కలుగును. సంచారధర్మరహితుడను [అనగా నిశ్చలుడను] అగు నాకు స్వప్నావస్థకూడలేదు. ౬౦

నేను పరిపూర్ణ - నిత్య - శుద్ధ - ప్రకాశస్వరూపుడను. నాకు తటస్థము కాగల అశుద్ధి ఏదియును లేదు. ఇక నాకు స్నానముతో ప్రయోజనమేమి?

దేశాభావాత్ క్వ గన్తవ్యం స్థానాభావాత్ క్వవా స్థితిః,
పూర్ణే మయి స్థానదేశౌ కల్పితావహా మద్వయః. ౬౨

ప్రాణసఞ్చారసంశోషాత్ పిపాసా జాయతే ఖలు,
శోషణానర్హచిద్రూపే మయ్యేషా జాయతే కథమ్. ౬౩

నాడీషు పీడ్యమానాసు వాయ్వగ్నిభ్యాం భవేత్ క్షుధా,
తయోః పీడనహేతుత్వాత్ సంవిద్రూపే కథం మయి. ౬౪

శరీరస్థితిశైథిల్యాత్ శ్వేతలోమ సమన్వితమ్,
జరా భవతి సా నాస్తి నిరంశే సర్వగే మయి. ౬౫

యోషిత్క్రీడా సుఖానన్దగర్వాఢ్యం యౌవనం కిల,
ఆత్మానన్దే పరే పూర్ణే మయి నాస్తి హి యౌవనమ్. ౬౬

ఒకానొక ప్రదేశమునకు బోయి, అందలి ఒక నిర్దిష్టస్థానమున నే నెట్లుండగలను ? [ నేను దేశ - పరిచ్ఛిన్నుడను కాను. ] పూర్ణుడను, అద్వయుడను అగు నాయందు దేశస్థానములు రెండును కల్పితములైనవి. ౬౨

ప్రాణసంచారమువలన త్రాగిన నీరు శుష్కించిపోగా, దాహము కలుగుచున్నది. నేను శుష్కించుటకు వీలులేని చిద్రూపుడను. ఇక నాకు పిపాస ఎట్లుండగలదు ? ౬౩

వాయువువలనను, అగ్నివలనను నాడులు పీడింపబడ, ఆకలి కలుగును. ఈ పీడాకర హేతువులు చిద్రూపుడనగు నా కెట్లంటును ? [ కనుక నేను క్షుధారహితుడను.] ౬౪

శరీరము శిథిలావస్థనుబొంది వెంట్రుకలు నెరసిన, జర యందురు. అంశరహితుడను, సర్వవ్యాపియునునగు నాకు జర ఎటు కలుగును ? ౬౫

స్త్రీలతో రమింప హృదయము గర్వభరితమగు కాలమే, యౌవనము. పరుడను, ఆత్మానందుడను, పూర్ణుడనుఅగు నాకు ఈయౌవనదశ లేదు. ౬౬

మూఢబుద్ధిపరివ్యాప్తం దుఃఖానామాలయః సదా,
బాల్యం కోపనశీలాప్తం న మే సుఖజలామ్బుధేః. ౬౭

ఏవం తత్త్వవిచారాబ్ధౌ నిమగ్నానాం సదా నృణామ్,
పరమాద్వైత విజ్ఞానమపరోక్షం న సంశయః. ౬౮

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత - స్వాత్మప్రకాశికా. ||౩౭||

మూఢత్వముతో నిండి, దుఃఖనిలయమై, కోపమే పరిణామముగగల బాల్యదశ సుఖసముద్రుడనగు నాకు లేదు. ౬౭

—ఈరీతి సదా తత్త్వవిచార-సముద్రమున నిమగ్నులైయుండు నరులకు, ప్రత్యక్షమగు అద్వైతజ్ఞానము లభింపగలదు; సంశయింప నక్కరలేదు. ౬౮

ఇది స్వాత్మప్రకాశిక - ఆంధ్రానువాదము ||౩౭||

# ౪౦. హస్తామలకమ్

కస్త్వం శిశో! కస్య కుతోఽసి గన్తా
కిం నామ తే త్వం కుత ఆగతోఽసి,
ఏతద్ వద త్వం మమ సుప్రసిద్ధం
మత్ప్రీతయే ప్రీతివివర్ధనోఽసి. * ౧

నాహం మనుష్యో న చ దేవ యక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః,
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షుర్న చాహం నిజబోధరూపః. * ౨

ఓ శిశుస్వరూపా! నీ వెవరవు ? ఎవరి పుత్రుడవు ? ౧

నేను మానవుడను గాను, దేవతను గాను, యక్షుడను గాను. బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రజాతులలో దేనికిని జెందను. నేను బ్రహ్మచారిని గాను, గృహస్థుడను గాను, వానప్రస్థుడను గాను, సన్న్యాసినిగూడ కాను. నేను నిజబోధస్వరూపుడను. ౨

---

* ఒకానొక సిద్ధపురుషుడు, మృతశిశువునుగూర్చి తల్లి విలపించుచుండగా, దానిని మాన్పునిమిత్తము ఆమృతకళేబరమున ప్రవేశించి, పుత్రుడు బ్రతికినాడను ఆనందమును తల్లికి గూర్చెను. కాని జడత్వమును దాల్చియుండెను. ఆపిల్లవానిని భూతగ్రస్తునిగ భావించి శ్రీశంకరులవారియొద్దకు తీసికొనిరాగా, శ్రీవారిట్లు ప్రశ్నించిరి. మిగిలినవి బాలుని ప్రత్యుత్తరము.

* ఈశ్లోకము అధికపాఠము.

నిమిత్తం మనశ్చక్షురాదిప్రవృత్తౌ
నిరస్తాఖిలోపాధి రాకాశకల్పః,
రవిర్లోకచేష్టానిమిత్తం యథా యః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహ మాత్మా. 3

యమగ్న్యుష్ణవన్నిత్య బోధస్వరూపం
మనశ్చక్షురాదీన్యబోధాత్మకాని,
ప్రవర్తన్త ఆశ్రిత్య నిష్కమ్ప మేకం
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహ మాత్మా. ४

ముఖాభాసకో దర్పణే దృశ్యమానో
ముఖత్వాత్ పృథక్త్వేన నైవాస్తి వస్తు,
చిదాభాసకో ధీషు జీవోఽపి తద్వత్
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహ మాత్మా. ౫

ఉపాధిరహితమై, ఆకాశమువలె వెలయుచు; సూర్యుడు లోకయాత్ర నిమిత్తము తోడ్పడునట్లు, మనస్సుయును, నేత్రాది – ఇంద్రియములును స్వకార్యప్రవృత్తములగుటకుగాను నిమిత్తమాత్రముగనుండి తోడ్పడునదియును; నిత్యోపలబ్ధిస్వరూపమును అగు ఏ ఆత్మ కలదో అదియే నేను. 3

అగ్నికి ఉష్ణమువలె నిత్యజ్ఞానమైనది సహజస్వరూపమూ, నిశ్చలమును, అద్వితీయమును అగు దేనిని ఆశ్రయించి జడములగు మనశ్చక్షురాదికములు తమతమ పనులలో తిరుగుచున్నవో, నేను ఆ నిత్యబోధాత్మను. ४

అద్దమున ప్రతిబింబించు ముఖము, వాస్తవమగు ముఖమునుండి వేరుగానట్లు, చిదాభాసుడై తోచుజీవుడుకూడ ఏ నిత్యోపలబ్ధిస్వరూపమగు ఆత్మనుండి వేరుకాదో; ఆ ఆత్మయే నేను. ౫

యథా దర్పణాభావ ఆభాసహానౌ
ముఖం విద్యతే కల్పనాహీన మేకం,
తథా ధీవియోగే నిరాభాసకో యః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహ మాత్మా. ౬

మనశ్చక్షురాదేర్వియుక్తః స్వయం యో
మనశ్చక్షురాదే ర్మనశ్చక్షు రాదిః,
మనశ్చక్షురాదే రగమ్య స్వరూపః
స నిత్యోపలబ్ధి స్వరూపోఽహ మాత్మా. ౭

య ఏకో విభాతి స్వతః శుద్ధచేతాః
ప్రకాశస్వరూపోఽపి నానేవ ధీషు,
శరావోదకస్థో యథా భాను రేకః
స నిత్యోపలబ్ధి స్వరూపోఽహ మాత్మా. ౮

అద్దము లేకుండిన ప్రతిబింబకల్పనలేని ముఖమొక్కటియే వెలయునట్లు, బుద్ధి విలీనతనందిన ద్వయకల్పనయును, దానిని ప్రకాశింపజేయు కార్యమును లేకుండ ఏ అద్వితీయవస్తువు తా నొక్కటియై వెలయుచున్నదో, ఆ నిత్య బోధాత్మయే నేను. ౬

బాహ్యాంతరేంద్రియ - రహితమయ్యు, మనస్సుకు మనస్సయును, నేత్రమునకు నేత్రమును అగుచు, ఆయా ఇంద్రియములకు అగమ్యమగు, ఏ నిత్య బోధాత్మస్వరూపము కలదో, అదియే నేను. ౭

ఏది శుద్ధచైతన్యస్వరూపమై అద్వితీయమై ప్రకాశస్వరూపమై వెలయుచు, విభిన్న జలకలశములలో ఒకే సూర్యుడు ప్రకాశించునట్లు, విభిన్న బుద్ధ్యుపాధులయందు పెక్కులుగా తోచుచుండెడు ఏనిత్యబోధస్వరూపము కలదో, ఆ ఆత్మయే నేను. ౮

యథాఽనేకచక్షుః ప్రకాశో రవిర్న
క్రమేణ ప్రకాశీకరోతి ప్రకాశ్యమ్,
అనేకా ధియో యస్తథైక ప్రబోధః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా. ౯

వివస్వత్ - ప్రభాతం యథా రూపమక్షం
ప్రగృహ్ణాతి నాభాతమేవం వివస్వాన్,
యదాభాత ఆభాసయత్యక్షమేకః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా. ౧౦

యథా సూర్య ఏకోఽప్స్వనేకశ్చలాసు
స్థిరా స్వప్యనన్యద్విభావ్యస్వరూపః,
చలాసు ప్రభిన్నాసు ధీష్వేవమేకః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా. ౧౧

సూర్యుడు బహుజనుల బహునేత్రములను క్రమముగ ఒకదానితరువాత ఒకటిగగాక, ఒకేసమయమున ప్రకాశింపజేయుచున్నట్లు, ఏ నిత్యబోధస్వరూపము తాను ఒక్కటియే అయ్యును, యుగపత్తుగ బహుబుద్ధులను ఉద్భాసిత మొనర్చుచున్నదో ఆ ఆత్మయే నేను. ౯

సూర్యాలోకమున ప్రకాశితమైన వస్తురూపమునే నేత్రేంద్రియము గ్రహించుచున్నదేకాని, తదప్రకాశితమగు వస్తువును గ్రహింప లేదు. అట్టి సూర్యుడుకూడ దేనివలన వెలుగునుపొంది, నేత్రాది-ఇంద్రియములను ప్రకాశింపజేయుచున్నాడో, ఆనిత్యబోధస్వరూపమే నేను. ౧౦

ఆకాశమున తానొక్కడే వెలుగుచుండియును కదలుచుండిన నీళ్లలో గూడను పెక్కులుగాతోచు సూర్యునివలె; చంచలములగు బుద్ధులలో తానొక్కటియే యయ్యును అనేకముగ తోచుచుండెడు ఏనిత్యజ్ఞానస్వరూపము కలదో, ఆ ఆత్మయే నేను. ౧౧

ఘనచ్ఛన్న దృష్టిర్ఘనచ్ఛన్న మర్కం
యథా నిష్ప్రభం మన్యతే చాతిమూఢః,
తథా బద్ధవద్భాతి యో మూఢదృష్టేః
స నిత్యోపలబ్ధి స్వరూపోఽహ మాత్మా. ౧౨

సమస్తేషు వస్తుష్వనుస్యూత మేకం
సమస్తాని వస్తూని యన్న స్పృశన్తి,
వియద్వత్ సదా శుద్ధ మచ్ఛ స్వరూపం
స నిత్యోపలబ్ధి స్వరూపోఽహ మాత్మా. ౧౩

ఉపాధౌ యథా భేదతా సన్మణీనాం
తథా భేదతా బుద్ధిభేదేషు తేఽపి,
యథా చన్ద్రికాణాం జలే చఞ్చలత్వం
తథా చఞ్చలత్వం తవాపీహ విష్ణో. ౧౪

ఇతి శ్రీశఙ్కరభగవత్పూజ్యపాదవిరచిత – హస్తామలకమ్. ॥౩౮॥

అత్యంతమూఢుడు తనదృష్టిని మేఘములు అడ్డుకొనగా, సూర్యుడే మేఘములవలన కప్పబడి కాంతిని పోగొట్టుకొనినాడని తలచురీతిగ, అజ్ఞదృష్టికే బద్ధునివలె భాసించెడు ఏనిత్యోపలబ్ధిస్వరూపమగు ఆత్మ కలదో, అదియే నేను.

సమస్త వస్తువులలోగూడ అనుస్యూతమగుచు, సమస్త వస్తువులవలన స్పృశింపబడక, ఆకాశమువలె శుద్ధనిర్మలస్వరూపమై ఏ నిత్యజ్ఞానస్వరూపాత్మ వెలయుచున్నదో, అదియే నేను. ౧౩

శుద్ధస్ఫటికమణి ఉపాధివశమున వర్ణభేదము దాల్చునట్లు, నీయందే విభిన్నములగు బుద్ధులవలన భేదము కల్పింపబడుచున్నది. విష్ణుస్వరూపా! జల తరంగములలో చంద్రకిరణములు కదలుచుండినట్లు తోచురీతిగ, బుద్ధిచాంచల్యముకూడ నీయందే ప్రకల్పితమగుచున్నది. (వాస్తవమునకు నీవు స్ఫటికమణివలెను, చంద్రకిరణములవలెను నిర్మలుడవు.)* ౧౪

ఇది హస్తామలక – ఆంధ్రానువాదము. ॥౩౯॥

---

* ఈశ్లోకములకు శ్రీశంకరులవారు రచించిన భాష్యము కలదు.

# సంశుద్ధి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౯ | పూ్నాయా | పున్నాయా |
| ,, | ౧౦ | పూ్నాయా | పున్నాయా |
| ౮ | ౧ | యద్యాత్ | యద్యాత్ |
| ౮ | ౭ | పద్మశ్య | ప్రపద్మశ్య |
| ౮ | ౭ | త్యాభిక | ద్యాభిక |
| ౧౨ | ౧౩ | ప్రతిత | ప్రతీత |
| ౧౯ | ౧౪ | లభించనిది | లభించినది |
| ౨౦ | ౧౭ | కాదు | లేదు |
| ౨౨ | ౭ | షోఒజ్జ | షోఒజ్ఞ |
| ౨౫ | ౨౦ | స్వాత్మ | స్వాత్మా |
| ౨౭ | ౬ | పాద్య | పాద్య |
| ౨౯ | ౯ | సఙ్ఘాభగస్తు | సఙ్ఘారస్తు |
| ౨౯ | ౧౯ | నీవే ఆత్మవు | శంభో! నీవే ఆత్మవు |
| ౩౧ | ౭ | నిహన్త్యేవ | నిహన్త్యేవ |
| ౩౧ | ౧౭ | కాకుండుట వలన | లేకుండుట వలన |
| ౩౨ | ౧౧ | ఇండుపగింజపొడ | ఇండుపగింజపొడి |
| ౩౩ | ౯ | ష్యాత్మా | ష్యాత్మా |
| ౩౪ | ౧౪ | నిర్మలాకాశమును | నిర్మలాకాశమున |
| ౩౪ | తుదిపంక్తికి చివర "అస్తే ఆత్మకును, సచ్చిదానంద నైర్మల్యములు" అని చేర్చుకొనవలెను. | | |
| ౩౫ | ౯ | స్వాత్మా | స్వాత్మా |
| ౩౬ | ౨౨ | మనమ్సకును | మనస్సునేకును |
| ౩౭ | ౪ | బ్రహోత్మ | బ్రహ్మాత్మ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౭ | ౮ | ఖా | క్షీః |
| ౪౦ | ౧౦ | యద్ | యజ్ |
| ౪౧ | ౧౦ | క్షిరే | క్షిచే |
| ౪౨ | ౧ | అణు | అనణు |
| ౪౨ | ౫ | ర్వ్యాస్య | ర్వ్యాప్య |
| ౪౩ | ౧౬ | ప్రకాశిత | ప్రకాశత |
| ౪౩ | ౧౯ | బోగొట్టు | బోగొట్టి |
| ౪౩ | ౨౪ | వేత్త ? | వేత్త |
| ౪౪ | ౧౩ | స్వరూప | స్వరూప |
| ౪౪ | ౧౪ | ఎచ్చటనో | ఎచ్చట |
| ౪౬ | ౩ | గజ్గా | గజ్గా |
| ౪౬ | ౧౦ | నానికే | వానికే |
| ౪౬ | ౧౩ | విశ్వేశ్వరుడు | విశ్వేశ్వరుడు |
| ౪౭ | ౯ | విమాత్యుః | విమృత్యుః |
| ౪౮ | ౬ | న్వరూపాత్ | స్వరూపాత్ |
| ౪౯ | ౮ | వలదను | కలదను |
| ౫౦ | ౧౧ | స్వానద్ద | స్వానన్ద |
| ౫౧ | ౧౩ | మధ్యమును | మధ్యయును |
| ౫౫ | ౨ | గేహే | గేహీ |
| ౫౫ | ౪ | వాక్యా | వాక్యే |
| ౫౬ | ౧౦ | (పోవు) | (పోవుచు) |
| ౫౮ | ౧ | జవనీ | జననీ |
| ౬౨ | ౧౭ | నూర్య | సూర్య |
| ౬౩ | ౪ | భాతిః | భీతిః |
| ౬౩ | ౫ | యావత్ | యావద్ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౬౫ | ౭ | సంజ్గ | సజ్గ |
| ౬౬ | ౬ | దేహమ్ | దేవమ్ |
| ౬౬ | ౯ | హుపదేశః | హ్యుపదేశః |
| ౬౮ | ౪ | ద్రష్టేతపి | ద్రష్టేత్యపి |
| ౬౮ | ౧౬ | కార్తికకార | వార్తికకార |
| ౮౫ | ౫ | వయం | నయం |
| ౮౭ | ౧౯ | వానివే | వానినే |
| ౭౩ | ౪ | స్థైరతా | స్థైకతా |
| ౭౬ | ౧ | అద్వైతేన | అద్వైతేవ |
| ౭౮ | ౧ | ప్రాప్తావేన | ప్రాప్తావేవ |
| ౭౭ | ౧ | పృష్టోఽసి | స్పృష్టోఽసి |
| ౬౨ | ౧౨ | నీతస్పృహో | వీతస్పృహో |
| ౯౨ | ౧౯ | సుభము | సుఖము |
| ౯౩ | ౧౦ | మేవబీజమ్ | మేకబీజమ్ |
| ౯౩ | ౨౧ | నిర్జిన | నిర్జన |
| ౯౫ | ౨ | గాజ్ఞం | గాజ్గం |
| ౧౧౧ | ౧౫ | బ్రహ్మానందజలము | బ్రహ్మానందజలముతో |
| ౧౧౩ | ౧౫ | ప్రవరబుద్ధి | ప్రఖరబుద్ధి |
| ౧౧౪ | ౧౯-౨౦ | అవయే | అవస్థయే |
| ౧౨౧ | ౩ | సంసారసారతా | సంసారాసారతా |
| ౧౩౦ | ౧౧ | యథార్థము | (యథార్థము) |
| ౧౩౧ | ౩ | భగవద్భక్తాః | భగవద్భక్త్యైః |
| ౧౩౨ | ౨౧ | కాను | కామ |
| ౧౩౨ | ౨౨ | సర్గ | స్వర్గ |
| ౧౩౩ | ౬ | యన్య | యస్య |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౩౮ | ౧౫ | ఖిలులును అగువారితోడ | ఖిలులును |
| ౧౩౯ | ౮ | మూర్ఖత్రైన | మూర్ఖత్రైవ |
| ౧౪౨ | ౧౪ | కథవలెను, | కథవలెను, శివకథవలెను |
| | | విద్వాంసులకు | విద్వాంసులకు |
| ౧౪౩ | ౧౩ | సత్వానుభూతిని | సత్వానుభూతిని |
| ౧౪౪ | ౭ | నీచ్యాది | వీచ్యాది |
| ౧౫౩ | ౭ | మేహహా | మేవాహా |
| ౧౫౬ | ౨౦ | ఆశ్రయము | ఆశ్రమము |
| ౧౫౯ | ౨౧ | అటే | అట్లే |
| ౧౬౧ | ౧౨ | అన్వయ | అన్వయ |
| ౧౬౩ | ౪ | శఞ్కారం | శఙ్కారం |
| ౧౬౩ | ౧౭ | సార్థక్యము | పార్థక్యము |
| ౧౬౫ | ౨౧ | దేవతులు | దేవతలు |
| ౧౭౫ | ౮ | పరిచాయ | పరిచీయ |
| ౧౭౫ | ౧౬ | జలంధర | జాలంధర |
| ౧౭౫ | ౧౬ | ఉద్యాన | ఉడ్యాన |
| ౧౭౫ | ౧౯ | మలకుండలిని | కులకుండలిని |
| ౧౮౭ | ౧౦ | మన | మవ |
| ౧౬౧ | ౧౬ | ప్రవర్తిల్లునట్టి | ప్రవర్తిల్లునో, అట్టి |
| ౧౯౨ | ౧ | విచ్చిన్న | విచ్ఛిన్న |
| ౧౯౫ | ౨ | నచనవ్యక్తిః | వచనవ్యక్తిః |
| ౧౯౫ | ౧౦ | జీవస్తమేవ | జీవస్త్వమేవ |
| ౨౦౪ | ౫ | భవత్ | భవేత్ |
| ౨౦౬ | ౮ | యత్నః | యత్నతః |
| ౨౦౭ | ౧౭ | లక్షణములు | క్షణములు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౧౨ | ౬ | కల్బయేత్ | కల్పయేత్ |
| ౨౧౩ | ౨ | లిజ్గాది | లిఙ్గాది |
| ౨౧౬ | ౭ | పరమాత్మని | పరమాత్మని |
| ౨౨౧ | ౧౦ | పరం ప్రహ్మ | పరం బ్రహ్మ |
| ౨౨౨ | ౧౧ | నమస్తం | సమస్తం |
| ౨౨౨ | ౧౪ | అవాఇ్మ్యా | అవాఙ్మ్యా |
| ౨౨౩ | ౧౬ | పరప్రహ్మ | పరబ్రహ్మమే |
| ౨౨౩ | ౧౯ | నా | వా |
| ౨౨౪ | ౨౦ | సుఖముచు | సుఖమును |
| ౨౨౬ | ౫ | మనోరథాః | మనోరథాన్ |
| ౨౩౦ | ౯ | మేనచ | మేవచ |
| ౨౩౦ | ౧౨ | అని. | అని వేదాంతడిండిమము. |
| ౨౩౫ | ౧౦ | డిణిమః | డిణ్డిమః |
| ౨౩౮ | ౧౪ | పిచ్పి | పిచ్ఛి |
| ౨౪౪ | ౧౦ | జ్ఞానాజ్ | జ్ఞానాజ్ |
| ౨౪౫ | ౯ | యేన | యేవ |
| ౨౪౫ | ౨౨ | విడిసోవును | విడిపోవును |
| ౨౫౨ | ౨౩ | బ్రహ్మ వసువు | బ్రహ్మవస్తువు |
| ౨౫౮ | ౧౨ | సంసృతి - తీవ్ర | సంసృతి |
| ౨౬౦ | ౬ | నివర్తో౽పి | వివర్తో౽పి |
| ౨౬౦ | ౨౦ | మొసగును | మొసగెను |
| ౨౬౧ | ౧౮ | రెలు | రెల్లు |
| ౨౬౨ | ౧౦ | ౫౫ | ౧౫ |
| ౨౬౭ | ౩ | దేహాదాః | దేహాగాః |
| ౨౬౭ | ౪ | కధా | తధా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౬౯ | ౪ | పదాహమితి | సదాహమితి |
| ౨౬౯ | ౫ | తత్పదా | తత్సదా |
| ౨౬౯ | ౧౨ | తత్పదా | తత్సదా |
| ౨౭౩ | ౨౧ | ఎటు | ఎట్లు |
| ౨౭౬ | ౭ | ప్రవర్తన | ప్రవర్తన్త |
| ౨౭౭ | ౨౩ | ఆత్మమే | ఆత్మయే |
| ౨౭౫ | ౧౦ | భాన్య | భావ్య |

"పర్యఙ్క రజ్జురన్ధ్రేషు నానైవైకాపి సూర్యభా,
ఏకోఽప్యనేక వద్భాతి తథా క్షేత్రేషు సర్వగః."

సూర్యప్రభ యొక్కటియే పర్యంక రజ్జు రంధ్రాది నానాస్థానముల, నానారూపముల తోచుచుండునట్లు: ఆత్మ ఒక్కటి యేయైనను వివిధ క్షేత్రములలో అనేక విధములుగ తోచుచున్నది.

అను శ్లోకమును "౧. అద్వైతానుభూతిః" యందలి ౩౫-వ శ్లోకముగ పఠింప నగును.

"కదా గఙ్గామ్భోభిః క్వచిదపిచ కూపోత్థిత జలైః
క్వచిత్కాసారోత్థైః క్వచిదపి సదుష్ణైశ్చ శిశిరైః,
భజన్ స్నానైర్భూత్యా క్వచి దపిచ కర్పూరనిభయా
మునిర్వ్యామోహం భజతి గురుదీక్షాక్షత తమాః."

గురుదీక్షవలన సుజ్ఞానియైన ముని ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రీతిగా కూప, గంగా, సరోవర, శిశిర, భస్మస్నానముల నొనర్చుచుండినను వ్యామోహము నందకుండును.

అను శ్లోకమును "౧౩ జీవన్ముక్తానన్దలహరి"లో ౫-వ శ్లోకముగ పఠింప నగును.

"౧౬. నిరంజనాష్టకము" పాదటీకలో పడిన ఈ శ్లోకములకు శ్రీశంకరుల వారు రచించిన భాష్యము కలదు అను వాక్యము భ్రమపతితము.

# శ్రీ నిర్వికల్పానందస్వామివారి ఇతర గ్రంథములు

## ౧. శ్రీ మద్భగవద్గీత (శ్రీధరీయము)

(చతుర్థ ముద్రణము)

ఈ గ్రంథమునకు సంతరింపబడిన పీఠిక శిరోరత్నముగ నున్నదని విశ్వనాథ సత్యనారాయణ గారును, టిప్పణి పరోపకార మనుట స్వభావోక్తి యని తిరుపతికవులలో ఒకరగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారును, పాదటీకలన్నియును అమృత బిందువులని వేలూరి శివరామశాస్త్రిగారును, గీతార్థ సారము నెరుగగోరు వారికి లాభకారియని వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, సంస్కృత భాష్యములు చక్కగ గ్రహించి వ్రాసినదని శ్రీ చిద్ఘనానేంద్ర స్వాములవారును, ఇంతటి ధారాశుద్ధితో తెలుగు గద్యను రచింపగల వ్యక్తులు నేడు చాలా అరుదని ప్రజామిత్ర పత్రికయును, ఆమూలాగ్రముగ ప్రశంసించిన దివ్య గ్రంథము. ౫౦౦ పుటలు. వెల ౪-౦-౦

## ౨. నా గురుదేవుడు

(చతుర్థ ముద్రణము)

ఇది శ్రీ వివేకానందస్వాములవారు తమ జీవిత సర్వస్వమగు శ్రీరామకృష్ణపరమహంసులవారిని గురించి న్యూయార్కులో ఒసగిన అద్వితీయోపన్యాసమునకు అనువాదము. ఒకసారి పఠించిన కంఠస్థమైపోవును. వెల ౦-౬-౦

(ఈ రెండు పుస్తకములకును, రామకృష్ణ మఠము, మదరాసు - ౪ అని వ్రాయవలెను.)

## ౩. యోగవాసిష్ఠము

[మూలానువాద సహితము]

(ద్వితీయ ముద్రణము)

ముప్పదిరెండువేల శ్లోక గ్రంథము. రాయల్ సైజు నాలుగువేల రెండు వందల పుటలు. పదునాల్గేళ్ల పరిశ్రమతో శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వామివారి తోడ్పాటుతో ముగిసిన గ్రంథము, శుష్కవేదాంతమని కొందరు భయపడు తాత్త్వికాంశములను, కాళిదాసాదుల సులలిత శైలిని మరపించెడి అమృతమయ

ఛందమున, రచింపబడిన శ్లోకములు. గౌడపాదశంకరులకు పూర్వమే వాల్మీకి మహర్షి వెలయించిన అద్వైత గ్రంథము. రెండు సంపుటములు. వెల ౫౦_౦_౦

## ౪. శాండిల్య భక్తి సూత్రములు

నారద భక్తి సూత్రములకు అనుబంధ గ్రంథము. కేవలము భక్తియైనచో అనుచిత _ ఉద్రేకమునకును, కేవలము జ్ఞానమే యైనచో శుష్కత్వమునకును దారితీయునని భయపడువారు చూడదగును. భక్తిజ్ఞానముల అపూర్వ సమన్వయము. మూలసూత్రములును, స్వప్నేశ్వర భాష్యము ననుసరించిన వివరణయును కలవు. డెమ్మీ ౪౦ పుటలు. వెల ౦_ర_౦

(ఈ రెండు గ్రంథములకును, వ్యాసాశ్రమము, ఏర్పేడు, చిత్తూరుజిల్లా, అని వ్రాయవలెను.)

## ౫. ప్ర పం చ మ త ము లు

పరిమిత వాక్యములలో ప్రపంచమునగల ముఖ్యమతముల సారాంశమును, ప్రవక్తల జీవితచర్యయును, ఉపదేశములును, వ్యావహారికభాషలో వర్ణితములైనవి. దీనిని చదివిన ప్రపంచమున ఉద్భవిల్లిన మతాచార్యు లందరును ఐక్యకంఠముతో ఒకే సిద్ధాంతమును _ అనగా జీవుడు ఎట్లో కష్టపడి భగవత్ సాక్షాత్కారము నంది తీరవలెనని బోధించిరని తేటతెల్లమగును. వెల ౧_ర_౦

(వలయువారు: జాతీయ జ్ఞాన గ్రంథమాల, మైలాపూర్, మద్రాసు_ ౧౪ అని వ్రాయవలెను.)

## ౬. అ ష్టా ద శ శ్లో క గీ త

భగవద్గీత నంతటిని ఓపికతో పఠింప జాలనివారి నిమిత్తము, పదునెనిమిది అధ్యాయములనుండి పదునెనిమిది శ్లోకములను సంగ్రహించి, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యలతో ప్రకటింపబడినది. కేవలము ఈవ్యాఖ్యను పఠించినచో ముముక్షువులకు సాధనామార్గము సూత్రప్రాయముగ గోచరింపగలదు. సర్వశాస్త్ర సారాంశము. ౪ర పుటలు. వెల ౦_౧౨_౦

## ౭. భ క్తి త త్త్వ ము

ఇందు నారదీయ భక్తియును, శ్రీచైతన్యమహాప్రభువు వారు నిర్దేశించిన భావసాధనా క్రమమును అత్యంత నైపుణ్యముతో వర్ణింప బడినది.

"మీ భక్తి తత్త్వమును ఉత్సాహముతో పఠించితిని. గ్రంథమునందలి విషయములును, భాషయును నన్ను ఎంతగనో ఆకర్షించినవి. మీ వచన రచన విశదముగను, సుస్పష్టముగను, నిశితముగను, శక్తిమంతముగను దీపిల్లుచు, మన వాఙ్మయమునందు సుందరోత్తమముగ తులతూగుచున్నది. నేను ఆమోదించెడు గ్రాంథిక శైలినే, మీరును అనుసరించుచున్నందులకు సంతోషము."

"మీరీరీతిగనే రచనలను కొనసాగించుచుందురు గాక! మీ గ్రంథములు మన వాఙ్మయ క్షేత్రమున దర్శన శాస్త్రముగను, సాధనామార్గముగను, సాహిత్యముగను పరిగణింపబడ గలవు."

కట్టమంచి రామలింగారెడ్డి,
మైసూరు, 9-12-50.

## ౮. భారతీయ తత్త్వ శాస్త్రము

ఈ గ్రంథమున షడ్దర్శనములు అనగా, గౌతమ, కణాద, కపిల, పతంజల, జైమిని, వ్యాసమహర్షుల భావములు సులభముగ వర్ణింపబడినవి.

వ్యాససూత్రముల ననుసరించి, శంకర, రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, బలదేవ, భాస్కర, విజ్ఞానభిక్షు, శ్రీకంఠాచార్యులను సంప్రదాయ ప్రవర్తకుల మతవాదములు నిష్పాక్షికముగ వివరింపబడి, శంకరులవారి అద్వైతముతో వానికిగల సార్థక్యముగూడ నిరూపింపబడుటయేగాక, అద్వైతమే సర్వదర్శన శిరోభూషణమని సూచింపబడినది.

ఈ గ్రంథమును చక్కగ పఠించిన షడ్దర్శనములను గురించిన సంగ్రహ జ్ఞానమేగాక, వ్యాససూత్రములకు గల తొమ్మిది భాష్యములు పఠించిన ఫలము లభింపగలదు.

పది ఏండ్లు పరిశ్రమచేసి వ్రాసిన ఉద్గ్రంథము.

"షడ్దర్శనములకు సంబంధించిన వాఙ్మయము నంతటిని అవలోడనగావించి, తాము సేకరించిన విషయజాలమును ఈ గ్రంథములో పండిత పామర రంజకముగా ఆంధ్రులకు సమర్పించినందులకు స్వామీజీ ఎంతయూ అభినందనీయులు."

— ఆంధ్రపత్రిక (17-4-49)

"భారతీయ తత్త్వశాస్త్రమంతటిని సూక్ష్మంగా తెలుసుకోగోరువారి కిది ఉపయోగకారి." — ఆంధ్రప్రభ (24-7-43)

"ఏ మతమును దూషణభూషణలు జేయక నిష్పక్షపాతమున సర్వమత స్వరూపములను చిత్రించిరి." — శ్రీవైష్ణవపత్రిక (ఏప్రియల్, 43)

"ఈతత్త్వశాస్త్రము చదువునప్పుడు శ్రీస్వాములవారు గ్రంథరూప గురువులై శిష్యులకు షడ్దర్శన, వేదాంతసూత్రభాష్యములు బోధించుచున్నట్లుండునే కాని మనకా పుస్తకము జదువుచున్నట్లుండదు."

— శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు

"తత్త్వశాస్త్రమునకు మీరు చేయుచున్న సేవ ఆంధ్ర చరిత్రకారులు మరచి పోజాలరు." — శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ.

"తాత్త్వికాభిప్రాయములను నిగూఢముగ గాక, సరళమగు భాషలో పాదిగించుట కష్టము. కాని గ్రంథకర్త తేలికగను, నిష్పష్టముగను వ్రాయుటలో విజయము నందెను. గ్రంథమునందలి ప్రతిపుటయును ఇందులకు సాక్షి."

— శ్రీ పి. టి. రాజు.

౧౫౧ పుటలు. వెల రు. ౨-౦-౦.

(ఈ మూడు గ్రంథముల నిమిత్తము, సాధన గ్రంథ మండలి, తెనాలి. అని వ్రాయవలెను.)

## శీఘ్రముగ వెలువడనున్న గ్రంథములు

౯. శంకర గ్రంథ రత్నావళి. (ఇరువదినాలుగు సంపుటములు)

౧౦. గీతాసూత్ర రత్నమాల.

౧౧. పంచ వింశతి గీతలు.

౧౨. బోధసారము.

౧౩. స్తవకుసుమాంజలి.

౧౪. శ్రీ శ్రీరామకృష్ణపూజాపద్ధతి.

౧౫. శ్రీ శ్రీ రామకృష్ణ - అనుధ్యానము.

౧౬. దశోపనిషత్తులు (కేవలము వచనము)

# శ్రీ రామకృష్ణ మఠమువారి

## ఆంధ్ర గ్రంథములు

| | |
|---|---|
| 1. శ్రీరామకృష్ణ లీలామృతము | 5_ 0_0 |
| 2. వివేకానంద జీవితచరిత్ర | 3_ 0_0 |
| 3. శారదాదేవి చరిత్ర | 1_12_0 |
| 4. నాగమహాశయుని జీవితము | 1_ 4_0 |
| 5. బ్రహ్మానంద : జీవితము, బోధనలు | 3_ 8_0 |
| 6. రామకృష్ణ బోధామృతము | 3_ 4_0 |
| 7. శారదా ప్రసంగములు | 2_ 8_0 |
| 8. గిరీశచంద్రుని జీవితము | 0_12_0 |

**వివేకానంద ప్రవచనములు :**

| | |
|---|---|
| 1. రాజయోగము | 2_ 4_0 |
| 2. కర్మయోగము | 1_ 8_0 |
| 3. భక్తియోగము | 1_ 4_0 |
| 4. వివేకానంద లేఖావళి (2 సంపు.) | 3_ 0_0 |
| 5. ప్రబోధ రత్నాకరము | 2_ 4_0 |
| 6. అనుష్ఠాన వేదాంతము | 1_ 4_0 |
| 7. వివేక సూర్యోదయము | 1_ 0_0 |
| 8. చికాగోనగరోపన్యాసములు | 0_ 8_0 |
| 9. నాసంస్కారణ యుద్ధవిధానము | 0_ 6_0 |
| 10. సాగురుదేవుడు | 0_ 6_0 |
| 11. నవీన భారతదేశము | 0_ 4_0 |
| 12. సర్వం విష్ణుమయం జగత్ | 0_ 3_0 |

# ఆధ్యాత్మిక పత్రికలు

ప్రస్తుతము ఆంధ్రదేశమున చక్కటి ఆధ్యాత్మిక మాసపత్రికలు వెలువడు చున్నవి. ఈక్రింద వానిలో కొన్ని దొరకు చోటును, సంవత్సరచందాయును తెల్పుచున్నాము. ఎవరికి ఏది లేక ఏవి కావలసియుండిన, వానిని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

౧. **శ్రీ వైష్ణవ పత్రిక** : ఇది గడచిన ౩౫ ఏండ్లనుండి భక్తిప్రపత్తులను ప్రచారము చేయుచు; ప్రస్తుతము వింజమూరి రంగాచార్యులుగారిచే, పెంటపాడు, పశ్చిమగోదావరినుండి, వెలువడుచున్నది.

సం. చం. రు. ౩-౦-౦

౨. **యదార్థభారతి** : ఇది ౨౭ ఏండ్లనుండి, ఆబాలగోపాలమునకు వేదాంత తత్త్వము అర్థమగునట్లు ప్రచారము చేయుచున్నది. దొరకుచోటు : వ్యాసాశ్రమం, ఏర్పేడు. సం. చం. రు. ౪-౦-౦

౩. **మోక్షసాధని** : నామభక్తిప్రచార పత్రిక, ప్రకాశకులు : సీతారామ నామ సంకీర్తనసంఘం, గుంటూరు. సం. చం. రు. ౨-౮-౦

౪. **రామకృష్ణప్రభ** : రామకృష్ణవివేకానంద వాఙ్మయమును, సనాతన హిందూధర్మమును, సంస్కృతిని ప్రచారముచేయు పత్రిక. శ్రీ నిర్వికల్పా నందస్వామిచే ప్రారంభింపబడి, తదనంతరము ౧౦ ఏండ్లనుండి, శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు 4 వారిచే ప్రకటింపబడుచున్నది. శ్రీబుధజానంద స్వామి వర్తమాన సంపాదకులు. సం. చం. రు. ౩-౦-౦

౫. **శాంతి** : ఓంకారస్వామివారిచే ౧౨ ఏండ్లనుండి శాంతిప్రచారార్థము, శాంతి ఆశ్రమం వాట్రేరునుండి ప్రకటింపబడుచున్నది.

సం. చం. రు. ౩-౦-౦

౬. **విశ్వమీమాంస** : నెల్లూరిజిల్లా, ఇనమడుగు, సత్యానంద ఆశ్రమం వారి పత్రిక. ఘతజ్ఞులవారిచే రమణాశ్రమభావము ననుసరించి, ౬ ఏండ్ల నుండి ప్రకటింపబడుచున్నది. సం. చం. రు. ౩-౦-౦

౭. **రామదర్శనం** : గుంటూరుజిల్లా, పిడుగురాళ్ల, రామతీర్థ సేవాశ్రమం నుండి, కేశవతీర్థులవారిచే రామతీర్థభావ ప్రచారార్థము ౪ ఏండ్లనుండి ప్రకటింపబడుచున్నది. సం. చం. రు. ౩-౦-౦

౮. **ముముక్షువు :** కృష్ణాజిల్లా, పెదముత్తేవి, శ్రీకృష్ణాశ్రమమునుండి ఉపయుక్తములచే గత 3 ఏండ్లనుండి, వైష్ణవభక్తిని ఉదారభావపూరితముగ ప్రచారము చేయుచున్నది. సం. చం. రు. ౨-౦-౦

౯. **గీతావాణి :** కర్నూలుజిల్లా, ఆళ్లగడ్డ, గీతాసాహిత్య సేవాసమితి పక్షమున స్వామిరామకృష్ణగారిచే 3 ఏండ్లనుండి ప్రకటింపబడుచున్నది. కేవలము భగవద్గీతాప్రచారార్థము వెలసిన పత్రిక. సం. చం. రు. ౪-౦-౦

# మీకు హృదయశాంతి కావాలా?

## శ్రీ రామతీర్థస్వామి దివ్య ప్రబోధాలు పఠించండి!

1. శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాన్త సారస్వతం (తెలుగులో)
   (1) వ సంహిత ఫుల్ క్యాలికో బైండు (షుమారు 1000 పేజీలు) రు 8_ 0_0
2. (2) వ సంహిత ,, 8_ 0_0
   ఈ రెండు సంపుటములు కలిసి ఒకేసారి 15_ 0_0
3. భగవాన్ రామతీర్థ - జీవితం 1_12_0
4. రామగీత - స్వామి వేదాంతగీతములు 1_ 4_0
5. మతము 2_ 0_0
6. కబీరు సూక్తులు 0_ 6_0
7. శ్రీ సమర్థ రామదాసు బోధలు 0_12_0
8. రామానుజ దర్శనం 0_12_0
9. శ్రీనృసింహాశ్రయం 0_ 4_0
10. శ్రీ నృసింహోపాసనాస్తోత్రం 0_ 4_0
11. రామతీర్థ పటములు 4 రకములు 0_ 6_0
12. శ్రీ భోళాలింగ శతకం 0_ 4_0
13. మహాత్మా ఉపాసనీబాబా 1_ 8_0
14. గీతాదర్శనము — శ్రీ నారాయణస్వామీజీ రచనము 5_ 0_0
    (600 పేజీలు ఫుల్ క్యాలికో బైండు)
15. ప్రహ్లాద విజయము (బుర్రకథ) 0_ 8_0
16. వేదాన్త దర్శనము (శ్రీ రామతీర్థ ఉపన్యాసములు) 2_ 8_0

**కార్యదర్శి : శ్రీ రామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల (PO)**
గుంటూరుజిల్లా (M. S. M. Ry)

# సాధనగ్రంథ మండలి, ప్రచురణలు.

| | | | |
|---|---|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0_12_0 | ♦ భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0_ 4_0 |
| * అర్థపంచకము | 0_12_0 | భక్తితత్త్వం | 0_12_0 |
| * ఆశ్వీన మాహాత్మ్యము | 2_ 0_0 | భక్తిరసాయనము | 2_ 0_0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0_ 3_0 | భారతీయ తత్త్వశాస్త్రము | 2_ 0_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_ 8_0 | భాగవతకథ | 2_ 0_0 |
| కల్యాణకుంజము | 1_ 4_0 | మానవధర్మము | 1_ 0_0 |
| గురుశిష్యులు (రామకృష్ణ వివేకానందులు) | 1_ 0_0 | * ముక్తిగీత | 0_ 6_0 |
| ♦ గీతాప్రతిభ | 0_12_0 | రాధారహస్యము | 2_ 4_0 |
| గీతాకదంబము | 1_ 4_0 | శ్రీరామపూజావిధానము | 0_ 4_0 |
| గోవిందదామోదరస్తోత్రము | 0_ 8_0 | ♦ శ్రీకాళహస్తీశ్వరశతకము | 0_ 8_0 |
| జడభరతుడు | 0_12_0 | శ్రీ సీతారామశతకము | 0_ 2_0 |
| నరసదాసు కీర్తనలు | 0_10_0 | * శ్రీ త్యాగరాజచరిత్ర | 0_ 4_0 |
| * పరమసాధన | 0_12_0 | * శ్రీరామనామ ప్రభావము | 0_ 6_0 |
| పరమార్థతత్త్వము | 0_12_0 | శ్రీ శుకుడు | 0_12_0 |
| పద్మపురాణము (ఆదిమ ఖండము) | 1_ 8_0 | శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0_ 4_0 |
| ,, (భూమిఖండము) | 2_ 0_0 | * సప్తమహాత్మ్యములు | 0_ 6_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_ 0_0 | సిద్ధాంతకల్పవల్లి | 1_ 0_0 |
| బదరీయాత్ర (3వ కూర్పు) | 1_ 0_0 | సంకీర్తనమీమాంస | 1_ 0_0 |
| | | ♦ హరినామ మహిమశతకము | 0_ 4_0 |
| | | * హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_ 0_0 |

* ఈ గ్రంథములు పునర్ముద్రణ కావలయును

♦ ఈ గ్రంథములు రెండవకూర్పు

రాబోవు గ్రంథములు : శంకరగ్రంథ రత్నావళి 24 సంపుటములు

గీతాకదంబము 10 సంపుటములు

ప్రేమదర్శనము, శివతత్త్వము

షరా : రు 1 కు వి, పి. లేదు. రు 5/_ లకు మించిన ఆర్డరకు రు 1 కి 0_3_0 రు 25/_ లకు, రు 1 కి 0_4_0 లు, రు 100/_ లకు రు 33/_ లు కమీషను యివ్వబడును. సమర్థులగు ప్రచారకులు ప్రతిగ్రామమున కావలయును. మంచికమీషను యివ్వబడును.

# గీతాకదంబము (108 పేజీలు రు. 1-4-0.)

అనువాదకుడు : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

మహాపురాణ ఉపపురాణములలో 'గీతలు' అను పేర కొన్ని ఘట్టములు గ్రథితములై యున్నవి. గీత లేక గీతము అనగా గానము చేయబడినది అనగా ఉపదేశింపబడినది అని తాత్పర్యము. కావున, సనందనాది బ్రహ్మపుత్రులు, లేక వసిష్ఠ వామదేవాది మహర్షులు, లేక నారాయణ నారదాదులు, మరీచ్యాదులకు, దేవగణములకు, మహర్షులకు లేక సాక్షా ద్భగవానుడే స్వ భక్త శిష్య గణములకు, బోధించి యున్నట్లు ఆయాగీతలు మాహాత్మ్య సంప్రదాయ బద్ధములై ఆయా పురాణములలో కూర్చబడి యున్నవి.

ఆ గీత లన్నియు గీతాకదంబ సంపుటములలో దళము లుగా, వరుసగా, సాధక పాఠక లోకముల కరకమలాంజలు లకు అందజేయ గలము.

ఈ ప్రథమ దళమును ఐదు గీతలలో ముగించితిమి. అవి వరుసగా ౧ గోపికాగీత, ౨ భ్రమరగీత, 3 హంసగీత, ౪ భిక్షుగీత, ౫ అవధూత గీత అను గీతలను తాత్పర్యముతో సాధకులకు అత్యంతోపయుక్తముగ ప్రకటించితిమి.

ఇహ పర కల్యాణమును బడయుటకు గీతాభ్యాసము కన్న సులభమైన మార్గ మింకొకటి లేదు.